## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ మాత్రేనమః

# * ఉపనిషత్సప్తకె *

## ఈశావాస్యోపనిషత్తు.

తారణనామసంవత్సర వైశాఖ బహుళ సప్తమీ ఆదివారము
14—5—44

హరిః ఓమ్:— పూర్ణమదః పూర్ణమిదం
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మేవావశిష్యతే।
ఓం శ్శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

ఓమ్. పూర్ణమ్ = పూర్ణము — అదః = అది=పరమాత్మ.
పూర్ణమ్ పూర్ణము = ఇదమ్ — ఇది = జీవాత్మ.
పూర్ణాత్ = పూర్ణమునుండి పూర్ణమ్:
ఉదచ్యతే = పైకి వచ్చెను = వెల్వడెను.
పూర్ణస్య = పూర్ణముయొక్క (పూర్ణమునుండి)
పూర్ణమ్ = పూర్ణమును అదాయ = తీయగా
పూర్ణమ్ పూర్ణము = ఏవ = మాత్రమే అవశిష్యతే =
మిగులుచున్నది.

విశేషార్థము:— పూర్ణమ్ = స్వతస్సిద్ధముగా పరిపూర్ణము అనన్తము. అప్రమేయము. దీనిలోనుండి తీయుటచేగాని, దీనితో కలుపుటచేగాని, దీని పూర్ణత్వమునకు — లోటు — పెంపు — రానేరదు. దేశకాలనిమిత్తములతో సంబన్ధము లేకుండ సంపూర్ణమై — అనన్తమై శోభిల్లును.

ఈ మన్త్రములోని పదమూడు పదములలోను పూర్ణమ్ అనుపదము ఏడుమార్లు ఉపయోగింపబడెను — పూర్ణమ్ = అనగా సపరిమితము — అదః — ఇదమ్ = అది ఇది — వ్యక్తికి = మాట్లాడువానికి దూరమందున్నది అది అనియు — దగ్గరనున్నది — ఇది అనియు — చెప్పుదురు. అదః = అనునది పరమాత్మయని యందఱు అంగీకరింతురు — సృష్టికి పూర్వముండు స్థితి యనికూడ చెప్పనొప్పును — ఇదమ్ = అనునది దగ్గఱనున్నది. హిరణ్యాగర్భుడనియు — జగత్తు అనియు — జీవాత్మయనియు, మూడు విధములుగా వ్యాఖ్యానము చేయుచున్నారు. మూడును చెప్పనొప్పును — జగత్తు తరువాతశ్లోకములో వచ్చుచున్నది — హిరణ్యాగర్భుడుకూడ దూరముననున్నవాడె. కాన జీవాత్మయని చెప్పుట భావ్యము.

జగత్తు పూర్ణమనిగాని, నిర్వికారమనిగాని ఏ మతకర్తలు భావించుటలేదు — ఋగ్వేదాన్తర్గతమగు పురుషసూక్తములోని క్రిందవ్రాసిన మన్త్రములు గమనింపనగును. "సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాఙ్గుళం" "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" ఈ మన్త్రములవల్ల పరమాత్మలో నీ విశ్వమన్తయు కొలది భాగమే యనియు, పరమాత్మ దీనినిమించి అతిక్రమించి యున్నాడనియు నీమన్త్రములవల్ల స్పష్టము. హిరణ్యాగర్భుడు పరమాత్మతో సమానుడు కాడు. ఆయన సృష్టి వైచిత్ర్యమును రచించు చిత్ శక్తిలోని అంశము. జీవాత్మయను పేరొనబడు వ్యక్తి అజ్ఞానముచే

ససంపూర్ణుడును, సహజస్థితిలోను (జ్ఞానదశయందును) — సంపూర్ణుడుగను భావింపబడుచున్నాడు. ప్రతి ఉపనిషత్తులోను, జీవాత్మ పరమాత్మల సంబన్ధమును, జీవాత్మ ప్రపంచ సంబన్ధమును, పరమాత్మ ప్రపంచసంబన్ధమును, చర్చించబడుచుండును. "ఇదం" అనగా వ్యక్తికి సమీపమునందున్న జీవాత్మయని యే చెప్పుట భావ్యము. ఒక్క భేదము గమనించవగును. జగత్తు — హిరణ్యగర్భుడు సృష్టి యున్నంతవరకు పూర్ణనిలోనికి బోజాలరు — సృష్టి కార్యము సాగించుచుండవలెను. జీవాత్మ అట్లుగాక తాను పరిపక్వమునొంది పూర్ణునిలో జేరగలడు. ఈ అవకాశమే యతనికి తారకోపాయము.

ఉదచ్యతే = ఉత్ = బయటకు అచ్యతే = నడుపబడినది. అఞ్చుధాతువు నడకను సూచించును.

సృష్టిలో పరమాత్మనుండి హిరణ్యగర్భుడు — జగత్తును — జీవాత్మ — ఈ మూడును వెడలినవి.

కారణములోని తత్వము కార్యములో స్పష్టమగును.

పూర్ణమగు పరమాత్మనుండి వెడలిన జీవాత్మ తత్వతః పరిపూర్ణుడే — ఏసునాథుడు తన యెదుట చేరియున్న ప్రజల నుద్దేశించి ఇట్లు చెప్పెను. "Be you perfecte as your father in heaven is perfect"

స్వర్గములోనున్న లోకపిత — పరమాత్మ ఎట్లు పరిపూర్ణుడో యట్లు మీరు పరిపూర్ణులు కండు." అని యేసు ప్రజల నుద్బోధించెను. పరిపూర్ణతసంపాదన ప్రజలకు సాధ్యము.

ఏలయనః— వృక్షము బీజములోనిమిడియున్నట్లు పరిపూర్ణత్వము ప్రతి జీవిలోని మిడియుండి సాధ్యమైయున్నది.

అదాయ = తీసికొని; ప్రళయకాలమందు హిరణ్యగర్భుని లోని పూర్ణత్వమును గైకొని తనలోలీనముచేసికొని పరమాత్మ పూర్ణుడైయుండునని శ్రీ శంకరులవారు అర్థముచేసిరి. ఆదాయ= అనగా తీసివేయగా అనగా జీవాత్మ వెల్వడిన పిమ్మట గూడ పరమాత్మ యథాప్రకారము పూర్ణునుగానె యుండును. పూర్ణత్వము యొక్క స్వభావ మదియె. సృష్టి యెన్నాళ్లు జరుగు చున్నను తత్పూర్వమువలెనె తత్పరమందుకూడ పరమాత్మ పరిపూర్ణుడే. గణితశాస్త్రమునగల ప్రధాన సూత్రమిట్లున్నది.

If you abb to or sudstract from or bevibe infinity dy anything it still remains infinity.

అప్రమేయమునకు నేదికలిపినను దానినుండి యేది తీసివేసినను దానిని దేనిచేత హెచ్చించినను భాగించిననుగూడ నదియ ప్రమేయముగానె యుండును.

పూర్ణత్వ సిద్ధాంతమునుండి వెలువడు మరియొక సత్యము గమనింప తగియున్నది. గణితశాస్త్రములో Infinity లు రెండుండ నేరవని ధృవపరచిరి. ఆ సూత్రము వేదాన్తశాస్త్రము నకును వర్తించును. పరమాత్మ జీవాత్మలిద్దఱు పరిపూర్ణులు గనుక నిద్దఱొక్కటేయని భావము. జీవాత్మయని పేర్కొను వ్యక్తి యథార్థమున పరమాత్మయే. ఆ విషయమునే శ్రీ వివేకానన్దులవారీవిధముగా దెల్పిరి. There is no room

for two infinty unconbitioneb deings anb hence we delive in personal Gob anb we ourselves are He.

జీవాత్మ తానె పరమాత్మయని బుద్ధిరీత్యా తెలిసికొని యాత్మరీత్యా అనుభవమొందుటయే జ్ఞాన పరమావధి. ఈ మన్త్రము శాన్తిపాఠము. శాన్తిః అని ముమ్మారు పఠించవలెను. స్థూలసూక్ష్మ కారణ శరీరములకు శాన్తి — ఆధిదైవిక-ఆధిభౌతిక — ఆధ్యాత్మికస్థితులకు శాన్తి — తాపత్రయములకు శాన్తి - శాన్తి సుస్థిరమగుగాక! యని ముమ్మారు శాన్తిని పఠించిరి. ఈ శాన్తిపాఠమే శ్వేతాశ్వతర - బృహదారణ్యకోపనిషత్తులోగూడ గలదు. ద్వాసుపర్ణా ఇతి - సమానె వృక్షె పురుషోనిమగ్నో ఇతి -

తాత్పర్యము:— పరమాత్మ పరిపూర్ణుడు - జీవాత్మ పరిపూర్ణుడు ఆ పరిపూర్ణునినుండి యీ పరిపూర్ణుడు వెల్వడెను. ఆ పరిపూర్ణునినుండి యీ పరిపూర్ణుడు వెల్వడినను ఆ పరిపూర్ణుని పూర్ణత్వమట్లే నిలిచియున్నది. అనగా సృష్టివలన నాయన పరిపూర్ణత్వమునకు తగ్గుదల లేదు. ప్రళయమువలన పెరుగుదలయు నుండదు. సృష్టికి పూర్వమును, సృష్ట్యనన్తరమును పరమాత్మ యథాప్రకారము పరిపూర్ణుడుగానెయుండును. పరిపూర్ణత్వము యొక్క స్వభావమదియె.

౧ ఈశావాస్యమిదగ్ంసర్వం
యత్కించజగత్యాంజగత్.

తేనత్యక్తేన భుంజీథాః;
మాగృధఃకస్యస్విద్ధనమ్॥

అర్థము:— జగత్యామ్ = జగత్తులో జగత్ = మారుచుండెడి యత్కించ = ఏ కొంచమైనను (సరే) ఇదగ్ం = ఈ; సర్వమ్ = సమస్తమును – ఈశా = పరమాత్మచే వాస్యం = ఆవరింపబడియున్నది. తేన = ఆ; త్యక్తేన = త్యాగముచేత (ఆత్మానం) ఆత్మను - భుఞ్జీథాః = పరిపాలింపుము – తేన = ఆ; లేదా దానియొక్క లేదా కాబట్టి - త్యక్తేన = త్యాగము వలన భుఞ్జీథాః = భుజింపుము - కస్య = యెవనియొక్క ధనం = ధనమును స్విత్ = అట్లగు నీలుంటే. మాగృధః = కోరకుము

విశేషార్థము:— జగత్యాంజగత్ = ఎల్లప్పుడు మారుచుండుటయే స్వభావముగాగల విశ్వమంతయు దీనికి పాలకుడు ఈశుడు అనగా సృష్టికర్త - అట్టివాడు పరమాత్మయే.

ఆంగ్లములో Phenominal అను పదము జగత్ అనుదానికి సరిపోవును- వాస్యం = వాసః = వస్త్రము. వాస్యం అనగా వస్త్రముతోవలె కప్పబడ తగినది. ఈ జగత్తు నంతను, లో మారుచుండు ప్రతి స్వల్పవస్తువును ఈశుడను వస్త్రముచే కప్పబడియున్నది.

పురుషసూక్తములో సభూమిం విశ్వతో వృత్వా = ఆయన భూమిని అన్నివైపుల నావరించెను. సామవేదము- 616 వ ఋక్కు- ఋగ్వేదము 1 వ మణ్డలము 7 వ అనువాకము 32 వ సూక్తము 15 వ మన్త్రము-(అనగా ఆది నుండి 3883వ మంత్రము)

అందుచే ప్రతి వస్తువు ఆయనచే నావ|క మ్మి బండి చక్రము
రింపబడి యున్నది. ఎవరు- ఏ వస్తువును-| చు ట్టు - నావరించి
ఆవరించిరో - లేక మూటకట్టుకొనిరో యున్నట్లు జంగమస్థావ
అది వారిదే - చరిత్రారంభమున ఆస్తిని రాది జంతువులను
ప్రత్యేకముగా నమర్చుకొన్నవారు ఇంద్రుడావరించి
దానికి ఆవరణ లేదా గట్టు - లేక గోడ యున్నాడు.
యేర్పరచుచుండిరి. అదే విధముగా

భావించిన యెడల ఈ లోకములోని ప్రతి వస్తువును, లోక
మంతయు పరమాత్మదే. అందువలన నాయనచే వెల్వరింప
బడిన జీవాత్మకును లోకములో నామరూపధారణ మొనర్చిన
జంతుజాలమునకును, ఈ జగత్తు అవిభక్తమైన ఆస్తి అయి
యున్నది. మితాక్షర న్యాయశాస్త్రములో జెప్పబడిన అవిభక్త
కుటుంబమునకుండు హక్కులకు ఈ భావనే మూలాధారము.
తత్వరీత్యా ఈ జగత్తంతయు పరమాత్మయే. "పురుష ఏవేదగ్ం
సర్వమ్" అని పురుషసూక్తములో గలదు - "బ్రహ్మైవేదగ్ం
విశ్వమ్" అని ముణ్డకోపనిషత్తులో గలదు. మహాత్మాజీ చెప్పు
ధనికుల ధర్మకర్తృత్వ సిద్ధాన్తమునకు అన్తర్భావము - లేక
తేనత్యక్తేన=అనుటచే అనన్తపద్మనాభుని పూజలోని రహస్య
మిదియే. తిరువాన్కూరు రాజ్యసూత్రమిదియె. అందులోనంద
ఱకు సమానమైనస్వత్వము సమానమైనభోగము కలదు. కాని
యే యొక్కరును నేయొక్క వస్తువును తనదని ప్రత్యేకించుకొన
వీలుకాదు - శ్రీ రామకృష్ణపరమహంసగారు చెప్పిన కథ జ్ఞాపక

ఘుంచుకొనవలెను - ఇద్దఱు సోదరులు భూమిని పంచుకొను నప్పుడు నాది నాదియని తగవులాడుచుండగా వారినిజూచి ఇది యంతయు నాదియని వారేల గ్రహించరని దేవుడు నవ్వుచుండును. తేనత్యక్తేన = త్యాగమూలమునసే అనగా:— త్యాగసే = భోగము తాను త్యజించి యితరులకు భుక్త్యపఱుచుట - ఇతరులు భుజించుచుండ తానసుభవింప గలుగుట-అదియే నిజమైనభోగము. పిల్లలకు పాలు ఇచ్చు-లేదా యన్నమిడు తల్లిదే నిజమైన భోగము. తన శరీరసారము వ్యయమగుటకు కినియక ఆనందించును. భూతజాలము భుజించుచుండ భూతేశుడగు పరమాత్మ లీల నెరపుచుండును. మహానారాయణోపనిషత్తులో "ఈశస్సర్వస్య జగతః ప్రభుః ప్రీణాతివిశ్వభుక్" అను మంత్రములో పరమాత్మ విశ్వమును అనుభవించి యానందించునని కలదు. అట్లే జీవాత్మయు ననుభవించవలెను - "త్యేనత్యక్తేన" అనునపుడు పరమాత్మచే వదలబడినదని అర్థముచెప్పెదరు. పరమాత్మ జగత్తును ఆవరించి దానిని

ఈ మన్త్రము— అనాసక్తి యోగమునకు మూలాధారము. ఎవరిని మనమత్యధికముగా ప్రేమింతుమో వారి కొఱకే మనము త్యాగము చేయగలము - ఇచ్చుట త్యాగముసర్వసమర్పణమును సూచించుచున్నది. పతివ్రతయగు స్త్రీ తానారాధించు భర్తకును, అనన్యభక్తిభావముచే ప్రేరితుడైన భక్తుడు తన యిష్టదైవమునకును, వాత్సల్యముగల తల్లి తన ముద్దుబిడ్డకును, విశ్వాసియగు సేవకుడు తన్నాకర్షించిన యజమానికిని

తనలో నిలుపుకొనెనని మొదటి పఙ్క్తి తెలుపుచున్నది. కాన నీ రెండర్థములకన్న పైన దెల్పిన ప్రసిద్ధ త్యాగమార్గమున అని యర్థము చెప్పుటయే భావ్యము- ప్రతివాడు నితరుల్కై త్యజించ మొదలు పెట్టినపుడు పరస్పర స్పర్ధలు లేక అందఱకును సమానముగా లభ్యమగును. జీవాత్మ పరమాత్మవలె పూర్ణుడు. కనుక కామ్యముగాని, కామ్యవస్తుభోగముకాని ఆతనికావశ్యకము గాదు. తన తొడలనుండి యూర్వశిని సృజించిన నారాయణ ఋషి ఆమె సాంగత్యమును లేక ఇతర దేవతాస్త్రీల సాంగత్యమును కోరలేదు - జీవాత్మ జగత్తు తన సృష్టియని భావించినపుడు దానిని కోరడు. మరియు నయ్యది మారునది. తాను మారనివాడు మారుచుండెడి వస్తువుపై మోహమతనికి పొడమదు. ధనం అనగా దాచతగిన వస్తువు. మారెడి జగత్తులో మారకుండ నిలిచెడి భద్రపరచతగిన వస్తువులేదని స్విత్ అను పదము సూచించుచున్నది. దేనిని ధన ప్రబోధితుడగు శిష్యుడు జ్ఞానదాన మొనర్చిన గురువునకును సంపూర్ణముగా నర్పణచేసెదరు. అదేవిధముగా జగత్తులోని భూతజాలమునకు త్యాగము చేయవలెనన్నచో దానిని ప్రేమించవలెను - తాను — ఆ భూతజాలము ఒక్కటే యను భావము కలిగినప్పుడే యవ్యాజమైన సంపూర్ణ ప్రేమ ఉద్భవిల్లును - అదియే - అహింస -

ఏసునాథుడు చెప్పిన వాక్యములు గమనింపనగును. నీధనమెచ్చట నుండునో నీ హృదయమచ్చట నుండును. దొంగలకు ఎలుకలకు తుప్పు వగయిరాలకు

ముగా భావించిన దానియందు మక్కువ యేర్పడును. మారెడిజగత్తును ధనముగా భావించినచో నట్టివాడు మోహమున తగుల్కొనును. కాన ధనముగా దేనిని భావించవద్దని మొదటి యాజ్ఞ. అట్లైవ నైన భావించిన యెడల దానికై యాశిం పకుమని రెండవ యాజ్ఞ- కస్య = ఎవని దైననుగాక ఈశునిదైనను సరె ఈశుని దైన జగత్తును నీవు నీ ధనముగా ఆశింప కుము. సమస్త భూతజాలమునకు సామాన్య స్వామ్యముగల జగత్తు యే యొక్కరికిని ధనము కాదు - ఏ యొక్క రును దానియెడ లుబ్ధులు కారాదు.

మహానారాయణోపనిషత్తులో "న్యాస ఇతిబ్రహ్మ" అను మన్త్రముచే త్యాగమే బ్రహ్మస్వరూపమని విదితము అందుచే త్యాగమే భోగమునకును- మహాభారతములో "నహి త్యాగసమం సుఖం" అని చెప్పబడి యున్నది. త్యాగము కల్పించు నానందము నిరుప మానము. "త్యాగేనైకే అమృతత్వ మానశుః" త్యాగమూలమున కొందఱు అమృతత్వమును పొందిరి. కొందఱికే లాంగు ఇహలోక ధన మేలవాంఛింతువు. అట్టి లోటుపాట్లు లేని స్వర్గ లోక ధనమునకయి యత్నింపుము- ముణ్డ కోపనిషత్. తృతీయ ముణ్డకః ప్రథమఃఖణ్డః

శ్రు॥ ద్వాసుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిష
స్వజాతే।
తయోరన్యః పిప్పలం
స్వాద్వత్తి అనశ్నన్న
న్యో అభిచాకశీతి.

౨వ మన్త్రము:—

సమానే వృక్షే పురుషో
నిమగ్నో అనీశయాశో
చతిముహ్యమానః
జుష్టం యదాపశ్యత్యన్య
మీశం అస్య మహిమా
నమితి వీతశోకః॥

ఈ రెండు మన్త్రములు శ్వేతాశ్వతర

గాక అందఱికిని నదియేమార్గము. తానాశించని బీజము మొలవదు. మొలచినగాని బీజబాహుళ్యమును సృష్టింపజాలదు. వైష్ణవ సంప్రదాయము దీనికనువుగానే యున్నది, విష్ణుదేవాలయముల ఆస్తికి హక్కుదార్లు వైష్ణవస్వాములు- దేవాలయ సేవకులు- వారికి ఆస్తి లేదు. వారందఱికిని సమష్టి భోగమేకాని దానియందెవరికిని ప్రత్యేక హక్కులేదు. కాన నాశింపకుము — స్విత్ అను పదమును "కస్య" అను పదముతో కలిపి అర్థము చేయవచ్చును - అప్పుడు ఎవనికైనను హక్కు కలుగునాయని చెప్పనొప్పును. శ్రీ శంకరులువారు "స్విత్" అను పదము నిరర్థకమని సూచించిరి. అది సన్దేహ సూచకము. అట్టి యర్థమున కస్యతో గాని, ధనముతో గాని, చేర్చిన యెడల జగత్తు ధనమేకాదనియు యెవరికిని ధనము కాజాలదనియు భావము స్ఫురించును- ఎట్లైనను సార్థకమేయగును.

తాత్పర్యము:— పాలకుడగు పరమాత్మ జగత్తు సంతను — జగత్తులోని ప్రతి స్వల్పవస్తువును ఆవరిం

4 వ అధ్యాయములో 6,7 మన్త్రములు గానున్నవి.

ఇదియే ముణ్డకోపనిషత్ - 3 వ అధ్యాయము 1 వ ఖండము 1-2 మంత్రములు గానున్నవి. ఋగ్వేదము ప్రథమమండలము 164 వ సూక్తము - 20 వ మన్త్రము - ఇందులో మొదటి మన్త్రము- ఈ మన్త్రములలో చెప్పిన భావమును గమనించవలెను- ఆ రెండు పక్షులలో నొకటి తీయని పండును తినుచున్నది. రెండవదితినకుండ ప్రకాశించుచున్నది - లేక చూచుచున్నది- అనగా తినెడి పక్షిని, తినుటయందలి ఆసక్తిని గమనించుచున్నది. 2 వ

చియున్నాడు. కాన త్యాగమూలమున జగత్తు ననుభవించవలెను. ఎల్లప్పుడును మారుచుండు జగత్తు ధనము కాగలిగితే యది దైవధనమే. అదంతయు ఆయనదే.

" శ్రుతి " ౨౹౹

కుర్వన్నేవేహ కర్మాణి
జిజీవిషేత్ శతగ్ సమాః ।
ఏవం త్వయినాన్యథే
తోఽస్తి నకర్మ లిప్యతే నరే ॥

ఇహ = ఇక్కడ - ఏవ = మాత్రమే కర్మాణి = పనులను; కుర్వన్ = చేయుచు శతగం = నూరు; సమాః = ఏండ్లు జిజీవిషేత్ = జీవించకోరవలెను. త్వయి = నీయందు ఏవం ఈవిధముగా ఇతః = ఇంతకంటె అన్యథా = వేరైన మార్గము నాస్తి = లేదు. ( ఉండలేదు ) నరే = నరునియందు కర్మ = పని నలిప్యతే = అంటదు.

విశేషార్థము:— ఇహ = ఇప్పుడే ఈ లోకము లేక ఈ దేహము ఏదైనను చెప్పవచ్చును - దేహము జీవితాంతము వరకు బలిష్ఠముగా నారోగ్యవంతముగా నుండుట అందఱకు నవసరము —" ఏవ "

మంత్రములో శ్వేతాశ్వతరోపనిషత్తులో అనిశ్చితాత్మా బధ్యతే భోక్తృభావాత్ -

భోగముచేత నాత్మ బద్ధింపబడుచున్నది - ముండకం ౩ - ౧ - ౧- మంత్రము పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి.

తినుటచే బద్ధము తినకుండుటచే ముక్తి కలుగుచున్నది. కనుక " తేనత్యక్తేన " అన్నప్పుడు భోగభావముగాక త్యాగభావమే జగత్తుయెడ చూపదగిన దృష్టియగుచున్నది.

బృ ౪-౪ - ౧౨

ఆత్మను తెలిసినవాడు ఈ శరీరము లోపలకు కోరియుండ దలచును. భగవద్గీత - 9 - 33 శ్లో

అను పదమును కుర్వన్నేతో కొందఱు చేర్చుచున్నారు. "ఇహ" తో చేర్చిన యెడల ఇప్పటి జీవితమునకే ప్రాముఖ్యత వచ్చును. అనగా:— దుర్లభమగు నీజీవితము లభించినందున దానిని వృధాచేయక ఎన్నడో ఏ రూపమునసో లభించనున్న జీవితముపై నాధారపడక దీనినే యుత్తమ మార్గమున వినియోగించవలెనని యర్థము చేయవచ్చును. కేనోపనిషత్తు రెండవ భాగము 5 వ మన్త్రము చూడనగును. "నచేదిహావేద మహతీ వినష్టిః" ఈ జీవితములో పరమాత్మ స్వరూపము తెలియని యెడల నత్యధిమయిన నష్టము కలుగును. కాన ఇహలోక- పరలోక జ్ఞానములు రెండును ఉత్తమ ఆత్మానుభవము కూడ నీజన్మలోనె సాధించితీరవలెను. "ఇహ" = ఇప్పుడే యని కూడ నర్థము చెప్పవచ్చును. అట్లయినచో ఇప్పుడే వాని లభ్యపరచుకొనవలెను. ఇతర జన్మలకు వాయిదా వేయరాదు. ఈజన్మలోకూడ నితరకాలములకు వాయిదా వేయరాదు. సిద్ధికలుగునా? కలుగదా! ఎప్పుడు దైవసేవ చేసెదరు స్వామికి చేసిన భోగములను అనుభవింతురు- సేవలో వ్యత్యాసము లేదు లోకమంతయు నిస్థితికి వచ్చినచో నీ మన్త్రము సార్థకమగును-

"కుర్వన్నే" లో ఏవను జేర్చిన యెడల చేయుమనే యని అర్థమగును. "కర్మాణి" అను పదమునకు విపులార్థమొసగినపుడు అట్టి విశాలమగు కర్మలో తనకవసరమగు భాగమును తానే చేయుచునని యర్థము. సాయము చేయు పనులకు వశుడుగాక తానే చేసికొనుచు స్వవశుడై ఉత్తమ జీవితమగడుపును. కర్మయోగులగుబుద్ధుడు, కృష్ణుడు చేసిన బోధయదియే.

కలుగును? అను ఆలోచనలతో నిమిత్తము లేకుండ సాధనకు వెంటనే పూనుకొనవలెను - శతగ్ంసమాః = నూరు ఏండ్లు పూర్ణాయుర్దాయము - లోకాచారమునుబట్టి నశ్వరశరీరమును ధరించిన మానవునకు నూరేండ్లు పూర్ణాయుర్దాయమని ఋషులు గణించిరి. యోగధారణచే కాలస్తంభన చేయువారికిగాక తక్కినవారికిది ప్రమాణము-బైబిలులో 90 ఏండ్లే ప్రమాణమని సూచించిరి. "కలౌ షష్టిః" అని కలియుగములో ప్రమాణము 60 ఏండ్లని చెప్పిరి. నిండుగా నూరేండ్లు గడచినను, లేకున్నను, ఎంత ఆయుర్దాయము కలదో అంతయనికూడ ఈ శతగ్ంసమాః అను పదమువలన గ్రహించవచ్చును. మాణ్డూక్యము శాన్తిపాఠములో "దేవహితం యదాయుః" అన్న వచనమునుబట్టి దేవుడు ప్రసాదించిన ఆయుర్దాయము ప్రమాణముగా పూర్వులు గ్రహించుచుండిరి. ఈ పదములలోని "దేవహితమ్" అను సమాసపదమునకును మరియొక అర్థము చెప్పనొప్పును. మానవశరీరమునకు

మహాత్ముని బోధయునదే గీతలో అ 3-శ్లో 5 ఆనన్దానుభవము కూడ కర్మయే యగుచుండ కర్మనుజూచి సంకోచపడనక్కర లేదు శక్తిహీనులగు రోగులకు వికలాంగులకు మినహాయింపు గలదు- నిషేధముకాదు కాన జనసామాన్యమాత్రమే మనగా:- శక్తివన్తులు తమశక్తినిదాచి పరోపకారమునను సోమరులు కారాదు.

ఇచ్చట సర్వాణి పదమును కర్మాణి అను పదమునకు జేర్చి అన్వయము చేయవచ్చును అప్పుడన్ని కర్మలనే చేయుచు అని యర్థము. కర్మాణి అనుపదమునకు విపులార్థము చెప్పినచో

సంబన్ధించిన బాహ్యాన్తరేంద్రియములకు దేవతలని పేరు. ఆ దేవతలు సౌష్ఠవముగా ప్రవర్తించునంతకాలము దేవహితమైన ఆయువు. అదియే వాంఛనీయమైనది. ఇన్ద్రియ పాటవము నశించిన పిమ్మట ఆయువు దుర్భరము. తనకును తన పరివారమునకును, దుస్సహము కాన ఇన్ద్రియములు సక్రమముగా వర్తించు నంతకాలము దైవప్రసాదితమైనంత కాలము అదియే "శతగ్ం సమాః" యని చెప్పవచ్చును. శతసంఖ్యావాచకమైనను ఒక్క నూటికే దానిని క్లుప్తపరచనక్కరలేదు. మించియునుండవచ్చును.

జిజీవిషేత్ = జీవించకోరును.

జీవితాశను - నిరాశయనిగాని పాపమనిగాని చెప్పనొల్లదు - దీర్ఘాయుర్దాయము సాధనావకాశమును కల్పించును - సిద్ధిని వలన లోకహితార్థమైన బోధనావకాశమును లభింపజేయును. సాధన అవసరము లేనివాడు, లోకహితార్థము బోధనాభారమును వహించనక్కరలేని వాడు జీవించవలెననిగాని మరణించవలెననిగాని కోరడు. కాయపండి చెట్టునుండిరాలును. ఇబ్బందియుండదు. అట్లుగాక కర్మాణి - పదమునకు సంకుచితార్థమిచ్చి వేదచోదిత కర్మ లేయన్నచో జ్ఞాన సంపాదనవ్యగ్రాలు నిషిద్ధములగును. శరీర సహజకర్మలును నిషిద్ధములగును. కాన ఆపద పొసగును. కాన "ఏవ" అను పదమును "ఇహ" తోనో, లేదా "కుర్వన్" తోనో, చేర్చుట భావ్యము. ఎవరికెట్లు నచ్చినవారట్లు చేయవచ్చును.

బృ–౪–౪–౭

యదాసర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య
హృదిశ్రితాః,
అథమర్త్యోఽమృతో
భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥ ★

కుబుసము (పాముకూసము) ఎండి పాము ఒంటినుండి జారి పడిపోవును - అట్లే కాలపరిపక్వమున జ్ఞానినుండి త్రివిధ శరీరములు జారిపోవును. అట్టి ఉత్తమస్థితి లభ్యమగునంతవరకు ఈ శరీరధారణము నిన్ద్యమగు కామ్యముకాదు. భిన్న శరీరధారణము:— గర్భగోళవాసము - బాల్యము మొదలగు అవాన్తరములకు నవకాశమిచ్చి నిరన్తర జ్ఞానసంపాదనకు నాటంకము కల్పించును - కర్మాణి = సర్వకర్మలు శారీరక - మానసిక - ఆధ్యాత్మిక-అభ్యున్నతికి నావశ్యకమగు చర్యలన్నియు నిందులో చేరును. శరీరపోషణము శరీరములో అప్రయత్నముగా (అనిచ్ఛగా) (Automatic) జరుగు చర్యలును, ఐచ్ఛికముగా జరుగు జ్ఞానసంపాదన యోగధారణ - సమాధిస్థితి - ఆత్మానందము - సర్వమును కర్మలే ఈ పదమునకు యజ్ఞయాగాది క్రతువులే అర్థమని చెప్పుటచే కర్మమార్గ సన్యాసమార్గముల మధ్య భిన్నాభిప్రాయములు తర్కవితర్కములు కలుగుచున్నవి- బాల్య కౌమార యౌవనాది వయోవిశేషములు - బ్రహ్మచర్య

★ ఇక్కడనే బ్రహ్మను పొందును.

శ్రీ రామకృష్ణపరమహంస ఇట్లు చెప్పెను. నా మనస్సును ఒకమారు తల్లికి అర్పిస్తిని. ఆమె ఇచ్ఛప్రకారము బ్రతుకవలెను— రోగము నయము చేయుమనిగాని జీవితము పెంచమనిగాని ప్రార్థించజాలననెను.

పాము కూసము విడిచినట్లు బృ ౪-౪-౭ వేదవిహితకర్మలే అని అర్థము చేసిన యెడల మరియొక యనుపపత్తి సంభవించును. ఈ మన్త్రము సార్వభౌమికము సర్వులకును వర్తించును - వేదవిహిత కర్మలాచరించుటకు కొందరికే అర్హతలు కలవు. అనుపనీతులకు స్త్రీలకు వికలాంగులకు

గృహస్థాద్యాశ్రమ విశేషములును, లౌకిక, పారలౌకిక జీవితావస్థలును, బాహ్య - ఆంతరంగిక క్రియావిశేషములును, అన్నియు నీ "కర్మాణి" అను పదమున కన్వయింప చేయ వచ్చును. ఆయాజీవిక నాయాకాలమునకు ఆయాసాధనకు నవసరమగు చర్యలు కర్మలగును - ఇట్లు విశాలార్థము పొసగుచుండ దానిని విస్మరించి సంకుచితార్థమునకు స్థానమిచ్చుట భావ్యముకాదు. ఏ యొక విధానమును ఏ యొక్కరికిని కర్తవ్యమై బాధించదు. అభివృద్ధినిబట్టి కర్తవ్యములు మారుచుండును. అట్టి యౌదార్యముతో నీపదము నన్వయమొనర్చిన యెడల కర్మకాండవాదులకును, జ్ఞానకాణ్డవాదులకును కలిగిన స్పర్ధలు సమసిపోవును -

* కుర్వన్ = చేయుచు పైన తెల్పిన "కర్మాణి" పదవిపులార్థమును గ్రహించినచో కుర్వన్ = తానే చేయవలెను అనుభావమును, దాని యంతరార్థమును, చక్కగా గ్రాహ్యమగును. అన్యులపై ఆధారపడక తనకవసర

కొన్ని ప్రత్యేక జాతులకు వేదవిహిత కర్మాచరణమందు నంతరాయము చూపబడెను. దానినిబట్టి యీ మన్త్రమునకు సంకుచితార్థము చెప్పుట న్యాయముకాదు. ఆయంతరాయములెంతవరకు సమర్థనీయములో సంశయాస్పదము. పూర్ణుడగు జీవాత్మకు కర్మనిషేధము చేయు హక్కు ఎవరికినుండజాలదు

* కుర్వన్ = శారీరక - మానసిక ఆధ్యాత్మిక ఉన్నతికి తానే కర్తయని భావము. ఇతరులు - బోధకులు - ఉపదేశకులు - మార్గదర్శకులు మాత్రమే. ఉద్ధారకుడు తానె.

మార్జాలకిశోర న్యాయముకన్న మర్కటకిశోర న్యాయమునకే యధిక

మగు పనులన్నియు తానె జరుపుకొనవలెను. అన్యుల కష్టఫలిత ములను తానుకోరరాదు. అనగా (Exploitation) పరావలంబనము, పరఫలాపేక్ష, పరపీడనము - ఏ విధముగాను పనికిరాదు. అందుచేతనే ఇన్ద్రియపాటవము కలిగినంతవరకే జీవించ కోరవలెను. అను సిద్ధాన్తము తెలుపబడెను. అందుచేతనే "త్యక్తేన భుఞ్జీథాః" త్యాగమూలమున అనుభవించవలెననెడి సిద్ధాన్తము తెలుపబడెను. పరభృతులయి భోగులైన వారికి సంపాదనాకష్టము తెలియదు. కనుక పరిమితి యుండదు. స్వకీయ కాయకష్టమొనర్చువారికి సంపాదనమునకును, భోగమునకును, పరిమితులుండును. మరియు భోగమెల్లను కాయకష్టార్జితముపై నాధారపడియుండవలెను. మానసిక కష్టముపై నాధారపడు వృత్తుల మూలమున లభించు నాదాయము భోగలాలసత, (Exploitation) కును తావిచ్చును.

(Make a living out of The sweat of Thy brow) నుదుట చమటకార్చి సంపాదించిన దానితో జీవనోపాధి గడుపుము-అన్న సిద్ధాన్తమును అతిక్రమించుటచే శారీరక, సాంఘిక, ఆరోగ్యములు నాశనమై వ్యక్తిగత - సమష్టిగత - రాజ్యగత పరాక్రమణలు పరిపరివిధముల తలలెత్తి ఆధునిక ప్రపంచమును పలుబాములు పెట్టుచున్నవి. ఏవం = ఈవిధముగా అనగా నీ

---

(ప్రాముఖ్యత నూచించుచున్నది. బుద్ధభగవానుడు చెప్పినట్లు Be a light in to yourself) నిన్ను నీవే యుద్ధరించుకొనుము. తొలినచూపు దివ్యే నీలోనె యున్నది- అన్నదే యీ మన్త్రముతలన స్పష్టమగుచున్నది. ముండకోపనిషత్తులో ఏతైరుపాయైర్యతయస్తు ఇదే భావ

మంత్రములో మొదటి పాదములో చెప్పినట్లుగా అని అర్థము చేయుచున్నారు - అది పాడిగాదు. శాన్తిపాఠములోను, మొదటి మంత్రములోను, రెండవ మంత్రములో మొదటిభాగములోను, తెలుపబడిన మహాసత్యములను గ్రహించి యాచరించుచు - అని యర్థము చెప్పవలెను - ఆ సత్యములు సర్వకాలసర్వావస్థలయందును, సర్వమానవకోటికిని వర్తింపతగినవై యున్నవి. వర్తింపజేసిన యెడల లోకోద్ధరణము నిరాటంకముగా నెరవేరును - (Utopia) అని పాశ్చాత్యులును, రామరాజ్యము — ధర్మరాజ్యము అని భారతీయులును భూతల స్వర్గమని పూర్వులును ఊహించెడి యుత్తమస్థితి లభ్యమగును - త్వయి = నీకు - ఇతరులాచరించినను ఆచరించకపోయినను, నీకిది ధర్మమని, నియతమని చెప్పుటచే ప్రతివాడును తనకు తాను వర్తింపజేసుకొని యాచరించవలెను. అన్యులకొఱకై యాలసింపనక్కరలేదు. నాన్యథేతోఽస్తి = ఇతర మార్గము లేదు - వ్యక్తి కళ్యాణమునకును, లోక కళ్యాణమునకును, ఇదియె మార్గము. అన్యమార్గములుభయాచహాములు, ప్రమాదభూయిష్టములు - పైన తెలుపబడిన మార్గములు అహింసా

---

మును సూచించుచున్నది.

గీత— ఉద్ధరేదాత్మనాత్మానమ్—

6 వ అధ్యాయ - 5 శ్లో— ఈ మన్త్రము అజ్ఞానియగు కర్మఠునకు వర్తించునని శంకరులవారి భావము. కర్మిష్ఠునకుగూడ జ్ఞానమార్గము పొందవచ్చు. నీకిదేవిధము వేరొండువిధము లేదని ఏమనుజుని నిషేధించుట భావ్యముకాదు. అందుచే నీమంత్రము సర్వజనులకు వర్తించవలసినదే.

యుతములని వేరుగా చెప్పనక్కరలేదు. పైనదెల్పిన సత్యముల ఆచరణలో నితరులతో నేవిధమయిన సంఘర్షణ - ద్వేషము - విరోధములును సంభవింపజాలవు.

♦ నరే=మానవునకు, నూరేండ్లు జీవించినను జీవించకున్నను, పై సూత్రములను అనుసరించువానికి అని అర్థము చెప్పవలెను - నరుడనగా నూత్నమార్గము ననుసరించువాడని యర్థము - లోకములోని పశ్వాదులకంటె క్రొత్తదైన - ఉత్తమమైన మార్గము అనుసరించువాడు నరుడు. అట్టివానికి పైదెల్పిన సూత్రములు వర్తించును. అట్టి నూతనమార్గునకు కర్మబంధ ముండనేరదు - ఈ మన్త్రములలో దెల్పిన సత్యమును అనుష్ఠించువారు సహజముగా దేవతలవలె వర్తింతురు. వారికి కర్మాసక్తి కర్మఫలాసక్తి లేదు - మోక్షాసక్తియు తదనువగు ఆచరణమును వారియందు ప్రదర్శితమగుచుండును. వారికి కర్మచే గలిగెడి లేపనము అనగా పూత అంటనేరదు.

తాత్పర్యము:-ఇచ్చటనే (=ఈలోకమందే, ఈదేహమునందే ఇప్పుడే) కర్మలను (శారీరక మానసిక ఆధ్యాత్మిక సకల చేష్టలను చల అచల స్థితులను) చేయుచునే నూరేండ్లు (పరమాత్మ

---

♦ భగవద్గీత — ౩ అధ్యాయం ౩౫ వ శ్లోకము స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥

నరుడనగా — నశించని ఆత్మగలవాడు. అనగా:- ఆత్మయే ప్రధానముగా కలిగి తదనుగుణముగా ప్రవర్తించువాడు కాన కర్మ ఆత్మను అంటదని యర్థము.

శరీరస్థోఽపి కౌంతేయ నకరోతి నలిప్యతే। భగవద్గీత—13 అ.

అనుగ్రహించినట్టియు ఇంద్రియములు భరించగలిగినట్టియు, అంతకాలము ) జీవింపకోరుము. నీకిదేవిధము మరియొకండు విధము లేదు- ( పశ్వాదులగు భూతములకన్న నూతనమగు ( మిన్నయగు ) మార్గముననుసరించు ) నరునకు కర్మ పై రెండు మన్త్రములలోను ఈ మన్త్రము మొదటి భాగములోను, విధించిన సత్యముల కనుగుణముగా తత్ జ్ఞానముతో జేయబడిన కర్మ అంటదు- ( ఫలభోక్తృవు కమ్మని బద్ధపరచదు )

★ 3 శృతిః॥ అసుర్యానామ తెలోకా అన్ధేన
తమసాఽఽవృతాః॥ తాం స్తె ప్రేత్యా
భి గచ్ఛన్తి యెకె చాత్మహనోజనాః॥

విశేషార్థము:— అసుర్యాః = అసుఃషు ప్రాణములయందు రమించువారు అసురులు వారికి సంబన్ధమైనవి - అసుర్యాః సూర్యుడు వెలుగునిచ్చువాడు - సూర్యుడు లేనిచోట్లు అసుర్యా అని చెప్పవచ్చును అని కవిసార్వభౌముడగు రవీన్ద్రుని భావము- ఆ అర్థము వచ్చుటకు అసూర్య అనియుండవలెనుగాని అసుర్యా అని యుండరాదు - అట్లుండుట ఛాందసరూపమని గ్రహించ

ఆత్మ ఏకర్మకు బద్ధముకాదు- కర్మలో తత్త్వాః ఇ౦ద్రియములను బాధించు శక్తి లేక దోషము లేదనికూడ అర్థము చేయవచ్చును- . ఆ కర్మకును కర్తకును ఏర్పడిన మనస్సంబన్ధమునుబట్టియే బన్ధత్వమేర్పడునని శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు.

★ అనిచ్ఛితమయిన కర్మ బన్ధించదని మహమ్మద్ ప్రవక్త కూడ అంగీకరించెను- రెండవమారు స్త్రీపై దృష్టించిన పాపమని ఆయన చెప్పిన వాక్యభావమిదియే- మొదటిచూపు అప్రయత్నము- రెండవచూపు బుద్ధిపూర్వకము- ఏకేచ = ఎవరైతె ఆత్మహనః = ఆత్మను చంపువారగు

వచ్చును. అట్టిచో జ్ఞానరహితమైన అని భావము- నామ నిశ్చయముగా అని యొకయర్థము - ప్రసిద్ధమైన అని యొకయర్థము- పేరుగల అని ఒక యర్థము. ఈ పదము నిరర్థకమని శ్రీ శంకరుల వారి భావము - పేరుగల లేక నిశ్చయముగా అను అర్థము గ్రహించవచ్చును. లోకాః = లోకములు అనగా లోకములనిగాని, జన్మలనిగాని, అవస్థావిశేషములనిగాని, చెప్పవచ్చును- అన్ధేన తమసా = తమస్సంబన్ధమైన అంధత్వముచేత అన్ధంతమః అను పదములు 9 వ మంత్రములోను- 12 వ మంత్రములోను రానున్నవి- ఈ మన్త్రములోను ఆ మన్త్రములలోను వచ్చునీ పదములకు ఒకే యర్థము చెప్పవలెను - అన్ధత్వమును కల్పించు చీకటియని చెప్పవచ్చును - తమోగుణ సంబన్ధమైన అన్ధత్వము అనవచ్చును. రెంటికి పర్యవసాన మొక్కటే.

♦ ఈ రెండు పదములు లోకమునకు విశేషణములగును. అశ్లే అసూర్యకూడ విశేషణముగా జేయవచ్చును. ప్రేత్య = మరణించిన పిమ్మట అని యొక యర్థము- ప్రస్తుత అవస్థనుదాటి యని మరియొకయర్థము. ఆత్మహనః = తమ్ముదా చంపుకొనిన వారు- తమ ఆత్మకు విరుద్ధమైన మార్గమును అనుసరించువారు-

---

జనాః = జనులు. తే = వారు ప్రేత్య = వదలినారు. నిశ్చయముగా, అసుర్యాః = అసురసంబన్ధమైనట్టియు తమసా = తమోగుణ భూయిష్ఠమైన అన్ధేన = అన్ధత్వముచే ఆవృతాః = కప్పబడినట్టియు తే, ఆలోకాః = లోకములను తాన్ = వానిని గూర్చి అభిగచ్ఛన్తి = పోవుచున్నారు.

♦ బృ ౪-౪-౧౧ లో మన్త్రమును పోల్చవచ్చును- అసూర్యశబ్దము బదులు అనందాయనికలదు- సుఖహీనమని యర్థము- "ఆత్మహనః" అనుదానికి బదులుగా అవిద్వాంసః అబుధాయని కలదు- విద్యాబోధలు లేనివారు

మొదటి మూడు మన్త్రములలో జెప్పిన మార్గములకు వ్యతిరిక్తముగా వర్తించువారు.

తాత్పర్యము:— తమలోనున్న ఆత్మకు విరుద్ధముగా ప్రవర్తించెడి యాత్మహత్యాకారులు- ఆయాయవస్థలను లేక దేహములను త్యజించినపిమ్మట ప్రకాశరహితములగు అసురసంబద్ధమైనట్టియు తమోభూయిష్ఠమైన అంధత్వముచే నావరింపబడినట్టియు నవస్థలను లేక జన్మములను లేక లోకములను పొందుచున్నారు.

౪ శ్రుతిః ॥ అనేజదేకం మనసోజవీయో
నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్ ॥
తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్
తస్మిన్నపోమాతరిశ్వాదధాతి ॥

తత్ = ఆ ఆత్మ- ఏకం = ఒక్కటే అనేజత్ = చలించనది. మనసః = మనస్సుకంటె జవీయః = వేగముకలది-ఏనత్ = దీనిని- దేవాః = దేవతలు - ఇన్ద్రియములు న ఆప్నువన్ = పొందలేరు — పూర్వం = అన్తకుమునుపే అర్షత్ = పోయియుండును- తిష్ఠత్ = నిల్చియుండియు- ధావతః = పఱుగెత్తుచున్న అన్యాన్ = ఇతరులను అత్యేతి = అతిక్రమించి ముందుకు పోవుచున్నది. తస్మిన్ = తన్మూలమున మాతరిశ్వా = పరమాత్మ అపః = క్రియాశక్తిని — అన్తరాళమును

ఆత్మజ్ఞానరహితులు అని అర్థము- ఆత్మోపలబ్ధికి భిన్నమైన మార్గమనుసరించిన వారు.

బృ- ౬-౨-౧౬ అథయ ఏతౌపన్థానౌనవిదుః తేకీటాః పతంగాః యదిదం

దధాతి = ఇచ్చుచున్నాడు - లేదా విభజించుచున్నాడు- లేదా భరించుచున్నాడు-

♦ విశేషార్థము:— అనేజత్ = కదలుట లేక కంపించుట అది లేనిది అనేజత్ — అనగా చంచలరహితమైనది- పరమాత్మ దేశకాల ( Space and time ) ములకు అతీతుడు. ఆయన కదలిపోవుటకు తనకుమించిన ప్రదేశములేదు- అందుచే నాయనను గురించి గమనము చెప్ప వీలుకాదు - ఏకం = ఆయన యొక్కడే - అన్యులు లేరు.

" ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్
నాన్యత్ కించన మిషత్ " ఐతరేయము-

జవీయః = అధికవేగముకలది అని చెప్పినప్పుడు ఆత్మకు— మనస్సుకు వేగములో తారతమ్యము తెల్పుట ముఖ్యాంశము కాదు. ఆత్మకు గమనమే చెప్పవీలుకాదు. ఉన్నచో గమన వేగము ఊహాతీతము - మనస్సు ఎంత వేగముగా గమనము చేయగలిగినను దాని శక్తివలన ఆత్మను గ్రహించజాలదని యర్థము- దేవాః = దేవతలు ఆత్మకంటె తక్కువ శక్తికల వారు- కాన ఆత్మను గ్రహించజాలరు.

---

దండశూకం- సూర్యచంద్ర మార్గములకు బోని ఆత్మహనులు క్రిములు- పురుగులు- దోమలు- రెక్కల పురుగులు మొదలగునవిగా అగుదురు.

♦ తిరుగుచున్నది భూమి, తిరుగనివాడు సూర్యుడు- కాని సామాన్యదృష్టితో భూమి తిరుగనట్లును సూర్యుడు తిరుగుచున్నట్లును, కనపడును. ఇట్లే ఇతర అనుభవములు కూడ ఓడలోను, రైలులోను, వాయువిమానములోను ప్రయాణము చేయువారికి ప్రక్కనున్న భూమి చెట్లు కొండలును కదలి పరుగెత్తుచున్నట్లు కనపడును. తాము స్థిరముగానున్నట్లు తోచును- అట్లే

దేవాః = ఇన్ద్రియములు మనస్సునకు లోబడిన పరివారమగు టచే మనస్సునకందని ఆత్మ ఈ ఇన్ద్రియములకును గోచరము కాదు. పూర్వమర్షత్, తిష్ఠత్, ధావతః, అత్యేతి, ఇవి యన్నియు నాత్మకువర్తించు చేష్టలుకావు-

మానవుని బహిరన్తరింద్రియముల వ్యాపారములకు ఆత్మ అందదని తెల్పుటకుగాను ఈ యింద్రియ చేష్టలకు వాడెడిపద ములు ఆత్మనుగూర్చి వాడబడెను - ఆత్మ నిర్వికారము- పై దెల్పిన చేష్టలు వికారఫలితములు. అన్యాన్ = ఇతరులను- అనగా దేవతలు - పదార్ధములు - ఇన్ద్రియములు ఏవయినను సరె = ఆత్మేతరములు - అపః = నీరు - వాయువు - అంత రిక్షము- ఈ మూడు అర్ధములు కలవు. నీరు- వాయువు పంచ భూతములలో జేరియున్నవి. అంతరిక్షమనగా భూమ్యాకాశ ముల మధ్య ప్రదేశము- సృష్టికి పూనకముందు ఆత్మ పూర్ణుడై యుండెను- సృష్టికి సంకల్పించినపుడు సృజింపబడినవానిని నిలువ బెట్టుటకు స్థలము కావలసియుండెను. ఆ స్థలమును తనలో నుండియే ఆత్మ అనుగ్రహించెను.

---

మనము కదలుచున్నను మనకు అందకుండ ఆత్మ పరుగెత్తుచున్నట్లు తోచును
"యతోవాచోనివర్తన్తె అప్రాప్యమనసాసహ" తైత్తిరీయము.

కేనోపనిషత్తు ప్రథమఖండము 3 శ్లోకము నతత్రచక్షుర్గచ్ఛతి నవా గ్గచ్ఛతినోమనో వగైరా నారాయణోపనిషత్ ఏకో నారాయణః నద్వి తీయోఽస్తి కశ్చిత్ ॥ భగవద్గీత- 11 అ- 5 వ శ్లో మొ- 2 శ్లో— మమదేహె = ఆయన దేహములో విశ్వరూపమును జూడవలెనని చెప్పు చున్నది. 15 శ్లో - లో అర్జునుడు పశ్యామి దేవాన్ తవదేవదేహె- కృష్ణుని దేహములోనే విశ్వమునుజూచెను- ముండకములో "తమసాచీ

* అదియె అంతరాళము- అంతరిక్షములో ఉదకములు కలవని ( ఋగ్వేదము 1 మండలము 10 వ అనువాకము 14 వ మంత్రము అనగా 628 వ ఋక్కులో గలదు. ) బైబిలులో గూడ దేవుడు నీటిమీద నావరించి సృష్టిచేసెననికలదు- పురుష సూక్తములో "అద్భ్యః సంభూతః పృథివ్యైరసాచ్చ" అని యున్నది. అందుచే సృష్టియొక్క ఆరంభమున నీటితో సంబన్ధము కలదని యనేక మతకర్తల భావము. అందుచే నపః అనగా సృష్టి రచనాశక్తి యని చెప్పనొప్పును. అంతరిక్షమన్న అర్థము సృష్టికి అనువగు స్థలమును ( అవకాశమును ) ఆత్మ తనలోనె కలిగించెను అన్న అర్థము మరింతభావ్యము. మాతరిశ్వా, మాతరి = అంతరిక్షమందు శ్వయతి = నడచువాడు. కాన వాయువు, ఈ "మాతరిశ్వా" అను పదము పరమాత్మకు వర్తించును.

(ఋగ్వేదము 1 మండలము 164 సూక్తము, 46 వ మన్త్రము 1730 వ ఋక్కు ) ఈ వాయువు బ్రహ్మయని తైత్తిరీయము శిక్షావల్లి శాన్తిపాఠములో కలదు. "త్వమేవ ప్రత్యక్షం

యతెబ్రహ్మ" అన్నపుడును తానె పెరిగి చోటిచ్చెనని భావము. భాగవతములో యశోద బాలకృష్ణుని నోటిలో విశ్వమును జూచుటయు అదియే భావము. ఇచ్చట కృష్ణుడు నిర్గుణపరబ్రహ్మము.

* (We move and live and have our being in him) ఆతనిలో నివసించి సంచరించి ఉనికిపట్టుగా చేసికొనియున్నాము. ఈ భావము అంతరాళము లేక అంతరిక్షము అని అపః అనుపదమునకు చెప్పెడి అర్థమునకు సరిపోవును. "అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్స్థితః"

బ్రహ్మాసి” నీవు ప్రత్యక్షముగా బ్రహ్మవగుచున్నావు. ఇచ్చట సృష్టి సంకల్పించిన పరమాత్మయేయని చెప్పుట భావ్యము.

“తస్మిన్నపోమాతరిశ్వాదధాతి” అన్న వాక్యమునకు పరమాత్మ తనలోనుండియే అవకాశమును, స్థలమును, సృజింపబడిన జగత్తునకు భూతములకును కల్పించెను, అని అర్థము చెప్పవచ్చును. మొదటి మన్త్రములోని ఈశావాస్యమునకు ఇది అనుగుణమైన యర్థము.

తాత్పర్యము:— ఆత్మ చలనరహితమై, ఏకమై, మనోవేగమున కందరానిదై, ఇతరేన్ద్రియములకును, దేవతలకును, పొందరానిదై అన్నిటికంటెను ముందున్నదై సుస్థిరమై, పరుగెత్తుచున్న అన్నిటిని నతిక్రమించినదై తనలోనుండియే సృష్టి కంతకును స్థలావకాశమును, కాలావకాశమును, కల్పించి భరించుచున్నది.

౫ శ్రుతిః॥ తదేజతి తన్నైజతి
తద్దూరె తద్వదన్తికే।
తదన్తరస్య సర్వస్య
తదు సర్వస్యాస్య బాహ్యతః॥

తత్ = అది; ఏజతి = కదులుచున్నది. తత్ = అది; నైజతి = కదలుటలేదు. తత్ = అది; దూరె = దూరమందున్నది.

మహానారాయణోపనిషత్తు. మన్త్రపుష్పములో యచ్చకించిజగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా॥
అన్తర్బహిశ్చతత్సర్వంవ్యాప్యనారాయణస్థితః॥

తత్ = అది; తద్వత్ = ఆప్రకారముగానె ( విదుషాం = జ్ఞానులకు ) అంతికే = సమీపమందును. తత్ = అది అస్య = ఈ; సర్వస్య = సమస్తజగత్తునకు అన్తః మధ్యయందును, తదు = ఆ; ఆత్మతత్వమె అస్య = ఈ; సర్వస్య = సమస్తజగత్తునకు బాహ్యతః = వెలుపలను; అస్తి = కలదు. ఉ = నిశ్చయము.

విశేషార్థము:— సామాన్య మానవ భాషాతీతమగు ( Absolute ) నిర్వికల్పమగు ఆత్మనుగూర్చి మానవభాషలో ( Relative ) దృష్టితో వర్ణించుటకష్టము, అందుచేనీమన్త్రము ప్రథమపాదములో చెప్పినస్థితి ఆత్మకువర్తించదు. కాని జ్ఞానులు అజ్ఞానులుఅగుమానవదృష్టిలోఅన్వయించును.స్వస్వరూపమున గమనము దూరము, సమీపము, అను ద్వంద్వాతీతమైన ఆత్మ అజ్ఞానులకు కదలుచున్నట్లును, దూరమందున్నట్లును స్ఫురించును. జ్ఞానులకదియే అచంచలమై తమ కత్యన్తసమీపములో తమలోనె యున్నట్లు అనుభవమగును.

అస్యసర్వస్య = ఈ అన్నిటికి అనగా దృశ్యజగత్తునకును, అందులోని భూతజాలమంతకును, అస్యసర్వస్య = అని రెండు పర్యాయములు వాడబడినది, అధిక ప్రాధాన్యమిచ్చుటకే ద్విరుక్తి ఉపయోగించును. అన్తః, బాహ్యతః, లోపల, వెలుపల— మొదటి మంత్రములోచెప్పిన భావము మరింత స్పష్టపరచబడినది. ఈ భూతజాలముయొక్క అంతరమందు ఆత్మ అన్తర్యామిగానున్నాడు. తత్ సృష్ట్వాతదేవానుప్రావిశత్ = తైత్తిరీయము ఆనందవల్లి 6 వఅనువాకము.

"య ఆత్మా సర్వాన్తరః" బృహదారణ్యకము. 3-౪-౧

తాత్పర్యము:— ఆత్మ కదలదు, కదలుచున్నట్లుండును, దూరమందున్నట్లు అత్యంత సమీపమందున్నట్లు తోచుచుండును, నిశ్చయముగా నాయాత్మ యీ జగత్తునకును, ఈ భూతజాలమునకంతకును, లోపల వెలుపల నిండియున్నది.

౬ శ్రుతి: ॥ యస్తుసర్వాణిభూతాని
ఆత్మన్యేవానుపశ్యతి॥
సర్వభూతేషుచాత్మానం
తతో న విజుగుప్సతే॥

యః = ఎవడు తు = అయితే; సర్వాణి = సమస్తమైన భూతాని = భూతములను; ఆత్మని = ఆత్మయందు; ఏవ = మాత్రమే; చ = మరియు సర్వభూతేషు = సర్వభూతముల యందు; ఆత్మానం=ఆత్మను; అనుపశ్యతి=చూచుచున్నాడో; తతః = పిమ్మట; నవిజుప్సతే = ఏవగించడు.

విశేషార్థము:- 1. భూతాని = భూ; అగుట; రూపమెత్తుట, సృజింపబడుట, అని అర్థముకలదు. కాన భూతములనగా:— ప్రాణముగల చర జన్తుజాలమేగాక స్థావర ఓషధులును వనస్ప

♦ఈ 6—7 మంత్రములలోని భావములు జీవితములో వర్తింపజేసినయెడల సకల విధములగు అసమానత్వములు రూపుమాయును. ఆర్థిక, సాంఘిక, రాజకీయ, నైతిక, ఆధ్యాత్మిక, అసమానత్వములకు తావుండదు. అందుచే భారతీయ తారకమంత్రమనదగును. "సర్వేజనాస్సుఖినోభవన్తు" అను నది స్థిరమగును. నూతన విద్యాపద్ధతులు వీనిమీద ఆధారపడవలెను. పాశ్చాత్యులు సమానత్వముచెప్పెదరు, భారతీయులు పరత్వమును నొక్కిచెప్పెదరు ఇవియే ముణ్డకోపనిషత్ 3 వ అధ్యాయము 1 వ ఖండము 1—2 మంత్ర)

తులును, సర్వ జడపదార్థములును భూతాని అను పదమునకు నన్వయించును. అణువునుండి బ్రహ్మాండమువరకుగల జగత్తంతయు భూతాని అను పదములో జేరియున్నది. (2) ఆత్మని ఆత్మాసం = ఆత్మయను పదము మూడవ మంత్రములోకలదు, కాని దాని యర్థము ఇంతవరకు నిరూపింపబడలేదు, జీవాత్మయనియు పరమాత్మయనియు అర్థము చెప్పవచ్చును. వక్త తననుగూర్చికూడ నీపదమునే వాడవచ్చును.అప్పుడు సర్వభూతములలో తనను తనలో సర్వభూతములను చూడవలెను, అని అర్థము చెప్పవలెను, లేదా! సర్వభూతములలో పరమాత్మను పరమాత్మలో సర్వభూతములను చూడవలెను, అని చెప్ప వచ్చును. అట్లే జీవాత్మలో సర్వభూతములును సర్వభూతములలో జీవాత్మను చూడవలెను, అనియైనను చెప్పవచ్చును.

(3) అనుపశ్యతి:— తదేకదృష్టితో చూడవలెను, ఒకానొకప్పుడు చూచుట పనికిరాదు. అశ్రద్ధతో జూచుట పనికిరాదు, స్థిరముగా సావధానముగా అనన్యదృష్టితో చూడవలెను. ఈ చూచుట అనునది వట్టిచూపుకాదు. అనుష్ఠాన, అనుభవ, ఆనందములుగా పరిణమించుచూపు.

(4) తతః = పిమ్మట అందువలన అనగా:— పైదెల్పిన దృష్టి తత్ఫలితమగు అనుభవము కలిగిన పిమ్మట.

---

ములుగా నున్నవి. ఋగ్వేదము ప్రథమ మణ్డలము 164 వ సూక్తము 20 వ మన్త్రము. ఇందులో మొదటి మన్త్రము ఈ మన్త్రములో చెప్పిన భావము గమనించవలెను. ఆ రెండు పక్షులలో నొకటి తీయనిపండు తినుచున్నది. రెండవది తినకుండ ప్రకాశించుచున్నది, లేక చూచుచున్నది.

(5) న విజుగుప్సతే = ఏవగించడు లోకములోగల సమస్త పదార్థములు పరస్పరము.

♦ దూరమగుటో సమీపమునకు వచ్చుచుండుటయో జరుగు చుండును. దానికే రాగద్వేషములని పేరు దానికే ఆంగ్ల భాషలో (Law of attraction and repulsion) అని పేరు. దానికే ఆకర్షణ, నిరాకర్షణ, అని చెప్పవచ్చును.

విజుగుప్సతే = అన్నప్పుడు పైన దెల్పిన దృష్ట్యనుభవము గల వ్యక్తి సర్వభూతములకుగాని, ఏ భూతమువలనగాని, దూర ముగా నుండడు. దేనివలన తనకుగాని, తనవలన దేనికిగాని, నిరాకర్షణ యుండదు. సమస్తము తానేయని అన్వయ వ్యతిరేక సూత్రమువలన గ్రహించి యున్నందున అన్యత్వములేని కారణ మున రాగద్వేషసూత్రమున కవకాశము లేదు.

తాత్పర్యము:— ఎవడు సర్వజగత్తును అందలి సకల వస్తు జీవజాలమును ఆత్మయందు (తనలోనుపరమాత్మలోను) తదేక దృష్టితో చూచుచున్నాడో, తదనుభవము పొందుచున్నాడో అట్లే సర్వజగత్తులోను అందలి సకలవస్తు జీవజాలములోను, ఆత్మను (తనను పరమాత్మను) తదేకదృష్టితో చూచుచు న్నాడో తదనుభవము పొందుచున్నాడో అట్టివానికి అటుపిమ్మట తన్మూలమున జగత్తులో దేనియందు రాగద్వేషములు కలుగు టకు అవకాశము లేదు. (ఆత్మ పదార్థమే ఆయాచిత్రవిచిత్ర భిన్న రూపముల ధరించెనని తెలిసి ముగ్ధుడగును.)

---

ఆనగా:— తినెడి పక్షిని, తినుటయందలి ఆసక్తిని గమనించుచున్నది.

♦ ౭ శ్రుతిః ॥ యస్మిన్ సర్వాణి భూతాని
ఆత్మైవా భూద్విజానతః ।
తత్ర కో మోహః కశ్శోక
ఏకత్వమనుపశ్యతః ॥

యస్మిన్ = ఎప్పుడు; సర్వాణి = సమస్తమైన; భూతాని = భూతములు; ఆత్మైవ = ఆత్మయే; అభూత్ = అయినట్లు; విజానతః = చక్కగా తెలియుచున్నవానికి; ఏకత్వమ్ = అద్వైతము, అనుపశ్యతః = అనుభవమగుచుండువానికి; తత్ర = అప్పుడు కో మోహః = మోహమెక్కడిది, కశ్శోకః = శోకమెక్కడిది.

విశేషార్థము:— యస్మిన్ = ఎప్పుడు, ఏకాలమందు, ఏ అనుభవదశలో ఆత్మైవాభూత్ = జగత్తును అందులోని సర్వ వస్తు జీవజాలమును తమ తమ భిన్నరూపములతో అగపడక ఒక్కటేయయి యారెయొక్కటి యాత్మయై తోచుట అనగా నామరూపములకుండుకొన్న ప్రాముఖ్యతయు నశ్వర అవినశ్వర భావమునకుండు ప్రాముఖ్యతయుపోయి యంతయు అవినాశియైన ఆత్మగా కనబడుట, అట్లే చరించుట, ఇచ్చట ఆత్మయను పదమునకు "తాను" అని యర్థము చెప్పవచ్చును; అప్పుడీ దృశ్యమంతయు తానేయని స్పష్టమగును. నాలుగు గోడలకు నాలుగు

♦ రెండవమంత్రములో బృ ౪-౪-౧౩ "సవిశ్వకృత్ సహిసర్వస్యకర్తా తస్యలోకః సలోక ఏవ = తానె అందఱు, అందఱె తాను తానె సృష్టికర్త 2 వ మంత్రములో తర్వాత, తినుచున్నపక్షి తినుటలో మగ్నమైనది. అందుచే దానికి వశమైనది, అందుచే మోహమనబడినది, అందుచే దుఃఖించుచున్నది. కాని ఎప్పుడు అతినని పక్షిని ఆ ప్రభువును ఆ పూజనీయుని,

నిలువుటద్దములుంచిన గదిలో నిల్చియున్న వ్యక్తికి ఎటుచూచి నను ఎంతదూరమైనను తానే కన్పడును, అట్లే ఆ నిలువుటద్ద ములే గోడలైన గదికి తనకన్న భిన్నమైన వస్తువువే కనపడదు.

(3) విజానతః = అనుపశ్యతః = చక్కగా తెలిసికొని తదేక ధ్యానముతో అనుభవమొనర్చుకొన్నవారు.

మోహః శోకః = మోహము ప్రమాదము తానుగాక ఆత్మగాక అన్యమున్నదనుకొనుట మోహము. బృ ౧-౪-౨ ద్వితీయాద్వై భయం భవతి = రెండవ వస్తువు ఉండగానే భయము కలుగును. మోహము వలననే భయము కలుగును, అదియె రాగద్వేషములకు తావిచ్చును, అందుచే ఫలా ఫల ప్రాప్తి. తద్ద్వారా సుఖదుఃఖములు తద్ద్వారా గర్వక్రోధములు మొదలగు తృష్ణాజనిత సంతానమంతయును హృదయరంగమున నాట్యమొనర్చ నవకాశము కలుగును.

తాత్పర్యము:— ఎప్పుడు, ఏకాలమున, ఏ దశయందు, జగత్తును, అందులోని సమస్తవస్తు జీవజాలమును ఆత్మయే (తానే పరమాత్మయే) అయినట్లు చక్కగా తెలియబడి యనుభవమగునో, ఈ సృష్టియొక్కయు, అందులోని వివిధ వస్తు జీవజాలముయొక్కయు ఆ సృష్టికర్తయొక్కయు ఏక

అతని మహిమను, జూచెనో యప్పుడే దుఃఖరహితమగుచున్నది.

ఈ మన్త్రములలో చెప్పిన వృక్షము ప్రకృతి-జగత్తు రుచిగలఫలమును తినుట యనగా జగత్తునందభిరుచిగలిగి దానిని అనుభవించుట, ఈ అనుభ వము ప్రారంభముకాగానే దానియందాసక్తి బెరిగి పరవశమగును. ఎప్పుడు దానికి వశమయ్యెనో యప్పటినుండి దానికి బంటు అగును. దానిపై తన

త్వము=అభిన్నత్వము ఎప్పుడు చక్కగా తెలియబడి యనుభవ మగునో యట్టిస్థితిలో నట్టి యనుభవైకవేత్తకు భిన్నత్వమున్న దను మొదలగు మోహాభావములెట్లు కలుగును? తత్ఫలితమగు శోకమెట్లు కలుగును?

౮ శ్రుతిః ॥ సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణం ।
అస్నావిరంశుద్ధమపాపవిద్ధమ్॥
కవిర్మనీషీ పరిభూః స్వయంభూః యాథాతథ్యతోఽర్థాన్
వ్యదధాత్ శాశ్వతీభ్యస్సమాభ్యః ॥

సః = ఆత్మ; పర్యగాత్ = సర్వత్రవ్యాపించినది, శుక్రం= ప్రకాశముకలది, అకాయం = శరీరము లేనిది, అవ్రణం = గాయము లేనిది, కొట్టబడనది. అస్నావిరం = నరములు లేనిది, శుద్ధం = నిర్మలమైనది, అపాపవిద్ధమ్ = పాపముచే గొట్టబడ నది, పాపము లేనిది. కవిః = సర్వద్రష్ట యయినది, మనీషీ = సర్వజ్ఞమైనది, పరిభూః = విశేషరూపముఁనొందెడిది, అన్ని టిని ఆవరించినది, స్వయంభూః = స్వయముగానే యుద్భవించి యున్నది, శాశ్వతీభ్యః = శాశ్వతమైన= సమాభ్యః సంవత్సర ములు లేక కాలము పర్యంతము, యాథాతథ్యతః = ఎట్లుండ

మున్న స్వేచ్ఛను అధికారమును వదలుకొని దానికి లొంగిపోవును. అంత కంటె శ్రేయస్సు లేదని భ్రమకలుగును, ఆ భోగేచ్ఛ. అ భోగతన్మయ త్వము, ఆ భోగముచే కలిగిన భ్రమ. పరాధీనునిజేసి దుఃఖములో ముంచును. ఆపండు తినని రెండవపక్షి యీజగత్తుపై అధికారము సల్పుచునేయుండును అందుచేతను దాసీనవత్ గా చూచుచుండును, అందుచే మోహముకాని దుఃఖముకాని యీపక్షికి లేదు. దుఃఖపడుచున్న రెండవపక్షి జగత్తులో నిమిడియున్న తనకండ్లను పండ్లు తినని రెండవపక్షిపై నిగిడించగానే తినుట

వలెనో యట్టి విధముననే అర్థాణ్ = ప్రయోజనములను, విధులను, ధర్మములను, వ్యదధాత్ = నిర్ణయించి నియోగించెను.

విశేషార్థము: = శుక్రం = అనగా తేజస్సుగాక బీజము, వీర్యము, సారము అని అర్థములు కలవు. ఆ పరమాత్మయే విశ్వమునకు బీజమన్న అర్థము పొసగును. ఆయనయే సర్వమునకును సారమన్న అర్థమును పొసగును. "శుక్రమేతదతివర్తన్తి ధీరాః" ముణ్డకం 3-2-1 అచ్చట బీజమనియే అర్థము. అకాయం = కాయమనగా దీనిలో ఎముకలు నగ్గరాలు పెరుగునది, అట్టి కాయము లేనివాడు వ్రణీ = అనగా: = గాయపడుట.

అకాయం, అవ్రణ- అస్నావిరమ్, ఈ మూడింటిచేను స్థూల శరీరము లేనివాడని యర్థము. అపాపవిద్ధం = అనగా పాపముచే కొట్టబడనివాడు, శుద్ధమ్, అపాపవిద్ధమ్, అన్నప్పుడు కారణ శరీరముకూడ లేనివాడని అర్థము.

కవిః = మామూలు కవియేగాక సర్వము చూచువాడని అర్థము. ఆశక్తి కొంతయయిన కలవాడే కవియని మనభాషలో ప్రఖ్యాతి పొందును. బృహదారణ్యకం 3-8-11 నాన్యతోఽస్తి ద్రష్టా ఇతరులు చూచువారు లేరు. ఆ పరమాత్మయే చూచువాడు మనీషీ = మనీషియనగా:— వివేకము లేక ప్రబోధము,

మానును. దాస్యము తొలగును భ్రమవీడును, శోకము అంతరించును. కాన రెండవపక్షి కర్తవ్యము జగత్తును భోగించుటగాక జగదధపతిమీద తనదృష్టిని నిలుపుట. ఈ మన్త్రములలో జెప్పిన తినెడిపక్షి జీవాత్మ. తిననిపక్షి పరమాత్మ. ఈ పరమాత్మస్వరూపము నితర యుపనిషత్తులలో గూడ వర్ణిత్తమై యున్నది. సాక్షిభూతుడుగా నాయావిశేణములు క్లప్తముగా తెలుపబడును,

ఆ వివేక, ప్రబోధములకు నిధి. మనీషీ— } పరిభూః = ఉన్నతుడని శ్రీ శంకరులవారు అర్థము చేసిరి. పర్యగాత్ = అను పదములో "పరి" అను దానికి సర్వతః అని అర్థము చెప్పిరి. అట్లే సర్వము, భూ అయిన వాడని చెప్పవచ్చును. "బహుధావిజాయతే" అని పురుష సూక్తములో కలదు. "బహుస్యాం ప్రజాయేయేతి =" తైత్తిరీయం – ఆనన్దవల్లి– 5 వ నువాకము– బహురూపముల ధరించుటయే సృష్టి కాన పరిభూః అనునపుడు బహురూపములను పొందినవాడని చెప్పవచ్చును. రవీంద్రుని భావము నదియే. అర్థాః = ఫలము, ఉద్దేశ్యము, పరమావధి, భావము, అని అర్థములు కలవు,

యాథాతథ్యతః = ఈ పాదమునకు శంకరులవారు చెప్పిన అర్థము:— ఈశ్వరుడు సర్వజ్ఞుడగుటచేత భూతముల కర్మఫల సాధననుసరించి యథాయోగ్యమైన విధమున కర్తవ్యములను, పదార్థములను భూతములకు విభజించి యిచ్చెను. మరియొక అర్థమిట్లు చెప్పిరి. సంవత్సరనాములైన ప్రజాపతులకు వారి వారి యోగ్యతలననుసరించి కర్తవ్యములను పంచి యిచ్చెను.

---

"తేనత్యక్తేనభుంజీథాః" అన్న వాక్యముయొక్క రహస్యార్థము ఈ రెండు సూత్రములవలన వెల్లడి యగుచున్నది.

జగత్తును, జగత్తునందలి ఆకర్షణీయమైన ఇన్ద్రియ జీవితమును ఆ జీవితమునందలి యనురాగమును త్యజించవలెను, లేకున్న దానికి లోబడి దాస్యబంధములో చిక్కుకొనును. భుజించవలసి వచ్చిన యెడల దానిపై అధిపతిగానే నిర్లక్ష్య భావముతో అనుభవించవచ్చును. త్యజించుటయే అనుభవించుటయని భావము, కవివరినవారు జగత్తుకెన్నడు దాసులుగారు.

రవీంద్రులవారీపాదమునకిట్లర్థము చెప్పిరి. (Dispenses of perfect fulfilment to the endless years.) "అన్తము లేని కాలమునకు సంపూర్ణమైన స్వోపలబ్ధిని ప్రసాదించెను." లోకములోని ప్రతి వస్తువును నిరన్తరాభివృద్ధిమూలమున పరిపూర్ణస్థితిని పొందవలెను. దానికనుగుణమగు ఉత్తమవిధానము పరమాత్మ అనన్తకాలగర్భమున నిమిడ్చి యూసవకాశమును అందఱికి ననుగ్రహించెను.

తాత్పర్యము;— ఆ పరమాత్మ స్వయంభువు, సర్వవ్యాపి, తేజోరాశి, సర్వమునకు బీజము. సర్వసారము, కండరములు, వ్రణములు, కాయము, లేనివాడు, స్థూల సూక్ష్మ దేహరహితమైనవాడు. సర్వద్రష్ట, సర్వజ్ఞానస్వరూపి. వివిధనామరూపధారియయినవాడు, లోకములోని వివిధనామరూపధారులు నిరన్తరాభివృద్ధి మూలమున పరిపూర్ణత్వమునొందుట కనుగుణమగు నుత్తమవిధానావకాశములను అనన్తకాలగర్భమున నిమిడ్చి యెల్లర ననుగ్రహించెను.

ఈ రెండు మన్త్రముల ఆధారముచేగూడ (తేనత్యక్తేన) పదములకు ఈ వ్యాఖ్యలోనిచ్చిన అర్థమే సమంజసమని ఋజువగుచున్నది. ముండకోపనిషత్తు ౧-౨-౧౧ వ మన్త్రము "భైక్ష్యచర్యాంచరన్తః" అన్నప్పుడు శ్రీ శంకరులవారు అపరిగ్రహులైన గృహస్థులు భైక్ష్యచర్యలోని వారేనని యర్థము చెప్పిరి. కాన ఆ యపరిగ్రహము అనగా:— అనాసక్తియోగమే. ఆ మంత్రమును దీనిని బలపరచుచున్నది.

• బృహదారణ్యకము ౪-౪-10 శ్వేతాశ్వతర ౧ అ 1 మంత్రమున్ను అవి

♦ ౯ శ్రుతిః ॥ అన్ధంతమః ప్రవిశన్తి
యేఽవిద్యాముపాసతే ।
తతో భూయఇవ తేతమో
య ఉ విద్యాయాగ్ంరతాః ॥

యే = ఎవరు; అవిద్యాం = అవిద్యను ఉపాసతే = ఉపాసింతురో తే = వారు; అన్ధంతమః = తమస్సంబన్ధమగు అంధత్వమును ప్రవిశన్తి = ప్రవేశింతురు. యే = ఎవరు; విద్యాయాం = విద్యయందు రతాః = అనురక్తులో; తే = వారు తతః = దానికంటె; భూయః = అధికముగ; తమః = తమస్సును ప్రవిశన్తీవ = ప్రవేశించునట్లుగపడుదురు.

విశేషార్థము:— అన్ధః తమః = (1) 3వ మన్త్రములో దీనిభావము చర్చించబడెను. తమస్సంబన్ధమగు నంధత్వము గ్రుడ్డితనమని చెప్పవచ్చును, అంధత్వమును కల్పించు నంధకారమని చెప్పవచ్చును.

(2) అవిద్యాం = అవిద్య అనగా:— విద్యకు భిన్నమైనది, అచ్ఛముగా కర్మకాణ్డమేయని శ్రీశంకరులవారి యభిప్రాయము, పరిమితమైన లోకముయొక్క జ్ఞానమని రవీన్ద్రులవారి యభిప్రాయము. అవిద్యయను పదమునకర్థము ఈ ఉపనిష

ద్యాహి అమృతంటువిద్యా విద్యావిద్యేనిహితే యత్రగూఢే విద్యావిద్యలు బ్రహ్మయందునిలిచియున్నవి. మాయబడియున్నవి. నశ్వరంః = అవిద్య అమృతం = విద్యయని చెప్పియున్నారు. అవిద్య = అజ్ఞానమని భిన్నత్వము తెలుపునదని యొక అర్థము. వేదకర్మకాణ్డయని మరియొక అర్థము విద్యయనగా ఏకత్వ జ్ఞానము నుతెలుపు

త్తులో ప్రత్యేకముగా తెలుపబడలేదు. ముండకోపనిషత్తులో నిరూపింపబడినది. 1 లో 4-5 మన్త్రములలో చెప్పబడిన పరాపరవిద్యలలో అపరవిద్య = అవిద్యయని చెప్పవలెను.

♦ ముణ్డకం 1-2లో7-8-9-10 మన్త్రములలో అవిద్యాస్వరూపము పూర్తిగా దెలుపబడెను. దానినిబట్టి వేదవేదాంగములలో తెలుపబడిన యజ్ఞయాగాదినైమిత్తికకర్మలే ప్రధానమనియు, తత్ఫలితములందు ఆసక్తులై దానికంటె మించిన శ్రేయస్సు లేదని విశ్వసించి తన్మూలమున లభించెడి స్వర్గాదిఫలముల ననుభవించి తదనన్తరము జన్మలనెత్తుచుండు జనులు జన్మమృత్యువులమధ్యరాకపోకలు జరిపెడివిధానము, అవిద్య, అవిద్యయనగా:- మామూలుగాననుకొనెడి అక్షరజ్ఞాన శూన్యతగాదు, పాప కర్మాచరణముకాదు, ఫలాకర్షణచే ప్రేరితమైన సన్మార్గ వర్తనము. ఉత్తమధర్మము కానేరదు, జననమరణములను కలిగించెడి విధానము, ఉత్తమ ధర్మము కానేరదు. పూర్ణునినుండి వెల్వడిన జీవాత్మ స్వతస్సిద్ధమగు పూర్ణత్వమును లభ్యమొనర్చుటకు యత్నించక న్యూనమగు నిహలోకసౌఖ్యములను లేక పరలోకసౌఖ్యములను, లేక రెంటిని వాంఛించి దానితోనే తృప్తి

---

నది- జ్ఞానమని ఒక అర్థము- ఉపనిషద్విద్యయని మరియొక అర్థము- విద్యా ఫలితము విద్యా స్వభావముకూడ అమృతమే గనుక దేవలోకప్రాప్తి మాత్రమేయని సంకోచపరచ వీలుకాదు- పుణ్యకర్మలుగానే పరిగణింప బడవలెను.

♦ "ఏషవః పన్థాస్సుకృతస్యలోకే॥" 7 లోకములలో పుణ్యకర్మల మార్గమిదియేయనిముండకము- ౧-౨-౧ మంత్రము తెలుపుచున్నది. అవిద్యను

పడుట అవిద్య, తనకు బాహ్యమగు నీతి సూత్రమును లేక ధర్మ సూత్రమును, ప్రమాణముగా గైకొనక పూర్ణుడైన ఆత్మయగు తన స్వభావమునకు సహజమగునట్టి తన పూర్ణత్వజ్ఞాన సంపాదనానుభవమునకు ననుగుణమై తనకు స్వీయమగునట్టియు ధర్మ సూత్రమునే ప్రమాణముగా గైకొనవలెను. ఆ సూత్రాచరణమున గలుగు సిద్ధియు ఆనన్దానుభవమును విద్యయగును.

♦ ఈ అవిద్యయనునది కఠోపనిషత్తు 1-2-5 మంత్రములో తెలుపబడినది. భగవద్గీత 2 అధ్యాయం 42-43-44 శ్లోకములలో చెప్పబడిన భావములను ఇదియే కనుక అవిద్యయనగా కామ్యకర్మలన్నియు నది స్వార్థపరమైన కర్మయైనను పరోపకారార్థపరమైన కర్మయయినను దానివలన మోక్షేతర వాంఛలు తృప్తిపరచు నుద్దేశము కలిగినంతవరకు అవియన్నియు కామ్యకర్మలే, ఫలభోగకరములే. ఫలభోగానంతరము పునర్జన్మాదులను కలిగించునవియే కాన నుత్తమసిద్ధాన్తముల ప్రకారము ఆమార్గమవిద్యయే యగును.

---

గూర్చి పతఞ్జలియోగశాస్త్రము 2 అధ్యా 5 వ శ్లోకములో అనిత్యాశుచి! దుఃఖ అనాత్మసు. నిత్య, శుచి, సుఖ, ఆత్మ, ఖ్యాతి రవిద్యా = అశాశ్వత, అపవిత్ర, బాధాయుతమైన ఆత్మేతరమును నిత్య పవిత్ర సుఖ ఆత్మగాభావించుట = అవిద్య అని నిరూపించెను.

♦ కఠోపనిషత్తు 1-2 వల్లిలో మొదటి 6 మంత్రములుకూడ చూడనగును. విద్యయనగా ఆత్మజ్ఞానమే యనియు అవిద్యయనగా తద్భిన్నమగు జ్ఞానమనియు విదితమగును.

ఎవరు దేనిని ఉపాసింతురో వారు అట్లే యగుదురు. ఏమాత్రము తేడా యుండదు. శతపథబ్రాహ్మణము 5—2—4

♦(3) ఉపాసతే = పూజింతురో, అవిద్యను పూజించుట యన అవిద్యాసిద్ధాన్తమును పరమావధిగా గైకొనుట, దీనికే, అనుష్ఠించుచుందురో, యని అర్థముగూడ కలదు, అనగా అవిద్యయని చెప్పబడు సిద్ధాన్తములోని కర్మజాలమును ఆచరించుచున్నారని భావము. శ్రీ శంకరులవారు తత్పరులయి యనుష్ఠించుచున్నారని యుపాసనకర్థము చెప్పిరి. ఉపాసన యనగా దగ్గరగా కూర్చొనుట పూజించుట, సేవించుట అని అర్థము కలదు. కాబట్టి ఉపాసతే అనగా:— జన్మతారకోపాయముగా గ్రహించి త్రికరణశుద్ధిగా నాచరించుట, అని అర్థము చెప్పవలెను.

(4) రతాః = అనురక్తులు అనగా:—ఉపాసతే అను పదమునకు ఎట్లు వ్యాఖ్యానమొనర్చిరో యట్లే దీనికిని అర్థముచేయవలెను. అనగా విద్యను జన్మతారకోపాయముగా గ్రహించి త్రికరణశుద్ధిగా నాచరించుటయని అర్థము. రత యనగా తృప్తి కల్పింపబడినది యని భావము.

(5) విద్యాయాం = విద్యయనగా కర్మానుష్ఠానములేని

---

♦ అపరిమితుని జ్ఞానమని రవీంద్రులవారి యభిప్రాయము.

అరవింద:— Divine Life; page 43. It is by vidya the knowledge of oneness that we know God; without it, Avidya the relative and multiple consciousness is a might of darkness and a disorder of ignorance.

♦ ప్రశ్నోపనిషత్తు 10 బృహదారణ్యకములో "విద్యయా ఆత్మానం

కేవల జ్ఞానమాత్రమని ఒక యర్థము చెప్పుచున్నారు. దేవతల యొక్కయు కర్మకాండయొక్కయు జ్ఞానము మాత్రిమేయని మరియొక అర్థము చెప్పుచున్నారు. కేవల జ్ఞానమని మరికొందఱి భావము. దేవతాజ్ఞానమని శ్రీ శంకరులవారు దెల్పిరి. విద్ = అనగా ఎఱుగుట జ్ఞానము పొందుట అని యర్థము. బహువచనములో విద్యలు అని చెప్పినపుడు వివిధోపాసనావిధానములు వివిధ కళల పరిచయము అని అర్థమిచ్చును. శ్రీ శంకరులవారు దేవతాజ్ఞానమని చెప్పుటకు బృహదారణ్యకములోని "విద్యయా దేవలోకః" ౧-౫-౧౬ మంత్రముపై నాధారపడిరి. ముండకములో పరవిద్యయనగా "యయాతదక్షర మధిగమ్యతే" అని చెప్పబడినది ౧-౧-౫ కేనోపనిషత్తులో "విద్యయావిన్దతేఽమృతమ్" అని చెప్పఁబడినది. 2 వ ఖండము 4 వ శ్లోకము ఈ ఉపనిషత్తులోనె "విద్యయా అమృతమశ్నుతే" అని 115 వ మన్త్రిములో చెప్పబడినది. అట్లే "సంభూత్యా అమృతమశ్నుతే" అని 14 వ మంత్రములో చెప్పబడినది. ఈ అమృతత్వమునకు భిన్నముగా "అవిద్యయామృత్యుంతీర్త్వా" అని 11 వ మన్త్రిములోను "వినాశేన మృత్యుంతీర్త్వా" అని 14 వ మంత్రములోను చెప్పబడినది. కాన అవిద్యా, అసంభూతి, లేక వినాశ, ఒక తెగలోను, విద్యా, సంభూతి ఒక

---

అన్విష్య" అని 1–10 వ మన్త్రిములో కలదు. అనగా విద్యచే ఆత్మను కనిపెట్టి అని అర్థము. ఆ ప్రశ్నోపనిషత్తులో బయలుదేరిన నారుగురు ఋషులు "బ్రహ్మపరాః బ్రహ్మనిష్ఠా పరంబ్రహ్మ అన్వేషమాణాః" పరబ్రహ్మను కనుగొనుటకు బయలుదేరిరి. అంతకుపూర్వము వేదవేదాంగ

తెగలోను చేరియున్నవి. మొదటి తెగ మృత్యువును, దాటించును. రెండవ తెగ అమృతత్వమును లభింపజేయును. విద్యయనగా దేవలోకమేయని యర్ధము చెప్పిన యెడల దేవలోకము అమృతత్వమునివ్వజాలదు.

"ముండకం ౧—౨—౯"

"నాకస్యపృష్ఠె తెసుకృతే అనుభూత్వా
ఇమంలోకం హీనతరంచావిశన్తి"

అందుచే నాకలోకమును బొందినవారు మరల తిరిగి జన్మయెత్తక తప్పదు. అట్లే భగవద్గీతలో 9 వ అధ్యాయము 21 వ శ్లోకము. స్వర్గలోకమునుండి తిరిగి జన్మయెత్తుటను సూచించుచున్నది కాన విద్యవలన కలుగు నమృతము స్వర్గలోకము లేక దేవలోకము అని చెప్పుట భావ్యముకాదు. జన్మరాహిత్యము రెండువిధముల కలుగును.

♦ (1) సగుణబ్రహ్మ నుపాసించినవారికి హిరణ్యగర్భలోకము కలుగును. అచ్చట మహాప్రళయమువరకు నివసించి నిర్గుణ పరమాత్మలో చేరుదురు.

* (2) నిర్గుణ బ్రహ్మనుపాసించి ఇచ్చటనే యిప్పుడే పర

---

ములు చదివి అనుష్ఠించి పరబ్రహ్మను కనగొనలేక పిప్పలాదమహర్షి యొద్దకువచ్చిరి. ఆ ఉపనిషత్తు అంతమందు అవిద్యాయాః పరంపారం తారయసీతి అని నమస్కరించిరి

♦ దాని భావము, అవిద్యనుదాటి పరమాత్మ స్వరూపజ్ఞానమును పొందిరి అని విద్యయనగా ఆత్మజ్ఞానమనియు అవిద్యయనగా తదితరమనియుస్పష్టము.

* "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" బ్రహ్మసూత్రములలో ౧-౧-౧ దెల్పిరి.

మాత్మను పొందుదురు. ఈ మోక్షస్వభావము సామీప్య, సారూప్య, సాలోక్య, సాయుజ్యములలో నేదియగునో యా వివాదమును విడచి బ్రహ్మసూత్రములలో నిర్ధారణ చేయబడిన అమృతత్వము పైన రెండువిధములనే పొందనగును.

* పురుషసూక్తము "తమేవం విద్వానమృత ఇహభవతి-నాన్యః పన్థావిద్యతేఽయనాయ" అని చెప్పుచున్నదికాన విద్య యనగా మోక్షప్రాప్తి కల్పించునదే దేవలోకమిచ్చునది విద్య యని బృహదారణ్యకములో చెప్పిన వాక్యము సందర్భాను సారముగా నితరార్థము కలిగియున్నది. అక్కడ విద్యయా అనగా మనన ధ్యానములని అర్థము చెప్పిరి. దేవలోకః అనగా దేవతల లోకమనిగాక పరబ్రహ్మ లోకమనికూడ అర్థము చెప్ప వచ్చును, దివ్యలోకమనికూడ చెప్పనొప్పును. అప్పుడు పర స్పర విరోధముండదు. లేక దేవతలలోకమేయని అర్థము చెప్పి నపుడు విద్యయా అనుపదమునకు మననధ్యానములని చెప్పినను పరస్పర విరోధముండదు. కాన విద్యయా అను పదమునకు పరమాత్మజ్ఞానమేయని నిర్ధారణ చేయవలెను. అది సగుణ పర మాత్మయొక్క జ్ఞానమా? నిర్గుణ పరమాత్మయొక్క జ్ఞానమా? సగుణనిర్గుణ సముచ్చయజ్ఞానమా? యనిమాత్రమే విచారణీయ

తైత్తిరీయోపనిషత్ ౧ అ ౩ వ అనువాకము, "అథాతస్సంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామఇతి"

*బ్రహ్మసూత్రములు ౪-౨-౧౫ సూత్రము ౪-౪-౧ నుండి ౪-౪-౨౨ వరకు చూడనగును.

* బృ ౬-౨-౧౫ సగుణోపాసకులు హిరణ్యగర్భలోకములో చాల

మగును.

(6) ఇవ = దీనిని ఏవయని నిరూపించిమాత్రమే రవీంద్రుల వారు అర్థముచేసిరి. అటువలె అనగా అగుపడునుగాని నిజముగా కాదు. అనునర్థమును శ్రీ శంకరులవారు తెల్పిరి.

* ఈ పదమును "తతో భూయ ఇవతమః" అనుదానితో చేర్చుచున్నారు. అట్లు చేర్చుటవలన నంతకంటె హెచ్చుగా కనపడు అంధంతమః అని అర్థమగును. విద్యయందనురక్తికల వారు తమస్సు చీకటి, లేక అజ్ఞానము, అంధమ్ = గ్రుడ్డితనమును పొందవలసి లేదు. ఎందువలననగా:— "విద్యయా అమృతమశ్నుతే" యని యీ యుపనిషత్తులోనె 11 వ మంత్రములో జెప్పబడి యున్నది.

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ".

* అన్న మంత్రము బృహదారణ్యకములో వచ్చుచున్నది, దానియర్థము. అసత్, తమసః మృత్యో, మూడును మూడు పదములుగానున్నను ఒకటే అర్థమని ఆ ఉపనిషత్తులో స్పష్టపరచబడినది అట్లే సత్, జ్యోతి అమృతం మూడును ఒకే

ఏండ్లు ఉందురు. మరల జన్మపొందరు.

* ఇట్లన్వయించిన యెడల విద్య, అవిద్యలవలన ఫలితము ఒకేరకము గలదనియు తారతమ భేదమున్మాత్రమే కలదనియు స్ఫురించును. కాని దీని పిమ్మట 10 వ మంత్రమే ఈ రెంటి ఫలితములమధ్య తారతమ భేదముగాక తత్వభేదమే కలదని నిరూపించుచున్నది.

యర్థముకలవి. మొదటి మూడును ఆత్మజ్ఞానము లేని అశాశ్వత అంధకారస్థితికిని, రెండవ మూడు పదములు శాశ్వత ఆత్మజ్ఞాన ప్రకాశిత స్థితికిని వర్తించును. కాని విద్యయనగా ఆత్మజ్ఞానము. అసత్-తమస్ మృత్యువులోనికి తీయనేరదు. అందుచే నవిద్య వలన కలిగెడి స్థితికంటె అధికమగు లేక అధికముగాకన్పడు తమస్సులోనికి మానవునివిద్య తీసికొనిపోదు. అందుచే "నివ" యను పదము ప్రవిశన్తి అను పదమునకు జేర్చిన యెడల అజ్ఞానములో ప్రవేశించునట్లగుపడును. అనగా నింద్రియ జీవితములోనె రమించువానికి లేదా కర్మఫలాపేక్షచే నిహలోక పరలోక సౌఖ్యములను కోరువానికి విద్యారతులు చేయు చర్యలు ఆశ్చర్యముగాను, నిరాశాజనకములుగాను, ప్రమాదజనితములుగాను కన్పడవచ్చును. విద్యారతులు, తమపై విధించుకొను తపస్సు, బ్రహ్మచర్యము, శ్రద్ధ దుర్ఘటమైన మార్గముగా అగపడుట సహజము. అందుచే నుపనిషత్కారులు ఈ పాదములో తమ యభిప్రాయమునుగాక సంశయాత్మకమగు లోకభావమును తెల్పుచున్నారని యూహించుట భావ్యము.

విద్యాస్వరూపమేమో యీ మన్త్రమునకు పూర్వపు మంత్రములలో తెలుపబడెను. ఏకత్వమనుభోగ్యమగుచుండగా శోక మోహములు లేవని తెలుపబడెను. అది యాత్మజ్ఞుని లక్షణము. అట్టి ఆత్మజ్ఞుడు తమస్సులో లేక అంధత్వములో పడుట అసంభ

* బృహదారణ్యకములో లేలాయతీవ = కదలుచున్నట్లగపడునుగాని కదలదు. అని అర్థము చెప్పెది. అట్లే యిచ్చటను "ప్రవిశన్తీవ" = అని అన్వయము చేయవలెను.

వము. పూర్వవ్యాఖ్యాతలు చేసిన వ్యాఖ్యానమునువదలి యీ మన్త్రమునకు నూతనమైన అను సమంజసమైన అన్వయము చేయవలెను.

తాత్పర్యము:— అవిద్యామార్గమును అనగా:— మోక్షేతర వాంఛల తృప్తిపరచు నుద్దేశము కలిగి తదనుగుణమగు మార్గమును జన్మతారకోపాయముగా గ్రహించి త్రికరణశుద్ధిగా నాచరించువారు అంధత్వమును కల్పించు తమోమయమగు అంధకారమున ప్రవేశింతురు.

విద్యామార్గమును = అనగా:—మోక్షేచ్ఛగలిగి ఆత్మైక్యాను సన్ధానమునకు అనుగుణమగు మార్గమును జన్మతారకోపాయముగా గ్రహించి త్రికరణశుద్ధిగా ననుసరించువారు మొదటిదానికన్న అధికమగు నంధకారమున ప్రవేశించినట్లగపడుదురు, (నిజమునకట్లు ప్రవేశింపరు) అది భ్రమయే నిశ్చయము.

౧౦ శ్రుతిః ॥ అన్యదేవాహుర్విద్యయా
అన్యదాహు రవిద్యయా॥
ఇతి శుశ్రుమధీరాణాం
యెనస్తద్వ్యాచ చక్షిరె॥

విద్యయా = విద్యచేత అన్యత్ = వేరైన (ఫలము) ఏవ = మాత్రమే ఆహుః = చెప్పిరి, అవిద్యయా = అవిద్యచేత అన్యత్ = వేరైన (ఫలము) ఆహుః = చెప్పిరి. యె = ఎవరు నః = మాకు లేక మనకు తత్ = దానిని (విద్య అవిద్యల ఫలితమును) విచచక్షిరె = పాఠాన్తరము, వ్యాచచక్షిరె = బోధపరచిరో,

ధీరాణాం = అట్టి ధీరులనుండి ఇతి ఇట్లుగా శుశ్రుమ = వినుచున్నాము.

విశేషార్థము: = అన్యదేవ = వేరైనదే అనగా విద్యలవలన కలిగెడి ఫలమొకటియు, అవిద్యవలన కలిగెడి ఫలము మఱొకటియు అనగా విద్యాఽవిద్యలు రెండును భిన్నములగు ఫలితములను కలిగించును. అనగా దేనిఫలితము దానిదే, అన్యత్ అను పదము రెండు పర్యాయములు వాడబడెను. ఏ యొక్కమారే వాడబడినను రెండుమార్లు వాడినట్లు ఎంచవచ్చును. రెండింటి ఫలితములలో తరతమభేదముగాక తత్వభేదమే కలదని యర్థము. కఠోపనిషత్తులో 1 అధ్యాయం 2 వ వల్లి 4 వ శ్లోకము చూడనగును.

శ్రుతిః ॥ దూరమేతె విపరీతెవిషూచీ
అవిద్యాయాచవిద్యేతిజ్ఞాతా॥
విద్యాభీప్సినం నచికేతసం మన్యే
నత్వాకామాబహవోలోలుప న్త॥

విద్య అవిద్యలు రెండును ఒక్కొక్కదానికి దూరమున నున్నవి. పరస్పర విపరీతములు లేక విరుద్ధములు ఉత్తర దక్షిణ ధృవములవలె భిన్నభిన్నమైన గమ్యస్థానములను జూపునవి. విద్య, అవిద్య, అను పదములకు శ్రేయస్సు ప్రేయస్సు అని కూడ నర్థము కఠోపనిషత్తె తెలుపుచున్నది, ముండకములో వలెనే అవిద్యా నిరసనము కలదు.

ధీరాణాం = ధీరులనగాపరమాత్మను దర్శించినవారు " తస్య ధీరాః పరిజానన్తియోనిం " పురుషసూక్తము ఇచ్చటను అదే

యర్థములో ధీర పదము వాడబడెను. ముండకములో " ధీర " యను పదము ఈ యర్థముననే వాడబడెను. ముండకము 2 వ ఖండము 7 వ మంత్రము, ముండకము 3-2-1 బృ ౧-౪-౨ ద్వితీయాద్వైభయంభవతి, అథతస్యభయంభవతి. నః=మాకు లేక మనకు ఈ ఉపనిషత్తు చెప్పిన గురుశిష్యులకు లేక ఆయా యుపనిషత్తులో వర్ణించిన అనుభవములుకల మహానుభావులకు వారికంటే పూర్వులయిన ధీరులు వారికి విశదపరచిరి. దీనివలన నీ జ్ఞానము పరంపరాగతమనియు ఏకాలమునకాకాలమునతదను భవజ్ఞులు కలరనియు తేలుచున్నది.

తాత్పర్యము:— విద్యవలన వేరైనదేయగు ఫలమును అవిద్యవలన మొదటిదానికన్న వేరైనదేయగు ఫలమును కలుగు నని వారు ( ధీరులు ) చెప్పుచున్నారు. మాకీవిషయమును విశదపరచిన ధీరులవలన ( పరమాత్మను దర్శించిన వారివలన ) మేమిట్లు వినియున్నాము.

౧౧ శ్రుతిః ॥ విద్యాంచావిద్యాంచ
యస్తద్వేదోభయగ్ంసహ॥
అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయాఽమృతమశ్నుతే॥

యః = ఎవడు తత్ = ఆ; విద్యాంచ = విద్యను; అవిద్యాంచ = అవిద్యను; ఉభయం = రెండింటిని సహ = కలిపి, కూడః; వేద = ప్రబోధించుకొనుచున్నాడో సః = అతడు; అవిద్యయా = అవిద్యచేత మృత్యుం = మృత్యువును; తీర్త్వా = దాటి నిజస్వరూపము తెలిసికొని; విద్యయా = విద్యచేత

అమృతం = అమృతత్వమును అశ్నుతే = పొందుచున్నాడు.

విశేషార్థము:— (1) విద్య, అవిద్యను, గుఱించి లోగడనే చర్చించబడెను. వేద = తెలిసికొనుట ఇది సామాన్యార్థము, ఇంద్రియములద్వారా కలిగిన విషయస్పర్శ ఫలితమును మనస్సుచే గ్రహించి బుద్ధిచే నిర్ణయించుట సామాన్యజ్ఞాన సంపాదన మార్గము. కాని "వేద" అనునపుడు "విద్య" అనునపుడు బుద్ధిమూలమున కలిగెడి జ్ఞానమేగాక బుద్ధినతిక్రమించిన ఆత్మకు ఈ విజ్ఞానమలవడుట అనుభవైకవేద్యమగుట యని యర్థము కలదు. కాన "వేద" అనునపుడు అవిద్యా మార్గమును పరిశోధించి దాని పర్యవసానము తెలిసికొన్నవాడును, విద్యామార్గమును పరిశోధించి దానిపర్యవసానము తెలిసికొన్న వాడును ఈ రెండింటియొక్క తత్వభేదమును, ఫలభేదమును, భిన్నత్వమును, తెలిసికొన్నవాడును, అని చెప్పవలెను.

మృత్యుం = మృత్యుదేవతయని చెప్పవచ్చును, మృత్యువనగా నశ్వరమగు సమస్తము అని చెప్పవచ్చును. బృహదారణ్యకములో చెప్పినట్లు అసత్, తమస్సు, మృత్యువు, ఈ మూడును అని చెప్పవచ్చును. ఈ మృత్యువునకు లోబడిన జన్మమరణ సంసారములోని రాకపోకలని చెప్పవచ్చును. కాన నశ్వర

* బృ ౧-౪ లో బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్ - తదాత్మానమేవావేత్ - అహం బ్రహ్మాస్మీతి- తస్మాత్తత్సర్వమభవత్ - తద్యోయో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్ - తథాఋషీణాం తథామనుష్యాణాం = తా నేది తెలుసుకొనునో అదే తానగుచున్నాడు.

తదిదమప్యేతర్హి య ఏవం వేద అహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి॥

ప్రపంచము నశ్వర ప్రపంచసంబన్ధమైన జీవనమార్గము, నశ్వర ఫలితము. మూఢుకూడ దీని భావమే, అజ్ఞానములో ప్రవేశింప జేయు నవిద్యచేత మృత్యువును తెలిసికొనుట ఈక దాటుట ఎట్లు సంభవించును? ముండకోపనిషత్తు 1-2-12 మంత్రములలో "పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్। నాస్త్యకృతః కృతేన" అన్న పాదములు తెల్పిన అంశమునిచ్చట గమనించవలెను, బ్రాహ్మణుడు అవిద్యామార్గములోనుండి తానాచరించు కర్మలవలన లభ్యమయ్యేడి లోకములను, పదవులను, దశలను, ఫలితములను, జన్మాన్తరములను, పరీక్షించి సంపూర్ణశోధనానన్తరమున అకృతుడు = స్వయంభువు, కృతేన = చేయబడిన కర్మచేత నాస్తి = దొరకబడని నిర్వేదం వైరాగ్యమును ఆయాత్ పొందుచున్నాడు. ఇట్లే ప్రశ్నోపనిషత్తులో 1-2 మన్త్రములలో బ్రహ్మన్వేషణపరులై వచ్చిన మునులకు సంవత్సర కాలము తపసా, బ్రహ్మచర్యేణ, శ్రద్ధయా సంవత్సరము గడుపుమని పిప్పలాదమహర్షి శిక్షాకాలము నేర్పరచెను. కఠోపనిషత్తులో తండ్రిచేసిన యాగము గమనించిన నచికేతస్సునకు శ్రద్ధా, ఆవివేశ = నూతన ప్రబోధము కలిగెను. ముణ్డకములో పైన దెల్పిన మంత్రములోనె శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు అగు గురువు దగ్గరకు తద్విజ్ఞానార్థం అనగా అకృతుని గూర్చి తెలిసికొనుటకు పోవలెనని కలదు, బ్రహ్మసూత్రములలో అథాతో బ్రహ్మజిజ్ఞాసాయనికలదు. అథ, అతః, అను పదములకు లోగడ వేదమార్గమును అనుష్ఠించి దాని సారము= అవతలి యొడ్డును కనిపెట్టి ఉత్తరజిజ్ఞాసకు అర్హతను సంపాదించి

బ్రహ్మజిజ్ఞాసకు పూనెనని కలదు. వీనినన్నిటినిబట్టి యవిద్యా మార్గముననుసరించి దాని స్వరూపమును దాని సహజశక్తిని తెలిసికొని దానిని దాని ఫలితములను విసర్జించి విరాగియయి విద్యామార్గమున కాయత్తుడై అష్టాదైన గుమన్నవోర్ధ తద్రహ స్యమును (ఉపనిషత్తును) గ్రహించవలెను. అనేక జన్మల లోను లేక ♦ ఈ జన్మలోనే సంపాదించబడిన వైరాగ్యముకుదర నిదే యాత్మాన్వేషణ సాధ్యముకాదు. అరవిందయోగి చెప్పి నట్లు మానవశరీరములో నిమిడియున్న (Desire soul) పరా జయమును పొందనిదే యాత్మజ్ఞాన ఉత్తేజము కలుగనేరదు. (Desire soul) అనగా అవిద్యామార్గమున భోగాభిలాష తీరని న్యూనమైన జీవాత్మ అవిద్యామార్గముయొక్క సమగ్ర మైన శక్తిసామర్థ్యములు బోధపడగానె ఆ మార్గత్యాగమే తత్ క్షణము సంభవించును. కుబుసము వీడిపోయినట్లు అవిద్యామార్గ మును తత్సంబద్ధమైన నశ్వరఫలితములును తత్ క్షణమే త్యాజ్యములగును.

(4) ఉభయంసహ = అనునపుడు రెంటిని ఒకేకాలమందు అనుష్ఠించువాడని యర్థము చేయుచున్నారు. అది పరస్పర విరుద్ధమైన విషయమగుటచే దుస్సాధ్యము. అవిద్యామార్గము చెప్పబడిన కర్మలను నిష్కామముగా విద్యామార్గములోనున్న

♦ ఛాందోగ్యము- ఇంద్రవిరోచనుల కథ. తమస్సునుండి సత్వము శుద్ధసత్వము పరిణామము వాంఛాత్మ కఠోపనిషత్ మృత్యుంతీర్త్వా మృత్యువు. నశ్వరమార్గము, అవిద్యాపథ్యాఫలితములను, మరొక యర్థసారము కలియవచ్చును. అసురపథ్యాలోని వారు పశువిధానమును పాపమును అనుస

జ్ఞాని ఆచరింపవలెనని చెప్పెదరు. అవిద్యామార్గమునకు గమ్యస్థానము ప్రత్యేకముగా నిర్దేశింపబడియున్నది. ఆ మార్గములో సంచరించువాడు తన భావపరివర్తనమునుబట్టి యా గమ్యస్థానమును దాటిపోలేడు. ఆ మార్గము నె వదలిపెట్టవలెను. ఆమార్గమున లభించెడి ఫలములను తాను స్వీకరించక ఇతరులకు వదలవచ్చును. దానిచేత నొక్కింత మనసులో పరివర్తనము కలుగవచ్చును. కాని యాశ్రమయంతయు నిరర్థకమే యగును. విద్యామార్గమున నున్నవానికి తన యాత్మచేగాక ఇతరులచే (సంఘము, శాస్త్ర, వేదము-చే) నిర్ణయింపబడిన కర్తవ్యములు ఉండనేరవు, విద్యామార్గమునున్నవాడు స్వయం నియన్త అందుచేనతనిని నియమించు పనులు లేవు. శ్రీ వివేకానందులవారు చెప్పినట్లు ఆత్మోపలబ్ధిపొందిన బుద్ధదేవుని క్షత్రియుడన్న కారణమున రాజ్యపరిపాలనకు నియోగించగలవారెవరును లేరు, అవిద్యామార్గము అతీతులకు వర్తించదు.

ఆశ్నుతే = పొందుచున్నాడు. ఈ జన్మలోనే, ఇక్కడనే అమృతత్వము పొందవచ్చునని భావము, అమృతం = అనగా దేవతలకు సామాన్యమగు అమృతత్వమని శంకరులువారు అర్థము చేయుచున్నారు. అట్లు దీని అర్థమును క్లుప్తపరచుట భావ్యముకాదు. 14 వ మంత్రములోను సంభూతియొక్క ఫలిత

---

రింతురు. దాని ఫలితముగ పరజానిందన, రాజదండన, పరితాపము నరక బాధనొందుచుందురు. అవిద్యామార్గగాములు (ఈ బాధావమానములనుండి వైదొలగుదురు, వానిని దాటుదురు) "సహ" యను పదమునకు కలిపి రెండుకూడయని ఒకయర్థము.

మమృతమేయని చెప్పబడినది.

ఈ యుపనిషత్తు అమృతముకన్న వేరే పరమావధిని నిరూపించ లేదు. అట్టి యమృతము స్వర్గలోకావాసమేయని చెప్పిన యెడల నీ యుపనిషత్తంతయు నిరుపయోగమగును. "ఏకత్వమనుపశ్యతః" అనువానికి అనగా సంపూర్ణజ్ఞానికి స్వర్గలోకపరిమితమగు నమృతత్వముతో నేమిప్రయోజనము. ?

"తస్మై దేవాబలిమావహన్తి" అని తైత్తిరీయం శిక్షావల్లి 4 వ అనువాకములో జెప్పబడియున్నది. అట్టి జ్ఞానికి దేవతలు వినమ్రులయి జోహారులొనర్తురని యర్థము కాన నిచ్చట చెప్పబడిన అమృతము దేవతాసాధ్యమై దేవతల భోగ్యమగు నమృతము కాదు, అసలైన అమృతమే.

తాత్పర్యము:— ఎవరు విద్య అవిద్యలను ఆ రెంటికి సాధ్యమగు పరమావధులను వానితత్వభేదములను కలరూపున అనగా యదార్థముగా ప్రబోధమొనర్చుకొనిరో వారవిద్యామార్గమును, దానిచే సిద్ధింపబడు నశ్వరఫలితములను జన్మపరంపరలను త్యజించి యసురపన్థలోని పాపమార్గమును తత్ఫలిత దుఃఖమును దాటి విద్యామార్గమున నమృతత్వమును పొందుచున్నారు.

---

"వేదసహ" రెంటినికలిపి తెలిసికొని విద్యావిద్యల ప్రత్యేకజ్ఞానము గాక రెంటి సమన్వయజ్ఞానము అని అర్థము చెప్పవచ్చును. రెంటికిసమన్వయమెట్లన అవిద్యకంటె ఉత్తమమైన మార్గము కలదని దానిని అవశ్యమవలంబించ వలెనని అవిద్యావాదులు గుర్తించవలెను. విద్యకన్న తక్కువదైన అవిద్య మానవజీవితములో కొంతకాలమాచరణయోగ్యమై పిమ్మట త్యాజ్యమగునని విద్యావాదులు గ్రహించవలెను. మానవ అధ్యాత్మికాభివృద్ధినిబట్టి

౧౨ శ్రుతిః ॥ అన్ధంతమః ప్రవిశన్తి
యేఽసంభూతి ముపాసతే।
తతో భూయ ఇవ తేత మో
య ఉ సంభూత్యాగ్ంరతాః ॥

యె = ఎవరు; అసంభూతిం = అసంభూతిని; ఉపాసతే = ఉపాసింతురో; తే = వారు; అన్ధంతమః = అంధత్వమును కలిగించు తమస్సులో; ప్రవిశన్తి = ప్రవేశించుచున్నారు, యె = ఎవరు సంభూత్యాం = సంభూతియందు రతాః = అనురక్తులో తే = వారు తతః = అంతకంటె భూయః = హెచ్చయిన తమః = తమస్సునందు ప్రవిశన్తీవ = ప్రవేశించుచున్నట్లగపడుదురు, ఉ = నిశ్చయము.

విశేషార్థము:— 9-10-11 శ్లోకమన్త్రము లొకజట్టు 12-13-14 శ్లోక మన్త్రములు మరియొకజట్టు, మొదటి జట్టులో దెలుపబడిన ద్వంద్వములు విద్య, అవిద్య, రెండవజట్టులో దెలుపబడిన ద్వంద్వములు సంభూతి, అసంభూతి, అసంభూతికే వినాశమును పదముకూడ వాడబడెను. మొదటి జట్టులోని విద్య, అవిద్యలు రెండవజట్టులోని సంభూతి, అనంభూతులు ఒకే యర్థ

అవిద్యయనగా కర్మకలాపమునందలి యనురక్తి భిన్నత్వమునందలి వాంఛ కొందఱిని వదలదనియు నట్టివారు దానిలో కొన్నాళ్లు చరించి దానియందు వైరాగ్యముకలిగిన పిమ్మట నే పై మెట్టగు విద్యాపద్ధతికి పోగలరని విద్యావాదులు గ్రహించవలెను. విద్యావాదము మొదటినుండి బోధించుచున్నను కొందఱికది నచ్చకుండుట వారి స్వభావముల పరిమితినిబట్టి సంభవించుచున్నదని గ్రహించవలెను. కాన రెంటికి తారతమ్యమును ప్రయోజకప్రయోజ్య భావమున పరిమితులను గ్రహించవలెను.

ముగల పదములా? వేఱైన యర్థముకలవాయని యోచించ వలెను. అసంభూతి నిషిద్ధగుణనివృత్తియనియు, సంభూతి సమాధి స్థితియనియు కొందఱర్థము చెప్పుచున్నారు. అసంభూతియనగా ప్రకృతిరూపమైన మాయాశక్తియనియు, సంభూతియనగా నిర్గుణ పరబ్రహ్మమనియు కొందఱు అర్థము చేయుచున్నారు. అసంభూతియనగా ప్రకృతియనియు సంభూతియనగా హిరణ్యాగర్భుడనియు మరికొందఱి భావము. ఏమిట్రుని భావములో నసంభూతి యనగా ( Kans tory ) తాత్కాలిక సత్యాస్తము దాయము, సంభూతియనగా:— ( Eternal ) అనగా:— శాశ్వతపదార్థము. శ్రీ శంకరులవారు అసంభూతియనగా నవ్యక్త ప్రకృతియనియు, సంభూతియనగా కార్యబ్రహ్మ లేక హిరణ్యగర్భుడనియు జెప్పుచున్నారు. ఈ 12 వ మంత్రము 9 వ మంత్రములో జెప్పిన భావమున కనుగుణమై యంతకన్న మిన్న యయిన సత్యమును స్ఫురింపజేయుచున్నది. ఈ పదములకు మరి యొక విధమున అర్థము చెప్పవచ్చును. అసంభూతియనగా ( Imperfect Personal finite ) అనియు సంభూతియనగా ( Perfect Impersonal Infinite ) అనియు నర్థము చెప్ప వచ్చును. ఈ ఉపనిషత్తు ఆరంభమున తెలుపబడిన శాన్తి పాఠ ములో వర్ణించిన పరిపూర్ణ పరమాత్మను లభ్యమొనర్చుకొను విధానమీ యుపనిషత్తులో తెలిపితీరవలెను. సంభూతియనగా సమ్యక్ + భూతి సంభూతి = సంపూర్ణమైన ఐశ్వర్యము అట్టి శుభలక్షణ సమన్వితుడు పూర్ణుడు అనన్తుడు నిర్గుణుడు . కాక

చూడగా సగుణస్వరూపిరూపమని చెప్పవచ్చును. సగుణనిర్గుణస్వరూపులిద్దఱు పరమాత్మలోను గూర్చిన భావనలే. సృష్టికి పూర్వమందు స్థితిని నిర్గుణపరమాత్మయనియు సృష్టిలో వ్యాప్తాను సంకమునకు (పొంది యుండు) సగుణపరమాత్మయనియు వ్యవహరించెదరు. విద్యామార్గము ఆత్మజ్ఞానమును ప్రసాదించుచున్నను సగుణోపాసనవలనఁ గొంత ద్వైతభావమునకు అవకాశముండును. నిర్గుణోపాసన కేవల అద్వైత స్థితిని కల్పించును. లోగడ ౮ వ మంత్రములో తెలిపినట్లు సగుణోపాసకుడు బ్రహ్మలోకమున ప్రళయాంతమువరకు నిలిచియుండి యప్పుడు పరమాత్మలో లీనమగును. నిర్గుణోపాసకుడిప్పుడే పరమాత్మలో లీనమగును. బ్రహ్మసూత్రములలో ౪–౪–౧ మొదలు ౨౨ వ సూత్రము

---

కలుగును. ఈ తమస్సులో తరతమ భావముండవచ్చును.

ఉష్ణప్రదేశములలో శీతల ప్రదేశములలో ధ్రువప్రాంతములలోనుండే ఎండ వేడిమిలో అత్యధిక తారతమ్యములుండును. కాని ఆయా ప్రదేశములలోగూడ ఉష్ణాధిక్యతచేత వడదెబ్బలు తగులుచునే యుండును.

అరవింద:— 'Divine Life' pages 2, 3;—

It is by Vidya, the knowledge of oneness that we know God; without it, Avidya, the relative of multiple consciousness is a night of darkness of a disorder of ignorance.

బృ ౪-౪-౨౦ ఏకధైవానుద్రష్టవ్యమేతదప్రమేయంధ్రువం = అది అజ్ఞేయము, శాశ్వతము.

ఒకరూపమున ఒకవిధముగనే దానిని అనుభవైకవేద్యమైనట్లుగా నవలెను చివరకు నిరాకార నిర్గుణస్థితిలోనే తెలిసికొనవలెను.

వరకు చూడసగును. ఈ రెంటిదశల మధ్యనుండు భేదము తెలుపుటకే ఈ మన్త్రముద్దేశింపబడినది. హిరణ్యగర్భలోకములో మరికొంత అభివృద్ధినొందును, సృష్టిశక్తి కలుగదు. ఈ మన్త్రములోని తక్కిన పదములకు చెప్పతగిన యర్థమునుగూర్చి 9 వ మన్త్రములో చూడవచ్చును.

తాత్పర్యము:— ఆత్మాన్వేషకులయ్యు అసంభూతిని సగుణస్వరూపోపాసనను జన్మతారకమార్గముగా స్వీకరించి త్రికరణశుద్ధిగా ననుసరించువారు అన్ధత్వమును కల్పించు సంధకారమున ప్రవేశింతురు. అట్లుగాక సంభూతిని సంపూర్ణమగు పరమాత్మానురక్తులు అంతకంటె హెచ్చగు అంధకారమున ప్రవేశించినట్లగపడుదురు. యదార్థమునకు ప్రవేశింపరు, నిశ్చయము.

౧౩ శ్రుతిః ॥ అన్యదేవాహుస్సంభవాత్
అన్యదాహురసంభవాత్ ॥
ఇతి శుశ్రుమధీరాణాం
యెనస్తత్ వ్యాచచక్షిరే ॥

సంభవాత్ = సంభూతి మార్గమువలన అన్యత్ = వేరైనది (ఫలము) ఏవ=మాత్రమె; తే = వారు ఆహుః = చెప్పెదరు, యె = ఎవరు; నః = మనకు తత్ = ఆ సంభూతి అసంభూతి, మార్గములను విచచక్షిరె పాఠాన్తరము, వ్యాచచక్షిరే = విశదపరచిరో, తె = అట్టి ధీరాణాం = ధీరులవలన ఇతి = ఇట్లు శుశ్రుమ = వినుచున్నాము.

విశేషార్థము:— ఏవ = మాత్రము, (1) దీనిని అన్యత్ అను రెండు పదములతో చేర్చవలెను. అనగా సంభూతి మార్గ

తం = అమృతత్వమును అశ్నుతే = పొందుచున్నాడు.

విశేషార్థము:— సంభూతిః ఈ పదము రెండుమారులీమంత్రములో కలదు. దానిని అసంభూతినిగా శ్రీ శంకరులవారు మార్పుచేసిరి. అట్లు మార్చుటచే అవ్యక్త ప్రకృతియని అర్థము చెప్పిరి ఇది భావ్యముగా తోచదు. ఇట్లు మార్పుచేయుటచే అమృతమను పదమునకు ప్రకృతి లయమూలకమైన అమృతమని అర్థముచేసిరి. అదియును భావ్యముగా తోచదు, ఏలయనిన:— 12 వ మంత్రములో అసంభూతి మొదటి పాదములోను సంభూతి రెండవపాదములోను తెలుపబడెను. 9 వ మంత్రములో అవిద్య మొదటి పాదములోను, విద్య రెండవపాదములోను తెలుపబడెను. అవిద్యకన్న విద్య ఎట్లు భిన్నమో ఉత్తమమో యట్లే అసంభూతికన్న సంభూతి భిన్నమును, ఉత్తమమును, అని ఉపనిషత్కారుని భావమై యుండవలెను. శ్రీ శంకరులవారు సూచించిన మార్పు ఈ మంత్రములో చేసిన యెడల అనగా మంత్రములో చెప్పబడని అకారమును సంభూతి పదమునకు చేర్చిన యెడల నట్టిమార్పు 12 వ మంత్రమునకు విరుద్ధముగా నుండును. ఇట్టి మార్పు చేయుటకు తగిన కారణముగాని తగిన యధికారమునుగాని, శ్రీ శంకరులవారు తెల్పియుండలేదు. వినాశమను పదము ఈ మంత్రములో క్రొత్తగా కన్పడుచున్నది. ఇది 12 వ మంత్రములో లేదు. అక్కడయుండి యిక్కడ లేని పదము అసంభూతికాన వచ్చుటచే సంభూతియే యిచ్చట వినాశ మని యూహించవలెను. వినాశమనగా హిరణ్యగర్భుడని శ్రీ శంకరులవారు తెలుపుచున్నారు. 12 వ మంత్రములో

నసంభూతికి దేయర్థమని నిర్ణయించబడెను. వినాశమనగా హిరణ్య గర్భుడు చేసిన సృష్టియంతయు నశించునదే గనుక దానితో పాటు హిరణ్యగర్భ భావనయు అంతమొందును దేకాన వినాశమన హిరణ్యగర్భుడని చెప్పనొప్పును.

* (3) మృత్యుంతీర్త్వా = హిరణ్యగర్భుని ఉపాసించినవారు ఆయన లోకమునుపొంది మరల జన్మనొందరు, జన్మనొందరు గాన మరల మృత్యువాత పడరు హిరణ్యగర్భుని యుపాసనవలన నవిద్యామార్గము నతిక్రమించినవారు నగుదురు. (4) సంభూతిం 12 వ మంత్రములో సంపూర్ణుడగు పరమాత్మయని యీ పద మున కర్థము చెప్పబడెను. (5) అమృతం = పరిపూర్ణునిలో లీనమై నానావ్య సృష్టి లయములలోగాని, మహాప్రళయము లలో గాని వికారమునొందనట్టి శాశ్వతమైన పరమాత్మైక్యతను పొందుటయే అమృతము.

**తాత్పర్యము:—** ఎవరు సంభూతి, అసంభూతి (వినాశము) లను, ఆ రెంటికి సాధ్యమగు పరమావధులను వాని తత్త్వభేదము

---

* మృత్యువును దాటినను సంపూర్ణ అమృతత్వమును పొందక పోవచ్చును. ముండకం ౧-౨-౧౧ వ మంత్రము చూడనగును. ప్రశ్నోపనిషత్తు ౪ వ ప్రశ్న మున సర్వోభవతి. ముండకము 3-౨-౯ వ మంత్రము బ్రహ్మైవ భవతి అనెడి ఉత్తమస్థితి యింకను లభ్యముకాదు. బ్ర సూ ౪ వ అధ్యాయము ౪ వ ఖండము ఈ విషయమును విస్తరించుచున్నది.

ఈ పరిపూర్ణుడే తెలిసికొనతగినవాడు (తెలిసికొనవలసినవాడు) మాండూక్యం 2 వ మంత్రము చతుర్థంమన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః నాల్గవ వాడని చెప్పబడువాడు.

ఆతను, ఆత్మ ఆతను తెలియబడతగినవాడు అన్యులుకారు.

ళను కలరూపున అనగా యథార్థముగా ప్రబోధమొనర్చికొనిరో వారు అసంభూతిమార్గమును దానిచే లభ్యమగు న్యూన ఫలిత మును దానివలస లభించదగు బ్రహ్మలోకావాసమును తెలిసికొని దానినతిక్రమించి సంభూతిమార్గమున పరిపూర్ణ పరమాత్మతో నైక్యత అను అమృతత్వమును పొందుచున్నారు.

౧౫ శ్రుతిః ॥ హిరణ్మయేనపాత్రేణ
సత్యస్యాపి హితం ముఖం ।
తత్త్వంపూషన్ అపావృణు
సత్యధర్మాయదృష్టయె ॥

హిరణ్మయేన = బంగారుతో చేయబడిన; పాత్రేణ = పాత్రవలన; సత్యస్య = సత్యముయొక్క ముఖం = ముఖము, అపిహితం = కప్పబడినది, పూషన్ = ఓ పూషుడా సత్యధర్మాయ = సత్యధర్మముకొఱకు దృష్టయె = కనపడునిమిత్తము తత్ = దానిని త్వం = నీవు అపావృణు = తెరువుము.

విశేషార్థము:— పూషన్ = సూర్యుడా! సూర్యుడు లోకపోషకుడు. లోకపోషకుడుగాన పరమాత్మయేయని యర్థము చెప్పవచ్చును. ( 2 ) హిరణ్మయేనపాత్రేణ = తేజస్సనేపాత్రచే సూర్యునిచూడ శక్యముగాకున్నది ఈ పదమునకు మరియొక అర్థముచెప్పవచ్చును. ఆకర్షవంతమగు ప్రకృతియను మూతచే నని చెప్పవచ్చును. హిరణ్యము = కాన్తివర్ణము మూల్యము కలబంగారమునకు వాడెదరు. ఎట్లు బంగారము తనకాన్తిచేతను, వర్ణముచేతను, మూల్యముచేతను. సామాన్యజనుల నాకర్షించునో అట్లే సూర్యుడు తన తేజోమండలముచే జీవకోటినాకర్షిం

చుచున్నారు. అట్టి ఆత్మస్వ మనోహరమైన భోగానుకల్పించు ప్రకృతిచే పరమాత్మ లోకములను ఆకర్షించుచున్నారు.

*(3) సత్యస్య=సత్యము సూర్యమండలాంతర్గతుడగు ఆత్మ యని యొక అర్థము. తైత్తిరీయము ఆనందవల్లి. భృగువల్లిలో, "సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే సఏకః" అనిచెప్పె. పురుషునిలోనున్న పరమాత్మయు ఆదిత్యునిలోనున్న పరమాత్మయు రెండును ఒకటియే సత్యస్య అనగా పూర్ణుడగు పరమాత్మయే యని యొక అర్థము. (4) సత్యధర్మాయ = "సత్యమే ధర్మము గాగల నాకొఱకు" అని అర్థము చెప్పుచున్నారు. సత్యము యొక్క లక్షణములు తెలిసికొనుటకై యని అర్థము చెప్ప వచ్చును. అనగా పరమాత్మలక్షణములను తెలిసికొనుటకు అని అర్థము చెప్పవచ్చును. వేదాంగోక్త ప్రవృత్తికొఱకు పరాత్పరుడు చేసిన శాశ్వత ధర్మశాసనమని చెప్పవచ్చును. ఈ యర్థమే సమంజసము (శ్రీ) రవీంద్రనాథు అరవిందఘోషులు అన్వయము చేసిరి. 8 వ మంత్రములో చివరి పాదమునకు చేయబడిన అన్వయమునకిది యనుగుణముగానుండును.

తాత్పర్యము:— సూర్యరూపముగా ఓ సూర్యుడా! తేజో మండలముచే నీలోనున్న సత్యస్వరూపము మూయబడి లేక

---

*బృహదారణ్యకం ౧-౪-౧౪ లో శ్రేయోరూపం అత్యసృజత ధర్మం యో వై స ధర్మః సత్యం వై తత్ ఏతద్ధి ఏవోభయం భవతి ధర్మ మనుసృజించెను ధర్మము, సత్యం రెండు నొకటే.

యత్ర దేవతా సత్యస్య పరమం నిధానం,

అరవిందఘోషులు. సూర్యుని సువర్ణరూపమే గాదు మండలాకారాధారమైన పరమ సత్యమును చూడగోరుచున్నారు.

దాచబడి యున్నది. ఆ సత్యధర్మమును చూడగోరు నాకొఱకు నీవా తేజస్సును ఉపసంహరించి నీలోనున్న సత్యస్వరూపమును దెల్పుము = పరమాత్మపరముగా ఓ సత్యస్వరూపి జగత్పోషణ కర్తా మనోహరమగు ప్రకృతిచే నీ సత్యస్వరూపము మూయ బడియున్నది. నీ సత్యస్వరూపమును జగదాధారముగా నీవొన ర్చిన శాశ్వత ధర్మశాసనమును నేను దర్శించుటకై యీప్రకృతి యను మూతను తీసివేయుము.

౧౬. శ్రుతిః ॥ పూషన్నేకర్షే యమసూర్యప్రాజాపత్య
వ్యూహరశ్మీన్ సమూహ తేజో
యత్తేరూపం కళ్యాణతమంతత్తే
పశ్యామియోఽసావసౌ పురుషః సోఽహమస్మి ॥

పూషన్ = పోషకుడా; ఏకర్షే = ఒంటరిగానుండువాడా యమ = నియామకుడా సూర్య = సూర్యుడా! తేజోవస్తుడా ప్రాజాపత్య = ప్రజాపతి తనయుడా! తేజః = తేజస్సును సమూహ = ఒక్కచోటికి చేర్చుకొనుము. రశ్మీన్ = కిరణము లను వ్యూహ = సర్దుకొనుము, లాగుకొనుము. తే=నీయొక్క; కళ్యాణతమః = అత్యధిక కళ్యాణకరమైన. రూపం = రూపము యత్ = ఏదియో తత్ = దానిని తే = నీయొక్క (అనుగ్ర హము వలన) పశ్యామి = చూచెదను. అసౌపురుషః = ఆ! పురుషుడు యః = ఎవడో సః=ఆయన అహం = నేను అస్మి=! అగుచున్నాను.

* విశేషార్థము:— పూషన్ జగత్పోషకుడు, పరమాత్మ ఏకర్షే ఒంటరివాడు "నద్వితీయోఽస్తి కించన" కొంచమైనను రెండవదిలేదు. పరమాత్మ ఒక్కడే యమ = లోకశాసనములను జేసి నియమించువాడు, సూర్య తనకాన్తిచే లోకమును వెలిగించువాడు ప్రాజాపత్య విష్ణువు. ఎవరికి ప్రజాపతితనయుడో యట్టి పరమాత్మ అసౌ అసౌపురుషః = ఆ ఆపురుషుడు అనగా సుప్రసిద్ధ పురుషుడు సూర్యమణ్డలాంతర్గతుడగు పురుషుడు అని యొక అర్థము, శరీరమందున్న పురుషుడు తాను అసౌపురుషః = సూర్యమణ్డలమందున్న పురుషుడు అసౌపురుషః పరమాత్మగానున్న పురుషుడు అహం అస్మి ముగ్గురు ఒకటేనని భావము అనుభవరీత్యా కలుగుచున్నది. కళ్యాణతమం = తమస్ ప్రత్యయము కళ్యాణములో ఆత్యాధిక్యమును జూపును, తనలోనున్న పురుషుడు కళ్యాణుడే లోకములోనున్న పురుషుడు సూర్యునిలోనున్న పురుషుడు తనకంటే మించిన కళ్యాణతరులు పురాణపురుషుడు పరమాత్మ కళ్యాణతముడు. ఈ మంత్రములో ఉపనిషత్కారుడు ఆత్మైక్యానుసంధానమువలన గలిగిన ఆనందమును ప్రకటించుచున్నాడు, తైత్తిరీయమున శిక్షావల్లిలో త్రిశంకుడును భృగువల్లిలో భృగువును ఎట్లు ఆనందమును ప్రకటించిరో అట్లే * ఈ మన్త్రము ఆనందప్రకటనమని ఎంచవచ్చును. వ్యాహృ

---

* ఏకర్షె = గురుపరంపరలో జేరినవాడు. ౨-౬-3 బృ నారాయణం ఒకడైన ఋషి ద్రష్టయని అరవిందయోగి అర్థముచేసెను.

*బృ ౧-౪ అహంబ్రహ్మాస్మి, నేను బ్రహ్మనైతిని. ౪-౪-౧ మాంస్పృష్ట అవినత్తోమయైవ

సమూహ అని క్రియలకు ఉపసంహరించుము, అని అర్థము దాని భావమేమన వానివల్ల ఆటంకము నాకు తొలగినది, నీకళ్యాణ తమ రూపమును చూచుచున్నాను. నేను నీవె అయినాను. అని యుచ్చస్వరమున తన్మయుడైన మహర్షి ఆనందనినాదమును చేయుచున్నాడు.

తాత్పర్యము:— జగత్పోషకుడా! అద్వైతమూర్తీ, లోక నియామకుడా! విష్ణో, తేజస్స్వరూపీ తేజః పుంజమును సడలింపుము. నీ కళ్యాణతమమైన రూపమును నేను చూచుచున్నాను, నీవెవరవో వాడే నేనగుచున్నాను. హిరణ్మయపాత్రను అతిక్రమించి పరమాత్మతో సాయుజ్యమును అనుభవించు మహర్షి ఆనందనినాదమిది.

౧౭ శ్రుతిః ॥ వాయురనిల మమృతమథేదం
భస్మాంతగ్ం శరీరం ।
ఓం క్రతో స్మర కృతగ్ం స్మర
క్రతో స్మర కృతగ్ం స్మర ॥

అథ = పిమ్మట ఇదం = ఈ శరీరములోనున్న వాయుః =

---

పురుషసూక్తం వేదాహమేతం పురుషం మహాన్తం అన్నట్లు ఇదిగూడ ఆట్లే ప్రస్ఫుట ప్రవచనము.

బృ ౪-౪-౫ ఆట్లే నేను గ్రహించితిని- తస్యోఽస్మి విద్యాత్మన్యాస్వామి- మహానారాయణం అహమస్మి బ్రహ్మాహమస్మి యోహమస్మి బ్రహ్మాహమస్మి నిస్సారించిన ప్రకృతిని తొలగించుము- బ్రహ్మాహమస్మియని బృహదారణ్యకము తెలుపుచున్నది- ( I my father are one ) నేను నాతండ్రి ఒక్కరమేనని ఏసునాథుడు ఎలుగెత్తి చాటుచున్నాడు-

ఆత్మపదార్థము అనిలః = సర్వవ్యాపి: అమృతః = నాశనరహి తుడు శరీరం = ఈశరీరము భస్మాంతం = భస్మీభూతమగుటయే లక్షణముగాగలది.

ఓం క్రతో = ఓంకారస్వరూపియైనట్టియు శరీరమందున్న అధి యజ్ఞుడైన ఓ ఆత్మా స్మర = నీస్వస్థితిని జ్ఞాపకమ్ముంచుకొనుము. కృతం = ఇప్పుడు పొందిన అనుభవమును ( సోఽహమస్మి అను అనుభవమును ) స్మర = జ్ఞాపకముంచుకొనుము.

విశేషార్థము:— వాయువు మాతరిశ్వా 4 వ మంత్రములో చెప్పఁబడినట్లె ఆత్మను సూచించును, క్రతో అనగా మనస్సు అని యజ్ఞరూపియని, విష్ణువు అని, వివిధార్థములు కలవు. ఇచ్చట నీ జీవాత్మ 15-16 మంత్రములలో నద్వితీయమైన యజ్ఞ మును జేసి నిరుపమానమైన ఆనందమును పొందెను. కాన శరీర మందున్న జీవాత్మయే అన్త్యయజ్ఞమొనర్చెను, తానే అధి యజ్ఞమని తెలిసికొనెను. భగవద్గీత 8 వ అధ్యాయము 4 వ శ్లోకము "అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర" అని తెలుపుచున్నది. "కృతం" లోగడచేసిన కర్మలని యర్థము చెప్పెదరు. కృతం అనగా చేయబడిన అనగా పొందబడిన తాను 15-16 మంత్రములలో పొందిన అనుభవముతో. లోగడ కర్మ లన్నియు నాశనమైనవి వానిని గురించి స్మరించనక్కరలేదు. ఈ యత్యుత్కృష్ట అనుభవమే స్మరించతగినది. "స్థిత్వాస్యామన్త కాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి" భగవద్గీత 2 వ అధ్యా యము 72 వ శ్లోకము, కాన ఇప్పుడు కలిగిన ఐక్యానుభవము శాశ్వతముగానుండవలెనని స్మరించుచున్నాడు.

తాత్పర్యము:— పిమ్మట ఆఋషి తననుగూర్చి ఇట్లుద్బోధించుచున్నాడు. ఈ శరీరములోనున్న వాయువు జీవాత్మ సర్వవ్యాపి అమృతుడు శరీరముమాత్రము భస్మముతో అంతమగు లక్షణముకలది. ఓంకారరూపియగు యజ్ఞపురుషుడు నేనని స్మరించెదను. సోఽహమస్మియన్న అనుభవమును స్మరించెదను, నాయథార్థరూపజ్ఞానమును, తజ్జనితానందమును స్మరించుకొనుచుందును. ఇతరమంతయు లుప్తమై పోవును.

౧౮ శ్రుతిః ॥ అగ్నే నయసుపథారాయె అస్మా
న్విశ్వాని దేవవయునాని విద్వాన్ ।
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాం తెనమఉక్తింవిధేమ ॥

అగ్నే = ఓ అగ్నీ: రాయె = ఫలప్రాప్తికి; సుపథా = శ్రేష్ఠమైన మార్గమున అస్మాన్ = మమ్ము; నయ = నడిపింపుము, దేవ = దివ్యస్వరూపా! విశ్వాని = సమస్తమైన వయునాని = మార్గములను, విద్వాన్ = తెలిసినవాడవు జుహురాణం = వంకరమైన ఏనః=పాపమును అస్మత్ =మానుండి యుయోధి= తొలగింపుము, తె = నీకు భూయిష్ఠాం = అనేకములయిన నమఉక్తిం=నమస్కారవాక్యములను విధేమ=అర్పించుచున్నాము.

విశేషార్థము:— ఈ మన్త్రము కృష్ణయజుర్వేదములో ౪౧ అనువాకము ౧౪- వేదమంత్రములను సంహిత బ్రాహ్మణ భాగములలో ఎట్లర్థముచేసినను వానిని ఉపనిషత్తులలో చేర్చినప్పుడు ఉపనిషత్తుకనుగుణమగు విధానముననే యర్థముచేయవలెను. అగ్నే = పరమాత్మ అగ్నియనుపేరుతో బిలచినను అసలయిన

సత్పదార్థమునకే ఆపేరు వర్తించునని ఋగ్వేదము 170 వ ఋక్కు తెలుపుచున్నది. రాయె = కర్మఫలప్రాప్తి కొఱకని యర్థము చెప్పెదరు. ఇచ్చట జ్ఞానానుభవముకొఱకని చెప్ప వలెను, సుపథా = ఈ యుపనిషత్తులో తెల్పిన 5 మార్గములలో అసుర, అవిద్య, విద్య, అసంభూతి, సంభూతి, మార్గములలో నుత్తమైనమార్గము, ఏలయన ఈ పరమాత్మ "విశ్వానివయు నాని" సకలమైన మార్గములను ఎరిగినవాడు, వయునాని = బుద్ధులను జ్ఞానములను, మార్గములను, అని చెప్పుటభావ్యము, కర్మలేయని క్లుప్తపరచుట పాడికాదు. జుహురాణమేనః = వంకరగాపోవుటచేతనే పాపము, సరియైనమార్గము, అసలు మార్గము, వంకరమార్గము, దూరమార్గము. ప్రక్కమార్గము కాన వ్యభిచార మార్గము రెండు వస్తువులకు మధ్య కనిష్ఠ దూరము సరియైన మార్గము దానికేమాత్రము వైదొలగినను అదియే వంకరమార్గము. అందుచేతనే ఆమాత్రము దూరమధిక మగును. నమఉక్తిం = జ్ఞానమార్గమును సూచించును. స్మరణ, మనన, ధ్యానములు అవసరము. అవియే యనుసరణీయములని యిక్కడ సూచితము.

తాత్పర్యము:— ఓ పరమాత్మా! నీవు లోకములోని సమస్త తత్త్వజ్ఞానములను ఎరిగినవాడవు. జ్ఞానానందము కలుగుటకై యత్యంత శ్రేష్ఠమైన మార్గమున మమ్ముగొనిపొమ్ము. ఆ యుత్తమ మార్గమునసుండి కించిత్తు అయినను వైదొలగు పాపము మాకంటకుండ చేయుము. నిన్ను సదాస్మరించెదము. ధ్యానించెదము, నిన్ను ఆరాధించెదము. 15-16-17-18 మంత్ర

ములు నాలుగును ఉపాసనామార్గమని తెలుపుచున్నారు. కావచ్చును ఆత్మానంద ప్రకటనయు కావచ్చును. ఈ మన్త్రములు బృహదారణ్యకోపనిషత్తు 5-15 గా నుదహరింపబడినవి. ఈ యర్థమేయచ్చటను పొసగును. దానికంటే నీయుపనిషత్తు పూర్వపు దని యూహించనగును. ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతె। పూర్ణస్యపూర్ణమాదాయపూర్ణమేవావశిష్యతె॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



ఓమ్.

10–8–44 శ్రావణ బ ౭ మీా గురువారం.

హరిః ఓం– సామవేదీయ కేనోపనిషత్

## ★ ఉపనిషత్పత్రిక ★

శాన్తి మన్త్రము. ఓం సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై

నౌ = మన యిద్దఱిని సహ కల్యాణ అవతు = రక్షించుగాక. నౌ = మనయిద్దఱిని సహ కూడ భునక్తు = భుజించునట్లు చేయుగాక. వీర్యం = శక్తిసామర్థ్యములనుబొంది సహ = ఇద్దఱము కలిసి కరవావహై = పనిచేయుదముగాక.

నౌ = మాయుభయులయొక్క అధీతం=చదువు, తేజస్వి= తేజోవన్తము అస్తు = అగుగాక మనముభయులము మావిద్విషావహై = ఒకరినొకరు ద్వేషింపకుందుముగాక !

విశేషార్థము:— ఇద్దఱము = గురువు, శిష్యుడు ఇద్దఱము అని యర్థము. శిష్యులు ఒకరుగాక హెచ్చుమందికూడనుండ వచ్చును. అట్లే అధ్యాపకులుగూడ ఒకరుగాక పెక్కుమంది యుండవచ్చును. అప్పుడు శిష్యగణమంతయునొక్క రేయనియు అధ్యాపకగణమంతయు నొక్క రేయనియు అర్థము చేయవలెను.

గురువులనగా:— బ్రహ్మవిద్యా ప్రబోధకు లేయని ఎంచనక్కర లేదు. ఉపనిషత్తులు చెప్పునపుడు గురువనగా బ్రహ్మవిద్యా ప్రబోధకులే వేదవిద్యలు చెప్పునప్పుడుగూడ సామాన్య గురు శిష్యులు సహితము ఈ మన్త్రమునే చెప్పెదరు. శాస్త్రవిద్యలు చెప్పునపుడును ఈ మన్త్రమునే వాడెదరు. కాన సంప్రదాయ మును బట్టి ఎవడు ఏది నేర్చుకొన్నను నేర్చుకొనువాడు శిష్యు డనియు నేర్పువాడు గురువనియు చెప్పవచ్చును. లోకాచార మునుబట్టి యేదో శాఖలో యేదో యొక విషయమును ఏమాత్ర మైనను చెప్పలేనివాడుండడు. ఆమాత్రము నేర్చుకొనవలసిన యావశ్యకత లేనివాడుండడు కాన నీమంత్రము సర్వజనులమధ్య సర్వకాలముల వాడతగినదే. మహాత్మాజీ ఆశ్రమములు ఏర్ప ఱచిన పిమ్మట ఈ మన్త్రమును భోజనారంభమున (సంతర్ప ణలో) పఠించు పద్ధతి నేర్పాటుచేసిరి. ఆయన సమక్షములో నున్నంతవరకు ఆయన గురువనియు తక్కినవారు శిష్యులనియు నెంచనగును. ఆయన లేని సమయములో గృహస్థు అతిథుల మధ్య ఈ మంత్రము చెప్పబడుచున్నది. వారి సాంప్రదాయ మునుబట్టి యీ మన్త్రపఠన మావశ్యకమే. వారితోను వారి వల్ల తరిఫీదుపొందిన గృహస్థులతోను కలసి సహపఙ్క్తి భోజనము చేయునపుడు నేర్చుకోతగిన అంశములు అనేకములుండును. ఈ మన్త్రముయొక్క అంతరార్థము గ్రహించినపుడు ప్రతి గృహములోను భోజనముచేయునపుడెల్లను నీమంత్రపఠనము ప్రయోజనకరముగానుండక తప్పదు.

(2) అవతు = రక్షించుగాక రక్షించువాడు పరమాత్మ

ఆ పదమును అధ్యాహారము చేసుకొనవలెను. మరియొక విధమున నాలోచించనగును. పరస్పరము నేమిద్దరము రక్షించుకొందుముగాక యని అర్థమగునట్లు మా ఐకమత్యము అనుపదమును అధ్యాహారము చేయవచ్చును. సహ అను పదముకూడ కలదుగాన మాకలయికవలన కలిగెడి ఐకమత్యము దాని ఫలితమగు శారీరక మానసిక ఆధ్యాత్మిక బలము మమ్ము రక్షించుగాకయని అర్థము చేయవచ్చును.

(3) భునక్తు = భుజించునట్లు చేయుగాక! ఈ పదమునకు పాలించుగాకయని అర్థము చెప్పుచున్నారు. పాలనలో పోషణయిమిడియే యున్నది. అన్నము పెట్టకుండ చేసెడి పాలన ఆర్య సంప్రదాయములో లేదు, పరమాత్మ మాకిద్దఱకు అన్నము కలుగజేయుగాకయని ఒక అర్థము. రెండవ అర్థము మా యైకమత్య శక్తిచే నన్నము సంపాదించి భుజింతుముగాకయని చెప్పవచ్చును. అప్పుడైకమత్యమనుపద మధ్యాహారమగును. ఇద్దఱము భుజింతుముగాక యనునపుడొక స్వారస్యము కలదు. ఇద్దఱుతిను నాహారములో భేదము లేకుండ సమానమైన వస్తువులనే శక్తికొలది భుజింతురని యర్థము. అది యనాదినుండి యార్యసంప్రదాయము పఙ్క్తిభేదముచేయుట మహాపాపమని యార్యులనమ్మకము. అందుచే గురువు, శిష్యుడు సామాన్యముగా నొకేవిధమగు నాహారము భుజించవలెను. శిష్యుని బుద్ధి వికాసమునకును బ్రహ్మచర్యపాలనమునకును ఎట్టి యాహారమవసరమో యట్టిదియే గురువుకూడ భుజించవలెను. ఇంద్రియ లోలత్వము గురువునకుగూడ నిషేధమే. ఇంద్రియలోలుడయిన

గురువును జూచి శిష్యుడు చెడుమార్గమును పట్టును. పూర్వకాలమున నీగురుకులము లరణ్యప్రాంతమున నుండెడివి. అందుచే శిష్యులకన్న గురువులకు హెచ్చు పదార్థము లభించేదికాదు. గౌతమ ధర్మసూత్ర ప్రకారము శిష్యుడు మధుకరముచేసి తెచ్చిన పదార్థముతోనే గురువు, గురుపత్నికూడ పోషింపబడుచుండిరి. శాస్త్రయుక్తమైనట్టియు ఇంద్రియలోలత్వమునకు దారితీయనట్టియు నాహారమునే భుజించవలెనని నియమమును ఈ వాక్యము సూచించుచున్నది, రుచికై తినరాదు. *హితభుక్ మితభుక్. హితమైన వస్తువును మితముగా భుజించవలెను, సహభునక్తు అనుటచే గురుశిష్యులిద్దఱు ఒకేసమయమున ఒకే పఙ్క్తిని భుజించుచుండిరని యర్థము అందుచే కులభేదము దృష్టిదోషము లేదనియర్థము. శిష్యులందఱు ఏ కులమువారయినను తమలో తామును గురువులతోను కలసి భుజించుచుండిరి. పూర్వము భారతయుద్ధకాలమువరకుకూడ కులభేదముపాటించకుండ భుజించుచుండిరి. మహాత్ములవారి యాశ్రమాదులలో కులభేద, దృష్టిదోష, పఙ్క్తిభేదములు లేకుండ భోజనములు సలుపుదురు. అందుకనే యట్టిభోజనమునకు నీ మంత్రము వర్తించునని వినోబాజీ సమర్థించెను. ఉత్తరహిందూదేశమున నిప్పటికిని పఙ్క్తిభేదమేగాని దృష్టిదోషము లేదు. ఆ పఙ్క్తిభేదము కూడ మహాత్మాజీ తొలగించెను.

(4) కరవావహై = ఇద్దఱును పనిచేయవలెను. ఈ పని

* మధ్వాచార్యులవారు భుజించుటయే అని అన్వయము చేసిరి. పీకు తినుటవరకే సంపాదింపవలెను దాచుటకు కాదు.

శారీరకమైనదియే స్పష్టము. మానసికమైన చదువు పిమ్మట వాక్యములో దెలుపబడెను. ఈ పనికూడ లాంఛనముకాదు. వీర్యముతో అనగా శక్తిసామర్థ్యములన్నియునుపయోగించి చేయవలెను. ఇప్పటికిని వేదాధ్యయనముచేయు శిష్యులు గురువుతో కూడ శక్తికొలది కాయకష్టము చేయుచున్నారు. చేయుపని వీర్యమును పెంచవలెను.

(5) అధీతం = చదువు గురువు శిష్యునకు చెప్పునపుడు అది శిష్యునకేగాక గురువునకుగూడ ప్రయోజనకారి. అందుచేతనే యిద్దరి చదువు అని చెప్పబడెను. ఈ చదువు తేజస్సుతో అనగా విచక్షణతో విజ్ఞానమను తేజస్సుతో బోధింపబడినదిగా నుండవలెను.

(6) మావిద్విషావహై = గురుశిష్యులిద్దఱు ఒకరినొకరు ద్వేషించరాదని యొకయర్థము. అదియు నవసరమే. గూఢమయిన రహస్యమును గురువు శిష్యునకు దెలుపవలసియుండును శిష్యుని ప్రేమించని యెడల నట్టిరహస్యము చెప్పవీలుండదు. ♦మరియు శ్వేతాశ్వతరములో చెప్పినట్లు అర్హుడై ప్రేమాస్పదుడైన శిష్యునకే ఉపనిషత్తు బోధించబడును. ♦ భాగవతము "బ్రూయుః స్నిగ్ధస్య శిష్యస్య గురవో గుహ్యమప్యుత" గురువు ప్రేమించినశిష్యునకు గూఢతర విషయములనుగూడ తెలుపును. వసునాథుడు యిట్లే తెలిపెను. "అవిరోధేన బ్రహ్మకర్మసమారభే" (దేవాలయము యొద్ద దైవనైవేద్యము పెట్టినపుడు

♦ శ్వేతాశ్వతరం 6 వ అధ్యాయము 22-23 మంత్రములలో
♦ భాగవతము 1-1-8

శతుత్రిత్వము జ్ఞాపకము వచ్చిన యెడల ఆపి యింటికిపోయి సద్దు కొని రమ్ము. రహస్యముగానుంచబడినదెల్ల దాపరికము లేకుండ మీకు విప్పిచెప్పబడును. ఈ పదమునకింకొకయర్థము కలదు. గురుశిష్యులు పరుల నెవ్వరిని ద్వేషించరాదు. అట్లు ద్వేషించిన యెడల నుభయులకును ఆత్మోపలబ్ధి కలుగనేరదు. రాగద్వేషములు జయించనివారికి సద్గతులు లేవు. ♦భగవద్గీతలో "తయోర్న వశమాగచ్ఛేత్" ఆరెంటికి లోబడకుము. అవియె మీకు విరోధులు అని చెప్పియున్నారు. ఇద్దఱిమధ్యగాని పరికిని పరులకునుగాని విరోధభావముండరాదని ఇంకొక అర్థము. ఈ మంత్రములో నాలుగుపాదములలోను 5 (ఐదు) వాక్యములు కలవు. అప్పటి విద్యావిధానమును ఈ 5 విశదమొనర్చును. ఈ నియమములనే జీవితములో ఆచరించినయెడల మానవసంఘము అపూర్వమగు అభివృద్ధిని పొందును. ఇందులో ని నియమము లేవనగా (1) స్వసంరక్షణాశక్తిని గురుశిష్యులిద్ద ఱును సంపాదించవలెను, ఒండొరులను రక్షించుకొనవలెను. (2) శాస్త్రసమ్మతమైన ఆహారమును లభ్యమైనంతవరకు దాచుకొనకుండ అవసరమునుబట్టి పఙ్క్తిభేద దృష్టి దోషములు లేకుండ భుజించవలెను. (3) శక్తిసామర్థ్యములను వికసింప చేయునట్లు కాయకష్టము చేయవలెను. (4) బుద్ధి వికసించి

---

♦ భగవద్గీత 3 అధ్యాయము 34 శ్లోకము వీరు ఉపనిషత్తు పఠనమునకు గడంగిరి. భిన్నత్వకారణములు, భిన్నముగా అనుభవములు గురువి శిష్యుల, భోజనము కాయపుష్టి విద్యాబలము, అధికారము. ఈ గురుశిష్యులు ఈ కారణములను తొలగించి ఐకమత్యము కుదుర్చుకొని ఇతరులకు మార్గదర్శ కులు కావలెను.

అన్నస్ఫురణపెంపొందునట్లు విద్యాభ్యాసము చేయవలెను. గురుశిష్యులమధ్య పరస్పరము ద్వేషముగాని విరోధభావము గాని ఉండరాదు, అన్తియేగాక అట్టిభావములను ఇతరులయెడ కూడ కలిగియుండరాదు. ఈ నైయిదుసూత్రములను భరతఖండ ములోగాని, ప్రపంచములోగాని నివసించెడి వివిధ దేశీయులు సంఘములు జాతులుమధ్య వర్తింపచేసిన యెడల లోకకళ్యా ణము తప్పక సమకూరును పరపీడనము తొలగిపోవును. ప్రబ లులు దుర్బలులను వేధించుట స్వాతంత్ర్యములను హరించుట, ఆస్తిపాస్తులను కొల్లగొట్టుట మొదలగు దుర్నయములు అడు గంటును. వీరు భుజించు ఆహారము ఎచ్చటనుండి వచ్చునో తెలుపబడలేదు కాని వారి శారీరక మానసిక కష్టములవలన లభించునని ఊహించవచ్చును. లేదా పూర్వము విద్యాభిమాను లగు రాజులు సమకూర్చవచ్చును. లేదా మధుకరము, భిక్ష యును ఇచ్చుటచే జనసామాన్యమే వీరిని పోషించి యుండ వచ్చును. ఈ గురుశిష్యులు అవస్థలపాలుగాక సుఖముగా సాత్త్విక జీవితము గడపియుందురు.

## శాంతివచనము

మువ్మారు శాన్తి చెప్పబడెను. ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములగు విఘ్నములు తొలగుటకు నుద్దేశింపబడెను. తాపత్రయ నివారణముకూడ కలుగవచ్చును. స్థూల సూక్ష్మ కారణ శరీరములకుగూడ శాన్తి కలుగవచ్చును.

తాత్పర్యము:— మన ఇద్దఱకును రక్షణ కలుగుగాక!

ఒండొరులను రక్షించుకొందుముగాక! మన యిద్దఱము కలసి భుజింతుముగాక. మనమిద్దఱమును శక్త్యుత్సాహములతో పని చేయుదముగాక, బుద్ధి వికసించునట్లు ప్రబోధము పెరుగునట్లు అన్తస్స్ఫురణ తేజరిల్లునట్లు మన విద్యాభ్యాసము నెగ్గుగాక, మనము ఒండొరులనుగాని పరులనుగాని ద్వేషింపకుందుముగాక మనలో మనకుగాని, మనకును ఇతరులకునుగాని విరోధముండ కుండుగాక! శిష్యునికన్న గురువు ఏ విధమునను ఆధిక్యత కోర లేదు. ఏకత్వము నాచరించుటకుగాను దైవమును ప్రార్థన చేయుటగా అన్వయించవచ్చును. ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః॥

ఓం ఆప్యాయన్తు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః
శ్రోత్రమథో బల మిన్ద్రియాణి చ సర్వాణి ॥
సర్వం బ్రహ్మౌపనిషదం మాహం బ్రహ్మనిరాకుర్యామ్
మామా బ్రహ్మనిరాకారోదనిరాకరణమ స్త్వనిరాకరణం మెఽస్తు
తదాత్మనినిరతేయఉపనిషత్సుధర్మాస్తేమయిసన్తు తేమయిసన్తు॥

మమ = నాయొక్క అఙ్గాని = అంగములు ఆప్యాయన్తు = తుష్టి పుష్టి పొందుగాక, అథో = మరియు వాక్ = వాక్కు ప్రాణః = ప్రాణము (నాసిక) చక్షుః = కన్ను, శ్రోత్రం— చెవి; చ = మరియు సర్వాణి = సమస్తమయిన ఇంద్రియాణి = ఇంద్రియములు బలం = బలము ఆప్యాయన్తు = తుష్టి పుష్టి నొందుగాక. సర్వం = సమస్తము ఔపనిషదం = ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన బ్రహ్మ పరమాత్మ, అహం = నేను బ్రహ్మ = బ్రహ్మను, మానిరాకుర్యాం = నిరాకరించకుండును గాక, బ్రహ్మ = బ్రహ్మ మా = నన్ను మానిరాకరోత్ =

నిరాకరించకుండునుగాక, అనిరాకరణం=అనిరాకరణము అస్తు= బ్రహ్మనిరాకరణము ఎన్నటికిని సంభవింపకుండుగాక. ఉపని షత్సు = ఉపనిషత్తులయందలి; యె ధర్మాః = ఏ ధర్మములు కలవో; తే = అవి తదాత్మని = ఆ బ్రహ్మమందు నిరతే = ఆసక్తుడనయిన, మయి= నాయందు సన్తు ఉండుగాక తేమయి సన్తు = అవినాయందుండుగాక!

విశేషార్థము:— (1) ఆప్యాయన్తు= పుష్టిపొందుటః పుష్టినిపొం దుట అవయవములు బలిష్ఠములై తమ తమ కార్యములను నిర్వ హింపుటచే తృప్తినొందుట, అనగా శరీరమంతయు గంభీరా కారమునుదాల్చి బలోపేతమై తమ విస్పష్టధర్మమును నిర్వ హించు నింద్రియములద్వారా శారీరక మానసిక సంతోష మును పొందవలెనని భావము. మాండూక్య, ముండక, ప్రశ్నోప నిషత్తులలో నివ్వబడిన శాన్తిపాఠములో "స్థిరై రంగై స్తుష్టు వాంగ్ం సస్తనూభిః" అని చెప్పబడి యున్నవి. దృఢగాత్ర ముసు స్థిరమైన అంగములును కావలెననియె ఋషులు కోరు చుండిరి. ఆ భావమే యీ శాన్తిపాఠములోను కలదు. మొదటి శాన్తిపాఠములో "సహనావవతు" అన్నపుడు శారీరక, మాన సిక, ఆధ్యాత్మిక బలముచే స్వసంరక్షణ కోరబడెను.

Art of self defence ను (స్వశరీర రక్షణలోని నిపుణత్వమును) ఋషులు సర్వదాపోషించుచుండిరి. (శక్తి హీనులు భుక్తిహీనులు ముక్తిహీనులు" అగుదురు) 3 ముండక ఖండ 2 4 వ మంత్రములో "నాయమాత్మా బలహీనేనలభ్యో" ఈ ఆత్మ బలహీనునకు లభ్యముకాదు, అని తెలిపియున్నారు.

బలహీనునకు ప్రపంచానుభవముకూడ సంశయాస్పదమే.

అఙ్గాని, ఇన్ద్రియాణి, అంగమనగా శరీరము శరీరములోని భాగము. ఇన్ద్రియాణి = ఇన్ద్రియములు కర్మేన్ద్రియములు, జ్ఞానేంద్రియములు, అన్తరిన్ద్రియములు పదునాలుగు. అంగములు కొన్ని ఈ ఇంద్రియములలో చేరును. ఇంద్రియములు, అంగములు అన్ని చెప్పుటచేత శరీరమంతయు సర్వసంశోభితమై యుండవలెనని తాత్పర్యము.

( 3 ) బలం = బలమనగా శక్తి అని సామాన్యార్థము. లావు, తూకము అనికూడ అర్థముకలదు. ఇచ్చట ఆ అర్థములు సమంజసములుకావు. శరీరము అంతయు పొందెడి గంభీరాకారము కూడ బలమని పిలువబడును. అవయవములు పుష్టిగా నుండుటయేగాక శరీరమంతయు చూడ సొంపుగానుండవలెను. అని అర్థము చెప్పవచ్చును. బలమనగా శుక్రమను అర్థము కలదు, రక్తము అని అర్థముకలదు. రక్తపుష్టి వీర్యపుష్టి కలుగవలెనని యర్థము చెప్పవచ్చును.

( 4 ) ఔపనిషదంబ్రహ్మ = ఈ లోకమంతయు ఔపనిషద బ్రహ్మయని చెప్పబడెను. వేదములలో శాస్త్రములలో చెప్పబడు బ్రహ్మగాక ఉపనిషత్తులలో ప్రతిపాదించి నిర్ధారణచేయబడిన బ్రహ్మయే ఈ ఉపనిషత్కారుడు. మొదటి భాగము 4–5–6–7–8 మంత్రములలో చెప్పినట్లు ఇచ్చటనుపాసించునది గాక అదే బ్రహ్మయని నిర్ధారణ చేయుచున్నాడు. గనుక నట్టి బ్రహ్మయే యీ ప్రపంచమంతయునని భావము.

♦ ముణ్డకమిదే భావమును దెలుపుచున్నది. "బ్రహ్మైవేదం విశ్వం" ఈ విశ్వమంతయు బ్రహ్మమే ఆ బ్రహ్మ ఉపనిషత్ప్రతి పాద్యుడు నిరాకార నిర్గుణ పరమాత్మయే.

(5) నిరాకుర్యాం = నిరాకరించుట అనగా లేడని చెప్పుట ఉన్నను పూజించకుండుట పూజించినను అనుభవములోనికి తెచ్చుకొనకుండుట అనగా నట్టి బ్రహ్మ లేనట్లుగా ప్రవర్తించుట నేను బ్రహ్మను నిరాకరించకుందునుగాక. తన జీవితములో నా బ్రహ్మమహిమ వెల్లడికావలెనని భావము. ఏసునాథుడు ఇట్లే మానవజీవితములో దైవమహిమ వెల్లడికావలెనని తెల్పెను. (చెప్పెను)

(6) బ్రహ్మనిరాకరోత్ = బ్రహ్మనిరాకరించుట, బ్రహ్మ ఎవరిని నిరాకరించడు, సమస్తము ఆయనయే, ఆయనలోనే యున్నది. ఆయనయొద్దకే చేరుచున్నది. అజ్ఞానులయిన మానవులు ఆయనను నిరాకరించవచ్చును. జ్ఞానరాశియైన ఆయన మనలను నిరాకరించుట అసంభవము. ఒకవిధముననదిసాధ్యము. మన తపస్సు చాలనప్పుడు మనలను ఆయన పరీక్షించునప్పుడు అర్హతరానంతవరకు ఆయన మనకు ప్రత్యక్షముకాడు. త్వరగా ప్రత్యక్షము కాకపోవుటయే ఆయనవలన నిరాకరణము. అన వచ్చును. అప్పుడుకూడ ఆయన నిరాకరించుచున్నాడనునది మన భావమేగాని యాయనకట్టి భావముండదు.

♦ (7) అనిరాకరణం అస్తు = దైవము నన్ను రక్షించి నను, నాకు ప్రత్యక్షముకాకున్నను నేను నిరాశచెందకుందును

---

♦ ముణ్డకం 2 వ ఖండము 1 మంత్రము 10 డిటో 2.2 11 మంత్రమును

గాక, ఎన్నడును దైవము లేదను భావము, భావప్రవర్తనము. నాకు సంభవింపకుండుగాక, సహాయనిరాకరణమను పదము జనులకు తెలిసియే యున్నది. ఆ పదము ఉపనిషత్తులలో నుపయోగింపబడిన పవిత్రమైన పదమే.

(8) ఆత్మనిరతే = ఆత్మయందు ఆసక్తిగలయని అర్థము. దానిని "మయి"కి విశేషణముగా నర్థము చెప్పుచున్నారు. ఆత్మాన్వేషకుడగు నాయందు అని యర్థము. ప్రత్యేకపదముగా కొందఱన్వయించిరి. ఆత్మనిరతులయందు అని అర్థము. అప్పుడు వారియందు కన్పడునట్టియు ఉపనిషత్తులయందు చెప్పబడినట్టియు ధర్మములని అర్థముచేయవలెను. ఇంకొకవిధమున చెప్పనగును. ఆత్మదర్శనమే పరమ ప్రయోజనముగాగల ఉపనిషత్తులయందు చెప్పబడిన అని అర్థమగును. లేదా ఆత్మసంబన్ధమైనట్టియు ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడినట్టియు ధర్మములు అని అర్థమగును.

(9) సన్తు = ఉండుగాక = ధర్మములు నాయందుండుగాక. అనగా నా ప్రవర్తనలో ప్రస్ఫుటమగుగాక! అనియర్థము, పెట్టెలో దాచిన పుస్తకమువలెగాక పుష్పమునుండి వెల్వడు సౌరభమువలె ఆ ధర్మసౌందర్యము ఆ ధర్మసుగన్ధము నాశరీరమందు వ్యాపించి నాజీవితము తరింపజేయుగాక అని యర్థము.

* ఏసునాధుని శిష్యులు విచారణ సమయమున ఆయన గురుత్వమును నిరాకరించిరి. (Thow shalt deny me Thrice before the cock crows Thrice.) కోడి రెండుమారులు కూయులోపల నీవు నన్ను ముమ్మారు నిరాకరింతువు. అట్లే శిష్యుడు జరిపెను. అగ్నిపరీక్ష కలిగినప్పుడు సిద్ధాన్తమునకు నిలువక దానిని త్యజించుట నిరాకరణము.

తాత్పర్యము:— నాశరీరాంగములు నాసర్వేంద్రియములు వాక్, ముక్కు, కన్ను, చెవి, మొదలగునవన్నియు, నాశరీరమంతయు పుష్టినొందుగాక. సౌష్టవము కలిగియుండి తమ తమ విధ్యుక్తకార్యములను నిర్వహించుచు తృప్తినొందుగాక! నా శరీరము ధాతుపుష్టి నొందుగాక, ఈ సమస్త విశ్వము ఉపనిషత్తులలో ప్రతిపాదించిన నిరాకార నిర్గుణపరమాత్మయే. నేనా పరమాత్మను నిరాకరించకుందునుగాక. భావములో భాషలో పరివర్తనలో ఆయన లేడనునట్టి దోషము నాకు సంభవింపకుండు గాక. ఆ పరమాత్మయు నన్ను మరువక, నిరాకరించక త్వరలో ప్రత్యక్షమగుగాక. ఆయన అనుగ్రహము కలుగుటలో నాలస్యమైనను లేక ( Temtation ) దురాకర్షణము పరీక్షయు కలిగినను నేను నిరాశనొందకుందునుగాక. ఆ పరమాత్మను నిరాకరింపకుందునుగాక! ఆత్మసంబన్ధమైనవియు ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడినవియు సగుధర్మములు ఆత్మయగునాయందు సుస్థిరములై నిలబడుగాక, త్రికరణశుద్ధిగా నాచే ఆచరింపబడుగాక. తద్ద్వారా నేను తరింతునుగాక.

ఓం. కేనోపనిషత్ ప్రథమఖండం - ౧ వ బ్రాహ్మణము.

హరిః ఓం:— కేనేషితం పతతి ప్రేషితం మనః
కేనప్రాణః ప్రథమః ప్రైతియుక్తః ।
కేనేషితాం వాచమిమాం వదన్తి
చక్షుః శ్రోతం కఉ దేవోయునక్తి.

ప్రథమః = మొట్టమొదట కేన = ఎవనిచేత ఈషితం =

కోరబడి ప్రేషితం = ప్రేరేపింపబడి మనః = మనస్సు పతతి = పడుచున్నది. కేన = ఎవరిచేత యుక్తః = నియమింపబడి ప్రాణః = శ్వాసము ప్రైతి కదలుచున్నది. కేన = ఎవనిచేత ఇషితాం = కోరబడిన ఇమాం = ఈ వాచం = వాక్కును (జీవులు) వదన్తి = పలుకుచున్నారు. కః = ఏ దేవః = దేవుడు చక్షుః = కంటిని, శ్రోత్రం = చెవిని ఉ = నిక్కముగా యునక్తి = నడిపించుచున్నాడు, నియమించుచున్నాడు.? ఈ మన్త్రము శిష్యుని వాక్యము.

* విశేషార్థము :— (1) మనః = మనస్సు, నాసిక, వాక్కు, చక్షుః, శ్రోత్రం 5. ఐదు ఇంద్రియములను గూర్చి ప్రశ్న చేయబడినది. రెండవ మంత్రములో నీ ఐదింటిని గూర్చి గురువు సమాధానము చెప్పెను. నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది మంత్రములలో నీయైదింటిలో ఒక్కొక్కదానిని గూర్చి చెప్పబడినది. ఇందులో ప్రాణః అనుపదమునకు నుచ్ఛ్వాస నిశ్వాసములు జరుపు నాసికయని యిచ్చట అర్థము చెప్పబడెను. ఇతరులు దానికి ముఖ్యప్రాణమని యర్థము చేయుచున్నారు. అందుకై ప్రథమః అను పదమును ప్రాణమునకు విశేషణముగా నన్వయించుచున్నారు. శిరస్సుననున్న నోరు, చెవి, కన్ను, చెప్పబడినవి. మిగిలినది ముక్కు దానినిగూడ నుదహరించుట

---

* మనస్సు స్వతంత్రమైన వస్తువు కాదు. ఇతరుల శక్తివల్లనే దానికి సంచారము కలుగుచున్నది. మనస్సుకూడ ప్రకృతిలోనుండి వచ్చినదే. భగవద్గీత. 13 వ అధ్యాయము 5-6 శ్లోకములు, బృహదారణ్యకము ౧-3-3 ప్రాణం అనగా ముక్కు అని అర్థము చేయబడెను.

భావ్యము. రెండు ముక్కులు, రెండు కళ్లు, రెండు చెవులు, నోరు, ఈ యేడుకలసి సప్తమహర్షులని బృహదారణ్యకములో ౨-౨-౩ర మన్త్రము చెప్పుచున్నది. మనస్సు ముఖ్యప్రాణముపై అధికారము చేయదు, మనస్సే మొదట చెప్పబడినది. గనుక మనస్సు మనస్సుకు తండ్రి, ముఖ్యప్రాణము, బిడ్డ అని బృహ ౧-౫-౭ చెప్పుచున్నది. అచ్చటనే ౧-౩-౧ నుండి ౧౬ వ మంత్రమువరకు తెలుపబడిన 5 గురు దేవతలు వాక్కు, నాసిక, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వీనిని ముఖ్యప్రాణము అనగా జీవాత్మ యుద్ధరించెనని కలదు. కాన యిచ్చటను నాసికయే చెప్పవలెను. లోబడిన ఇంద్రియములే ఉదహరించబడెనని ఊహించుట భావము. మనస్సును తక్కిన ఇంద్రియములును అన్నియును అచేతనములే వీనికి చైతన్యముగలదేదో యాధారమై యుండవలెను.

( 2 ) యుక్తః = కలసి లేక నియోగింపబడి అని రెండును చెప్పవచ్చును. ఏ యధిష్ఠానదేవతచే నియోగింపబడి లేదా ఏ దేవతతో కలసి యిట్లీయింద్రియములు వర్తిల్లుచున్నవి అని పృచ్ఛకుని భావము. యునక్తి కిరూఢ నిదేవిధముగ అర్థము చెప్పవచ్చును.

( 3 ) ఇషితం ప్రేషితం = ఈ పదము ఈషితముకాదు. ఇషితమనగా కోరబడి మొట్టమొదట ఎవరి యిచ్ఛచేత నీనైదు ఇంద్రియములు కర్తృమునందు నియోగించబడినవి? అనునది ప్రశ్న అందుచే ప్రథమః అను పదమునకు ఇషితముతో సంబన్ధములు కలుపుటమేలు. అసలు సృష్టికర్త ఈ ఇంద్రియములనన్నిటిని

కల్పించి మానవునిలో నిలిపెను.

* ఐతరేయము చూడనగును. పిమ్మట జీవాత్మ ఈ యింద్రియములను ఉపయోగించుచుండును. జీవాత్మవలన కలిగెడి ప్రోత్సాహము ప్రేషితం అనుపదమువలన సూచితమగుచున్నది.

(4) పతతి = పడుచున్నది పూలమీద పురుగులు వ్రాలునట్లు మనస్సు విషయములమీద వ్రాలును. వ్రాలి యా యా ఇంద్రియములద్వారా ఆయావిషయ స్పర్శను గ్రహించి భోగించును.

(5) దేవః = దేవత లేక దివ్యమైనది. దానికే ప్రకాశింపచేయు వివేకము లేక బుద్ధియని చెప్పవచ్చును. ప్రకాశవంతమగు తేజస్సు కలుగుటచేతనే యితర వస్తువులను గ్రహించెడి శక్తి ఏర్పడుచున్నది, ప్రాణమన్నచోట ముఖ్యప్రాణమే అని అర్థము చెప్పినయెడల ఇచ్చట దేవ అను పదము నిరర్థకమగును. ముఖ్య ప్రాణమే సమస్తేంద్రియములను నడుపుచున్నదని ప్రశ్నోపనిషత్తు 3 వ ప్రశ్న 3—4. బ్రాహ్మణములలో చెప్పుచున్నది. అందువలన చెవిని, కంటిని, నడపునది ముఖ్య ప్రాణమే కావలెను. ఇచ్చట వేరొక దేవత కంటిని చెవిని నడపుచున్నట్లు సూచనగలదు. కాన ప్రాణః అన్నప్పుడు నాశిక అనియే అర్థము చేయవలెను.

తాత్పర్యము:— దేని సంకల్పముచే నీమనస్సు మొట్టమొ

---

* ఈ మనస్సు శరీరములోనికి ఎట్లు ప్రవేశించినది అనికూడ అర్థము చేయవచ్చును.

దట ఈ శరీరములో ప్రవేశించుచున్నది? దేనివలన ప్రేరేపింప బడి విషయములమీద వ్రాలుచున్నది? దేనిచే నియోగింపబడి లేక దేనితో కలసి ఈ నాసిక ఉచ్ఛ్వాస నిశ్వాసములను జరుపుచున్నది? గ్రహించుచున్నది? ఎవరి సంకల్ప ప్రకాశము ఈ వాక్యములను జీవులు పలుకుచున్నారు? ఏ తేజశ్శాలియగు దేవుడు నిక్కముగా నీకంటిని ఈ చెవిని నియోగించి నడపించు చున్నాడు?

ఉపనిషత్ బ్రాహ్మణము:— శ్రీ ॥ శ్రోత్రస్య శ్రోత్రం మనసో
మనో యద్వాచోహవాచంసఉప్రాణస్య ప్రాణః
చక్షుషశ్చక్షురతిముచ్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవన్తి ॥

* యత్ =ఏది శ్రోత్రస్య = చెవియొక్క శ్రోత్రం = వినెడు శక్తి, మనసః=మనస్సుకు మనః=మననముచేయుశక్తి వాచః= వాక్కునకు లేక నాలుకకు వాచం = పలికెడిశక్తి ప్రాణస్య = నాసికకు ప్రాణః = ఊపిరి ఆడించుశక్తి చక్షుషః = కంటికి చక్షుః = చూచెడిశక్తి హ ఉ నిశ్చయముగా సః=అది ధీరాః= ధీరులు అతిముచ్య = వేరుపరచి అస్మాల్లోకాత్ = ఈలోకము నుండి ప్రేత్య = వెడలి అమృతాః = అమృతులు భవన్తి = అగుచున్నారు.

విశేషార్థము:—ఈ వాక్యము గురువుయిచ్చిన ప్రత్యుత్తరము.

---

* బృహదారణ్యకము 4-3-6 వ మన్త్రము "ఆత్మనైవాయం జ్యోతిషా.స్తై॥ సూర్యచంద్రాదులస్తమించినప్పుడు జీవి ఏ ప్రకాశమువలన ప్రవర్తించగలడు? ఆ తన ఆత్మయే తనకు తేజస్సునిచ్చుచున్నది.

(1) శ్రోత్రస్య శ్రోత్రం = మొదటి మంత్రములో చెప్పిన 5 ఇంద్రియములను ఈ మంత్రముదహరించుచున్నది. శ్రోత్రస్య శ్రోత్రమనగా చెవికి చెవియని అర్థము. శరీరము అయియుండ వచ్చును, లేదా సజీవమై యుండవచ్చును. సజీవమై యున్న పుడు జాగ్రదవస్థలో లేదా నిద్రావస్థలోనుండవచ్చును. జాగ్ర దవస్థలో నున్నపుడు అన్యాసక్తమై యుండవచ్చును. లేదా సామాన్యస్థితిలో నుండవచ్చును. శరీరమునకు వెలుపల విష యము లన్నియు కలవు. ఈ విషయములకును ఆ శరీరమునకును స్పర్శ కలుగుచుండును. మృతశరీరముగాని, నిద్రావస్థలోనున్న సజీవశరీరముగాని, అన్యాసక్తమై జాగ్రదావస్థలోనున్న శరీ రముగాని, విషయస్పర్శను గమనించను, జాగ్రదావస్థలో నుండి యన్యాసక్తము కానపుడు విషయస్పర్శను గ్రహించ గలదు. ఇంద్రియములు ఈస్పర్శను మనస్సుదగ్గఱకుకొనిపోవును. మనస్సు ఆ స్పర్శకు అర్థమునుకల్పించి స్పర్శకలిగించిన బాహ్య విషయమును తెలిసికొనును. ఆ స్పర్శపేరు ఆంగ్లములో (Sensation) దానికే సంజ్ఞానమనిపేరు. మనస్సు ఇచ్చెడి అర్థమునకు (Perception) ఆ జ్ఞానము అని పేరు. మనస్సు గ్రహించినదానిని బుద్ధికినివేదించును. *దానికే— ప్రజ్ఞానమని

*తస్యభాసా సర్వమిదం విభాతి కఠోపనిషత్తు 5 అ, 15 మం. శ్వేతా శ్వతరం అ. 14 మంత్రము ముణ్డకం 2 ఖండం 2 మంత్రము 10 ఆత్మప్రకా శము వలననే లోకమంతయు ప్రకాశించుచున్నది. యేనసూర్యస్తపతి తేజ సేద్ధః తైత్తిరీయం 3 బ్రాహ్మణం 12.9 లో 7 ఆయన తేజస్సువల్లనే సూర్యుడు వెలుగుచున్నాడు.

పేరు. ఈబుద్ధి జీవాత్మను అర్పించుకొనును. అతడే ( Knower) “ జ్ఞః ” చెవికి చెవి అనునపుడు చెవిద్వారా వచ్చెడి విషయ స్పర్శము వినెడి ఆఖరువ్యక్తి “ జ్ఞః ” ఎవరో వాడు అనియర్థము. ఇన్ని యింద్రియములుకూడ తమ తమ ప్రత్యేక కర్తవ్యములను నిర్వహించేశక్తి ఆ “ జ్ఞః ” నుండి పొందుచుండును. సః అని మన్త్రములో చెప్పబడినవాడు జ్ఞః అని చెప్పబడెడువాడె.

(2) అతిముచ్య = అనగా వేరుపరచి విషయమును, ఇంద్రియమును వేరుపరచవలెను. ఇంద్రియమును, ఆ యింద్రియమునకు శక్తిని వేరుపరచవలెను. అప్పుడు ఇంద్రియమనగా ఇంద్రియమున్న స్థానము, ఆయింద్రియమునకున్న శక్తికిని ఆ శక్తి ప్రదాతను వేరుచేయవలెను. అట్లు వేరుచేసినపుడు మిగిలెడి శక్తి ప్రదాత స్వభావమును తెలియవలెను. బృహదారణ్యకములో “ విజ్ఞాతారమరె కేనవిజానీయాత్ ” శ్వేతాశ్వతరములో “ సవేత్తి వేద్యం నచ తస్యాస్తి వేత్తా ” దీపమువలన నన్ని వస్తువులను చూడవచ్చును. దానిని జూచుటకు వేఱే దీపమక్కఱలేదు, చూడగలవాడున్నంతమాత్రమున చాలును. అట్లే “ జ్ఞః ” అని చెప్పబడినవాడు తనవంటి శక్తికలవానిచేతనే చూడబడునుగాని అట్టి శక్తిలేని ఇంద్రియాదులచే జూడబడడు, అతిముచ్య అనునపుడు వేరుపరచి త్యజించి అనికూడ అర్థము కలదు. అనగా ఈ యింద్రియములను వాటికుండు విషయసుముఖత్వమును త్యజించి అని అర్థము చెప్పవలెను.

(3) లోకాత్ = లోకమునుండి ఈ జీవలోకము యీ ప్రపంచము అని అర్థము చెప్పవచ్చును. లేదా ఈ యింద్రియ

వ్యాపారము జరుపు రంగమునుండి లేక అవస్థనుండి అనగా నింద్రియ వ్యాపారమే ప్రాముఖ్యముగాగల పరిస్థితులనుండి.

(4) ప్రేత్య = చనిపోయిన అని ఒక అర్థము. రంగమునుండి వెళ్ళడియని నొకయర్థము. ఇంద్రియవ్యాపారములనుండి పైనదొలగి ఉన్నత స్థాయిలో నుత్తమజీవితము గడుపుచుండి అని అర్థము చెప్పవచ్చును.

(5) ధీరాః = ధీరులు అనగా జ్ఞానులు అనగా ఋషులు అనగా పరమాత్మ దర్శనముచేసినవారు. ఇట్టి అర్థము పురుష సూక్తములోను, ముణ్డకములోను చేయబడినది, ఉపనిషత్తుల లోనెల్ల ప్రత్యేక సందర్భములున్నపుడుతప్ప సామాన్యస్థితిలో నీయర్థమే పొసగుచుండును.

* (6) అమృతాః = అమృతము శరీరపతనమైన పిమ్మట మరల శరీరము ధరించరని అనగా జన్మయెత్తరని ఒక యర్థము.

---

* ఇట్లే గీత అ 15. శ్లో 12 13 అ 33 శ్లో కాబట్టి ఆత్మశక్తివలననే లోకములో పంచభూతములు ఏర్పడుచున్నవి. ఆత్మశక్తివలననె ఇంద్రియములు తమ తమ పనులందు సమర్థములగుచున్నవి.

తైత్తిరీయము 2 అ 7 వ పనస కోహ్యేవాన్యాత్ కఃప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనన్దోనస్యాత్ ॥ ఆకాశములో ఆనందమే లేనియెడల ఎవరు ఊపిరి పీల్చగలరు. ఎవరు జీవించగలరు. పరమాత్మస్వభావమగు ఆనందము లోకమంతటా వ్యాపించబట్టే ఏ జీవియైనను జీవించుట తటస్థించుచున్నది.

కఠోపనిషత్ 4 అ. 1 మన్త్రము ఇంద్రియములు బాహ్యస్పర్శకలవి. ఏ కొద్దిమందియో ధీరులు అన్తర్ముఖు లైనచో ఆ పరమాత్మను చూడగలరు.

శరీరపతనముగాకున్నను నశించెడి శరీరమే తానను భావమును పూర్ణముగా విడచి యనశ్వరమగు నాత్మయే తానను భావము స్థిరపడి అనుభవైకవేద్యము అయినవారు రెండవభాగము 5 వ మంత్రములో ఈ మంత్రములోని చివరిభాగము "ధీరా ... భవన్తి" వరకు గలదు; అచ్చటనే 4 వ మంత్రములో అమృత మను పదమునకు అన్నిచోట్ల నిదియేఅర్థము అన్ని యుపనిషత్తు లలో నిదియే యర్థము. ఏషణాత్రయమును త్యజించినవారు అమృతులగుదురని సర్వవిదితము.

ప్రేత్య అను పదమునకు ఏషణాత్రయమును విడుచుటయని శ్రీ శంకరులవారు అర్థము చేయుచున్నారు. అట్లు పోసగనిచో అతిముచ్య యనుపదమునకే ఈ యర్థము చేయవచ్చునని వారి భావము. ఇచ్చట నీ రెండుపదములకును అట్టియర్థము సులభ సాధ్యముకాదు. ప్రసంగవశమునను అట్టి అర్థమున కావశ్యకత లేదు. మొదటి మంత్రములోని ప్రశ్నకును, రెండవ మంత్రము లోని ప్రత్యుత్తరమునకును యిక్కడ ఏషణాత్రయ త్యాగము చెప్పనక్కర లేకుండగనే సామరస్యము గుదురుచున్నది. ఇంద్రి యములు, శరీరము తానేయనుభావము అజ్ఞానముచే వాటిల్లు చున్నది. తాను యీ ఇంద్రియములు కాదనియు తాను యీ శరీరముకాదనియు వీనికంటే భిన్నమై వీనిని నడపించువాడనియు తెలిసికొనుట ఆవశ్యకము ఇవన్నియు నశ్వరములనియు తాను అనశ్వరుడననియు తెలిసికొనుటావశ్యకము.తనకు వీనివలనకలుగ దగిన లాభనష్టములు లేవనియు తెలిసికొనుట ఆవశ్యకము. ఇట్లు తెలిసికొన్నవాడు ఇంద్రియ లీలారంగమగు ప్రపంచముతో

నిమిత్తములేనివాడగును. అందుచేతనే వానికి అమృతత్వము సంభవించును. అట్టిస్థితిలో ఏషణాత్రయముండదు. ఏషణాత్రయ త్యాగము పూర్వసాధనమాత్రమే యగును ఈ మంత్రములో సాధనప్రస్తావనలేదు. బృ 3-౫-౧ ఏతంవై తమాత్మానం విదిత్వాబ్రాహ్మణాః । "పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథభిక్షాచర్యంచరన్తి" ఆత్మను తెలిసి ఏషణాత్రయమును విడనాడును, పూర్వసాధనగాక తర్వాత ఫలితముగా చెప్పబడును. సాధనయు కావచ్చును, ఫలితము పూర్తివిసర్జన.

తాత్పర్యము:— ఎవడు చెవికి చెవి, (వినెడిశక్తి) మనస్సుకు మనస్సు (మననశక్తి) నాలుకకు నాలుక (పలికెడిశక్తి) నాసికకు నాసిక (శ్వాసముల నడిపెడిశక్తి) కంటికి కన్ను (చూచెడిశక్తి) అయియున్నాడో యతడే నిశ్చయముగా నాత్మయేయని భావము. ఇంద్రియములను, ఆ యింద్రియముల శక్తిని, లేదా అధిష్ఠానదేవతలను, వేరుపరచి ఆశక్తిపరిధా తను తెలిసికొన్న ధీరులు ఇంద్రియములు, శరీరము తాము కాదని నిర్ధారణచేసికొని ఇంద్రియములకును ఇంద్రియసంగమునకును, శరీరమునకును, అతీతులయి అమృతత్వమును పొందుచున్నారు. ఈ శరీరాదులు పతనమైన పిమ్మట అమృతులగుచున్నారు, అనికూడ చెప్పవచ్చును. అయమాత్మాబ్రహ్మ యని మాండూక్యము రెండవమంత్రము తెలుపుచున్నది. మానవశరీరములోనుండి జీవాత్మయని పిలువబడునది స్వతస్సిద్ధముగా బ్రహ్మయే.

3 బ్రాహ్మణం = శృతిః 3॥ నతత్రచక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి
నోమనోనవిద్మో నవిజానీమో యథైతదనుశిష్యాత్ ॥
౪ బ్రాహ్మణం—శృతిః ౪ అన్యదేవతద్విదితాదథోఅవిదితాదధి।
ఇతి శుశ్రుమపూర్వేషాం యెన స్తద్వ్యాచ చక్షిరె॥

తత్ర = అచ్చటికి చక్షుః = కన్ను నగచ్ఛతి = పోదు. తత్ర = అచ్చటికి వాక్ = వాక్కు నగచ్ఛతి=పోదు. తత్ర = అచ్చటికి మనః = మనస్సు నగచ్ఛతి=పోదు. ఉ=నిశ్చయము (తత్ = దానిని) న విద్మః = మన మెఱుంగము, నవిజానీ, మః = అనుభవములోనికి వచ్చినదియు లేదు, యథా = ఎట్లు అనుశిష్యాత్ = బోధించగలము. తత్ = అది విదితాత్ = ఎరిగినదానికంటె అన్యత్ = వేరైనది, ఏవ = నిశ్చయము. అథ = మరియు అవిదితాత్ = తెలియనిదానికంటెను అది = మించినది ఇతి = ఇట్లని పూర్వేషాం = పూర్వులయొక్క వచన. మును శుశ్రుమ = వినియున్నాము.

విశేషార్థము:— (1) వ్యాచచక్షిరె = విశదపరచి. స్పష్టముగా యథార్థమైన విధమున మాకు అనుభవైకవేద్యమొన ర్చిరి. పరమాత్మ ధీరులకు జ్ఞానులకు మహాత్ములకు వేద్యుడయి యున్నాడు. ఇతరులకు దుర్లభుడై యున్నాడు సాధననుబట్టి. ఉపకరణములనుబట్టి, అర్హతనుబట్టి యీ సాధ్యాసాధ్యములు సంభవించుచున్నవి. నః = మాకు తత్ =దానిని ప్రబోధించిరి. అని చెప్పటచేత ఆపరమాత్మజ్ఞానము నిశ్చయముగా నిస్సందేహ

ముగా లభ్యమగునను అభయము కలదు. ఇట్లే * ఈశావాస్య ములోగూడ తెలుపబడెను. " ఇతి శుశ్రుమ ధీరాణాం యేన స్త ద్విచచక్షిరెః" అచ్చట, నిచ్చట రెండుపదములలో భేదము కలదు, అచ్చట ధీరాణాం అని కలదు. ఇచ్చట పూర్వేషాం అని కలదు, అచ్చట విచచక్షిరె ఇచ్చట వ్యాచచక్షిరే ఈ క్రియాపదములు రెండు ఒకదానికొకటి రూపాంతరములని యెంచవలెను. ధీరాణాం = అనునపుడు జ్ఞానులన్న అర్థము స్పష్టమగుచున్నది పూర్వేషాం అనునపుడు అట్లు స్పష్టమగుట లేదు. కాని పూర్వేషాం అనునపుడు పూర్వగురుపరంపరయని అర్థము చేయవచ్చును. అట్లు చేసినయెడల ఈ గురువులందఱు మహాత్ములేగనుక అచ్చటను ఇచ్చటను పూర్వాచార్యులచేత ప్రబోధితమైన మహాత్ములు ఈ రెండు ఉపనిషత్తులను ప్రజలకు అనుగ్రహించిరి, అని తేలును. ఇతరములగు ఉపనిషత్తులు ముణ్డకము, ప్రశ్న, తైత్తిరీయము, బృహదారణ్యకము మొద లగునవి. గురుపరంపరను ప్రత్యక్షముగాను, పరోక్షముగాను తెలిపియున్నవి, ఈ ఉపనిషత్ విద్య అంతయు గురుముఖమున అర్హుడైన శిష్యునకు ప్రబోధితముకావలసినదే. ఇప్పటికిని ఆ ఉపనిషత్ రహస్యానుభవము అట్లే లభించుచున్నది. శ్రీరామ కృష్ణపరమహంసలవారికి " భైరవి " అను స్త్రీవలనను " తోటా పురి " అను పురుషునివలనను, సగుణ, నిర్గుణ పరమాత్మల దర్శనము సవికల్ప నిర్వికల్ప సమాధులలో లభించెను. ఆయన

* ఈశావాస్యము 10 వ మంత్రము 13 వ మంత్రము.

వలన ఆయన శిష్యులకు అనుగ్రహించబడెను. ఉపనిషత్తులను అధ్యేత్తించినమాత్రమున నధ్యయనసుఖమే కలుగునుగాని అనుభవానందము కలుగనేరదు.

*(౨) పూర్వేషాం = పూర్వులవలన ఈ ఉపనిషత్ నెల్లాడి యే కొన్ని వేల సంవత్సరములయినదోయని ప్రతీతి. అంతకు పూర్వము ఎన్ని సంవత్సరములనుండి ఈ ఉపనిషద్జ్ఞానము పరంపరాగతముగా వచ్చుచుండెనో తెలియ శక్యముకాదు. త్రికాలజ్ఞులగు జ్ఞానులే తెలిసికొందురు.

(౩) తత్ర = అచ్చటికి రెండవమంత్రములో చెప్పిన బ్రహ్మ యొద్దకు ఎవరిని తెలిసిన అమృతత్వము కలుగునని చెప్పబడెనో అట్టివాని యొద్దకు వెనుకటి మంత్రములో కంటికి కన్ను అని చెప్పబడినది గనుక ఆ రెండవకన్ను ఎచ్చటనున్నదని ఆ కంటి శక్తిని ఎట్లు కనిపెట్టవచ్చునని శిష్యుడు ప్రశ్నించి యుండ వచ్చును. లేదా అట్లు ప్రశ్న కలుగునని గురువే యూహించి యీ మంత్రమున ప్రత్యుత్తరమిచ్చెను, 1–2 మంత్రములలో చెప్పబడిన ఐదింటిలో కన్ను, వాక్కు, మనస్సు, ఈ మూడు నిచ్చట ఉదహరింపబడినవి. తక్కినవికూడ నుదహరింపబడినట్లే యెంచవచ్చును. ఈ యైదింద్రియములు తమ్ము సృజించినవానిని తమకు శక్తినిచ్చినవానిని గ్రహించలేవని యర్థము. బాహ్యేంద్రి

* ఈ పూర్వ గురుపరంపరలో స్త్రీలుగూడనుండిరి. ఇద్దఱి పేర్లను బృ ౬–౫–౩ ఉదహరించుచున్నది. వాచ్, అంభినీ, ఇద్దఱు అంభినీ సూర్యునివలన జ్ఞానోపదేశము పొందెను.

యము లేగాక ♦ నంతరింద్రియములుగూడ గ్రహించ లేవని స్పష్ట పరచబడెను. ఈ భావము ఇతరోపనిషత్తులలోగలదు. * బృహ దారణ్యకములో "విజ్ఞాతారం కేన విజానీయాత్ ♦ తైత్తిరీయం "యతో వాచోనివర్తంతె అప్రాప్య మనసాసహ" అచ్చటికి వాక్కు పోలేదు. మనస్సుతోసహ తిరిగివచ్చెను. అదే భావ మును * ముణ్డకములో "నచక్షుసా గృహ్యతెనాపివాచా నాన్యైర్దేవైః తపసాకర్మణావా" మానవ శరీరములోని ఇంద్రి యము లేవియు, సాపరమాత్మను గ్రహించ లేవు.

(4) న విద్మః = మన మెరుగము. గురుశిష్యులిద్దరు ఎరుగ రని యర్థముకాదు, గురువులకు తెలియుననుట నిస్సందేహమే. ఇచ్చట ఈ పై తెలిపిన ఇంద్రియములద్వారా గురువుకైనను శిష్యునకైనను తెలియదనుటయే ఈ వాక్యమునకర్థము. అందు వలన శిష్యుడు ఈ ఇంద్రియముల అశక్తతను కనిపెట్టి వానినుండి విముఖుడుకావలెనని భావము, అట్లు విముఖుడైనపుడు సాధ నాంతరమును యోచింప మొదలుపెట్టును.

(5) నవిజానీమః = ఈ ఇంద్రియములద్వారా వచ్చెడి విషయజ్ఞానమును స్వకీయప్రవర్తనలో లీనముచేసికొనినను అది యును ప్రయోజనకారి కాదని యర్థము. "విద్మః" అన్నపుడు వలెనే ఇచ్చటగూడ గురుశిష్యులిద్దఱిసంగతి చెప్పినను గురువుకు

♦ అన్తరింద్రియములు = అంతరేంద్రియములు.

* బృహదారణ్యకము 2-4-14

♦ తైత్తిరీయము ౨ వ అధ్యాయము 4 వ పనస.

♦ 3 ముణ్డకము ఖండము 1 8 వ మంత్రము.

తెలియదని యూహించరాదు. గురువు శిష్యునకు బోధించు నపుడు శిష్యునకు తెలిసిన వస్తువుతోపోల్చి తెలియనివస్తువును బోధింపఁజూచును. ఇంద్రియములద్వారా తెలియఁబడిన వస్తువులతో తద్ద్వారాదుర్గ్రాహ్యమైన వస్తువును పోల్చుట అసంభవము. ఇట్లు చెప్పుటచే పరమాత్మ శిష్యులకు తెలిసిన అనగా నింద్రియగోచరమగు అన్ని వస్తువులకంటెను భిన్నమని అర్థము. అందుచేతనుపమానోపమేయముల ద్వారా తెలుప శక్యము కాదని భావము. శ్వేతాశ్వతరము 3-19 లో "సవేత్తి వేద్యం నచ తస్యాస్తి వేత్తా" అతడే తెలిసికొనును. అతడే తెలియ తగినవాడు, అతనిని తెలిసినవారు లేరు. దీనినిబట్టి యీలోకములోని వస్తువులేవియు పరమాత్మ కావని "నేతినేతి" యను పదములచే చెప్పిన సత్యము వెల్లడించబడుచున్నది, ఆత్మ ఆత్మ చేతనే గ్రాహ్యమనికూడ భావించవలెను.

(6) ఏతదనుశిష్యాత్ = ఎట్లు బోధించవచ్చును? అనునది ప్రశ్నగా వదలవచ్చును, లేదా! ఎట్లు బోధించవలెనో మాకు తెలియదని "నవిజానీమః" తో కలుపవచ్చును.

(7) విదితాత్ = తెలిసినదానికంటె; దానికంటే పరమాత్మ అన్యము, ఇచ్చట "తెలియుట" అనగా నింద్రియముల చేత తెలియుట అని అర్థము. ఇన్ద్రియగ్రాహ్యమైన వస్తువులు ఆ యింద్రియములవలెనే నశ్వరములుకాన హేయములు, వాంఛనీయములుకావు. వానిని గురించిన జ్ఞానము అట్టిదియే. ఇట్లు చెప్పుటచే నీ విషయములయందు తజ్జ్ఞానమునందు విరక్తి

కల్పింపబడుచున్నది. సాధనాంతరావశ్యకత సూచింపబడుచున్నది.

(8) అవిదితాత్ అధి = అవిదితం అనగా తెలియబడనది. ఇంద్రియములచే గ్రాహ్యముకానిది అని చెప్పవచ్చును. అవ్యక్తము అని చెప్పవచ్చును. అజ్ఞాతముఅనవచ్చును, "అధి" అను పదమునకు వేరైనది, ఎక్కువైనది, అని రెండర్థములు కలవు. శ్రీ శంకరులవారు ఈ రెంటికిని ఒకే భావమును సూచించిరి. అవిదితమైన వస్తువుకన్న వేరైనది అని చెప్పుట అసందర్భముగా కనబడును, అవిదితము కనుక దాని స్వభావమే తెలియదు. కాన దానికంటె విచారణీయమగు పదార్థము లేక శక్తి భిన్నమో కాదో చెప్పుట అసంభవము. అందుచే మరియొక అన్వయము సరళమైనది సరసమైనది దొరకవలెను. ఈ అధ్యాయములో నె రానున్న మంత్రములలో ఉపాస్యమైన పదార్థమునకన్న బ్రహ్మ వేరని చెప్పబడెను. కాన బ్రహ్మగాక, ఏ ఇతర వస్తువునో లేక శక్తినో లేక దేవతనో, శిష్యగణము, లేక ఇతరజనము ఉపాసించుచుండిరో అది ఈ అవిదితమను పదము వలన నిర్దేశింపబడినదని చెప్పవచ్చును. అప్పుడు విదితమయినది ప్రపంచము, అవిదితమైనది ఈ ప్రపంచముపాసించు వేదచోదిత దేవతాగణము. ఈ ఉపనిషత్కారుడు ప్రతిపాదించు బ్రహ్మ రెండవ శాస్త్రపాఠములో చెప్పిన బ్రహ్మ. ఈ ఉపన్యాస దేవతాగణముకన్న భిన్నమైనది, మిన్నయైనది. "అవిదిత"మనిరి కాని అవేద్యమనలేదు. కాన ఆ దేవతలనుగూడ తెలిసికొనశక్యమే అవిదితమనగా తత్వవేత్తలు చెప్పు ప్రకృతి, అవ్యాకృతము

మూలప్రకృతి, అనిర్వచనీయమగుమాయ అని చెప్పినను చెప్ప వచ్చును. అప్పుడు వివిధ సిద్ధాన్తములలో నవ్యక్తములని చెప్ప బడు వస్తువులకంటే నీబ్రహ్మ భిన్నమైనదని అతిశయమైనదని అర్థమగును. ఇంకొకవిధమున ఆలోచించవచ్చును. అధి:— అనగా:- అటుదోవచూపునది అని అర్థముకలదు, తత్సంబన్ధమై నది, దానినుండి వచ్చునది, అనికూడ నర్థముకలదు. అప్పుడు విదితమునకంటె భిన్నమైనది, అవిదితస్వరూపమున యుండునది అనవచ్చును. అనగా బహుజనులకు తెలియనిదిగానేయుండు స్వభావముకలది అని చెప్పనొప్పును. బృహదారణ్యకం 3-4-1 లో "యత్ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" "య ఆత్మా సర్వా న్తరః" అని చెప్పుచున్నది. ఏది సాక్షాత్తుగా అపరోక్షరూప మున బ్రహ్మ అయియున్నది. ఏది సర్వాన్తర్యామి అయియు న్నది. అని చెప్పబడి యున్నది. కావ ఈ బ్రహ్మ కనుపడువాని కంటె భిన్నము, ఊహించుదానికంటె భిన్నము, అతీతము, కార్యకారణములకంటే భిన్నమనియు, అతీతమనియు చెప్ప వచ్చును. ముణ్డకము 3-2-3-4 మంత్రములలో "నాయమాత్మా ప్రవచనేనలభ్యో న మేధయాన బహునాశ్రుతేన" "నాయ మాత్మా బలహీనేనలభ్యోనచప్రమాదాత్తపసోవాప్యలిఙ్గాత్" ఆత్మాన్వేషణమునకు ఆత్మదర్శనమునకు సామాన్య సాధనము లేవియు పనికిరావని యీ మంత్రములో గురువుశిష్యునకుపదే శించుచున్నాడు. పూర్వ ఋషుల అభిప్రాయమిదియొకనిస్పష్ట పరచెను.

తాత్పర్యము:— ఆ బ్రహ్మతోయందు పడమును కన్నుసుమీ

పించి చూడలేదు, వాక్కు వర్ణించలేదు. మనస్సు, ఊహించలేదు. ఈ సాధనములవలన మనము తెలియజాలము. తద్ద్వారా వచ్చెడి జ్ఞానముచే కర్మేన్ద్రియములును గ్రహించజాలవు, దానిని అనుష్ఠానములోనికి అనుభవములోనికి తెచ్చుకొనలేము. ఇట్టి సాధనములమీద నాధారపడువారికి దానినెట్లు బోధించవచ్చును? అట్టి సాధనములపై యాధారపడి యెట్లు బోధించవలెనో ఊహించలేము. తెలిసినట్లుండు లోకముసకంటె నది భిన్నము, అతీతము లోకముచేనుపాసింపబడు తెలియనట్లుండు దేవతాదులకంటె నది భిన్నము, అతీతము, బహుజనులకది తెలియనిదిగానే తోచుచుండును. ఎవరు మాకీ బ్రహ్మను అనుభవైకవేద్యమొనర్చిరో యట్టి పూర్వ ఋషులవలన నేము పై దెల్పిన విషయములను వినియున్నాము. (వారి, మా అనుభవములను బట్టి ఈ యాత్మను లేక బ్రహ్మను తెలిసికొనుటకు శరీరసంబన్ధమైన ఇన్ద్రియాదులు తన్మూలమునలభ్యమగు భౌతిక ప్రాపఞ్చిక జ్ఞానముపయోగపడదు.)

౫ బ్రాహ్మణము— శ్రుతిః ॥ యద్వాచాఽనభ్యుదితం
యేన వాగభ్యుద్యతే ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం యదిదముపాసతే ॥

యత్ = ఏది వాచా = వాక్కుచేత అనభ్యుదితం = అప్రకాశితమైనదో యేన = దేనిచేత వాక్ = వాక్కు అభ్యుద్యతే = ప్రకాశింపచేయబడుచున్నదో, తదేవ = దానినే త్వం = నీవు బ్రహ్మ = బ్రహ్మనుగా విద్ధి = తెలిసికొనుము, యదిదం =

యత్ = ఏఇదం=సాకారమైన ఈశ్వరాదికమును ఉపాసతే= ఉపాసించుచున్నారో ఇదం = ఇది బ్రహ్మ; = కాదు.

విశేషార్థము:— వాచా = వాక్కుచేత వాగింద్రియముల చేత సర్వభాషలచేత అని అర్థము, సర్వజీవులభాషచేతలభింపదు (2) అనభ్యుదితం = ఉదితం = అనగా పైకెక్కినది వచింపబడినది, సూర్యుడు దృశ్యమైనప్పుడు సూర్యుని విషయములో ఉదితమైనదని చెప్పబడును. అభ్యుదితమనగా స్పష్టముగా కనబడుట యని యర్థము — వాగ్వాదములో చక్కగా నుచ్చరింపబడినదని యర్థము. అనభ్యుదితమనగా దీనికి వ్యతిరేకభావము. కాన ఆ బ్రహ్మ వాక్కుచేత వర్ణింపబడజాలదని స్పష్టము. వాక్కునకు ఎనిమిది స్థానములు కలవని చెప్పెదరు. 1 జిహ్వామూలము 2 హృదయము 3 కంఠము 4 మూర్ధము 5 దంతములు 6 నాసిక 7 ఓష్ఠములు 8 తాలువు. హృదయమునుండి బయలుదేరి తాల్వాదిస్థానములసంబంధముచే వివిధరూపముల నొందుచు బహిర్గతమైన స్వరము హృదయగతభావమును దెలుపునపుడు వాక్కు అనబడును.

(3) అభ్యుద్యతే = వాక్కు మనోగతభావములను తెలుపుచుండుటచేత మానవులను మహిమాన్వితుల జేయుచున్నది. కాని ఈ శక్తి వాక్కుకు, వాగింద్రియమునకు వాక్ స్థానములకు స్వయముగా లభ్యమైనదికాదు. బ్రహ్మచేత ప్రసాదింపబడు శక్తిచేత ఈ వాక్కు ప్రశస్తినొందుచున్నది. * బృహదా

* బృహదారణ్యకము 3-7-17 3.8.11 నాన్యోస్తి దృష్టా శ్రోతా మంతా విజ్ఞాతా. అదృష్టం దృష్టృ- అశ్రుతం శ్రోతృ అమతంమన్తృ అవి

రణ్యకములో "యోవాచమన్తరో యమయతి" ఎవరు వాక్కునకు లోపలనుండి దానిని నియమించుచున్నారో అతడే బ్రహ్మయని చెప్పబడెను.

(4) తదేవబ్రహ్మ = తత్ = అది, ఏవ = మాత్రమే అనగానదియె బ్రహ్మ. ఇచ్చట ఒక విశేషము కలదు, మానవ శరీరములోనున్న దానిని ఆత్మయందుము. బాహ్య ప్రపంచ ములో నున్నదానిని బ్రహ్మయందుము. ఇచ్చట యివి రెండు ఒకటేయనియు ఈ ఆత్మయే బ్రహ్మయనియు బ్రహ్మగాక వేరొండు ఆత్మ లేదనియు స్పష్టపరచబడెను.

(5) విద్ధి = తెలిసికొనుము, అదియే తెలసికొన తగినది. ఇది విధివాక్యము. దీనితోపాటు ఇంకొక నిషేధవాక్యముకూడ తెలిసికొనవలసి యున్నది.

(6) యదిదముపాసతే = నేదం = ఇదికాదు అనగా నిది బ్రహ్మకాదు. ఏది బ్రహ్మకాదు? యదిదముపాసతే = దేనిని ఇచ్చటి జనులు ఉపాసించుచున్నారో అది బ్రహ్మకాదు. ఇచ్చట ప్రజలు అనగా లోకమందలి సామాన్యజనులందఱు కర్మకాణ్డ పరులు బాహ్యపదార్థమును బాహ్యముగానుపాసించువారు లేదా బాహ్యపదార్థమునంతరంగములో నుపాసించువారు. ఉపాసనయే నిషేధ్యమని యొకభావము స్ఫురించుచున్నది. ఉపా సించునపుడు ఉపాసకుడు ఉపాస్యదేవత ఇద్దఱుండవలెను. ఈ పాదము మొదటి వాక్యములో తదేవబ్రహ్మ అనగా ఉపాసకుని

---

జ్ఞాతం. విజ్ఞాత్ర.

లోనుండు ఆత్మయే బ్రహ్మయని చెప్పుటచేత తద్భిన్నమయిన ఉపాస్య దేవత మరియొండు లభించ నేరదు. అందుచేత నుపాసనయే దుర్లభమగుచున్నది. తదేవ బ్రహ్మ అనుటచే మానవ శరీరములోనున్న యాత్మయే బ్రహ్మయగుచు బ్రహ్మపురియని * ముణ్డకములో చెప్పబడిన గుహాలోనిహితమై ♦ ముణ్డకములో 'యో వేదనిహితం గుహాయాం' అని చెప్పబడినదే బ్రహ్మయగుచున్నది. గనుక దానికంటె స్థలాంతరముననున్న ఉపాస్య దేవత దుర్లభము. సామాన్యజనులచే పూజింపబడు భూతములు పిశాచములు, దేవతలు, అవతారములు, త్రిమూర్తులు మొదలగు వారందఱును స్థలాంతర దేవతలుగా పరిగణింపబడువారు ఉపాస్యులగుట దుర్లభము. అన్తర్యామియయిన బ్రహ్మకూడ జ్ఞానికి ఉపాస్యుడుకాడు ఐక్యమును తెలిసికొనుటతోనే జ్ఞానము పూర్తియగుచున్నది. అప్పుడచ్చట ♦ బృహదారణ్యకములో చెప్పినట్లు అన్యపదార్థము (రెండవ వస్తువు) లేదుగనుక ఉపాసనయే దుర్లభము. ఇచ్చట "ఉపాసించబడునది" అనునప్పుడు ఉపాసనావిధానముకూడ న్యూనమనియే స్ఫురించుచున్నది. మహాభారతము శాన్తిపర్వము 242/7 "కర్మణాబధ్యతెజన్తుః విద్యయాచవిముచ్యతే। తస్మాత్కర్మన కుర్వన్తియతయః పారదర్శినః॥" "క్రియాపథశ్చైవ పురస్తాత్ సన్న్యాసశ్చతయోః స్సన్న్యాస ఏవాత్యరేచయత్" అని చెప్పబడెను. కర్మ జన్తువు

* ముణ్డకం 2 ఖండం 2 మన్త్రము 7

♦ ముండకం 2 ఖండం 1 మంత్రము 10

♦ బృహదారణ్యకము 4.3.30.31 లో

లను బాధించుననియు విద్య విముక్తి నిచ్చుననియు కాన బ్రహ్మ జ్ఞానులగు యతులు కర్మ చేయరనియు తెలుపబడెను. పూర్వ కాలమున కర్మపథము, సన్యాసపథము రెండుండెననియు రెంటిలో సన్యాసపథమే ఆచరించతగినదనియు చెప్పబడెను. ఇదే విధమున మహానారాయణము 78 వ పనసలో "ఏతాన్యవరాణి పరాగ్ంసి న్యాసఏవాత్యరేచయత్" అచ్చట చెప్పిన తక్కిన మార్గములు న్యూనములయినవనియు సన్యాసమే ఆచరణీయ మనియు స్థిరపరచబడెను.

తాత్పర్యము:— ఏది వాక్కుచేత ప్రకాశింప చేయబడదో అనగా బహిర్గతముకాదో బోధింపబడదో దేనిచేత వాగింద్రియ మునకు వాక్కునకు శక్తిసామర్థ్యములు లభించుచున్నవో అదియే బ్రహ్మ దానినే బ్రహ్మయని తెలిసికొనుము. లోకము లోని ప్రజలు దేనిని ఉపాసించుచున్నారో అది బ్రహ్మ కాదు ఉపాస్యమగు దేవతలున్ను ఉపాసించు ప్రజలును ఉపాసనా విధానమును విమర్శింపబడెను; ఉపాసకుడే బ్రహ్మ అయి యుండగా తనకన్న వేరు ఉపాస్యదేవత ఉన్నదనుకొనుటయును సామాన్య ఉపాసనావిధానమున దానిని లభ్యపరచుకొనగల్గు గుదు మనుకొనుటయును భ్రమలు. అట్టి భ్రమలుగల ప్రజలకు బ్రహ్మజ్ఞానము లభించుటకు తగిన అర్హతలు కలుగలేదని సూచింపబడినది. ఇచ్చట ఉపాసింపబడువాడు బ్రహ్మకాదు, ఉపాసనావిధానము బ్రహ్మజ్ఞానమును లభింపజేయదు. ఉపాస కులకు తదర్హతలు లేవు.

౬ బ్రాహ్మణం శ్రుతిః ॥

యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్ ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥

మనసా = మనస్సుచే యత్ = ఏ బ్రహ్మస్వరూపము; న మనుతే = తలంపబడదో బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలు; యేన = ఏ బ్రహ్మస్వరూపముచేత, మనః = మనస్సును మతం గ్రహింపబడినదని ఆహుః = చెప్పుచున్నారో; తదేవ = దానినే; త్వం = నీవు బ్రహ్మ = బ్రహ్మస్వరూపమును విద్ధి = తెలిసికొనుము; యదిదం = ఏ ఈశ్వరస్వరూపాదికమును; ఉపాసతే = ఉపాసించుచున్నారో ఇదం = ఇది బ్రహ్మ = బ్రహ్మ స్వరూపమున = కాదు॥

విశేషార్థము:— మనస్సు ఈ ఖండములో మనస్సుని వాడి వాడినపుడెల్ల అన్తరింద్రియములు నాలుగుకూడ ఉద్దేశింపబడినవి. కామ, సంకల్ప, సంశయ, శ్రద్ధా, అశ్రద్ధా, ధైర్య, అధైర్య, లజ్జా, బుద్ధి, భయములు ఇవన్నియు మనస్సంబన్ధమైన వృత్తులే.

( 2 ) నమనుతే = గ్రహించరు ఎవరనగా జనులు. మనస్సు ద్వారా ఆత్మను లేక బ్రహ్మను గ్రహించరు, అనగా గ్రహించలేరు. 2-3 మంత్రములలో చెప్పిన అంశమే మరల ఇచ్చట స్థిరపరచబడినది. * తైత్తిరీయములో "అప్రాప్య మనసాసహ" మనస్సుచేత పొందలేకపోయిరి, అని చెప్పబడెను.

* తైత్తిరీయము 2-4 పనప

(3) ఆహుః = చెప్పెదరు. చెప్పువారు బ్రహ్మవేత్తలని శ్రీ శంకరులవారి భావము; ఆ రహస్యమును కనిపెట్టినవారు ఆత్మవేత్తలని రెండవమంత్రము చెప్పుచున్నది. "నమనుతే" అనునపుడు జనులు అని చెప్పబడెను. అచ్చటకూడ ఆజనులలో బ్రహ్మవేత్తలు కలరని ఊహించవలెను; సామాన్యుడయినను బ్రహ్మవేత్తయయినను మనస్సుకుండుశక్తి ఒక్కటియే. బ్రహ్మవేత్తకూడ బ్రహ్మను ఆమనస్సుద్వారాకాక ఆత్మద్వారానే చూచును, * మాండూక్యములో "సంవిశతి ఆత్మనాఽఽత్మానమ్" * భగవద్గీతలో "ఆత్మన్యేవాత్మనాతుష్టః" ఆత్మను ఆత్మద్వారానే పొందవలెను.

(4) మతం = గ్రహించబడినది. అనగా వ్యాప్తమగుచున్నది, అనగా మనస్సు ఇతర వస్తువులను గ్రహించు శక్తి ఆ బ్రహ్మవలననే పొందుచున్నది; మనస్సు అచేతనవస్తువై యున్నది. దానికి కలిగెడి శక్తిసామర్థ్యములు చిత్స్వరూపియగు ఆత్మవలననే కలుగుచున్నవి. * ప్రశ్నోపనిషత్తులో "ఏషహి ద్రష్టా, స్ప్రష్టా, శ్రోతా, ఘ్రాతా, రసయితా, మన్తా, బోద్ధా, కర్తా, విజ్ఞానాత్మా, పురుషః," అని చెప్పబడెను. ఇచ్చట 4-5-6-7-8 మన్త్రములలో చెప్పిన విషయము ప్రశ్నోపనిషద్బ్రాహ్మణములో స్పష్టపరచ బడినది. ఆత్మయే ఆయా ఇన్ద్రియములద్వారా ఆయాపనులు నిర్వ

* మాండూక్యము 12 వ మంత్రము.
* భగవద్గీత 2 అ. 55 వ శ్లోకము.
* ప్రశ్నోపనిషత్ 4 వ ప్రశ్న 9 వ మన్త్రము.

హించువాడు, ఆయా ఇంద్రియములకు నాయాశక్తుల నిచ్చువాడు.

(5) రెండవపాదములోని ముఖ్యవిషయములపై విశదీకరణయినకు 4 వ మన్త్రములో ఇచ్చిన ఆయాశబ్దముల విశదీకరణము చూడవలెను.

తాత్పర్యము:— మనస్సుచేత ప్రజలు యెవరిని గ్రహించలేరో, ఎవరు మనస్సును గ్రహించుచున్నారో, ఇతరవిషయములను గ్రహించు శక్తిని మనస్సుకు ఇచ్చుచున్నారో, అట్టి రహస్యమును ఎవనినిగూర్చి బ్రహ్మవేత్తలు ప్రకటించుచున్నారో, అదియే బ్రహ్మ దానినే బ్రహ్మయని తెలిసికొనుము. లోకములోని ప్రజలు దేనినుపాసించుచున్నారో అది బ్రహ్మ కాదు. ఉపాస్యమగు దేవతలును, ఉపాసించు ప్రజలును, ఉపాసనావిధానమును, విమర్శింపబడెను. ఉపాసకుడే బ్రహ్మయై యుండగా తనకన్న వేరు ఉపాస్య దేవత ఉన్నదనుకొనుటయును, సామాన్యోపాసనావిధానమున దానిని లభ్యపరచుకొనగలుగుదుము అనుకొనుటయును; భ్రమలు. అట్టి భ్రమలుకల ప్రజలకు బ్రహ్మజ్ఞానము లభించుటకు తగిన అర్హతలు కలుగలేదని సూచింపబడినది. ఇచ్చట ఉపాసింపబడువాడు బ్రహ్మకాదు, ఉపాసనావిధానము బ్రహ్మజ్ఞానమును లభింపజేయదు. ఉపాసకులకు తదర్హతలు లేవు.

౬ వ మన్త్రము శ్రు॥ యచ్చక్షుషా నపశ్యతి
యేనచక్షూంషి పశ్యతి ।

తదేవ బ్రహ్మత్వం విద్ధి
నేదం యదిదముపాసతే ॥

లోకః = జనము చక్షుషా = నేత్రములచేత; యత్ = ఏ బ్రహ్మను నపశ్యతి = చూడదో లోకః = జనము యేన = ఏ బ్రహ్మస్వరూపముచేత చక్షూంషి = నేత్రవ్యాపారములను పశ్యతి = చూచుచున్నదో తదేవ = దానినే త్వం = నీవు బ్రహ్మ = బ్రహ్మస్వరూపమునుగా విద్ధి = తెలిసికొనుము. N.B తక్కినవి 4-5 మంత్రములలో వ్రాసినవి గనుక చూడవలెను.

విశేషార్థము:— (1) నపశ్యతి = చూడరు, చూడజాలరు. అనగా:— లోకములోని ప్రజ కంటిద్వారా బ్రహ్మను చూడజాలరు.

(2) చక్షూంషి పశ్యతి = కన్నులు చూచుచున్నవి. అనగా కన్నులద్వారా ప్రజ చూచుచున్నారు. కన్నులకు చూచెడిశక్తి ఆత్మవలననే లభించుచున్నది. 2 వ పాదములోని పదముల విశేషార్థము 4 వ మంత్రములో చూడవలెను.

తాత్పర్యము:— దేనిని మానవులు తమకంటితో చూడజాలరో, ఎవరు అనుగ్రహించిన శక్తివలన కన్నులు చూడగలుగుచున్నవో ఆ కన్నులద్వారా ప్రజలు చూడగలుగుచున్నారో అదియె బ్రహ్మ 4 వ మంత్రములోని తాత్పర్యమునే కొంత బ్రహ్మతరువాత వ్రాసిన దీనికి జేర్చవలెను.

౭ వ మంత్రము శ్రుతిః ॥ యచ్ఛ్రోత్రేణనశృణోతి
యేనశ్రోత్రమిదంశ్రుతం ।

తదేవ బ్రహ్మత్వం విద్ధి
నేదం యదిదముపాసతే॥

శ్రోత్రేణ = చెవిచేత శ్రోత్రం = శబ్దము శ్రుతం = వినబడునట్లు చేయబడినదో N. B. ఈ వ మంత్రములోవలె మిగిలిన పదములకర్థము చేయవలెను.

విశేషార్థము:— (1) నశృణోతి = వినదు. మానవుడు బ్రహ్మను చెవిద్వారా గ్రహించజాలడు.

(2) శ్రుతం = వినబడుచున్నది. అనగా చెవికి వినెడిశక్తి కలిగింపబడుచున్నది. ఏది చెవిద్వారా గ్రాహ్యమగు విషయములను గ్రహించునో అదియె బ్రహ్మ. ఈ ఖండములో చెప్పిన ఇంద్రియములు 5 ఐదింటిమీద ఆత్మ ఆధారపడదు. ఉన్నచోట వానికి ఆయాశక్తులను అదియే అనుగ్రహించును. శరీరములో నాయా ఇంద్రియభాగములకు ఆయాశక్తులిచ్చును. ఆయాశక్తి ద్వారా తెలియబడు విషయములను తానుగైకొని ఉపయోగించును. ♦ ముణ్డకములో "అప్రాణోహ్యమనాశ్శుభ్రః" అనగా మనస్సుఇంద్రియాదులతో నవసరము లేదనియు నట్టివిలేనిదియు అని చెప్పబడెను. చెవిమూలమున శబ్దములను విందుము. స్వరవేగమతిశయమైనప్పుడు చెవి వినజాలదు. అతి స్వల్పమైనప్పుడు కూడ చెవి వినజాలదు. పరిమితి వేగముగల స్వరమును మాత్రమే చెవి గ్రహించగలదు, బ్రహ్మ స్వరరాశియైనను చెవి గ్రహించజాలదు. మానవుని యుద్దేశించి బ్రహ్మనుండి ఏశబ్దము వెల్వడినను దాని పరిమితికి లోబడని యెడల చెవి గ్రహించదు,

♦ ముణ్డకము 2 ఖండము 1 మంత్రము 2

చెవికియున్నశక్తి అతి స్వల్పమని తెలియవలెను. అట్లే నాసిక గంధగ్రహణమునను, నేత్రము రూపగ్రహణమునను స్వల్ప శక్తివంతములయ్యే యున్నవి. ♦ ఐతరేయములో జెప్పినట్లు ఆయా ఇంద్రియములు అన్నమును గ్రహించజాలక పోయెను. అది ఆయా ఇన్ద్రియమునకు అనువగువిషయము కాదనుకొన్నను అనువగు విషయములలోకూడ ఈ యింద్రియముల శక్తిసామర్థ్యములు స్వల్పములే. రెండవ పాదములోని ఇతరపదముల విశేషార్థమునకు 4 వ మంత్రములోని యాయాపదముల విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము.— ప్రజలు దేనిని చెవిమూలమున గ్రహించజాలరో, చెవికి వినెడి శక్తిని ఎవరనుగ్రహించిరో చెవిద్వారా వినబడు విషయములను ఎవరు గ్రహించుదురో అదియె బ్రహ్మ. 4 వ మంత్రమునకు వ్రాసిన తాత్పర్యములో "అదియేబ్రహ్మ" తరువాత వ్రాసినది దీనికి చేర్చవలెను.

౮ మన్త్రము శ్రుతిః ॥ యత్ ప్రాణేన న ప్రాణితి
యేన ప్రాణః ప్రణీయతే ।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం
యదిద ముపాసతే ॥

యత్ = దేనిని ప్రాణేన = నాసికవలన న ప్రాణితి = గ్రహించలేరో; యేన = దేనిచేత ప్రాణః = నాసిక ప్రణీయతే =

---

♦ ఐతరేయము 1 అధ్యాయము 3 వ ఖండము 3-4--5-6-7-8-9 మంత్రములలో

గ్రహించుశక్తిని పొందుచున్నదో 2 వ పాదములోని తక్కిన పదములకు 5 వ మంత్రములోని ప్రతిపదార్థము చూడవలెను.

విశేషార్థము:— (1) ప్రాణేన=నాసికేంద్రియముద్వారా శ్వాసముల నడపుశక్తి, గంధముచు గ్రహించుశక్తి ఈ రెండు శక్తులు దీనికి కలవు. శ్రీ శంకరులవారుకూడ ఘ్రాణేంద్రియము అనియే అర్థము చేసిరి. అందుచేత 1 వ మంత్రములో ప్రాణేన అను పదమునకు నిట్లే అన్వయము చేయవలెను, 2 వ మంత్రములో కూడ నట్లే యన్వయము చేయవలెను.

(2) నప్రాణీయతే = శ్వాసరూపమునగాని, గంధరూపమునగాని గ్రహించదు గ్రహించజాలదు. గ్రహించు శక్తిని అదియే ప్రసాదించును. దానికిగంధము లేదు, శ్వాసగా గ్రహించ బడదు. 2 వ పాదములోని శబ్దములకు 5 వ మంత్రములోని విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము:— దేనిని ఘ్రాణేంద్రియముద్వారా గ్రహించలేరో ఏది యీ నాసికకు ఘ్రాణశ్వాస శక్తులను కలిగించుచున్నదో శ్వాస గంధములద్వారా వచ్చు విషయములను ఏది ఉపయోగించుచున్నదో అదియే బ్రహ్మ. తక్కినది 5 వ మంత్రమునకు వ్రాసిన తాత్పర్యములో "అదియె బ్రహ్మ" తరువాత వ్రాసినది దీనికి చేర్చవలెను.

—:ద్వితీయ ఖండము:—

౧ వ మంత్రము, శ్రుతిః హరిః ఓమ్.

యదిమన్యసేసువేదేతిదభ్రమేవాపినూనం

త్వం వేత్థ బ్రహ్మణోరూపం ।
యదస్యత్వం యదస్య దేవేష్వథను మీమాంస్య
మేవ తే; మన్యేవిదితమ్॥

అహం = నేను బ్రహ్మణః = బ్రహ్మయొక్క; రూపం=రూపమును; సువేదేతి=సరిగ తెలిసికొంటినని, త్వం = నీవు; మన్యసె యది = తలచిన యెడల తత్ =అది దభ్రమేవాపి = స్వల్పమైన దేను, త్వం = నీవు అస్యబ్రహ్మణః=ఈ బ్రహ్మయొక్క యత్ = ఏ; రూపం = రూపమును ఇహ = ఇక్కడ వేత్థ = తెలిసికొనుచున్నావో తదపి = అదియును అస్యబ్రహ్మణః= ఈ బ్రహ్మయొక్కయత్ =ఏ;రూపం=రూపమును; దేవేషు= దేవతలయందు వేత్థ = తెలిసికొనుచున్నావో; తదపి= అదియును; దభ్రమేవ = స్వల్పమేను, నూనం = నిశ్చయము; అథను= అందువలన; తే= నీకు; తత్= ఆ బ్రహ్మస్వరూపము; మీమాంస్యమేవ= విచారింప తగినదేను, అహం = నేను; తత్ = ఆ బ్రహ్మస్వరూపము విదితమేవ = తెలియబడినదిగానే; మన్యే = తలచుచున్నాను.

విశేషార్థము:— (1) సువేద = చక్కగా తెలియును ప్రథమ ఖండములో చెప్పబడిన దానివలన బాగా తెలియును, చెప్పబడినవేవనగా:— శరీరములోని ఇంద్రియములవల్ల అది గ్రాహ్యముకాదు. (2) ఆయా యింద్రియములకు నాయా శక్తులు దానివలన లభించినవి. (3) అది బ్రహ్మ. (4) అది మానవులలోనున్నది. (5) మానవులిప్పుడు ఇటదేనినుపాసించు

చున్నారో అది బ్రహ్మకాదు. (6) వారుపాసించువిధానము బ్రహ్మజ్ఞానమును కల్పించదు. (7) వారివిధానము నవలంబించుటవలన వారికి బ్రహ్మజ్ఞానమునకింకను అర్హత కలుగలేదు. ఈ అంశములను విన్న శిష్యుడు బౌద్ధిక జ్ఞానమును కొంతవరకలవరచుకొనెను. ఈ జ్ఞానములో నధికభాగము నిషేధరూపము న యున్న ది. దీనినే ఆంగ్లములో (Intelectual instruction) అందురు. దానికి సాహిత్య లేక బౌద్ధికజ్ఞానము అని అర్థము. సాహిత్యజ్ఞానము నిశ్చితజ్ఞానముగా లేక అనుభవజ్ఞానముగా పరిణమించుట కత్తే సాధన ఆవశ్యకము. సువేద నాకు చక్కగా తెలియును, తానొకడు కర్త తెలియ తగినది మరొకటి కర్మ. ఆ రెంటిఫలితము జ్ఞానము క్రియ. మూడు త్రిపుటి యున్నపుడే నేను దానిని తెలిసికొంటిని. అని చెప్పవచ్చును. ఎప్పుడు నేనే బ్రహ్మనైతినో అపుడు నాకు తెలుసునని చక్కగా తెలుసునని చెప్పుటసంభవించదు. మరియు తెలియుటలో అంతరువులు ఉండవు. తెలియుట చక్కగా తెలియు ట అను భేదములుండవు. * బృహదారణ్యకములో "నాన్యదతో౽స్తివిజ్ఞాతృ నాన్యదతో౽స్తిద్రష్టృనాన్యదతో౽స్తిశ్రోతృ నాన్యదతో౽స్తి మన్తృ" దానికంటె వేఱొకడు చూచువాడు వినువాడు యోచించువాడు గ్రహించువాడు లేడు. * ప్రశ్నోపనిషత్తులో వీడే ద్రష్ట, ఘ్రాత మొదలయినవి

* బృహదారణ్యకము 3-8-11

* ప్రశ్నోపనిషత్ 4 వ ప్రశ్న 9 వ బ్రాహ్మణము.

అని విధిరూపము తెల్పెను. బృహదారణ్యకము వీనికంటె మరి యొకడు లేడని నిషేధరూపమున తెల్పెను. అందుచేత తెలియు వాడు తెలియఁబడువాడు యిద్దఱు ఒకటే యగుటచే నాకది బాగా తెలుసునని చెప్పుట సంభవించదు.

( 2 ) మన్యసేయది = తలంచితివేని శిష్యుడు తన శక్తి సామర్థ్యముల ప్రమాణము నెరుంగక తెలుసునని భావించిన యెడల ప్రమాదము సంభవించును. * ఛాన్దోగ్యములో ప్రజా పతియొద్దకు జ్ఞానార్థులై పోయిన వీరోచనుని ఇంద్రునికథ తెలుపు చున్నది. ఇద్దఱికిని ప్రజాపతి ఒకటే మంత్రమును జెప్పెను. దానితోడనే వీరోచనుడు తృప్తిపడి పూర్తి విద్యావన్తుడనైతి నని వెడలిపోయెను. ఇంద్రుడు మరికొన్ని సంవత్సరములు అచ్చటనుండి మరల మరల ప్రశ్నించి నిగూఢతత్త్వమును దెలిసి కొనెను. అట్లు శిష్యులు మేధాశక్తి సంపన్నులు కానపుడు పొరపడుట కలదు, అందుచే మన్యసే అనగా తలంతువేని, నీకట్టి అభిప్రాయము కలిగిన యెడల అని చెప్పబడెను. సంపూర్ణ విశ్వాసమే కలిగిన యెడల గురువు ఇట్లనడు. అట్టి సంపూర్ణ జ్ఞానముగాని సంపూర్ణ జ్ఞానము కలిగినట్లు విశ్వాసముగాని శిష్యునకు ఏర్పడినదని గురువునకు స్థిరపడలేదు.

( 3 ) బ్రహ్మణోరూపం=బ్రహ్మయొక్కరూపము, బ్రహ్మకు రూపము లేనేలేదు, లేనిరూపమును తెలియ వీలులేదు. ఇచ్చట రూపమనగా:— తత్త్వమని అర్థము చెప్పవలెను.

* ఛాన్దోగ్యము 8.7.4

బ్రహ్మయొక్క తత్త్వమును అనేకమయిన ఉపనిషత్తులు ఇతి, ఇతి, నేతి, నేతి, వాక్యములతో వర్ణించియున్నవి. ♦ తైత్తిరీయము "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ♦ బృహదారణ్యకము "విజ్ఞానమానన్దం బ్రహ్మ" "విజ్ఞానఘన ఏవ" ♦ ఐతరేయములో "ప్రజ్ఞానం బ్రహ్మ" ♦ కఠోపనిషత్తులో "అశబ్దమస్పర్శమరూపమవ్యయం" "తథాఽరసం నిత్యమగంధవచ్చయత్ ॥" అనియు * ఈశావాస్యములో "సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరంశుద్ధమపాపవిద్ధం" అనియును * మాండూక్యములో "అదృష్టమవ్యవహార్యమగ్రాహ్యమలక్షణమచిన్త్యమవ్యపదేశ్యం" అనియును * ముండకములో "అద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుశ్రోత్రమపాణిపాదం" అనియును ఇట్లే ఇతరమైన ఉపనిషత్తులలోను గూడ నేతి నేతి శబ్దములతో వర్ణించిరి. అందుకనే * బృహదారణ్యకములో పరమాత్మ నేతి నామధారియని చెప్పబడినది. "నేతి నేతి నహి ఏతస్మాదితి నేత్యన్యత్ పరమస్తి" * బృహదారణ్యా

♦ తైత్తిరీయము 2.1
♦ బృహదారణ్యకము 3.9.28 2.4.12
♦ ఐతరేయము 3 అధ్యాయము 1 ఖండము 4 వ మంత్రము.
♦ కఠోపనిషత్ 3 అ. 15 మంత్రము.
* ఈశావాస్యము 9 వ మంత్రము.
* మాండూక్యము 7 మంత్రము.
* ముండకం 1 ఖండము 1 మంత్రము 6
* బృహదారణ్యకము 2.3.6
* డిటో 3.8.8

కములో "అస్థూల మనణ్వహ్రస్వమదీర్ఘ ...... అనన్తరమ బాహ్యమ్" స్థూలముకానిది సూక్ష్మముకానిది, వెలుపల అని గాని లోపల అనిగాని భేదము లేనిది. రూపమనగా సహజస్థితి స్వభావము, సారము, అని అర్థము కలదు. ఇచ్చట బ్రహ్మ యొక్క సారము అనిగాని లేక అసలు స్థితియనిగాని తత్త్వమని గాని అర్థము చెప్పవలెను.

(4) దేవేషు = దేవతలలో ప్రకటితమగు బ్రహ్మరూపము అని ఒకవిధమైన నర్థము చేయుచున్నారు. మరికొందఱు దేవతలలో విజ్ఞానము తెలిసికొన్నదికూడ స్వల్పమేనని అర్థముచేయుచున్నారు. దేవేషు అనగా ఇంద్రియములలో అనికూడ అర్థము చెప్పవచ్చును. అప్పుడు ఇంద్రియముల కేశక్తి యివ్వబడెనో యాశక్తిస్వల్పమే బ్రహ్మయొక్కసర్వశక్తులను సంపూర్ణముగా నింద్రియములలో నిమడ్చలేదు, అట్లె దేవతలలోను బ్రహ్మ యొక్క సర్వశక్తులు ఇమడ్చబడలేదు, అని అర్థముచేయవచ్చును. ఇంకొకవిధమున ఊహించనగును. "యదస్యభూతేషు యదస్యదేవేషు" ఏది భూతములలోను, ఏది దేవతలలోను బ్రహ్మయొక్కతత్త్వము ప్రకటితమై యున్నదో దానిని నీవువిచారించవలసి యున్నది. దేవతలలోను భూతములలోను బ్రహ్మను గూర్చి తెలిసినవారు ఇంకను దానినిగూర్చి విచారించవలసియే యున్నది. అప్పుడు తే అనగా వారు అని అర్థము చెప్పవలసి యుండును. భూతేషు అను పదము అధ్యాహారము చేయవలసి యుండును.

(5) త్వం = ఈ మంత్రములో నూనం = పిమ్మట ఒక

మారును, యదస్య తరువాత ఒకమారును "త్వం" వాడబడి నది. ఈ రెంటిని మొదటి వాక్యములోనే చేర్చిన మేలగును, "త్వం మన్యసెత్వం వేత్థ బహ్మణోరూపం" అని వాక్యముపూర్తి చేయవచ్చును. లేదా "యదస్య భూతేషు యదస్య దేవేషు" వరకు కలపి ఒకవాక్యము చేయవచ్చును. "అధను మీమాంస్య మేవతె" అనునది మరియొక వాక్యమగును. మన్యేవిదితం చివరి వాక్యమగును.

(6) మన్యేవిదితం అనగా తెలిసినదని యనుకొందును. ఇది గురువు వాక్యము కావచ్చును. అట్లయిన యెడల గురువు శిష్యునితో నాకు బ్రహ్మనుగూర్చి తెలుసును. నీకు తెలుసును అని అనుకొనుచున్నావు కాని ఇంకను విచారించవలసియున్నది. అని మంత్రముయొక్క సారమగును. ఇట్లు చెప్పుట అసంభావ్యము కాదు. ♦ కఠోపనిషత్తులో యముడు నాకంటె అన్యుడు ఎవరు అతనిని తెలిసికొనుటకు అర్హుడు కాడు అని చెప్పి యున్నాడు కఃతం... "మదన్యో జాతుమర్హతి" ♦ ప్రశ్నోపనిషత్తులో "నాతః పరమస్తి" అని ఇంతకంటెమించిన జ్ఞానము లేదని పిప్పలాదమహర్షి ప్రకటించెను. ఈ చివరి వాక్యము "మన్యేవిదితం" శిష్యునియొక్క వాక్యమని యర్థము చేయుచున్నారు. శ్రీ శంకరులువారును అట్లే యభిప్రాయపడిరి. శిష్యుడు నేను బ్రహ్మను అర్థముచేసికొంటిని అని చెప్పినట్లు వ్యాఖ్యానముచేసిరి. అట్లుగాక గురువు యిచ్చిన హెచ్చరికను

♦ కఠోపనిషత్తులో 2 అధ్యాయము 22 మంత్రము.

♦ ప్రశ్నోపనిషత్ 6 వ ప్రశ్న 7 వ బ్రాహ్మణము.

నేను గ్రహించితిని. అని శిష్యుడు చెప్పిన వాక్యముగా నన్వయించ వచ్చును. అప్పుడు దానిభావనేమన మొదటి ఖండములో గురువుచెప్పిన దానినిబట్టి నాకు బాగా తెలిసినదనియనుకొంటిని. కాని గురువు నా భావమును గ్రహించి ఇంకను నేను పరిశోధించవలసి యున్నదని మందలించెను. ఆ మందలింపు నిజముగా నవసరమే. ఇట్లర్థము చేసినయెడల 2 వ మంత్రముకూడ సరళమైన యర్థము పొసగ పీలుండును. ఎట్లయిన ఈమంత్రమునందు అన్వయకాఠిన్య మధికము కాగలదు.

తాత్పర్యము:— గురువువాక్యము:— బ్రహ్మతత్త్వమును గూర్చి మొదటి ఖండములో నేజెప్పిన సంగతులను బుద్ధిద్వారా గ్రహించి దానిని బాగా తెలిసికొంటినని నీవు యోచించిన యెడల దానినిగూర్చి భూతములలోను లేక దేవతలలోను ప్రకటితమైన బ్రహ్మతత్త్వము స్వల్పమైనది. అందులో కూడ నీకు తెలిసినది అతిస్వల్పమే నిశ్చయము కానసీవింకను దానినిగూర్చి పరిశీలించవలసి యున్నది. శిష్యుడు తమ మందలింపును పూర్తిగా గ్రహించితినని అనుకొనుచున్నాను. ఈ క్రిందివిధమున మార్చి చెప్పనగును. ఏది బ్రహ్మయొక్క తత్త్వమో ఏది యింద్రియముల శక్తిగా ప్రకటితమగుచున్నదో ఆ రెంటిలోకూడ నీకు తెలిసినది స్వల్పమే భూతకోటిలోను దేవతలలోను బుద్ధిమంతులు ఆయననుగూర్చి తెలిసికొన్నది స్వల్పమే. అట్టి ప్రకటితమైనదంతయు నీకు తెలిసినను అప్పటికిని నీకు బ్రహ్మజ్ఞానము స్వల్పమే అందుచేత నది ఇంకను పరిశోధనాంశమైయే యున్నది.

౨ మంత్రము- శ్రుతిః ॥ నాహం మన్యే సువేదేతి
నోనవేదేతి వేదచ ।
యోనస్తద్వేద తద్వేద
నోనవేదేతివేదచ ॥

అహం = నేను తత్ = దానిని సువేదేతి = బాగుగా తెలియు నని, నమన్యే = తలచను చ = మరియు అహం = నేను తత్ = దానిని నవేదేతి = తెలియదనియు నోమన్యే = తలచను. వేదేతిచ = తెలిసికొంటినని మన్యే = తలచుచున్నాను. యః = ఎవడు, నః = మనలో నోనవేదేతివేదచ, ఈ వాక్యముయొక్క అర్థమును వేద = తెలిసికొనునో; సః = వాడు తత్ = దానిని వేద = తెలిసికొనుచున్నాడు.

విశేషార్థము:— నమన్యే = తలంచను. నేను తలంచను అని చెప్పునది శిష్యుడు అని తెలియవలెను. గురువుగారిచ్చిన హెచ్చరికనుబట్టి తనమనఃస్థితిని గురువుకు స్పష్టపరచుచున్నాడు అతనిస్థితి మూడు విధములుగానున్నది. బాగుగా తెలియదు అనిగాని, తెలుసును అనిగాని, అసలే తెలియదు అనిగాని అతడు తలంచడు. మొదటి ఖండములో కొంతవినబట్టి అసలే తెలియదనుట భావ్యముకాదు. బాగా తెలుసునని చెప్పుటకు వీలు లేదని గురువే హెచ్చరించెను. ఇట్టిస్థితిలో తెలుసునని చెప్పుటకుకూడ ధైర్యము చాలకున్నది. ఇచ్చట వాడినపదము వేద అనునది. దానికి ఇంద్రియగోచరము అని అర్థము చెప్ప వచ్చును. అనుభవైకవేద్యమని యర్థము చెప్పవచ్చును. ఇచ్చట తనకు ఇంద్రియగోచరము కాలేదు బ్రహ్మ ఇంద్రియములకు

గోచరమగు విషయముకాను, మరి ఏ సాధనమున గ్రాహ్యము గునో యది శిష్యునకింకను తెలియలేదు. మొదటి ఖండములో 2 వ మంత్రములో దా ని ని తెలిసినవారు అమృతత్వమును పొందుదురని తెలుపబడెను. కాని దానిని ఎట్లు తెలిసికొన వలెనో చెప్పలేదు. ఆ ఖండములో మూడునుండి ఎనిమిదివరకు నుండు మంత్రములలో నింద్రియము లతనిని ఎట్లు, ఎందువలన, గ్రహించజాలవో తెలుపబడెను. మరియు సామాన్యోపాసనలకు అందడనియు తెలుపబడెను. ఈ ఖండములో అతనిని యెట్లు తెలిసికొనవలెనో ఆ సాధన తెలుపబడుచున్నది. అందుచేత శిష్యునకు తెలిసిన, తెలియని, తెలియదగిన సంగతులను నిస్సందేహముగా గురువు స్పష్టపరచుచున్నాడు.

ఈ మొదటి పాదము శిష్యుని వచనము. రెండవ పాదము గురువు వచనము.

(2) నః = మనలో అనగా గురుశిష్యులలో

(3) వేద = తెలిసికొనెను అనగా తెలిసికొనదగును. ఆత్మ స్వశక్తివలననే దానిని తెలిసికొనదగును, తెలిసికొనును.

(4) న వేద = తెలియదు, తెలియబడదు. ఇంద్రియముల

ద్వారా తెలియబడదు. బ్రహ్మనుగూర్చి తెలియబడుననిగాని, తెలియబడదనిగాని, రెండును చెప్ప వీలుకాదు. ఈ సమాచార మునే గురువు ఎరిగి యున్నాడు.

(౫) ♦ నాహం = ఇది న + అహం = అగును, కాను, నేను అని రెండుపదములకర్థము; ఇంకొక పాఠాన్తరము కలదు. నాహ = దానికి న + అహ అహ, అనగా నిశ్చయము అహం అనే పదము వాడకున్నను వచ్చెడి చిక్కు లేదు. ఏలయన:— మన్యే అను పదమువలన నేనుఎంచెదను అనుభావమే ఏర్పడును.

తాత్పర్యము:— మీరు మంత్రలించినట్లు నాకిది బాగుగా తెలియునని నేననుకోను, అంతేకాదు, నాకిది తెలుసునని లేదా అసలే తెలియదనికూడ చెప్పజాలను. ఇది శిష్యునివాక్యము దాని పిమ్మట గురువిట్లు చెప్పుచున్నారు. మనలో ఎవరు దానిని తెలిసికొనిరో వారు దానిని గూర్చి యొక్క విషయము స్పష్టముగా గ్రహించియున్నారు. దాని స్వభావమునుబట్టి అది తెలియునది కాదు, తెలియనిదికాదు. అనగా నది ఇంద్రియములవలన గోచరముకానిది. ఆత్మ స్వశక్తివలన గోచరమగునది.

3 మంత్రము- శ్రుతిః ॥ యస్యామతం తస్యమతం
మతం యస్య న వేదసః ।
అవిజ్ఞాతం విజానతాం
విజ్ఞాతమవిజానతామ్ ॥

యస్య = ఎవనికి; అమతం = గ్రాహ్యముకాలేదో; తస్య = అతనికి; మతం = తెలియబడినది; యస్య = ఎవనికి; మతం = గ్రాహ్యమైనదో; సః = అతడు; న వేద = తెలిసికొనలేడు.

---

♦ లోగడ మీయొద్దకు రాకపూర్వము, నాకుండిన జ్ఞానముకూడ అత్యన్త స్వల్పమే అందుచేతనే మీయొద్దకు వచ్చితిని. ఆ మార్గముకూడ పొరపాటనియె తలంచెదను.

విజానతాం = అనుభవజ్ఞానముకలవారికి; విజ్ఞాతం = ప్రబోధిత మైనది, అవిజానతాం=అనుభవజ్ఞానము లేనివారికి; అవిజ్ఞాతం= తెలియబడలేదు.

విశేషార్థము:— (1) అమతం = తెలియబడనిది. పూర్ణముగా తెలియుటకు వీలులేనిది అను తలంపుగలవారికి, అని అర్థము చెప్పుచున్నారు. అట్లు చెప్పుటచేత జ్ఞానిగల సమ్మత స్పష్టమగును కాని జ్ఞాని అమతం = నాకు పూర్ణముగా తెలియదని చెప్పుట అసంభవము. జ్ఞానికాగానె అప్రయత్నముగాకూడ శ్రీ విద్యారణ్యస్వాములవారు "పంచదశి" లో తెలిపినట్లు "ధన్యోఽస్మి ధన్యోఽస్మి అహంబ్రహ్మాస్మి అహంబ్రహ్మాస్మి" అను ఘోష వెల్వడును, అందుచేత "అమతం" అనుపదమునకు "నాకర్థముకాలేద"ని చెప్పుట భావ్యముకాదు. 1 వ ఖండములో మనస్సుచేయుచర్య మననము మతము అనుపదములచే తెలుపబడెను. ఇచ్చట అమతమనగా మనస్సుచేతను మనస్సుకు లోబడియుండు పరివారమగు ఇంద్రియములచేతను గ్రహించబడలేదు" అని యర్థము చెప్పవలెను. అనగా మనస్సు మొదలగు ఇంద్రియములచే గ్రహించక ఇతరవిధముల ఎవడు గ్రహించెనో వానికది మతము ప్రబోధితమైనది.

(2) మతం = మనస్సుచేతనే గ్రహించబడినది; అనగా మనస్సుతత్పరివారమగు నింద్రియములచేతనెంతవరకు గ్రహించబడెనో దానితో తృప్తిపడువానికి అనియర్థము. ఇచ్చట మతమను పదము రెండుమార్లు వాడబడినది, రెంటికిని ఒకటే యర్థము. మనస్సు తత్పరివారమగు ఇంద్రియములు వీనికతీత

మగు విధమున ఎవరు బ్రహ్మను గ్రహించెనో అనగానట్టిజ్ఞానము ఒక్కపర్యాయము కలుగగానె వానిమనస్సు ఇంద్రియములు పూర్వపు దుర్లోపమును పోగొట్టుకొని బ్రహ్మనే గోచరింపచేసుకొనుచుండును' అనగా బ్రహ్మజ్ఞాని జాగ్రదావస్థలోనున్నను, స్వప్నావస్థలోనున్నను, సమాధిలోనున్నపుడువలెనే బ్రహ్మను మాత్రమే గోచరింప చేసుకొనుచుండును. అనగా బ్రహ్మజ్ఞాని బ్రహ్మనే గోచరింపచేసుకొనుచుండును. అతనికన్యము గోచరము కానేరదు. మనస్సు ఇంద్రియములద్వారానే తెలిసికొనుటకు యత్నించి అంతటితో తృప్తిపడిన వానికి నవేద = అతనికి బ్రహ్మతత్వము తెలియదు.

(౩) అవిజ్ఞాతం = ఈ పాదములో నాలుగు పాదములు కలవు, అవిజ్ఞాతం, విజ్ఞాతం, విజానతాం, అవిజానతాం, శ్రీ శంకరులవారును ఇతర వ్యాఖ్యాతలును ఈనాలుగు పదములను రెండు వాక్యములు చేయుచున్నారు. "అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతం అవిజానతాం" జ్ఞానికి తెలియని పదార్థమనియు, అజ్ఞానికి తెలిసినపదార్థమనియు అర్థముచేసియున్నారు ఈ రెండు వాక్యములు పరస్పరవిరుద్ధములుగా కనబడుచున్నవి. అందుచేత విజ్ఞాతం అవిజ్ఞాతం అనుపదములకు ప్రత్యేకార్థములు చెప్పుచున్నారు. విజ్ఞాతమనగా లోకములోనివస్తువులును, తన అహంకారమును మాత్రమే బ్రహ్మగా తలంచినవాడు. అవిజ్ఞాతమనగా సంద్రియగోచరముకానిది అని అర్థము. మొదటి పాదములోగూడ పరస్పర విరుద్ధమయిన వాక్యములుగా నన్వయించుచున్నారు. తెలియని వానికి తెలియును, తెలిసినవానికి

తెలియదు, అని అన్వయించుచున్నారు. 1-2-3 మంత్రములలో బారున ఇట్లే పరస్పర విరుద్ధములుగా కనపడు వాక్యార్థమును అన్వయకాఠిన్యమును కల్పించుట ఉపనిషత్కారుని అభిప్రాయము కాకపోవచ్చును. ఈ రెండవపాదము ఇంకొకవిధమున రెండు వాక్యములు చేయవచ్చును. విజానతాం విజ్ఞాతం అవిజానతాం అవిజ్ఞాతం జానతాం అనగా తెలిసినవారికి, * విజానతాం విశేషముగా తెలిసినవారికి, అనగా శ్రీ అరవిందయోగి చెప్పినట్లు ( Knowledge by Identity ) అనగా జ్ఞాతయు జ్ఞేయపదార్థమును ఒకటిగా సమ్మేళనమొనర్చినప్పుడు కలిగెడి జ్ఞానము ముఖ్యమని వారి యభిప్రాయము. ఈ విశేషజ్ఞానమను

* మనస్సు మొదలగు ఇంద్రియములకు స్వాభావికముగా బహ్యప్రజ్ఞయే కలదు. మాణ్డూక్యము 7 వ మంత్రము. కఠోపనిషత్ 1 మంత్రము, 4 వ వల్లి. "పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాఙ్పశ్యతి నాంతరాత్మన్ । కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదావృత్త చక్షురమృతత్వ మిచ్ఛన్ ॥ బ్రహ్మ ఇంద్రియములనన్నిటిని శిక్షించెను బాహ్యముఖమొనర్చెను, ఎవరో ధీరులు కొందరు అంతర్ముఖమొనర్చి ప్రత్యగాత్మను చూచెదరు. కాన ఈ ఇంద్రియములు బ్రహ్మజ్ఞానమునకు సాధనభూతములుకావు. చర్మచక్షుస్సునకు దివ్యచక్షువను చర్మశ్రోత్రమునకు దివ్యశ్రోత్రమును ఏర్పడవలెను. వానిచేతనే బ్రహ్మశ్రవణము బ్రహ్మదర్శనము కలుగును. అట్లే ఇతరేన్ద్రియములును దివ్యములయినవి కలుగవలెను. అరవిన్దయోగివానికే ( Super miend Devine sight. Devine hearing ) అని తెలిపియున్నాడు. అవి ప్రత్యేక ఇన్ద్రియములుకూడ కావు. ఆత్మకుండు స్వతస్సిద్ధమయిన శక్తులిప్పుడు అభినవశాస్త్రజ్ఞులు కనిపెట్టు దూరశ్రవణ దూరదర్శన యంత్రములను మించిన శక్తులు.

నది ( Intention ) అన్తస్స్ఫురణ లేదా, (Direct Knowledge ) అపరోక్షానుభూతియని చెప్పవచ్చును. లేదా అనుభవైక జ్ఞానమని సామాన్యులకర్థమగునట్లు తెలుపవచ్చును. అప్పుడీ రెండువాక్యములకు అర్థమిట్లు పొసగును. అనుభవైక జ్ఞానముకలవారికే యీ బ్రహ్మ తెలియఃబడుచున్నది. అనుభవైక జ్ఞానములేనివారికిది తెలియఃబడఃటలేదు. ఇంద్రియః జన్య జ్ఞానముగాని మనోజన్య జ్ఞానముగాని బ్రహ్మనుగూర్చి కలుగ నేరదనియు నట్టిజ్ఞానము గ్రంథాపేక్షికము మాత్రమే యనియు అర్థము చేయవచ్చును. ఇట్లన్వయించుటవలన శిష్యునిలో మనస్సు ఇంద్రియములుగాక ఈ మహాజ్ఞానసంపాదనకు సాధన మేదని ఆతురత ఏర్పడును. ఈ అన్వయము 4 వ మంత్రమునకు సరిగా దారితీయును.

తాత్పర్యము:— ఎవడు ఈ బ్రహ్మతత్వమును మనస్సు మొదలగు ఇంద్రియములకు అతీతమైన సాధనోపకరణముచే బోధయొనర్చుకొనునో వానికీ బ్రహ్మతత్వము ఎల్లెడ మనస్సు మొదలగు ఇంద్రియఃములకుగూడ గోచరమగుచునే యుండును కాని ఎవడు మనస్సు మొదలగు ఇంద్రియములకన్న అతీతమగు సాధనోపకరణమును గ్రహించలేక మనస్సు మొదలగు నింద్రియములద్వారా కలిగెడి పరిచయముతోనె తృప్తినొంది యంతటితో పరిశీలనను ఆపునో అతనికి నిజముగా బ్రహ్మజ్ఞానము కలుగదు. అతనికి కలిగెడి జ్ఞానము ఆధ్యాత్మికము గాక లౌకికము మాత్రమే యఃగును. ఎవనికి బ్రహ్మతత్వము అనుభవైక వేద్యమగునో వాడే నిజముగా బ్రహ్మజ్ఞానము కలవాడు. ఎవని

కది అనుభవైకవేద్యము కాలేదో వానికి నిజమైనబ్రహ్మజ్ఞానము కలుగలేదు.

౪ వ మంత్రము, శ్రుతిః ॥

ప్రతిబోధవిదితం మతమమృతత్వం హి విన్దతే ॥
ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతేఽమృతమ్ ॥

ప్రతిబోధవిదితం=ప్రతిబోధవలన తెలిసికొనబడినది; మతం= మనస్సు మొదలగు ఇంద్రియములవలన తెలిసికొనబడినది. (యస్య = ఎవనికో ) సః = అతడు ) అమృతత్వం = అమరత్వమును హి = నిశ్చయముగా విన్దతే = పొందుచున్నాడు; ఆత్మనా = ఆత్మచేత; వీర్యం = వీర్యమును; విన్దతే = పొందుచున్నాడు. విద్యయా = విద్యచేత; అమృతం = అమృతత్వమును విన్దతే = పొందుచున్నాడు.

విశేషార్థము:— (1) ప్రతిబోధః = మనస్సుయొక్క అన్ని వృత్తులచేత తెలియుట, అని శ్రీ శంకరులవారు తెలుపుచున్నారు. మనస్సుకు కలిగిన సర్వశక్తులను ప్రయోగించి తద్ద్వారా కలిగెడి జ్ఞానమును సమన్వయపరచి తన్మూలమున బ్రహ్మను గ్రహించవచ్చును అని చెప్పుచున్నారు. ఈ మనస్సు సమస్త వృత్తులకు అన్తరాత్మయే సాక్షిగనుక దానిని కనిపెట్టవచ్చునని భావము. *అదియే సంపూర్ణజ్ఞానమని యర్థము చెప్పుచున్నారు. ఇంకొక విధమునకూడ నన్వయము చేయుచున్నారు. బోధ

* ఆగ్లేయుల భావము విద్యయనగా స్వభావములోనున్న దానిని పరిణామస్థితికి తీసికొనివచ్చుట ఆట్లే అధ్యాత్మ విద్యకూడ అవిద్యా ఆవరణమను కారాగారమున బద్ధమైయున్న జీవాత్మను గురువనుగ్రహమున బద్ధవిముక్తిని చేయుట.

క్రియకు ఆత్మ కర్తయనియు బోధక్రియా రూపమున నది విదిత మగుననియు చెప్పుచున్నారు. ఇంకొక అర్థము కూడ చెప్పు చున్నారు. మనస్సును ఆత్మలో సంయోగము చేయుటచేత కలిగెడిబోధ ప్రతిబోధయని అన్వయించుచున్నారు. * బృహ దారణ్యకములో "అసంగోనహి సజ్జతే" * భగవద్గీతలో "అసక్తం సర్వభృత్" అన్నివిధరించి సక్తముకానిది, అసం గుడు గనుక దేనిలోను తుగ్నముకానివాడు. ఇట్టి శ్రుతిస్మృతి వాక్యములు మనస్సు ఆత్మసంయోగమునకు అన్తరాయము లని అభిప్రాయపడిరి. శ్రీ శంకరులవారు నిశ్చయపరచిన అర్థ మేమనగా ఆత్మనిత్యము, అవినాశి, జ్ఞానస్వరూపి, ప్రకాశమ యము, అదియెబ్రహ్మ, అదే సంపూర్ణబోధ, ఆ బోధకలిగిన వాడే ప్రతిబోధితుడు. ఆత్మ తన్నుతా తెలిసికొనుటకు ఇతర సాధనోపకరణములు అక్కరలేదు. * బృహదారణ్యకములో "ఆత్మన్యేవాత్మానంపశ్యతి" అని తెలుపుచున్నది. ఆత్మ యందే ఆత్మను చూచుచున్నాడు. ఇచట సాధనము తెలుప లేదు, కర్త తానని మాత్రం చెప్పబడెను. * భగవద్గీతలో "స్వయమేవ ఆత్మన ఆత్మానం వేత్థత్వం పురుషోత్తమ" పురు షోత్తమా! నీవు నీశక్తివలననే నిన్ను చూచుకొనుచున్నావు. * మాణ్డూక్యము "సంవిశత్యాత్మన ఆత్మానం" ఆత్మవలననే

* బృహదారణ్యకము 3-9-26
* భగవద్గీతలో 13 అ. 14 శ్లోకములో
* బృహదారణ్యకం 4-4-23
* భగవద్గీత 10 అ. 15 వ శ్లోకము.
* మాండూక్యము 12 వ మంత్రము.

ఆత్మలో ప్రవేశించుచున్నాడు. కఠోపనిషత్ అ. 4-1 మంత్రములో "ప్రత్యగాత్మానమైక్షత్" తాను ప్రత్యగాత్మను చూచుచున్నాడు. ఇట్టి మంత్రములవలన ఆధారమువలన ఆత్మయే ఆత్మను గ్రహించును, అని తేలుచున్నది. ఈ ప్రతి బోధయను దానికి ఇంకొక అర్థము చెప్పుచున్నారు. సుషుప్తిలో యున్నవాడు తటాలున నిద్రలేచినట్లు అకస్మాత్తుగా కలిగిన బోధకు నిర్నిమిత్తముగా కలిగినందున ప్రతిబోధ అనుచు న్నారు. గురువుయొక్క ఉపదేశమే ప్రతిబోధయని ఒక అర్థము చెప్పుచున్నారు. అట్టి ఉపదేశమువలన నిద్రనుండి మేల్కొనిన వాడు అని అర్థముచేసిరి. పైదెల్పిన సంగ్రహరూపమైన శంక రులవారి భావమునుబట్టి తేలునది యేమనగా మనస్సుకుగల సర్వవృత్తులద్వారా బ్రహ్మను తెలిసికొన్నవాడు ఇట్లు చెప్పుటచే 1 ఖండము 2-3-5 మంత్రములకు భిన్నమగుచున్నదని సందే హము కలుగక తప్పదు. అకస్మాత్తుగా కలిగెడిబోధ ప్రతిబోధ యనినయెడల నది కారణములేనిదగును. ఆ ప్రతిబోధయందుండి కలిగెనో తెలియనదియగును. మాండూక్యము, బృహదారణ్య కము మొదలగు నుపనిషత్తులలో చెప్పినట్లు(ఆత్మ ఆత్మనే తెలిసి కొనును) అన్న భావనే సమంజసము. దానికి నిరుపాధికమైన ఆత్మ ఇతరులను తెలిసికొనలేదని ఆక్షేపణ చెప్పబడుచున్నది, కాని దానికి బృహదారణ్యకములో తగిన సమాధానముకలదు. అచ్చట దాని జ్ఞానశక్తి నశించదు, అది తెలిసికొనదగిన రెండవవస్తువు లేనందుననే తెలిసికొనుటలేదని చెప్పబడుచు న్నది. ఆ తెలిసికొనుశక్తి నాశనరహితమైనది. "నవిజ్ఞాతేః

విషయేలోపో విద్యతే అవినాశిత్వాత్ నతు తద్ద్వితీయమస్తి. తతో ఽన్యద్విభక్తం యద్విజానీయాత్" అని తెలిసికొనతగిన విభాజ్యమైన రెండవవస్తువు లేదు. గురువుయొక్క బోధయుగ తెలియుచున్నది. అని చెప్పుటకూడ సమంజసమే. ఏలయన:— 1 వ ఖండం 3 వ మంత్రములో గురుశిష్య పరంపరగా ఈ జ్ఞానము వెల్లడియగుచున్నదని స్పష్టపరచబడెను. గురువుచేసిన బోధ వినిన శిష్యునకు తనలోనుండి ప్రతిబోధ వెల్వడును, ధ్వనిచేసినపుడు వెల్వడు ప్రతిధ్వనివలెనే శ్రీ రామకృష్ణపరమహంస తన శిష్యులను తాకినపుడు వారికి సమాధిస్థితి కలుగుచుండెను. వివేకానందుని ఎదురరొమ్మున పరమహంస కుడిపాదము పెట్టగానె వివేకానందుడు నిరాకారనిర్గుణపరమాత్మను సమాధిస్థితిలో చేరగలిగెను. సూదంటురాయియొద్దకు తెచ్చిన సూదిలో స్పందనము కలుగును. విద్యుచ్ఛక్తి పూరితమైన రెండు తీగలు సమీపించినపుడు పిడుగు యేర్పడును. ఒకదానిలోనున్న విద్యుచ్ఛక్తి రెండవదానిలోనున్న విద్యుచ్ఛక్తిని ప్రేరేపించును. గురువు ఆత్మబోధ చేయుచుండగా శిష్యునిలో తత్తుల్యముగ ప్రబోధము కలుగుచుండును. అందుకనియే అర్హతగల శిష్యుని యొద్దకు గురువు వెతికికొని వచ్చుటయు శక్తివంతుడగు గురువు యొద్దకు జ్ఞానార్థియగు శిష్యుడు వెదకికొనుచు పోవుచుండుటయు తటస్థించును. బాల్యమున అపహరింపబడిన ప్రద్యుమ్నుడు కొన్ని సంవత్సరముల పిమ్మట లభించినపుడు రుక్మిణీదేవికప్రయత్నముగా స్తన్యముపొంగెను. దానిచేతనే యతడు తన తనయుడని ఆమె గ్రహించెను. పొలమునుండి తిరిగివచ్చు ఆవు

తన బిడ్డను చూడగానె చేపును. అట్లే ఉత్తమ గురుసంపర్కమున ఆత్మజ్ఞానము ఒడమను. కాన ప్రతిబోధ జనగా అన్తస్స్ఫురణ, అపరోక్షానుభూతి అనుభవైకజ్ఞానము అని చెప్పవచ్చును. ఇట్లు ఉత్పన్నమైన జ్ఞానము ద్వారా తెలియబడినది ప్రతిబోధ విదితం.

(2) మతం = 3 వ మంత్రములో చెప్పిన విశదీకరణము చూడవలెను. తనలోను, దైవము లోను, లోకము లోను ఆత్మ దర్శనము చేయవలెను. ఏ ఒక్క చోట చూచినను చాలదని సూచనకలదు.

(3) విన్దతే = పొందును. అమృతత్వమును పొందును ఎవరికి ప్రతిబోధవలన ఆత్మస్వరూపము ప్రబోధితమగుచున్నదో ఎవరికి యెచ్చటచూచినను బ్రహ్మయే సర్వేన్ద్రియములద్వారా గోచరమగుచున్నదో అతనికమృతత్వము కలుగుచున్నది. ఈ అమృతత్వమనునది ఇతరచోటనుండివచ్చి లభించు సంపదకాదు. తనలోనున్న అంతరాత్మ లేక ప్రత్యగాత్మకు స్వభావసిద్ధమైన లక్షణమే. అదివరకుండు అవిద్య నశించగానే కళ్యాణతమమైన లక్షణయుక్తమైన ఆత్మదర్శనము కలిగి అమృతత్వము అనుభవమగుచున్నది. మూడుచోట్ల ఈ పదము వాడబడినది. పరమాత్మను జూచినపుడు అభయమేర్పడును. ఎప్పుడును యెవరి వలనను భయముండదు. అదియే నిజమైన వీర్యము. పౌరుషత్వము. ఆపాదతలమస్తకము కవచధారణ మొనర్చి శస్త్రపాణి వీరుడుకాదు. మూడుచోట్ల ఒకటే అర్థము చేయవచ్చును.

(4) ♦ వీర్యమ్ = బలము, శరీరబలము; మనోబలము, ఆత్మబలము. అనగా ధనము సహాయము, మన్త్రము ఓషధి యోగము తపము వీనివలన కలుగు బలములు అనిత్యములు మృత్యువును హరింపజాలవు. ఆత్మజ్ఞానముచే కలుగు వీర్యము మృత్యువును తరింప జేయును. దుఃఖమును తరింప జేయును. ముణ్డకములో "నాయమాత్మా బలహీనేనలభ్యః" బలహీనులకు ఆత్మ లభించదు. ఆత్మవలన కలిగే బలము నిరుపమానము లోకములో శరీరబలముకలవాడు బుద్ధిబలము కలవానికి లొంగుచున్నాడు. బుద్ధిబలముకలవాడు నైతికబలముకలవానికి, నైతిక బలముకలవాడు ఆత్మబలము కలవానికి లొంగుదురు. కానఆత్మ బలము నిరుపమానము.

(5) విద్యయా = విద్య అనగా నిరాకార నిర్గుణ పరమాత్మను తెలుపునది. * ఈశావాస్యములో చూడనగును. "విద్యయా అమృతమశ్నుతే" * కఠోపనిషత్ చూడనగును. * 3 వ

---

♦ నైతికబలము ఈ వీర్యమనగా ధీరత్వమని కూడ నర్థమే. తైత్తిరీయము 2.4 వ పనస— నబిభేతికదాచనేతి 9 వ పనస నబిభేతికుతశ్చనేతి, 7 వ పనస అథసోఽభయంగతో భవతి. పరమాత్మను పొందినపుడు అభయమేర్పడును. ఎప్పుడును ఎవరివలనను భయముండదు అదియేనిజమైనవీర్యము. పౌరుషత్వము ఆపాదతలమస్తకము కవచధారణ మొనర్చిన శస్త్రపాణి వీరుడు కాదు. మూడుచోట్ల ఒకటే అర్థము చేయవలెను.

* ఈశావాస్యము 11 వ మంత్రము.

* కఠోపనిషత్ 2 అ. 1.2.3.4 మంత్రములలో

* ముణ్డకము 3 ఖండము 1 మంత్రము 5.8 మంత్రములు.

ముణ్డకములో చూడనగును. సమ్యక్ జ్ఞానమువలన లభ్యమగును "సమ్యక్ జ్ఞానేన లభ్యః" అని యున్నది. సమ్యక్ జ్ఞానమే విద్య. * ప్రశ్నోపనిషత్తులో "విద్యయా ఆత్మానం అన్విష్య" విద్యచే ఆత్మను వెదకవలెను. దేనివలన ఆత్మ తెలియబడునో అదియే విద్య. "ప్రతిబోధవిదితం" అని ఈ మంత్రము మొదటిపాదములో చెప్పిన ప్రతిబోధ = విద్య * కఠోపనిషత్ "ఋతంపిబన్తౌ సుకృతస్యలోకే గుహాంప్రతిష్టౌ పరమేపరార్ధే" గుహాయందున్న ఉత్తమాకాశమున ఇద్దఱు ప్రవేశించిరి. వారి లోకమందలి కర్మసూత్రమును గమనించినవారు. ఆ యిద్దఱిలో నొకడు జీవాత్మ, రెండవవాడు పరమాత్మ. * కఠోపనిషత్తులో "ఆత్మేన్ద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" ఇన్ద్రియ మనోయుక్తుడై కర్మసూత్రబద్ధుడై ఉన్నవాడు జీవాత్మ. ఇన్ద్రియమనోయుక్తుడుగాక నిరుపాధికుడై నివసించి కర్మసూత్రమును అమలుపరచుచు నాటిల నెరపువాడు, పరమాత్మ. బుట్టలో పెట్టిన నాగేంద్రుని నాగస్వరముచే ప్రబోధిత మొనర్చగా పడగవిప్పి తేజరిల్లుచుండును. ఆబుట్టనెట్లో తప్పించుకొని బయటపడును. అట్లే గురూపదేశ ప్రేరితమై జీవాత్మ ఇన్ద్రియ మనోయుక్తమను ఆవరణమునుండి బయల్పడి స్వతస్సిద్ధమైన తేజస్సున ప్రజ్వరిల్లును. * కఠోపనిషత్తులో "తమక్రతుః పశ్యతి

* ప్రశ్నోపనిషత్ 1-10 శ్లో

* కఠోపనిషత్ 3.1 శ్లో

* కఠోపనిషత్ 3.4 శ్లో

* కఠోపనిషత్ 2.20 శ్లో

పీతశోకోధాతు ప్రసాదాన్మహిమానమాత్మనః" ఆ జీవాత్మకు నావరణమైయున్న ఇన్ద్రియమనోబుద్ధులు దట్టమైన ఆవరణముగా నుండి పాములవాని బుట్టవలె ఆటంకమగుచున్నది. ఆ ఇన్ద్రియమనోబుద్ధులచే నిర్మితములగు సప్తప్రాకారములనదగు సప్త ధాతువులు జీవాత్మను బన్ధించిన కారాగారముయొక్క దుర్భేద్యకుడ్యములు. "ధాతుప్రసాదాత్" అనగా ఈధాతువుల మాలిన్యము పోగా గోడవలె అవతల వస్తువును దాచక అద్దమువలె నవతల వస్తువును కనపరచుచుండును. ఆ ప్రసాదము మరింత పెరుగగా నాయద్దముకూడ మాయమగును. అప్పుడు నిరాటంకముగా ఆత్మ తనను పరమాత్మను గాంచును. * కఠోపనిషత్తులో జెప్పినట్లు "ఛాయాతపౌ" తాను ఛాయయనియు పరమాత్మ ఆతపమనియు గ్రహించును. ♦ ప్రశ్నోపనిషత్తులో. "ఆత్మన ఏష ప్రాణో జాయతే. యథైషా పురుషే ఛాయైతస్మిన్నే తదాతతమ్" జీవాత్మ ఆ పరమాత్మయొక్క ఛాయవలెనుండి పిమ్మట తానే పరమాత్మయని గ్రహించును.

తాత్పర్యము:— గురువు అనుగ్రహముచే నవిద్యావరణము తొలగి జీవాత్మ స్వస్వరూపమును గ్రహించి ప్రబోధితమై తద్ధ్యానమున బ్రహ్మతత్త్వమును విదితమొనర్చుకొని ఆత్మ బ్రహ్మైక్యానుభవమును పొంది యెల్లెడ నింద్రియమనోబుద్ధులు ద్వారా నైతము బ్రహ్మను గోచరమొనర్చుకొనుచు నమృతత్వమును అనుభవించుచున్నది. ఈ ఆత్మజ్ఞానముచేత నిరుపమానమైన

* కఠోపనిషత్ 3-1 శ్లో

♦ ప్రశ్నోపనిషత్ 3-3 శ్లో

ఆత్మబలమునొంది నిర్భీకమై నెగడుచున్నది. ఆత్మప్రబోధముచే నాత్మకు సహజమగు నమృతత్వమనుభవమగుచున్నది. ఆ పరవిద్య అమృతసాధనము. అమృతత్వమునిచ్చునదే నిజమైన విద్య.

౫వ మన్త్రము శ్రుతిః ||

ఇహ చేదవేదీదథ సత్యమస్తి
న చేదిహావేదీన్మహతీ వినష్టిః ||
భూతేషు భూతేషు విచిత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ||

ఇహ = ఇచ్చట, ఇప్పుడు అవేదీచ్చేత్ = తెలిసికొనిన యెడల; అథ = పిమ్మట; సత్యం = సత్యము; అస్తి = కలదు ఇహ = ఇచ్చట, ఇప్పుడు నావేదీత్ చేత్ = తెలిసికొననియెడల; తదా = అప్పుడు, మహతీ = గొప్పదైన; వినష్టిః = అత్యన్త నాశము; ( కలుగును ) ధీరాః = జ్ఞానులు; భూతేషుభూతేషు = ప్రతిజీవియందును, లోకమంతటను; విచిత్య = అనుభవమొనర్చుకొని; అస్మాత్ = ఈ లోకాత్ = లోకమునుండి; ప్రేత్య = అతిక్రమించి; అమృతాః = అమృతులు; భవన్తి = అగుచున్నారు.

విశేషార్థము:— (1) ఇహ = రెండుచోట్ల కలదు. ఇప్పుడే ఈ జీవితమందే యీ క్షణమందె ఇచ్చటనేయని అర్థమగును. ఆత్మాన్వేషణము ఎన్నటికో, ఏ జన్మకో ఈ జన్మలోనే ఏ వార్ధకమునకో వాయిదా వేయ వీలులేదు. తక్షణమే సాధనకుపూనుకొనవలెను. సిద్ధియగునట్లుకూడ నత్యధిక కృషిచేయవలెను.

♦ ఈశావాస్యములో "కుర్వన్నేవేహ కర్మాణి" ఇహ = ఇప్పుడే ఇచ్చటనే అని నొక్కి చెప్పబడెను. ♦ కఠోపనిషత్తులో ఈ వరం ఇప్పుడే ఇమ్మని "నాన్యం వరం వృణీతే." మరొకటి వరించనని నచికేతుస్సు చెప్పెను. అట్టి దుర్లభమైన మానవ జన్మ దొరకగానె పరమాత్మను పొందని యెడల మహావిపత్తు కలుగును. ♦ భగవద్గీతలో దుఃఖమయమైన జీవితముపొంది యున్నావు. ఈ బాధలేలపడెదవు? నన్ను భజించి తరించుమని శ్రీకృష్ణుడు అర్జునునకు తెలిపెను. శ్రీ శంకరులవారు అధికారముగల అనగా సర్వార్హతకల పురుషుడు తెలిసికొనవలెనని భావించిరి. కాని ఈ మంత్రములో అధికారి, అనధికారియను భేదములేదు. గురువు శిష్యునకు చెప్పుచున్న మంత్రమిది. ప్రతివాడును ఆత్మాన్వేషణము చేయుటకు హక్కు కలిగియున్నాడు అది యతనికర్తవ్యము. ప్రతివాడును ఆత్మయే అయియున్నాడు అతడు సాధనచేయుట కాటంకముండరాదు. తన స్వభావము లోని దోషమువలన ఆలస్యము జరిగిన జరుగుగాక! ఈజన్మలో సిద్ధిపొందమక పోవుగాక! కాని సాధనచేయుటలోను సత్వరసిద్ధికై కృషిచేయుటలోను ప్రతివానికి కర్తవ్యమై యున్నది. రాజ్యాధికార లోభులు తమవశములోనున్న దేశముల స్వాతంత్ర్యమును

♦ ఈశావాస్యము 2 వ మంత్రము

♦ కఠోపనిషత్తులో 1-29 లో

♦ భగవద్గీత 9 వ అధ్యాయం 33 శ్లోకము.

♦ బృ. ౪-౪-౧౨. నేను ఆత్మనని తెలిసినపిమ్మట ఏమికోరి ఎందుకై ఈ శరీరములోనుండి బాధనొందును.

హరించి పునర్దానముచేయుమని కోరినపుడు మీకర్హత లేదని సాకులు చెప్పుచుందురు. పారతంత్ర్యమే అనర్హతను కల్పించి పెంచును. స్వాతంత్ర్యమే అర్హతను కల్పించి పెంచును. అందు కనే లోకమాన్యుడు స్వాతంత్ర్యము నాజన్మహక్కని చెప్పెను. మానవుడు సర్వస్వతంత్రుడు, అతడాత్మస్వరూపుడు, అతని స్వాతంత్ర్యము హరించుట మహాపాపము. ఆర్థిక, సాంఘిక, రాజకీయ, నైతిక, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యములను హరించ రాదు. అందుచేత నధికారి, అనధికారియను భేదమును శాశ్వత మైన ఆటంకముగా నిలువపెట్టక స్వతస్సిద్ధముగా నందఱు అధి కారులే కనుక తాత్కాలిక అనర్హత యున్న యెడల దానిని తొలగించుటకు గురువులు ఆప్తులు ప్రభువులు మరింత కృషి చేయవలెను. అలసత తమోగుణము దానికి తావులేకుండ కృషిసలుపవలెను.

(2) అధ=పిమ్మట వెంటనేయని అర్థము. జ్ఞానము లభించ గానే సత్యము గోచరమగును. రెంటికినిమధ్య కాలవ్యవధిలేదు.

(3) సత్యమస్తి = సత్యముకలదు. అచ్చటనే యున్నది. ఇదివరకు గోచరముకానిది ఇప్పుడు ప్రచణ్డతేజస్సుతో ప్రత్యక్ష మగును. (సత్యమనగా పరమాత్మ; * ముణ్డకములో "సత్యస్య పరమంనిధానం" సత్యనిలయము = పరమాత్మయే. సత్య మనగా (శ్రీ) శంకరులవారు అవినాశిత సార్థకత, సద్భావ పర మార్థత, అని అన్వయించిరి. సత్యమనగా సత్, చిత్, ఆనం

* ముణ్డకము 1 ఖండము మంత్రము 6

దము. అని చెప్పు సత్తుయొక్క-భావము అనగా శాశ్వత పదార్థమే.

♦ (4) మహతీవినష్టిః= తెలిసికొనని యెడల ఫలితమత్యన్తమైన వినాశము అని ఈ మన్త్రము స్పష్టము చేయుచున్నది. దీనినిబట్టి మహాత్ములు పునర్జన్మను నమ్మలేదని చెప్పవీలుకాదు. యూదులు, మహమ్మదీయులు, క్రైస్తవులువలెనే ఈ జన్మయొక్క-టే కలదనియు దానిలోజరిగిన కృత్యాకృత్యములకు స్వర్గనరకములు కలుగుననియు మరల మానవజన్మ లేదనియు చెప్పెడిసిద్ధాన్తమునకు ఇచ్చట తావులేదు. "మహతీవినష్టిః" అనినందువలన జ్ఞానసంపాదనావకాశము పోగొట్టుకొన్నవాడు. అనేక జన్మ జరామరణ పరంపరలు పొందవలసి వచ్చుననియు నది దుఃఖతరమనియు ఒక భావము.

(2) ఇప్పుడు దొరకిన గురువులు ఇప్పుడుదొరకిన విద్యావకాశము మరియొకపర్యాయము దొరకకపోవచ్చునని ఒక భావము. 3 సజ్జీవితము, అసజ్జీవితము రెండు లభించనున్నపుడు మొదటిదానిని వదలుకొని రెండవదానిని వరించుట దుస్స్వభావమును పెంచుటయగును. అవకాశము రానట్టివాడు అజ్ఞానదశలో నున్నను క్షమించవచ్చును. అవకాశము కలిగినను

---

బృ. ౩-౮-౧౦ యోవా ఏ తదక్షరమవిదిత్వా అస్మాల్లోకాత్ప్రైత్యస కృపణః అథయ ఏ తదక్షరం విదిత్వా అస్మాల్లోకాత్ప్రైత్యసబ్రాహ్మణః

బృ- ౪-౪-౧౪ ఇహైవసంతోఽథ విద్మః తద్వయం నచేదవేదిః మహతీవినష్టిః యే తద్విదురమృతాస్తే భవన్తి అథేతరే దుఃఖమేవాపియన్తి. ఈ జన్మలో బ్రహ్మను తెలియనిచో నధిక నష్టము దుఃఖమే. కలుగును

పోనాడి అజ్ఞానమును అసజ్జీవితమును వరించినవాడు మరింత శిక్షార్హుడగును, ఇదియొక నష్టకారణము. "అజ్ఞ్యవచ్చుదాక అమవస ఆగదు" అను సామెతలోని యంతరార్థమిదియె. ♦ ముణ్డకములో "తమేవైకం జానథాత్మా న మన్యావాచో విముంచథ" (ఇతర వ్యవహారములను వదలి ఆత్మనొక్కదానినే తెలిసికొనమని చెప్పెను.) ♦ బృహదారణ్యకములో "వాచో విగ్లాపనంహితత్" అది వట్టి కంఠశోష అని చెప్పెను. ఇతర విషయములను కట్టిపెట్టి యాత్మవిచారణే చేయవలెను. అట్లే "జీసస్" తన శిష్యులగు పల్లెవారితో మీచేపలవలలనువదలిపెట్టి నావెంటరండు అనిపిలచి వెంటగైకొనిపోయెను. కానఆధ్యాత్మిక జీవితము వెంటనే ఆరంభించకపోయినయెడల నష్టమగును. ఆంగ్లమహాకవి షేక్స్పియర్ చెప్పినట్లు ( There is a tride in the fortunes of men which taken at its Highest Will lead to swceess.)

మానవ జీవితములో నొక్కొక్క తరుణము లేక ఋతువు సంభవించును. దానిని ఉపయోగించుకొనవలెను. తరుణము తప్పిన యెడల తక్కిందు గుగును, అన్నట్లు జ్ఞాన సంపాదన కవకాశము దొరకినపుడు జారవిడువరాదు. అధికారులుకార్యకారణముచే గొందఱిని ఆత్మాన్వేషణకనర్హులనుగా చేసినయెడల ఈ మహాత్మి వినష్టి వారికి తప్పదు. ఈ అధికారమునుగూర్చి నిర్ణయించువాడు జ్ఞానియైన గురువే కావలెను. ఇతరులు కులము గాని సంఘముగాని, అట్టిపని చేయజాలరు. అధికారుల్లలోగూడ

♦ ముణ్డకము 2 ఖండము 2 మంత్రము 5 బృహదారణ్యకము.

నాలుగు రకములుకలవు. ఉత్తమాధికారులు, మధ్యమాధికారులు, అధమాధికారులు, అనధికారులు, అని 4 రకములు. (1) ఉత్తమాధికారులలో నచికేతస్సుచేరును. కుమారదశలోనున్నను అతనికిశ్రద్ధయేర్పడెను. తన్నుదక్షిణగానిమ్మని తండ్రిని ప్రార్థించి యముని చేరెను. అచ్చట భీతినొందక మూడురోజులుపవసించి యమునివలన మూడువరములుపొంది యతని మెప్పువడసి మరియొక వరముపొంది యాత్మతత్వ రహస్యమును ఆయనవలన లభ్యమొనర్చుకొనెను. ఈ కథ కఠోపనిషత్తులో కలదు. (2) మధ్యమాధికారులు ప్రశ్నోపనిషత్తులో పిప్పలాదమహర్షి యొద్దకు చేరిన 6 గురు ఋషులకు ఆయన ఒక సంవత్సరకాలము ఆశ్రమ వాసము విధించెను. (3) అధమాధికారులు ఇంద్రుడు విరోచనుడు ప్రజాపతియొద్దకుబోయి 36 సంవత్సరములు నివసించిన పిమ్మట మొదటి ప్రశ్నకు జవాబుపొందిరి. 101 సంవత్సరము నిండిన పిమ్మట ఇంద్రునకు సంపూర్ణోపదేశము లభించెను, వీరి కథ ఛాందోగ్యకౌషీతకీ ఉపనిషత్తులలో కలదు. (4) అనధికారులు:— అనధికారుల కథ ఛాందోగ్యములో కలదు. ఒక మహర్షి యొక్క ఆశ్రమమున నొకడు 12 సంవత్సరములు అన్ని పనులు చేయుచునుండెను, ఆమహర్షి యనేకమందికి నుపదేశముచేసి పంపుచుండినను మహర్షి యితనిపై కనికరించలేదు, అప్పుడు ఋషిపత్ని వీనిపై జాలిగొని మహర్షితో వీని సంగతి ప్రసంగించెను. అప్పుడామహర్షి తనయొద్దనున్న వానిలో బక్కచిక్కిన 400 ఆవుల నతనికి స్వాధీనపర్చి యివి బలసి కట్టి 1000 జీవులుగల మంద అగునంతవరకు పెంచి పోషించి పెంచి తెచ్చిన

యెడల నీకట్టే యుపదేశింతునని ఋషి తెలిపెను. అందుకువాడంగీకరించి కొన్ని సంవత్సరములపాటు ఆ గోసేవ చేసెను. అవి 1000 అయినసంగతికూడ కనిపెట్టలేక పోయెను. ఆ పశువులలో నొక్కటి వానిపై జాలిగొని మామంద 1000 అయినది నీవు ఋషియొద్దకు తోలుకొనిపొమ్ము నీకు జ్ఞానము కలుగునని తెలిపెను. మధ్య మధ్య మజిలీలతో నతడు ఋష్యాశ్రమముచేరెను. ప్రతి మజిలీలోను నొక్కొక్క పశువతనికి వొక్కొక్క యంశము బోధించుచుండెను. పిమ్మట ఋషి యతనిని పరీక్షించి పూర్ణ ప్రబోధ ప్రసాదించెను. ఈ ఉపనిషత్తులోని కథనుబట్టి యూహించతగిన సంగతులేవన అనధికారులకు గూడ పూర్తి నిషేధము లేదు. గురుకులవాసము పెంచి వారిని సంస్కరించి చివరకు వారికి ప్రబోధించి వారిని మహర్షులు తరింప జేసిరి. మానవ తరుణోపాయము మహాత్ములకెంతో ప్రియతమము. నోటి వెంట మాటరాని మూగవారికి పెరుగు అన్నమును పళ్లెములో పోసి దానిలో నుపదేశమంత్రమును వ్రాసి దానిని మూగవారిచే నారగింపు చేయుచుండిరి. తన్మూలమున మూగవారుకూడ తరించుచుండిరని ధర్మశాస్త్రములలో ప్రతీతికలదు. పై దెల్పిన మహాత్ముల ధర్మమార్గము ఇప్పటికిని అనుసరణీయము.

*(5) భూతేషు భూతేషు=భూతమనగా సామాన్యముగా జీవియని అర్థము. చైతన్యముకలది భూతేషు భూతేషు అనగా

* ప్రశ్నోపనిషత్ 1 వ ప్రశ్న. 5 వ బ్రాహ్మణమునుబట్టి "ఏతత్సర్వం యన్మూర్తం చామూర్తం చ తస్మాన్మూర్తి రేవ రయిః" రూపముకలది లేనిదికూడ రయియే కాన రయిలో నెల్ల బ్రహ్మను చూపవలెను.

సమస్త భూతకోటియని యర్థము. కాని భూతమనగా నింకొక యర్థముకూడ కలదు. భూ అను ధాతువునకు అగుట యని యర్థము. ఎచ్చట ఏ నామరూపములుగల ఏ వస్తువు ఏ జీవి కలదో అవిరెండు పరమాత్మ విభూతులే కాన సమస్తవస్తు జీవజాలము అని అర్థము చెప్పవలెను. జడమనుకొను పదార్థములలో గూడ బ్రహ్మకలడని గ్రహించవలెను. అచ్చటనుండు బ్రహ్మనుకూడ చూడవలెను.

*(6) విచిత్య=సర్వవస్తు భూతములయందుండు బ్రహ్మను ఆయా నామరూపములనుండి వేరుచేసి దర్శించవలెను. దీనికి విచిన్త్యయని రూపాంతరము కలదని తెలుపుచున్నారు. అట్టి రూపాన్తరమును శ్రీ శంకరులవారు ఉదహరించలేదు. ఇట్లు సర్వవస్తు జీవజాలములో బ్రహ్మనుజూచిన బ్రహ్మజ్ఞాని బ్రహ్మయే యగుచున్నాడు. * ముణ్డకములో "స యోహవై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవభవతి" పరబ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మయే యగుచున్నాడు.

(7) ధీరాః = ధీరులు 1 ఖండము 2 వ మంత్రము చూడ నగును.

(8) 4 వ పాదము దీనినిగూర్చి 1 ఖండం 2 వ మన్త్రము చూడవలెను.

తాత్పర్యము:— ఇచ్చట ఈ లోకములోనే ఈ జన్మలోనే

* పురుషసూక్తం. సర్వాణి రూపాణి విచిత్యధీరః

* ముణ్డక ం 3. ఖండం 2 మన్త్రము. 9

యిప్పుడే బ్రహ్మను తెలిసికొన్న యెడల వారికి సత్యము లభ్యమగును. దివ్యజీవిత మలవడును. అట్లు బ్రహ్మను తెలిసికొనని యెడల మహత్తరమైన విపత్తు సంభవించును. లోకమందలి సర్వజడ జీవజాలమందు నిలిచియున్న బ్రహ్మను ఆ నామరూపముల నుండి వేరుపరచి సర్వత్రా బ్రహ్మగానె గోచరింప జేసికొని అనుభవైకజ్ఞానము కలవారు ఈ ఇంద్రియ జీవితమందలి సుఖదుఃఖాదులందు మగ్నముగాక అమృతులగుచున్నారు. ఇచ్చటి ఈ శరీరములు బాసినపిమ్మట అమృతులగుచున్నారనియు చెప్పవచ్చును. కాని మొదటి భావనయే సమంజసము. మానవ తరణోపాయము లభింపజేయుటకు ఉపనిషత్కారుడు అత్యధికమైన ఆతురత కనపరచుచున్నారు. ఏమాత్రము ఆలస్యము నకు సహించక వెంటనే సాధనకు బూనుకొని సత్యరసిద్ధికి కృషి జేసి యనల్పకాలములో తరించుట సర్వులకు విధిఅయియున్నది.

—: తృతీయ ఖండము :—

౧ మంత్రము. శ్రుతిః ॥

హరిః ఓమ్— బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే తస్య హ
బ్రహ్మణో విజయే దేవా అమహీయన్త,
త ఐక్షన్తాస్మాకమేవాయం విజయో
అస్మాకమేవాయం మహిమేతి ॥

హ = ఇట్టికథ కలదు. బ్రహ్మ = బ్రహ్మ దేవేభ్యః = దేవతల కొఱకు విజిగ్యే = విజయము సంపాదించెను; తస్య = ఆ బ్రహ్మణః = బ్రహ్మయొక్క విజయె = విజయమునందు; దేవాః =

దేవతలు; హ = నిశ్చయముగా; అమహీయన్త = మహిమను = మహిమనుపొందిరి. తే = వారు; అయం = ఈ; విజయః = విజయము, అస్మాకం = మాది, ఏవ = మాత్రమే అయం = ఈ; మహిమా = మహిమ ఇతి = అని ఐక్షన్త = తలంచిరి.

విశేషార్థము:— (1) హ = ఇతిహాస సూచకము పూర్వకాల దేవతలకును, అసురులకును యుద్ధము జరిగెను. దేవతలనగా లోకమర్యాద నిలుపువారు. అసురులనగా లోకమర్యాదనాశము చేయువారు. వారిద్దఱిలో బ్రహ్మ యిచ్ఛానుసారము దేవతలకు విజయము సంభవించెను, ఆ విజయమువలన కలిగిన ఫలమును దేవతలకె యిచ్చెను. ఇచ్చట దేవతలు అన్న పదమునకు ఇన్ద్రియములు అని అర్థము చేయవచ్చును. అసురులనగా నీయింద్రియముల ద్వారా లభించు భోగములయందు రమించి యంతకంటె పరమార్థము లేదనువారు. అట్లుగాక దైవసంపదగలవారు, అనగా ఈఇన్ద్రియములను నిగ్రహించి తద్ద్వారా గలుగు విషయసుఖములయందు మగ్నముగాక ఇంతకంటెను త్తమజీవిత మార్గము కలదని యెంచువారు. ఇన్ద్రియములలో "ఇన్ద్రియములకును" ఇన్ద్రియములకును జీవునకును తగువు వచ్చినట్లు ప్రశ్నోపనిషత్ ద్వితీయ ప్రశ్నలో కలదు. అట్లే బృహదారణ్యకములోను కలదు. ఇచ్చటనిచ్చిన కథలో అగ్నివాయ్వాదులు ఇతరేన్ద్రియములనియు ఇన్ద్రుడు జీవుడనియు చెప్పవచ్చును. ఇన్ద్రియాదులు బ్రహ్మను తెలియజాలరైరి, జీవుడు జ్ఞానోత్పత్తిచే తెలిసికొనెను.

(2) బ్రహ్మ = మొదటి రెండు ఖండములలో తెలిపినట్లే

నిరాకార నిర్గుణ పరమాత్మయె కావచ్చును, లేదా సగుణ స్వరూపియె కావచ్చును. సగుణస్వరూపి యనియే శ్రీ శంకరుల వారి భావము లోకపాలన కార్యక్రమమంతయు నాయనవశ మందే యున్నది. గాన ఆయనయే యిచ్చట కథను నడిపించెనని యెంచవచ్చును.

( 3 ) అమహీయన్త = మహిమను పొందిరి, గౌరవమును బొందిరి. సంతోషమును సంపదనుపొంది ఉన్నతస్థితికి వచ్చిరని కూడ అర్థము కలదు. ఇట్టిస్థితి కలిగినప్పుడు మొట్టమొదట విజయప్రాప్తి కారణమైన వానియందు కృతజ్ఞత యుండును. పిమ్మట ఉత్సాహమును పిమ్మట గర్వమును అభిమానమును, కలుగుచుండును. ఆ విజయప్రాప్తి కారణము ఎవరో తెలియనపుడు ఉత్సాహాతిశయములు గర్వము అధికముగా కలుగును.

( 4 ) అస్మాకమేవ = మనదే విజయము, గెలుపు తమదే అను భావము దేవతలకేర్పడెను. అనగా తమ జయమునకు బ్రహ్మకారణమను సమాచారము వారికి గోచరము కాలేదు. అందుచేత వారు బ్రహ్మయందు కృతజ్ఞతను చూపజాలక పోయిరి. తమ శక్తివలననే లభించలేదని గ్రహించి నమ్రతపొంద వలసి యుండెను. కాని యందుకుభిన్నముగా గర్వమునుపొందిరి. తమకు గలిగిన మహిమ అంతయు స్వార్జితమేయని సంతసించిరి, దేవతలకుగూడ బ్రహ్మయొక్క యునికిగాని, స్వరూపముగాని. తెలియదని యర్థము. దేవతలు అనునపుడు ఇన్ద్రియము లేయని యర్థము చేసినయెడల ఇన్ద్రియములకు గర్వము కలుగుట సహజము, అవి బ్రహ్మను తెలియజాలవు. లోకపరిచయమంతయు

తమ ద్వారానే జీవునకు కలుగుచున్నదనియు తాము లేకున్న జీవునకు లోకపరిచయమేర్పడదనియు నవి గర్వించవచ్చును. "ప్రమాదో ధీమతామపి" ధీమన్తులకుగూడ ప్రమాదముకలుగును అనునట్లు దేవతలకు విజయకారణమున బ్రహ్మ మరుపు తగిలెను. బ్రహ్మ ప్రసాదితమైన విజయము స్వార్జితమని పొరపడిరి. స్వశక్తియందు విశ్వాసమధికమయ్యెను. తత్ఫలితముగా నభిమానగర్వములు పెరిగెను. ఏవ అనుపదము వీరి మనోవికారమును సూచించుచున్నది.

తాత్పర్యము:— పూర్వమొక కథకలదు. దేవాసురులకు యుద్ధము సంభవించెను. లోకకళ్యాణమునిమిత్తము కృషిచేయు దేవతలకు తద్భంగకరులగు నసురులపై బ్రహ్మ విజయమును సమకూర్చెను. బ్రహ్మ ఇప్పించిన నావిజయముచే దేవతలకు సిరిసంపదలు, గౌరవమర్యాదలు, మహిమ పెరిగెను. ఈ విజయకారణమును దేవతలు గ్రహించక ఈ విజయమును తత్ఫలితమగు మహిమయును తమదేయని దేవతలు తలంచి తన్మూలమున అభిమానపూరితులయిరి.

౨వ మన్త్రము- శ్రుతిః ॥ తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యోహ

ప్రాదుర్బభూవ తన్నవ్యజానత కిమిదం యక్షమితి ॥

హ = అప్పుడు; ఏషాం = వారియొక్క; తత్ = ఆగర్వమును, (బ్రహ్మ) విజజ్ఞౌ = గ్రహించెను; తేభ్యః = వారికి; సః = అతడు, ప్రాదుర్బభూవ = ప్రత్యక్షమయ్యెను; తత్ = ఆ; ఇదం = ఈ యక్షంపూజనీయుడు కిం = ఎవరు, ఇతి = అని నవ్యజానత = తెలిసికొనలేకపోయిరి.

విశేషార్థము:— (1) విజజ్ఞౌ = బ్రహ్మ జీవుల హృదయాన్తరాళములోనుండువాడు. సర్వజ్ఞుడు, సర్వశక్తిమన్తుడు, సర్వకర్మఫలప్రదాత అయినవాడు, కాన నీ దేవతల హృదయకుహరములలో పొడమిన దురభిమానమును గమనించెను, గమనించిన పిమ్మట వీరినికూడ చసురు వలెనే నిరసించవలసియుండెను. కాని వారి పూర్వచరిత్రను గమనించి వారియెడ దయబూని వారి దురభిమానమును పోగొట్ట సిద్ధమయ్యెను.

(2) ప్రాదుర్బభూవ = వారియెదుట కనబడెను. తన స్వశక్తిచేత తానొక నామరూపమునుధరించి వారికాశ్చర్యము కలుగునట్లు ప్రత్యక్షమయ్యెను. ఇన్ద్రియగోచరముకాని పరమాత్మ ఇంద్రియగోచరమగు రూపమును దాల్చెను.

(3) యక్షం = యక్షమనగా పూజనీయమైనది. దేవయోనులలో యక్షరాక్షసులను జాతిలోనిదికాదు. వారియెదుట కనపడిన రూపము వారి ఇన్ద్రియములను హృదయమును ఆకర్షించెను. అనివార్యముగా నారాధ్యమయ్యెను. దానియందు పూజ్యభావముంచక తప్పనయ్యెను.

(4) నవ్యజానత = దానినామరూపములను తెలియజాలరైరి. దాని యుత్పత్తికి కారణమును వారికి తెలియదు. ఎటనుండి వచ్చెనో వారికి తెలియదు. అందుచేత నాశ్చర్యచకితులయిరి.

తాత్పర్యము:— అప్పుడు వారి హృదయములలోనున్న దురభిమానము నన్తర్యామియగు పరమాత్మ గ్రహించెను. వారినుద్ధరించుటకై యూయన అకస్మాత్తుగా నచ్చట ప్రత్యక్ష

మయ్యెను. ఆ రూపమెవరిదో యెందుకు యెటనుండివచ్చెనో వారికి తెలియలేదు. కాని దానిని జూడగా వారికాశ్చర్యము కలిగెను. అప్రయత్నముగా దానియందు పూజ్యభావమును కలిగెను. వారికి కలిగిన దురభిమానముచే నదృశ్యరూపమున నంతర్యామిగానున్న వానిని గ్రహించలేకపోవుటయేగాక యక్ష రూపమున దృశ్యమయిన వానినికూడ గ్రహించజాలక పోయిరి.

3 వ మన్త్రము- శ్రుతిః ॥ తేఽగ్ని మబ్రువన్ జాతవేద
ఏతద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి,

తె = ఆ; దేవతలు, అగ్నిం = అగ్నినిగూర్చి; ఇతి = ఇట్లని అబ్రువన్ = చెప్పిరి. జాతవేద = ఓ; అగ్నీ, ఏతత్ = ఈ; యక్షం = యక్షుడు; కిం = ఎవరు; ఇతి = అని; విజానీహి = తెలిసికొనుమా; తథా = సరె లేక అట్లే; ఇతి = అని అగ్ని చెప్పెను.

విశేషార్థము:— (1) తె = వారు; అనగా నాదేవత లందఱు అచ్చట సభచేసియుండిరి. ఆ సభలోనున్న వారందఱు యక్షునిగూర్చి తెలిసికొనదలచిరి. వారొకసుగుణమును కన బరిచిరి. యక్షుని నిర్లక్ష్యముచేసి యూరుకొనక దానినిగూర్చి తెలిసికొన యత్నించిరి. లోకములో ననేకవింతలు విడ్డూర ములు జరుగుచుండును. సామాన్యజనులు వాటినుపేక్షింతురు. అవి సామాన్యములే యనుకొందురు. కవులట్లుగాక అందులో నున్నవిశేషము నూహించి ప్రకటింతురు. శాస్త్రజ్ఞులావిశేషము లను పరిశీలించి తద్విధానమును ప్రకటింతురు. కవులు శాస్త్ర జ్ఞులును చేసిన ప్రకటనలను సామాన్యజనులు చూచి విస్మయ

మునొందెదరు. దేవతలలో యక్షుని దెలియు కోరిక కలుగుట శుభసూచకము.

(2) అగ్ని = అనగా కదలువాడు; ముందుకు నడిపించువాడు పంచభూతములలో మూడవవాడు వేడి వెలుతురు కలవాడు. స్పర్శదృష్టి కలిగించువాడు * ఐతరేయము "అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్" అగ్ని వాక్కు అయిముఖములో ప్రవేశించెను, అని తెలుపుచున్నది. అనగా అగ్ని మాట్లాడ కలవాడు. వాగింద్రియమున కధిష్ఠాన దేవత అట్టివానిని దేవతలు యక్షుని కనుగొనుటకు దూతగా పంపిరి.

| ఇంద్రియములు. | అధిష్ఠాన దేవత. | వాటి కర్తవ్యము. |
|---|---|---|
| 1 ముఖము | అగ్ని | వాక్కు |
| 2 నాసిక | వాయువు | ఉచ్ఛ్వాస నిశ్వాస |
| 3 చక్షుః | ఆదిత్యుడు | దృష్టి (ములు |
| 4 శ్రోత్రం | దిక్కులు | వినికిడి |
| 5 త్వక్కు | ఓషధి వనస్పతులు | కేశలోమములు |
| 6 హృదయము | చంద్రుడు | మననశక్తి |
| 7 నాభి | మృత్యువు | అపానము |
| 8 శిశ్నము | ఆపః | జననక్రియలేక పుట్టించుట. |

(3) జాతవేద = జాతవేదుడనగా, అగ్ని పుట్టుకనుండి

* ఐతరేయము 1 అధ్యాయము 2 ఖండము 4 వ మంత్రము. వాక్కు 1 వది ౮ వ ఇన్ద్రియము ౧ వ ముణ్డః ములో చెప్పిన ౧౪ లో మనస్సుగాక తక్కినవి. అగ్ని అన పదముచే నిరూపితము.

జ్ఞానముకలవాడు, బుద్ధిమన్తుడని యు చెప్పవచ్చును. అని వ్యుత్ప త్త్యర్థము. అందుచే యక్షుని తెలిసికొనుటకు అర్హతకలవాడని చెప్పవచ్చును. కాని యతనికున్న జ్ఞానము ఆత్మజ్ఞానముకాదని తోచును. జాతవేదస్సనగా ఇంకొకయర్థము చెప్పవచ్చును. అతడు పుట్టుచుండగా నితరులకు దృష్టిసాఫల్య మేర్పడును. అతడు సర్వదా పరోపకారి. దుర్మార్గులచేత జిక్కినప్పుడు అప కారము చేయ వినియోగింతురు. ఋగ్వేదములో నగ్నియె పర మాత్మయని చెప్పబడెను. అట్టి భావన ఇక్కడ చేయబడలేదని స్పష్టము.

(4) తథేతి = అట్లే అనెను. దేవతాసభచే నియోగించ బడినందున వారు తనపై పెట్టిన కర్తవ్యమును నిర్వహింతునని చెప్పెను. కర్తవ్యముయొక్క సాధ్యాసాధ్యతలు విచారించ కనే యట్లు చెప్పియుండును. ఉత్సాహావేశములలోనున్నవాడు కనుక యుద్ధములో జయము సమకూరినట్లే ఈ పరిశోధనలో కూడ జయము కలుగునని ఎంచియుండును. తనవాక్కు వృథా యగునని అతడు ఎంచలేదు.

తాత్పర్యము:— దేవతలందఱును సభలో సమావేశమై నాయకుడుగానుండ తగినట్టియు, జ్ఞానము కలిగినట్టియు అగ్నిని పిలచి ఈ యక్షుని సమాచారము విచారించి రమ్మనమని నియో గించిరి. అగ్నియు నాకార్యములోని సాధ్యాసాధ్యతలను విచా రించక యట్లే చేతునని తెలిపెను.

౮ వ మంత్రము శు్రతిః ౹

తదభ్యద్రవత్తమభ్యవదత్ కోసీత్యగ్నిర్వా
అహమస్మీత్యబ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి ॥

(అగ్ని) తత్ = ఆ యక్షునియొద్దకు; అభ్యద్రవత్ = పరుగెత్తెను. తం = ఆ; అగ్నిని, యక్షం = యక్షుడు; కః = ఎవడు; అసి = అయితివి, ఇతి=అని అభ్యవదత్ = అడిగెను. అహం = నేను; వై = నిక్కముగా, అగ్నిః = అగ్ని అస్మి= అయియున్నాడు; అహం = నేను జాతవేదాః=జాతవేదుడను; అస్మి = అయియున్నాను; ఇతి = ఇట్లని, అబ్రవీత్ = చెప్పెను.

విశేషార్థము:— (1) అభ్యద్రవత్ = త్వరగా వెళ్లెను లేక పరుగెత్తెను. ఇట్లు పరుగెత్తెననగా నీకార్యము సులభసాధ్యమని యతనికి తోచెను. స్వశక్తియందు విశ్వాసమధికముగానుండెను. యక్షుని సమీపమునకు బోయి మాట్లాడతలపెట్టియుండగా యక్షుడే పలకరించెను. అభి+అద్రవత్ యక్షుని వైపునకు పరుగెత్తెను.

(2) అగ్నిజాతవేద = ౩ వ మంత్రములోనున్న విశేషార్థము చూడవలెను. తన రెండుపేర్లు ఉన్నవని చెప్పుటచే నాత్మప్రశంసచేసికొనినవాడయ్యెను. ఆత్మస్తుతి, పరనిన్ద, ఆర్యధర్మములు కావు. అయినను పరిచయము నిమిత్తము తనపేర్లుచెప్పకొనెనని యూహించవచ్చును. తన కులగోత్రములను చెప్పి నమస్కరించుట ఆర్యులమర్యాద, ఎవరివద్దకు పోవుదమో వారితో తానిట్లు చెప్పవలెను. అగ్ని యక్షునికి నమస్కరించక

పోవుటచేత నీ యాచారమును అనుసరించ లేదని తలంచవలెను.

తాత్పర్యము:— అప్పుడగ్ని ఉత్సాహావేశములతో యక్షుని వైపు పరుగెత్తెను, సమీపించు నాయగ్నినిజూచి నీవెవ్వరవని యక్షుడడిగెను. నేను అగ్నిని నేను నిక్కముగా జాతవేదుడను. అని అగ్ని యక్షునకు జవాబుచెప్పెను. తన పేర్లు రెండు పర్యాయములు చెప్పుటలో తన శక్తి సామర్థ్యములను తన ప్రఖ్యాతిని గూడ అగ్ని తెలియజేసెను.

౫ 5 వ మన్త్రము శ్రుతిః ౹

తస్మిం స్త్వయి కిం వీర్యమిత్యపీదం సర్వం,
దహేయం యదిదం పృథివ్యామితి ౹౹

తస్మిన్ త్వయి = (త్వయి) అట్టి నీయందు; కిం = ఏమి, వీర్యం = బలము ( కలదు ) ఇతి = ఇట్లని ( యక్షుడడిగెను ) ఇదం = ఈ; పృథివ్యాం = పృథివియందు యత్ = ఏది (కలదో) ఇదంసర్వం = ఈ సమస్తమును, అపి = కూడ దహేయం = కాల్చగలను ఇతి = ఇట్లని ( అగ్ని తెల్పెను )

విశేషార్థము:— 1. వీర్యం=2 వ ఖండం 4 వ మంత్రముచూడ నగును. నీకుండు ప్రత్యేకశక్తి ఏదని యక్షుడు ప్రశ్నించెను.

( 2 ) తస్మిన్ త్వయి = అట్టి నీయందు అనగా నీవు అగ్నిని జాతవేదుడను అని రెండు సార్థకనామములు కలిగినట్లు చెప్పియున్నావు. అందుచే ప్రఖ్యాతవన్తుడవు, ఎట్టిది లభించెనో తెలియగోరెద.

( 3 ) పృథివ్యాం = పృథివీసంబన్ధమైనది. భూమిలోనున్నది భూమిమీాద పుట్టినది పెరిగినది. భూమికూడ దహించగలడని

యర్థము. భూమిమీద నున్నది భూసంబన్ధమైనదేగాక అంతరిక్షముమీద నున్నదికూడ ఆకాశములలోనున్నదికూడ దహించగలడు అనగా లోకములోనిదంతయును దహించగలడు.

(4) సర్వం అపి = సమస్తముకూడ ఒక్కరేణ అయిన తప్పకుండ కాల్చగలడు అగ్ని తన స్వశక్తిని సహజముగా తెలిపియుండెను. గర్వముకూడ కలదని ఊహించ వీలుకలదు.

తాత్పర్యము:— అట్టి ప్రసిద్ధపురుషులగు మీయందుండు ప్రత్యేక శక్తిసామర్థ్యము లేమియని యక్షుడగ్ని నడిగెను. ఈ లోకములోనుండు సమస్తము సకల స్థూలసూక్ష్మవస్తు జీవజాలమును కూడ నేను తగులపెట్టగలను, అని అగ్నిహోత్రుడు గర్వాహంకారసముపేతుడై ప్రత్యుత్తరమిచ్చెను.

ఽ 6 వ మంత్రము శ్రుతిః ౖ

తస్మై తృణం నిదధావేతద్దహేతి
తదుపప్రేయాయ సర్వజవేన తన్నశశాకదగ్ధుం
సతత ఏవనివవృతె నైతదశకం
విజ్ఞాతుం యదేతద్యక్షమితి ॥

ఏతత్ = దీనిని; దహ = కాల్చుము; ఇతి = అని(చెప్పుచు) తస్మై = అగ్నికిముందు; తృణం = గడ్డిపోచను; నిదధౌ = ఉంచెను, సర్వజవేన = తన పూర్ణవేగముతో; తత్ = దానిని (అగ్ని) ఉపప్రేయాయ = సమీపించెను; తత్ = దానిని; దగ్ధుం = కాల్చుటకు; నశశాక = శక్తి చాలకపోయెను (అశక్తుడయ్యెను) సః = అతడు (అగ్ని) తతః = అటనుండి; ఏవ = మాత్రమే; నివవృతె = మరలిపోయెను. యత్ = ఏది;

ఏతత్ = ఈ; యక్షం = యక్షుని ఏతత్ = దీనిని, విజ్ఞాతుం = తెలిసికొనుటకు నాశకం = సమర్థుడను కాకపోతిని. ఇతి = అని దేవతలతో అగ్ని చెప్పెను.

విశేషార్థము:— (1) తృణం = గడ్డిపోచ బహుశః = ఎండిన గడ్డిపరక కాల్చుటకు అతిసులభమైనది, విలువలేని వ్యర్థమైన వస్తువు. ఈ తృణమును తనలోనుండితీసి అచ్చటఉంచెను. యక్షుడు తన చుట్టుప్రక్కల వెతకిగాని, దూరమునుండి తెచ్చిగాని అక్కడపెట్టలేదు. ఈ తృణము ఎచ్చటనుండి వచ్చినదో అగ్ని గ్రహించియున్న యెడల అతనికి జ్ఞానోత్పత్తి అయియుండును. ఆ తృణము యక్షునిలోనుండి వచ్చినదిగనుక యక్షునిశక్తి అందులో నిమిడియున్నది. అట్లే భూలోకములో నున్న ప్రతి వస్తువులోను బ్రహ్మశక్తి యిమిడి యున్నది. దానిని గ్రహించక తృణీకరించుట అనగా తృణముగా జూచుటయే అజ్ఞానము, తృణీకరించుటయే అవమానపరచుటయే పాపము. అగ్ని ఈ తృణమును తృణీకరించి అనగా గడ్డిపోచగానె యెంచి అమర్యాదచెందెను. ఎన్నడును యెవరిని అవమానించరాదని గ్రహించవలెను. ఇది ఆధ్యాత్మిక జీవితమునకెట్లో రాజకీయ జీవితమునకును అట్లే ఆవశ్యకము.

(2) సర్వజవేన = అత్యంత వేగముతో అగ్నికెంత వేగము కలదో అంతవేగముతో ఆయన తన సర్వశక్తులను ఉపయోగించెనని భావము. ఏకార్యములుగాని పూనకపోయిన పోవచ్చుగాక! పూనినపుడు అశ్రద్ధగా చేయరాదు. సర్వశక్తులను వినియోగించవలెను, చిన్నపామునయినను పెద్దకర్రతో కొట్టమను

సావెతయొక్క అర్థమిదియే.

(3) నశశాక = శక్తివంతుడు కాకపోయెను. ముల్లోకము లలో నున్నదానిని కాల్చుసమర్థుడగు అగ్ని పరీక్షార్థము పెట్టిన ఈ పరకను కాల్చలేకపోయెను. అనగా బ్రహ్మసాయము చేసి నప్పుడును లేదా ఉపేక్ష వహించినప్పుడను స్వభావసిద్ధములగు పనులు ఆ స్వభావములో నిమిడియున్న శక్తి సామర్థ్యముల వల ననే పరిణతస్థితి నొందును. అట్లుగాక విశేష పరీక్షాసమయము ఏర్పడినప్పుడు సామాన్యశక్తులు నిర్వహించజాలవు.

(4) తతఏవ=అచ్చటనుండియేయని ఒక అర్థము, అంతటి నుండియేయని వేరొక అర్థము కలదు. అదే భావము. ఎట్లు ఎప్పుడు ఆపరకను కాల్చలేకపోయెనో తత్క్షణమే వేరుమాట లాడక వేరు పరిశోధనలుచేయక అగ్ని మరలిపోయెను. అవమా నితుడై తన అశక్తతను చింతిల్లుచు పోయెను. గర్వాహంకార ములు భగ్నములయ్యెను.

(5) విజ్ఞాతుం = తెలిసికొనుటకు న అశకం=నాకుశక్యము కాకపోయెను. అని దేవతలతో మనవిచేసెను. కప్పిపుచ్చక ఉన్న దున్నట్లు తెలిపెను. శక్తివన్తుడనని తాభ్రమపడి యితరులను భ్రమింపచేయుటకన్న అశక్తుడనని వెల్లడించుట అవమాన కరముకాదు. తనకంటెనధికుడుకాన నాయక్షుని తానుదెలియ జాలకపోతినని చెప్పెను.

తాత్పర్యము:— అట్లు తన శక్తిసామర్థ్యములను తెలిపిన అగ్ని ఎదుట యక్షుడు తనలోనుండి యొక గడ్డిపోచను లాగి దానిని కాల్చుమని అగ్ని ఎదుట పెట్టెను. అగ్ని అత్యంత వేగ

మున దానిని సమీపించి దానిపై తన సర్వశక్తులను ప్రయోగించెను కాని దానిని కాల్చుటకు సమర్థుడుకాకపోయెను. అటనుండి వెంటనే మరలి దేవతాసభకు పోయెను. అచ్చట తన అశక్తతను వెల్లడించెను ఆయక్షుడెవడో గ్రహించజాలకపోతినని సభకు నివేదించెను. యక్షుడు తనకంటె నధికుడని అంగీకరించెను. (3 వ మంత్రములో తాచెప్పినమాట నెగ్గలేదని చింతతో తల వంచెను.)

౭ 7 వ మంత్రము శ్రుతిః ॥

౭ అథవాయుమబ్రువన్ వాయవేతద్విజానీహి
కిమేతద్యక్షమితి తథేతి ॥

అథ = పిమ్మట; వాయుం = వాయువుతో; ఇతి = ఇట్లని, అబ్రువన్ = చెప్పిరి. వాయో! = ఓవాయువా, ఏదత్ = ఈ, యక్షం = యక్షుడు కిమ్ = ఎవరు? ఏతద్ = దీనిని విజానీహి = తెలిసికొనుము, తథా = అట్లే ఇతి = అని (వాయువుచెప్పెను)

* విశేషార్థము:— (1) వాయువు = గమనశక్తి కలవాడు. పంచభూతములలో రెండవవాడు స్పర్శశక్తి స్పర్శను కలిగించు

* తైత్తిరీయము 2 అ 3 వ పనస "ప్రాణందేవా అనుప్రాణన్తి మనుష్యాః పశవశ్చయే। ప్రాణోహిభూతానా మాయుః" వాయువు ప్రాణము, దేవతలకు మనుష్యులకు పశువులకు సర్వజీవకోటికి ఆధారమయినది. ఆయుర్దాయము ఇచ్చునదికాన యక్షునిలోనుండు ప్రాణశక్తిని కనిపెట్ట చాలునని ఊహ చేయవచ్చును. వాయువు అగ్నికంటె సూక్ష్మమైనవాడు వ్యాపించువాడు. కనుక (Exploner) ఎచ్చట ఏది యున్నను క్రొత్త విషయములనుకూడ కనిపెట్టగలవాడు వాయువు మనస్సుగా చెప్పవచ్చును. (Vitulforce) ప్రాణశక్తి.

వాడు నాసికకు అధిష్ఠాన దేవత, జీవులలో ప్రాణమై ఉచ్ఛ్వాస నిశ్వాసములను జరపువాడు. సర్వవ్యాపి దీనికి బట్టి యితను మిక్కిలి ముఖ్యమైనవాడని భావము. తక్కిన పదములకు 2-3 మంత్రముల విశేషార్థము చూడనగును

తాత్పర్యము:— ఇట్లు అగ్ని నిర్వహించ లేదని తెలిసినపిమ్మట ఆ దేవతాసమూహము వాయువును పిలిచి నీవు దీనిని తెలిసికొనుము. ఈ యక్షుడెవఁడో గ్రహించిరమ్మా అని నియోగించిరి. వాయువును పంపుటకు కారణము అతఁడు గమనశక్తి కలవాడు. సర్వవ్యాపి స్పర్శమాత్రముచేతనే గ్రహించగలవాడు. సర్వజీవకోటికి ప్రాణమైనవాడు కాన అతనివలన యక్షుని సమాచారము తెలియునని దేవతలు ఊహించిరి.

౮ వ మన్త్రము శ్రుతిః ॥

తదభ్యద్రవత్తమభ్యవద
త్కోఽసీతి వాయుర్వా అహమస్మీ
త్యబ్రవీన్మాతరిశ్వా
అహమస్మీతి ॥

( వాయువు ) తత్ = ఆయక్షునివైపు; అభ్యద్రవత్ = పరుగెత్తెను. తం = అతనిని; ( యక్షః = యక్షుడు ) కః = ఎవరు; అసి = అయియున్నావు. ఇతి = ఇట్లని, అభ్యవదత్ = అడిగెను; అహం = నేను; వై = నిక్కముగా వాయుః = వాయువు అస్మి = అయియున్నాను; మాతరిశ్వా = మాతరిశ్వుఁడను వై = నిక్కముగా; అహం = నేను; అస్మి = అయియున్నాను. ఇతి=ఇట్లని; ( వాయువు ) అబ్రవీత్ = తెలిపెను.

విశేషార్థము:— అంతరిక్షమందు చరించువాడు; అనగా భూమ్యాకాశములమధ్యనుండు సర్వప్రదేశమును సంచరించు వాడు.

తక్కిన పదములకు విశేషార్థము 4 వ మంత్రముయొక్క విశేషార్థము చూడనగును.

తాత్పర్యము:— అప్పుడు వాయువు ఆ యక్షునివైపు పరు గెత్తెను. వానినిచూచి మీరెవరని యక్షుడడిగెను. నేనునిక్క ముగా వాయువును నేను మాతరిశ్వుడను, నిశ్చయము అని వాయువు యక్షునకు ప్రత్యుత్తరమిచ్చెను. ఆ రెండు పదము లలో తన శక్తిసామర్థ్యములను వెల్లడించెను. తాను గమన వేగము కలవాడననియు ముల్లోకములలోను తిరుగువాడననియు నెచ్చటనున్న క్రొత్త వస్తువులైనను కదలమనగ కదల్చగల వాడను పరిశోధింపగలవాడనని యు తెల్పెను.

౯ (9) వ మన్త్రము:— శ్రుతిః ॥

తస్మిం స్త్వయి కింవీర్య మిత్యపీదగ్ం సర్వం
ఆదదీయం యదిదం పృధివ్యామితి ॥

తస్మిన్ = అటువంటి; త్వయి = నీయందు; కిం = ఏది; వీర్యం = సామర్థ్యము; ఇతి = ఇట్లని ( యక్షుడడిగెను ) ఇదం = ఈ; పృథివ్యాం = భూమియందుండు యత్ = ఏదికలదో, ఇదం = ఈ; సర్వం = సర్వమును ( సమస్తమును ) అపి = కూడ; ఆదదీయం = ఎత్తగలను. ఇతి = ఇట్లని (వాయువు జవాబుచెప్పెను)

విశేషార్థము:— ఆదదీయం = లేవనెత్తుట చేతితో గ్రహిం చుట లోకములోనుండు సర్వవస్తువులను కదల్చి పెల్లగించి

లేవనెత్తి పారవేయుగలడు, చెట్లుకొండలు అన్నియు వాయువుచే చలించును. అత్యన్త బలవన్తుడని యర్థము. తక్కిన పదములకు విశేషార్థము 5 వ మంత్రముయొక్క విశేషార్థము చూడనగును.

తాత్పర్యము:— అట్టి ప్రసిద్ధ పురుషులగు మీయందుండు ప్రత్యేకశక్తిసామర్థ్యము లేమి? యని యక్షుడు వాయువు నడిగెను. ఈ లోకములోనుండు సమస్తమును సకల స్థూలసూక్ష్మ వస్తు జీవజాలమును కూడ నేను కదల్పగలను. ఎత్తగలను, పెల్లగించగలను, అని వాయువు గర్వాహంకారసముపేతుడై ప్రత్యుత్తరమిచ్చెను. పరిశోధించగలడను సూచనకలదు.

౧౦ 10 వ మన్త్రము- శ్రుతిః ॥

తస్మై తృణం నిదధావేతదాధత్స్వేతి
తదుపప్రేయాయ సర్వజవేన తన్నశశాకాదాతుం
సతత ఏవ నివవృతే నైతదశకం విజ్ఞాతుం
యదేతద్యక్షమితి ॥

ఏతత్=దీనిని ఆదత్స్వ=ఎత్తుము, ఎగురగొట్టుము. ఇతి=అని (చెప్పుచు) తస్మై=వాయువుకుముందు; తృణం=గడ్డిపోచను, నిదధౌ=ఉంచెను; సర్వజవేన=తన పూర్ణవేగముతో; తత్=దానిని (వాయువు) ఉపప్రేయాయ=సమీపించెను. తత్=దానిని; ఆదాతుం=లేవనెత్తుటకు; నశశాక=శక్తిచాలకపోయెను, సః=అతడు (వాయువు) తతః=అటనుండి, ఏవ=మాత్రమే; నివవృతే=మరలిపోయెను, యత్=ఏది ఏతత్=ఈ; యక్షం=యక్షుని, ఏతత్=దీనిని, విజ్ఞాతుం=తెలిసికొనుటకు

న అశకం=సమర్థుడను కాకపోతిని, ఇతి=అని ( దేవతలతో వాయువు చెప్పెను )

విశేషార్థము:— ఆదత్స్వ=లేవదీసి ఎగరగొట్టుము ఈ పదమునకు విశేషార్థము 9 వ మంత్రములోనున్న విశేషార్థము చూడవలెను. తక్కిన పదములకు విశేషార్థమునకు 6 వ మంత్రములో వ్రాసిన విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము:— అట్లు తన శక్తిసామర్థ్యములను తెలిపిన వాయువు ఎదుట యక్షుడు తనలోనుండియొక గడ్డిపోచను లాగి దీనినిఎత్తి ఎగురగొట్టుమని ఎదుట పెట్టెను. వాయువు అత్యంత వేగమున దానిని సమీపించి దానిపై తనసర్వశక్తులను ప్రయోగించెను, కాని దానిని కదల్చుటకు సమర్థుడు కాకపోయెను. అటనుండి వెంటనే మరలి దేవతాసభకుపోయెను. అచ్చట తన అశక్తతను వెల్లడించెను. ఆయక్షుడెవడో గ్రహించజాలక పోతినని సభకు నివేదించెను. అతడు 7 వ మంత్రములో తాజెప్పిన మాట నెగ్గలేదని చింతతో తలవంచెను. తనకంటె నధికుడనియు దెలిపెను.

౧౧ వ మన్త్రము:— శ్రుతిః ॥

అథేన్ద్రమబ్రువన్ మఘవన్ ఏతద్విజానీహి
కిమేతద్యక్షమితితథేతి తదభ్యద్రవత్తస్మాత్తిరోదధే॥

అథ=పిమ్మట, ఇన్ద్రం=ఇన్ద్రునితో, ఇతి=ఇట్లని, అబ్రువన్=చెప్పిరి. మఘవన్= ఓ ఇంద్రుడా! ఏతత్ = ఈ యక్షం= యక్షుడు, కిమ్=ఎవరు ఏతత్=దీనిని, విజానీహి= తెలిసికొనుము తథా= అట్లే, ఇతి= అని, ( ఇంద్రుడు చెప్పెను )

తత్ = ఆయక్షుని వైపుకు అభ్యద్రవత్ = (ఇన్ద్రుడు) పరుగెత్తెను. తస్మాత్ = వానినుండి తిరోదధే = (యక్షుడు) అదృశ్యుడయ్యెను.

విశేషార్థము:— (1) ఇన్ద్రం = ఇంద్రుడు దేవతలలో ముఖ్యుడు. ఇన్ద్రుడనగా:— ఐశ్వర్యముకలవాడు, ఇన్ద్రుడు బలముకలవాడు. ఈ ఇన్ద్రుడు పరమేశ్వరుడని శ్రీ శంకరుల వారు చెప్పుచున్నారు. పరమేశ్వరుడనగా సగుణబ్రహ్మమని యర్థము. అట్లు చెప్పుటకవసరము కనబడుటలేదు. సగుణబ్రహ్మమైనచో పరమాత్మను తెలిసికొనుటకు అశక్తుడు కాజాలడు అని అర్థము చెప్పిన భావ్యముగానుండును. ఇంద్రియములన్నియు బ్రహ్మను కనుగొనలేవని 1 వ ఖండములో చెప్పబడెను 2 వ ఖండములో ప్రతిబోధ మూలమున బ్రహ్మను కనుగొనవచ్చునని తెలుపబడెను. ఆ ప్రతిబోధ పొందువాడు జీవాత్మయే. ప్రతిబోధ పొందగానే జీవాత్మ పరమాత్మయగును. జీవాత్మ, సగుణబ్రహ్మ ఇద్దఱు ఒక్కరేయని చెప్పుటకు వీలుండదు. జీవాత్మకు ఉపాధి ఆవరణములవలన అజ్ఞానమావరించి యుండును, సగుణబ్రహ్మకట్టి ఆపద లేదని స్పష్టము.

(2) మఘవన్ = పూజనీయుడు ధనవన్తుడు. ఈ ఇన్ద్రుడు చాల ధనవన్తుడని * ఋగ్వేదములో దెలుపబడెను. ఈ ఇన్ద్రుడు

* ఋగ్వేదము 1 వ మండలము 82 వ సూక్తము 6 వ మంత్రము 869 వ ఋక్కు ఇంద్రుడు అతిధనవన్తుడనియు భక్తుడు అందులో తన వంతు అనుభవించుననియు చెప్పుచున్నాడు. 730–720–656 ఋక్కులను చూడనగును. 631 వ ఋక్కు ప్రత్యేకముగ గమనించవలెను.

మఘవత్ ఉదాహుడనికూడ ప్రతీతికలదు. వేదకాలములో ఇన్ద్రుడే పరమాత్మ, పిమ్మట ఇంద్రుని హోదా తగ్గిపోయెను. ఎప్పుడు తగ్గెనో పరిశోధకులు తెలుపవలసి యుండును.

(3) తిరోదధే=అన్తర్ధానమయ్యెను. దానికి కారణము శ్రీ శంకరులువారు ఇట్లు తెలుపుచున్నారు. దేవతలకంటె నింద్రు డధికుడు, కాన నతనికి అభిమానమును అధికము. ఆ యభి మానమును భగ్నము చేయుటకు బ్రహ్మ అతనితో సంభాషిం చుట కూడ నిరాకరించెను. ఇట్లని శ్రీ శంకరులవారు భావించిరి. ఇట్టి కారణములను భావములను ఉపనిషత్కారుడు తెలుపలేదు, కాని శ్రీ శంకరులవారూహించిరి. అట్టి యూహ సరికాదని రానున్న 12 వ మన్త్రము తెలుపుచున్నది. 4 వ ఖండము 3వ మంత్రముకూడ బ్రహ్మజ్ఞానము ఇంద్రునకే కలిగెననియునందుచే ఇంద్రుడు తక్కిన దేవతలందఱికంటె నధికుడనియు నుపనిషత్ తెలుపుచున్నది. ఇట్టి స్థితిలో నింద్రునకధిక నిరాదరణ కలిగిం చుట ఒప్పదు. ఇంద్రుడనగా:— జీవాత్మయని అర్థము చెప్పిన యెడల యక్షుడంతర్ధానమగుటకు తగిన కారణము కనబడును. జీవుడు దేవునియొద్దకు వచ్చుసరికి జీవుడు దేవుడు అని యిద్ద ఱుండరు. ఒక్కరే యుండవలెను. ఒక్కరేయుందురు ఆ ఒక్క రెవరని తనలోతాను ప్రశ్నించుకొనగా తానే దేవుడని తేలును. అదియే జ్ఞానము. 12 వ మంత్రములో యక్షుడు కనబడకపోయి నను యక్షుడున్నచోట జ్ఞానము ఉమాదేవియను పేర ప్రత్యక్ష

మయ్యెను. * ముణ్డకములో "యదా పశ్యత్యన్యమీశమస్య మహిమానమితి వీతశోకః" ఎప్పుడు లోకమందాసక్తికల జీవుడు రెండవవాడును ప్రభువును అగు బ్రహ్మను జూచుచున్నాడో అప్పుడు శోకరహితుడగును. 3వ మంత్రములో "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం। తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి" ఎప్పుడు ద్రష్ట పురుషుని జూచునో అప్పుడతనితో నుత్తమమైన యైక్యతను బొందును. అదియే సాయుజ్యము. కాన జీవాత్మ పరమాత్మయొద్దకు సమీపించగానే యచ్చోట ఒకరేయుందురు. ఇద్దఱుండరు. అది సూచించుటకే యక్షుడచ్చట అంతర్ధానమయ్యెనని యూహించవచ్చును.

(3) తస్మాత్ = అతనినుండి లేదా అటనుండి లేదా కాబట్టి అని చెప్పవచ్చును. ఇన్ద్రుడాతురతతో పరుగెత్తుకొని వచ్చుచున్నాడు. అగ్ని వాయువులు తెలిసికొనలేక తిరిగివచ్చుటచే నితనికి అనుమానము, ఆశ్చర్యము, పరిశోధన కుతూహలము కలిగి పరువెత్తెను. అతని పరీక్షించుటకు యక్షుడదృశ్యుడయ్యెను. అగ్ని వాయువులు తమ అశక్తత బుజువుకాగానె మరుమాటలేక తత్ క్షణమే నిస్పృహులై వెడలిపోయిరి. యక్షరూపమున నావిర్భవించుట దూరమునందుండి కనుచుండుట

* ముండకము 3 ఖండము 1 మంత్రము 2 గజేంద్రుని ఏనుగు శోకవశ మొదటిపద్యా విడచి రెండవపద్యాలో ప్రబోధము కలుగక ముందు నిరాశ అంధకారము కలుగవచ్చును.

దగ్గఱకు వచ్చినప్పటికి తిరోభావ మగుటజూచి ఇంద్రుడు భయ పడునా! చపలుడగునా? నన్నుజూచి యక్షుడు ఓడిపోయెనని గర్వించి వెనుకకు మరలునా? యని శోధించుటకు యక్షుడ న్తర్ధానమయ్యెను. ఇన్ద్రుడు వెనుకకు మరలక యక్కడనే నిలబడి ఆశ్చర్యము భక్తి యినుమడింప ఆలోచనమగ్నుడయ్యెను.

తాత్పర్యము:— అట్లు అగ్ని వాయువులిద్దఱు కార్యనిర్వహణమునందు అశక్తులై తిరిగి వచ్చినపిమ్మట దేవతాసమూహమునకు ఆతురత అధికమయ్యెను. ఇతరులెవ్వరిని పంపినను నిష్ప్రయోజనమని ఎంచి తమ ప్రభువగు ఇంద్రునే ప్రార్థించిరి. హే మఘవన్, ఇన్ద్రా! బలవన్తుడా! ఐశ్వర్యవన్తుడా! ఉపాయవన్తుడా! ఈయక్షుడెవడో ఎట్టివాడో నీవుపోయి కనుగొనిరమ్ము. అని నియోగించిరి. (ప్రార్థించిరి) అట్లేయని ఇంద్రుడు యక్షుని వైపు అనుమాన ఆశ్చర్య ఆతురతలు ముప్పిరిగొన పరుగెత్తెను అందుచే నటనుండి యతనికి కనపడకుండ యక్షుడన్తర్హితుడయ్యెను. ఇన్ద్రుడు మరింత అబ్బురపడి యచ్చటనే నిలబడి తదేకనిష్ఠతో యక్షునిగూర్చి యోచింపసాగెను.

౧౨ వ మంత్రము- శ్రుతిః

సతస్మిన్నేవాకాశే
స్త్రియమాజగామ బహు
శోభమానాముమాం హైమవతీమ్ ‖
తాగ్ంహోవాచ కిమేతద్యక్షమితి

సః = ఆ ఇన్ద్రుడు తస్మిన్ = ఆ; ఆకాశే = కాళీయమయిన ఆకాశమునందు ఏవ = మాత్రమే, బహుశోభమానాం = మిక్కిలి

శోభాయమానమైన; హైమవతీం = బంగారు వర్ణముగల ఉమాం = ఉమయను స్త్రియం = స్త్రీని (గాంచి) ఆజగామ = ఉన్నచోటికి వచ్చెను. తాం = ఆమెను, ఏతత్ = ఈ; యక్షం = యక్షుడు, హ = నిశ్చయముగా కిం = ఎట్టివాడు? ఇతి = అని సః = ఆ ఇంద్రుడు ఉవాచ = పలికెను, అడిగెను.

విశేషార్థము:— (1) ఆకాశే = ఆకాశమునందు అనగా అదివరకు యక్షుడుండి ఖాళీచేసిన ప్రదేశమందు స్థలములోగవంతైనను తేడా లేదని తెలుపుటకు ఏవ అను పదముకూడ వాడబడెను. అచ్చటనేయని అర్థము.

(2) * బహుశోభమానాం హైమవతీం ఉమాం స్త్రియం = యక్షుడున్నచోట కనపడినది స్త్రీ విద్యాదేవి. ముక్తికూడ కాన్తయనియే భావింతురు. ప్రబోధమేర్పడినపుడు హృదయ కాఠిన్యముపోయి మార్దవము సౌకుమార్యము అనుకంప ఏర్పడును. అట్టి లక్షణములను స్త్రీరూపమున వర్ణింతురు. అందుచేతనే కనుపడిన వ్యక్తి స్త్రీరూపము ధరించెను. బహుశోభ. లోకములోని అన్ని సౌందర్యములకంటె శోభలకంటె, విద్యయు జ్ఞానమును పరమోత్కృష్టమైన సౌందర్యమును గలిగించును. అమెరికాలోని (Homes) అను క్రైస్తవమతబోధకుడు లండన్ నగరమున శ్రీ గాంధిమహాత్ముని జూచి ముగ్ధుడై ముల్లోకము

* అన్నపూర్ణే సదాపూర్ణే శంకరప్రాణవల్లభే।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాందేహి కృపావతి॥
జ్ఞానవైరాగ్యములను భిక్షము పెట్టగలిగిన తల్లి ఈమె.

లలో సౌందర్యవస్తుడతడేయని ప్రకటించెను. సత్వగుణముకలిగి నపుడే సర్వాంగములు తేజోమయముగునని * భగవద్గీత తెలుపుచున్నది. సామాన్యసత్వమేగాక శుద్ధసత్వమేర్పడి జ్ఞానోత్పత్తి అయినపుడు జ్ఞానిశరీరము నిరుపమాన సౌందర్యమును ధరించును. జ్ఞానిగాక జ్ఞానమే రూపమును ధరించినపుడు సౌందర్యలావణ్యములు అచ్చటనే నెలకొనుటలో ఆశ్చర్యమేమి? హైమవతీ హిమవన్తుని కుమార్తె అని అర్థము, సువర్ణాభరణములతో నలంకరింపబడినదని మరియొక అర్థము. పరిపూర్ణుడగు పరమపురుషుని వర్ణించినపుడు బంగారువర్ణమునే తెలిపెదరు. * ముణ్డకములో "పురుషం రుక్మవర్ణం" అని కలదు. రుక్మవర్ణమనగా బంగారువర్ణము పదునారువన్నెగల మేలిమి బంగారము, శుద్ధసువర్ణము, కల్మషరహితమనియు తేజోమయమనియు మృదుత్వమూర్తియనియు ప్రఖ్యాతి.

* (3) ఉమ = అనగా బ్రహ్మవిద్య. స + ఉమా అట్టిబ్రహ్మవిద్యతో గూడినవాడు శివుడు; పరబ్రహ్మ, మహానారాయణం, యీ శివుని అర్ధనారీశ్వరుడని వర్ణింతురు. కాన ఈశ్వరుడు అదృశ్యము కాగానే పుత్రవత్సలయగు ఉమాదేవి రూపమే ప్రత్యక్షమగుట భావ్యమే.

♦ (4) ఉవాచ = చెప్పెను. అడిగెను, కరుణారసపూరిత

---

* భగవద్గీత 4 అ. 11 శ్లో
* ముణ్డకము 1 ఖండం 3 మంత్రము 3
* నారాయణం పనస 38 వ మంత్రము.
♦ ఇదియే ప్రతిబోధ.

యగు ఆ మాతృదేవినిజూచి మాకిదివరకజ్ఞేయమైయున్న ఈ యక్షుని యథార్థస్థితిని తెలుపమని ప్రార్థించెను. అనగా జ్ఞానోత్పత్తియయి తద్ద్వారా యక్షునిరూపము బోధపడెనని యర్థము.

తాత్పర్యము:— యక్షుడుండి యదృశ్యమైన స్థలముననే ఒక స్త్రీరూపము, సౌందర్యలావణ్యాసంభరితము, శుద్ధసువర్ణరాశి సౌమ్యతేజోప్రభావయుతము కరుణార్ద్రమూర్తి, జ్ఞానస్వరూపిణి ముక్తికాన్త అచ్చట ప్రత్యక్షమయ్యెను. ఆ మాతృదేవిని చూచి మాకింతవరకు దుర్గ్రాహ్యమైయున్న యక్షుడెవడో తెలుపవే తల్లి యని ఇంద్రుడు ప్రార్థించెను. జ్ఞాన ప్రసాదితమైన ప్రబోధమును ఇంద్రుడు పొందెను.

## —: చతుర్థ ఖండము: —

శ్రుతిః హరిః ఓమ్- ౧ సా బ్రహ్మేతిహోవాచ,

బ్రహ్మణోవా ఏతద్విజయె మహీయధ్వమితి
తతోహైవ విదాంచకార బ్రహ్మేతి ॥౧॥

సా = ఆమె; (ఏతత్ = ఇది) బ్రహ్మ = బ్రహ్మ ఇతి = అని హ = నిశ్చయముగా; ఉవాచ = పలికెను; ఏతత్ = ఈ విజయె = విజయమందు; మహీయధ్వం = మహిమపొందితిరి, తత్ = అది బ్రహ్మణః = బ్రహ్మప్రసాదితము, ఏవ = నిశ్చయము, ఇతి = అని (ఆమె చెప్పెను) తతః = దానినుండి; ఏవ = మాత్రమే; హ = నిశ్చయముగా బ్రహ్మ = బ్రహ్మ; ఇతి = అని (ఇన్ద్రుడు) విదాంచకార = తెలిసికొనెను.

విశేషార్థము:—(1) సా=వెనుకఖండములో నామె తెలిపిన జ్ఞానదేవత.

(2) ఉవాచ = చెప్పెను. చెప్పినవి రెండు సంగతులు 1. యక్షుడే బ్రహ్మయని 2. దేవాసుర యుద్ధములో కలిగిన విజయమును తత్ఫలితమగు మహిమయును ఆ బ్రహ్మప్రసాదము లేయని

(3) తతఏవ=అందువలననే; అనగా ఆజ్ఞానదేవి ప్రసాదము చేతనే ఇతరకారణములవలనకాదు. ఇంద్రియములకృషి వలనగాదు ♦ ముణ్డకములో "జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వః తతస్తుతం పశ్యతె నిష్కలం ధ్యాయమానః" జ్ఞానప్రసాదము వలననే అతనిని పొందుదురు. అని చెప్పబడెను. ఆ మంత్రము లోనె చెప్పినట్లు ఏఇంద్రియములు ఏకాగ్రవలనకాదు. 1 ఖండము 4-5-6-7-8 మంత్రములలో "నేదంయదిదముపాసతే" ఇచ్చట నుపాసింపబడునది బ్రహ్మకాదని స్థిరపరచబడెను. ఆయుపాసన వలన ఈ బ్రహ్మ లభ్యముకాలేదని స్పష్టమగుచున్నది. బ్రహ్మను గ్రహించి చేసిన పరీక్షలో కలిగిన జ్ఞానప్రసాదముచేత నింద్రుడు బ్రహ్మను తెలిసికొనగలిగెను. 3 వ ఖండము ఆరంభములో ఈ విజయము మనది. ఈ మహిమ మనది అని భ్రమపడిన దేవతలకు యథార్థస్థితి జ్ఞానదేవి తెలిపెను.

(4) విదాంచకార=అనుభవపూర్వకముగా తెలిసికొనెను. "బ్రహ్మేతి" అని ఆమె చెప్పిన వాక్యము. ఆ ప్రవచనము యిప్పుడు అనుభవైకవేద్యమయ్యెను.

---

♦ ముణ్డకం 3 ఖండము 1 మంత్రము 8.

తాత్పర్యము:— అజ్ఞానదేవి ఇంద్రునకు ఇట్లు ప్రబోధించెను. ఆయక్షుడు నిజముగా బ్రహ్మయే దేవాసురయుద్ధములో నతడే మీకు విజయమును కలిగించెను. ఆ విజయమువలన సిరిసంపద లను, గౌరవమర్యాదలను అతడే మీకనుగ్రహించెను. నిస్సందేహము మీరు నిమిత్తమాత్రులే అయియుండిరి. అట్లామె చెప్పుట చేతనే ఇతర కారణములవలనగాక, ఇంద్రియజన్యజ్ఞానమువలన గాక, ఇచ్చట చేయబడు నుపాసనాదులవలనగాక ఇంద్రుడు ఈ పరబ్రహ్మను తెలిసికొనెను. అనుభవైకవేద్య మొనర్చుకొనెను.

౨ వ మంత్రము శ్రుతిః ౪

తస్మాద్వా ఏతే దేవా అతితరా
మివాన్యాన్దేవాన్యదగ్నిర్వాయురిన్ద్ర స్తే
హ్యేనన్నేదిష్ఠం పస్పృశు స్తే హ్యేనత్ప్రథమో
విదాంచకార బ్రహ్మేతి ౪॥

యత్ = ఎందువలన; తే = ఆ; అగ్నిర్వాయురిన్ద్రః = అగ్ని వాయువు ఇన్ద్రుడు; ఏనత్ = యక్షుని; నేదిష్ఠం = అత్యన్త సమీపము. హి = నిశ్చయముగా; పస్పృశురివ = స్పృశించి నట్లుగా (నుండిరి) తే = వారు; ఏనత్ = ఈ యక్షుని; ప్రథమః = మొట్టమొదట; బ్రహ్మ = బ్రహ్మ; ఇతి = అని; హి = నిశ్చయముగా, విదాంచకార = తెలిసికొనిరి. తస్మాత్ = కాన ఏ తే దేవాః = ఈ దేవతలు (ముగ్గురు దేవతలు) అన్యాన్ దేవాన్ = ఇతర దేవతలను వై = నిక్కముగా అతితరామ్ = అతిశయించిరి.

విశేషార్థము:— (1) అగ్నిర్వాయురింద్రః = వెనుక ఖండములో తెలుపబడినవారు ముగ్గురే వారున్ను తన ఇంద్రియములకును, ఉచ్ఛ్వాసనిశ్వాసములకు అధిష్ఠాన దేవతలు మొదటి ఇద్దఱు, మూడవవాడు జీవాత్మ.

(2) అన్యాన్ దేవాన్ = ఇతర దేవతలు; బృ 3–౯–౧ త్రయశ్చత్రీచశతం, (303) త్రయశ్చత్రీచసహస్రేతి- ఓమితి హోవాచ త్రయస్త్రింశదితి (33) షడితి, త్రయ ఇతి, ద్వావితి, అధ్యర్ధఇతి, ఏక ఇతి బృ 3–౯–౨ ఎంతమందో తెలుపబడ లేదు. ♦ ఋగ్వేదములో నొకచోట 11 మందియు మరియొక చోట 33 మందియు అని తెలుపబడెను. శరీరములోని యింద్రియములేయని ఎంచిన యెడల ఈ ఇంద్రియములు 11. 5 కర్మేంద్రియములు 5 జ్ఞానేంద్రియములు 1 అంతరింద్రియము. ఇంకొక విధమున ఈ ఇంద్రియములు 14 అయియున్నవి. అప్పుడు అన్తరింద్రియములు 4 గా ఎంచబడును. ♦ ఐతరేయములో 8 మంది గా తెలుపబడెను. సామాన్యముగా పదునాలుగనే యెంచ వచ్చును.

(3) ఏతత్ = దీనిని అనగా యక్షుని 3 వ ఖండములో దీనినిగూర్చి విచారణ జరిగెను. ఏది బ్రహ్మయని 1 వ మంత్రములో తెలుపబడెనో అతడే.

(4) నేదిష్ఠం = అత్యంత సమీపము ఈ సమీపమునకు వచ్చినవారు అగ్ని వాయువులిద్దఱే. వారు యక్షునితో సంవా

---

♦ ఋగ్వేదము ౮౦౯ ఋక్కు 33 దేవతలని తెలుపుచున్నది.

♦ ఐతరేయము 1 అ. 2 ఖండము 4 మంత్రము.

దము కూడ చేసిరి. ఇంద్రుడు సమీపమునకు వచ్చుచుండగనే యక్షుడంతర్ధానమయ్యెను. అయినను అతడుండిపోయిన ప్రదేశమునకు ఇంద్రుడు సమీపించెను.

(5) పస్పృశుః = తాకిరి. వీరు ముగ్గురు యక్షుని తాకలేదు. కాని యక్షునికి వీరి యింద్రియములకు స్పర్శకలిగెను. వారు ముగ్గురకును దృష్టివలనను మొదటి యిద్దఱికి సంభాషణవలనను కూడ స్పర్శకలిగెను. స్పర్శ అను పదమునకు ఆంగ్లములో (Perception) అని అర్థము చెప్పవచ్చును. అనగా ఆ జ్ఞానము కలిగెను. ఇవ అను పదమొకటి కలదు. అది నిరుపయోగమని శ్రీ శంకరులవారు అభిప్రాయపడిరి. లేదా నిశ్చయార్థమని కూడ చెప్పిరి. ఆ రెండర్థములుగాక పస్పృశురివ తాకినట్లుగా తాకునంతగానే దిష్ఠం = సమీపమునకు చేరిరి. అని చెప్పవచ్చును. అప్పుడు తాకకపోయినను తాకినట్లున్నదని చెప్పవచ్చును.

(6) ప్రథమః = మొట్టమొదట తక్కిన దేవతలకంటె ముందుగా దీనిని విదాంచకారతో కలుపవచ్చును. అప్పుడు మొదట ఎరిగినవారు వీరగుదురు. లేదా పస్పృశుః తో కలుపవచ్చును. అప్పుడు మొట్టమొదటగా యక్షుని తాకినవారు తాకునంత దగ్గఱగా వచ్చినవారు. వీరగుదురు ముఖ్యమగువిధమున అని శ్రీ శంకరులవారు అర్థము చెప్పిరి. అదియు సమంజసమే.

[7 విదాంచకార బ్రహ్మేతి = బ్రహ్మయని తెలిసికొనిరి ఈ ముగ్గురిలో మొదటి యిద్దఱు తెలిసికొనలేక మరలివచ్చి తమ యసమర్థత నొప్పుకొనిరి. ఇంద్రునకు బ్రహ్మయని ఉమాదేవి మూలమున తెలిసెను. అతనికి తెలియుటయే వారిద్దఱకు తెలియుటగా భావించుటకు వీలులేదు. ౩వ మంత్రము అడ్డమువచ్చుచున్నది. కాన ఈ మంత్రములోని క్రియలను ముగ్గురకు సమ్మిడిగా వర్తింపజేయక వేరుపరచి ఎవరి యనుభవములను వారికి ప్రత్యేకించి తెలిపిన యెడల భావ్యముగానుండును. లేనియెడల భాషకును, భావమునకును, అన్తరాయమేర్పడును. పస్పృశుః అన్న పదమును పస్పర్శుః (గా) అని వాడుచున్నారు. రెండు రూపములు కలవు. స్పర్శః అనగా విషయేన్ద్రియ సంయోగము అని అర్థముకలదు. అనగా ఆ జ్ఞానమని భావము స్పృశః అనగా తాకుట చెయ్యిపెట్టుట అని అర్థములు కలవు. ఇచ్చట పస్పర్శుః అను రూపాన్తరమే సందర్భమునుబట్టి సరిపోవును.

• తాత్పర్యము:— వెనుక ఖండములో చెప్పినట్లు అగ్ని వాయువులిద్దఱు ఆయక్షుని యొద్దకు నిశ్చయముగా అత్యన్త సమీపమునకు జేరి ఆయనను తాకినట్లే అగుపడిరి. ఆయనతో సంభాషణముకూడ జరిపిరి. తమకంటె అధికుడు అతీతుడు గల

• పురుషసూక్తములో నిట్లు చెప్పియున్నది. ధాతా పురస్తాద్య ముదాజహార. శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః మొట్టమొదట ధాతయనగా హిరణ్యగర్భుడు పరమాత్మనుగూర్చి మొదట ప్రకటించెను. పిమ్మట ఇన్ద్రుడా నలుదిశల వెల్లడించెను. ఇచ్చట సగుణబ్రహ్మ ప్రశంసలేదు. తక్కిన దేవతలలోని కెల్ల ఇంద్రుడే మొదట తెలిసికొని ప్రకటించినవాడు.

క్షని గ్రహించిరి. ఇంద్రుడు యక్షుని దూరమునుండి గమనించి ఆయన యుండిన ప్రదేశమునకత్యంత సమీపమునకు చేరెను. అట్లు చేరుటకు దేవతలలోనెల్ల నీముగ్గురే మొదటివారు. ఇంద్రుడు జ్ఞానస్వరూపిణియగు ఉమాదేవి అనుగ్రహమున యక్షుడు బ్రహ్మయని తెలిసికొనెను. ఇట్లు తెలిసికొనుటలో దేవతలలోనెల్ల ఇంద్రుడే మొదటివాడు. వారి ముగ్గురకు కలిగిన నీఈ యనుభవములనుబట్టి వారితర దేవతలకంటె అగ్రగణ్యులైరి.

3 వ మంత్రము శ్రుతిః

తస్మాద్వా ఇన్ద్రోఽతితరా
మివాన్యాన్దేవాన్ స హ్యేనన్నేదిష్ఠం
పస్పర్శ స హ్యేనత్ ప్రథమో
విదాంచకార బ్రహ్మేతి ॥

సః = ఇన్ద్రుడు; ఏనత్ = ఈ యక్షుని; నేదిష్ఠం = అత్యన్త సమీపమున, హి = నిశ్చయముగా (చేరి) పస్పర్శ ఇవ = స్పర్శకలిగించుకొనినట్లుండెను: సః = ఇన్ద్రుడు; ఏనత్ = ఈ యక్షుని; ప్రథమః = మొట్టమొదట హి = నిశ్చయముగా; బ్రహ్మ = బ్రహ్మ; ఇతి = అని విదాంచకార = తెలిసికొనెను. తస్మాత్ = కాబట్టి, ఇన్ద్రః = ఇన్ద్రుడు; అన్యాన్ దేవాన్ = ఇతర దేవతలను వై = నిక్కముగా అతితరామ్ = అతిశయించెను.

విశేషార్థము:— ఇందులోనున్న పదములకు విశేషార్థము నకై 2 వ మంత్రములోని విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము:— ఇంద్రుడు ఈ యక్షునకు నిశ్చయముగా నత్యన్త సమీపమునకు చేరి స్పర్శను ఆ జ్ఞానమును పొందినట్లుగ

పడెను. అతడు ఈ యక్షుడు బ్రహ్మయని దేవతలలోనికెల్ల మొట్టమొదట ఉమాసహాయమున తెలిసికొనెను. విశేష జ్ఞానమును పొందెను. అందుచేత నింద్రుడు ఇతర దేవతలందరికంటె నిశ్చయముగా నగ్రగణ్యుడు అగ్ని వాయువులకంటె నీయనకే ఎక్కువ అనుభవము కలిగెను.

౪ 4 వ మంత్రము శ్రుతిః—

తస్యైష ఆదేశో యదే తద్విద్యుతో
వ్యద్యుతదా ౩ ఇతీన్యమీమిషదా ౩
ఇత్యధిదైవతమ్ ॥

తస్య = దానియొక్క; ఏషః = ఇది; ఆదేశః = ప్రమాణవాక్యము యత్ = ఏది; ఏతత్ = ఇది, వ్యద్యుతత్ = దేదీప్యమానమగు ఆ ౩ = ఓహో నిశ్చయముగా దేదీప్యమానగు; ఇత్ = మరియు న్యమీమిషత్ = కన్నులు మిరుమిట్లుగొలుపు; ఆ ౩ = నిశ్చయముగా కన్నులు మిరుమిట్లుగొలుపు; విద్యుతః = విద్యుత్తుయొక్క (తేజము) ఇతి = ఇట్లు; అధిదైవతం = దేవతాసంబన్ధమైనది.

విశేషార్థము:— (1) తస్య = దానియొక్క బ్రహ్మయొక్క యని చెప్పుచున్నారు. అంతకంటె ఉమాదేవియొక్క ఆదేశమని అర్థము చేయవచ్చును. లేదా బ్రహ్మను తెలిసికొనిన ఇంద్రుని ప్రథమ ప్రకటనయని చెప్పవచ్చును. పురుషసూక్తములో "శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః" లోకోద్ధరణ ప్రబోధమదియే. ఆదేశః = ఆదేశమనగా ఆజ్ఞయని సలహాయని బోధయని, సూచక చిహ్నమని అర్థములు కలవు. "ఏష ఆదేశం"

ఇదియే వేదముయొక్క ఆజ్ఞయని అర్థముకలదు. శ్రీ శంకరుల వారు ఉపమ ఉపదేశము అని అర్థముచేసిరి. ఒక ఉపమానము తెలిపి తద్ద్వారా ఒక్క ఉపదేశమును (బోధను) చేయుట, నిరుపమానమైన బ్రహ్మను లోకములోని అరుదైన నొకవస్తువుతో నుపమించి తెలుపుట ఆదేశమనగా:— ఆబ్రహ్మను సూచింపగల ప్రమాణవాక్యము అని చెప్పుట భావ్యము.

(2) వ్యద్యుతత్ =అనగా ప్రకాశమగుట అని అర్థము. అది ఇచట పొసగనందున మెరుపుయొక్క కాన్తియని శ్రీ శంకరుల వారు అర్థముచేసిరి. ప్రజ్వరిల్లు దేదీప్యమానమగు అనునట్లే అర్థము చెప్పిన సందర్భమునుబట్టి సరిపోవును.

• (3) న్యమీమిషత్ =కన్నులు మూయించు అని అర్థము చెప్పిరి. మిరిమిట్లుగొలుపు అన్నను అదేభావము. ఆ కాన్తిని చూడలేక తటాలున అప్రయత్నముగా కన్నులు మూసెదరు, ఈ మెరుపుయొక్క ప్రకాశము కన్నులున్న భ్రమింప జేయును. ఈ మంత్రములో రెండు ఆదేశములున్నవని శ్రీ శంకరులవారు తెలిపిరి. రెంటిని ఒకటిగానే యన్వయించిన మేలగును. కన్నులు మిరుమిట్లుగొలుపు ప్రచండతేజస్సుతో వెలిగెడి మెరుపువంటిది.

---

• తైత్తిరీయము 1 అ. 11 వ పనసలో శ్రీ రామకృష్ణపరమహంసకే నిరాకార బ్రహ్మ అఖండజ్యోతిర్మయముగా కనబడెను. స్వగత పరగత భేదములు లేవు. దీనికిని; ఇతరులకును దేవతాది సగుణరూపమునకును మధ్య ఒక్క జ్యోతిర్మయమైన తెరయుండెను.

హిరణ్మయేన పాత్రేణ అని ఈశావాస్యములో చెప్పినది ఇదియే. దీనియందులోనుండియే ఒక శిశువు ఏడుగురు ఋషుల రూపములు ఏర్పడెను. తాను శిశువు ఋషి అంశ వివేకానందుడు అని ఆయన తెలిసికొనెను.

బ్రహ్మమనిని చెప్పవచ్చును. బృహదారణ్యకములో "యథా సకృత్ విద్యుతమ్" అని చెప్పబడియున్నది. ఇట్లుపాసించుట చేత శ్రద్ధవతి, అకస్మాత్తుగా ప్రజ్వలించి రెప్పపాటులో అదృశ్యమగునది విద్యుత్, * బ్రహ్మ అట్లే అకస్మాత్తుగా దర్శనమిచ్చి యదృశ్యమగును. ఆ దర్శనమిచ్చునపుడుకూడ "ఆదిత్య వర్ణం తమసస్తుపారే । తమసః పరస్తాత్" అంధకారమున కవతలనుండు జాజ్వల్యమానమగు తేజస్సుగా దర్శనమగును. ♦ మహానారాయణములో "తస్యమధ్యే మహానగ్నిః విశ్వార్చిః తస్యామధ్యే వహ్నిశిఖా విద్యుల్లేఖేవభాస్వరా" సమాధిస్థితిలో దర్శనమిచ్చునపుడుకూడ విశ్వార్చి, మహానగ్ని, వహ్నిశిఖావలెనే ద్యోతకమగును. మోజెస్సుకు అగ్నిస్తంభమువలె ప్రత్యక్షమయి నడిపించెను. పాశ్చాత్యదేశములోని క్రైస్తవులలోని విగూఢ తత్త్వజ్ఞులకు తేజస్సముద్రము ప్రత్యక్షమైనట్లే తోచెను. శ్రీ రామకృష్ణపరమహంసకు తేజస్సముద్రములో ఓలలాడినట్లు అనుభవము కలిగెను. బుద్ధభగవానుడు తేజోబిందువు తేజోంబుధిలో లీనమైనదని తెలిపిరి. ♦ ముణ్డకములో

* బ్రహ్మదర్శన మయినపుడు కొందఱు దానినిభరించజాలక భగ్నమనస్కులగుచుండిరి. రామకృష్ణపరమహంసులవారి శరీరముకూడ దస్సిపోయినట్లు నిదర్శనములు కలవు. బృ ౨-౩-౬ కొన్నాళ్ళకు పిమ్మట ఆ సమాధిస్థితి సామాన్యానుభవము అయినపిమ్మట శరీరవ్యథ ఆగిపోయెను. అర్జునుడు విశ్వరూపసందర్శనము కలిగినపుడు దానిని భరించలేక సౌమ్యరూపము చూపమని భగవద్గీత అ 11- శ్లో 45-46 లో ప్రార్థించెను.

♦ పురుషసూక్తము కఠోపనిషత్తు మహాద్భుయం మహానారాయణం

♦ ముణ్డకం 2 ఖండము 2 మంత్రము 10

సూర్యుడు చంద్రుడు నక్షత్రములు మెరుపు అగ్ని బ్రహ్మను ప్రకాశింపచేయలేవని తెలుపబడెను. కాన బ్రహ్మ తేజోరాశి యని ఊహించనగును. అట్లే ఉపమించబడుచున్నది. ఇచ్చట ౩ వ ఖండములో దేవతలకు యక్షరూపమున కనబడుటమాయ మగుట యిట్టిదియే.

*(4) ఆ = ఇది ఉపమాన సూచకమని శ్రీ శంకరుల వారు చెప్పిరి. వలె అని అర్థముకూడ చెప్పవచ్చునని. మెరుపు ఎట్లు అంధకారమును పటాపంచలుచేయునో అట్లే అజ్ఞానమును బ్రహ్మదర్శనము భస్మీభూతము జేయును. ఇట్లును జెప్పవచ్చును. ఆ, అనగా వెనుక చెప్పిన పదముయొక్క అర్థము మరింత ధ్రువ పడుటకని విద్వాంసులు చెప్పుచున్నారు. ఇచ్చట అట్లనుగ్ర హించినను భావ్యముగానుండును.

(5) విద్యుతః = విద్యుత్తుయొక్క దానిప్రిమ్మట తేజః అను పదము అధ్యాహారము చేయవలెనని శ్రీ శంకరులవారుసూచిం చిరి. అదిసమంజసము. సర్వత్రనుండు ఆవిద్యుత్తును కనుగొనుట బ్రహ్మను దర్శించుటయే బృ ౨-౫-౮ విద్యుత్ దేహము లోని తేజస్సుతోనేకీభవించును. విజ్ఞానసూచకము. "యశ్చాయ మధ్యాత్మం తైజసః తేజోమయో అమృతమయః పురుషః అయ

* ఇందులోని ౩ యొక్క భావము మూడు మాత్రలుగా పలుకవలెనని భావము. దీనికే ప్లుతమందురు. ఉదాత్త, అనుదాత్త స్వరిత అని ధ్వనులు మూడు రకములు ఈ 3 అంకె వేయుటచేత మూడు మాత్రలతో కలుపి పలుకవలెనని అర్థము.

మాత్మా ఇదమమృతం ఇదం బ్రహ్మ ఇదంసర్వం" బృ ౫-౭-౧ విద్యుదేవ బ్రహ్మ విద్యుత్తే బ్రహ్మ.

(6) * అధిదైవతం = దేవతలు లేదా ప్రకృతి శక్తులు సంబద్ధమున బ్రహ్మను విద్యుత్తుకు పోల్చనగును. తైత్తిరీయము 3 అ, 10 వ పనసలో "అథదైవీః బలమితి విద్యుతి" అని చెప్పియున్నది. దేవతలబలము విద్యుత్తులో నిమిడియున్నది. విద్యుత్తు ప్రపంచమంతటను వ్యాపించి యున్నది. అది లేని ప్రదేశమే లేదని ఇప్పటి శాస్త్రజ్ఞులు ఋజువు వేయుచున్నారు. ఆ విద్యుత్తును యన్త్రములద్వారా కేంద్రీకరింపజేసి సర్వకార్యములు నిర్వహింప సమర్థులగుచున్నారు. యంత్రములు లేకుండగనే పూర్వపు ఋషులు ఈ విద్యుత్తును వినియోగించుకొనిరి. వారికి ప్రత్యేక యన్త్రములు అనవసరమయ్యెను మహోన్నతమయిన శరీరమే యంత్రముగా పరిణమించెను.

తాత్పర్యము:— ప్రకృతి శక్తులతోగాని దేవతలతోగాని పోల్చిచెప్పవలెనన్న ఇట్లు సూచించనగును. అకస్మాత్తుగా మెరసి మాయమగు జాజ్వల్యమానమై నిశ్చయముగా దేదీప్యమానమయి కన్నులు మిరుమిట్లుగొలుపు మెరుపునకు మిరుమిట్లు గొలుపు ఆ విద్యుజ్జ్వాలయొక్క తేజస్సు ఏది సుప్రసిద్ధమయి

* అయితే విద్యుచ్ఛక్తిని యిప్పటివారు బ్రహ్మవేత్త లనబడుదురా? అంతేనో ముక్తులేనా? ఆ విద్యుక్తి సామాన్యముగా బ్రహ్మవలెనే అప్రకాశమై యుండును. ప్రకాశము కాగానే కన్నులు మిరుమిట్లుగొలుపును. ప్రకృతి శక్తులకన్న దేవతలనుటయేమేలు. వారు అనిమేషులు అట్టివారి న్యమీమిషత్ = ఉన్మీలితలోచనులగుచున్నారు ఇచ్చట కన్నమూరె [illegible]న యింద్రియములన్నియు అగ్నే వెనుకాదునని తెలుపుచున్నది.

కలదో అయ్యది ఈ బ్రహ్మతేజస్సు. ఇదియె బ్రహ్మజ్ఞానాను భవముయొక్క మొదటిదిశ. ఒక్కొక్క మారుకనుపడి ఆశకల్పించి ఇదియే బ్రహ్మబోధకమగు సూచనను తెలుపు ప్రమాణ వాక్యము.

॥ ౫ వ మన్త్రము శ్రుతిః ॥ అథాధ్యాత్మం

యదేతద్గచ్ఛతీవ చమనోఽనేన

చైతదుపస్మరత్యభీక్ష్ణం సంకల్పః ॥ ౫ ॥

అథ = పిమ్మట; అధ్యాత్మం = శరీరసంబన్ధమైన సూచన, యత్ = ఏది; ఏతత్ = ఇది; అనేన = దీనినలన; మనః = మనస్సు ఏతత్ = దీనిని; గచ్ఛతీవ = పోయినమిూపించుచున్నది వలె కన్పడును. అభీక్ష్ణం = వేగముగా సంకల్పః = సంకల్పించును. చ = మరియు ఉపస్మరతి = జ్ఞాపకముంచుకొనును లేదా ధ్యానించును.

విశేషార్థము:— (1) అధ్యాత్మం = మానవశరీరములో బ్రహ్మకనుపడువిషయము అనగా ప్రత్యగాత్మ సంబన్ధమయిన విషయమనిఅర్థము. పై మంత్రములో విశ్వములోనుండు ప్రకృతి శక్తులు లేక ప్రకృతిశక్తులకు సంబన్ధము కల్పించి బ్రహ్మగా వర్ణించబడెను. ఇచ్చట ప్రత్యేక మానవ వ్యక్తిసంబన్ధము బ్రహ్మ సూచకము ఏదియో తెలుపబడుచున్నది. పిండాండములో మున్నదియే బ్రహ్మాణ్డములోనున్నది.

(2) మనః అనేనచ ఏతత్ = ఈ పదములో "చ" ను వదలి "మనో అనేన తదుపస్మరతి" అని నిలిపి "మనః సఏతత్

ఉపస్మరతి" అని పదవిభాగముచేసి న ఉపస్మరతి అని అన్వయించిరి. అందువలన బ్రహ్మను మనస్సు స్మరింపజాలదు, అని అర్థమగును. (శ్రీ) శంకరులవారు అట్లు పదవిభాగముచేయలేదు. అట్లు చేయుటకు రెండు ఆటంకములు కలవు. "మనోఽనేన" అను-చోట "అ" ను సూచించు గుర్తుకలదు. "నేన" పిమ్మట "తదు" మధ్య "చై" అను అక్షరము కలదు. ఈ, అ, చ, లుండుటచేత నట్టి పదవిభాగము పొసగదు. కాన మనః అనేనచ ఏతత్ అనియే పదవిభాగము చేయవలెను. అట్లు చేసిన యెడల పైన దెల్పిన నిషేధార్థము రాజాలదు. అందువలననే ఉపస్మరతి అనగా సమీపమునకుబోయి స్మరించుటయని శంకరులవారు అన్వయించిరి. అది ఎట్లున్నను నిషేధార్థము పొసగదని నిర్ణయించవచ్చును. తైత్తిరీయం 3 అ. 10 వ పనసలో "తన్మన ఉపాసీత" దానిని మనస్సుగా ఎంచి ఉపాసించినయెడల మననశక్తికలవాడగును. అని చెప్పబడినది. ఇచ్చట అట్టి ఉపాసనయే చెప్పబడినదని (శ్రీ) శంకరులవారి భావము ఏలనన మనస్సే బ్రహ్మనుగూర్చి నిరన్తర సంకల్పము స్మరణచేయుచుండును అనిరి. కాని మనస్సుకు బ్రహ్మ, విషయముకాదని 1 ఖండము 2-3-5 మంత్రములలో తెలుపబడెను. దానిని మనసులో పెట్టుకొని యిచ్చట సగుణబ్రహ్మ ఉపాసనచెప్పబడినదని శ్రీ శంకరులవారూహించిరి. అట్లూహించుటకు తగినకారణము కనుపడదు. ఈ మంత్రము 4 వ మంత్రము ఉపాసనాసంబన్ధమైనవని శ్రీ శంకరులవారు తెలుపుచున్నారు. అట్టి విషయమును సూచించుటకు మంత్రములలో ప్రత్యేకపదములు లేవు. ఉచ్యతే అనుపదము

అధ్యాహారము చేయవలెనని శ్రీ శంకరులవారు తెలిపిరి. ఉపాసనా విషయము 6 వ మంత్రములో చెప్పబడెను.

(3) అభీక్ష్ణం=అభీక్ష్ణమన్నపుడు మాటిమాటికి నిరన్తరము అని అర్థము కలదు. అభీక్ష్ణం అన్నపుడు మాటిమాటికి వేగముగా అని అర్థముకలదు. అధికముగాననియు మార్పులేకయనియు అర్థముకలదు. ఇచ్చట వేగమని అర్థము చెప్పుటయే భావ్యము. మనోవేగము అనునది అందఱికి తెలిసిన విషయమే. 4 వ మంత్రములో విద్యుత్తుయొక్క త్వరితగమనము తెలుపబడెను. ఇచ్చట మనస్సుయొక్క త్వరితగమనము తెలుపుటయు భావ్యమే

(4) గచ్ఛతీవ = గచ్ఛతి అనగా పోవుట కాన పొందుట. ఈ మనస్సు బ్రహ్మయొద్దకు పోవును, పొందును అని చెప్పవలసియుండును. కాని ఇవ అనుపదము చేర్చినందున అట్లుపోయినట్లగపడునేకాని పోలేదనిస్పష్టము. 1 వ ఖండములో 3-5 మంత్రములలో చెప్పిన విషయమే మరల తెలుపబడెను.

తైత్తిరీయములో 2 అ. 4 వ పనసలో "యతో వాచో నివర్తన్తె అప్రాప్యమనసాసహ" మనసు బ్రహ్మను పొందలేక తిరిగివచ్చెను. లోకములో పరిణామవిధానములో నైదు అంతస్థులు కలవు * అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము,

* ముణ్డకము 2 ఖండము 2 మంత్రము 8 "తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరాః ।। బ్రహ్మయొక్క చిత్ శక్తిలోని స్వల్పాంశము మనస్సుగామారునది ఉత్తమయోనులలో ప్రకటమై లోకగ్రహణమునకు తోడ్పడుచున్నది. చిత్ ప్రతినిధియనవచ్చును. పరిమితాధికారముగల ప్రతినిధి.

ఆనన్దనుం మొట్టమొదట అన్నియు స్థూలమైన జడమైన అన్నము అనగా ( Matter ) రయి రూపమున ఉండును. అచ్చట బ్రహ్మను తెలియుశక్తి కనుపడదు. అసలు లేదనికాక గాఢనిద్రయందు ఉన్నట్లుగానుండును. తరువాత అంతస్థులో ప్రాణమేర్పడును. అందులో బ్రహ్మను తెలియుశక్తి అంకురరూపమున కనుపడును. మూడవ అంతస్థులో మనస్సు వెల్వడును. ఆ మనస్సు తనను లోకమును బ్రహ్మను తెలిసికొన యత్నించును. కాని సఫలమొందలేదు. విజ్ఞానస్థితిలో బ్రహ్మను తెలిసికొన గలుగును. మనస్సు బ్రహ్మను తెలిసికొనుటకు ప్రయత్నించునేకాని విజయమొందనేరదు. ఇచ్చట మనస్సు అని చెప్పుటచేత నెవరెవరిలో మనస్సు పరిణమించుచున్నదో యట్టి జీవకోటియంతయునని అర్థము, బాగా జ్ఞాపకముంచుకొనునది అనిగూడ తెలుపవచ్చును.

తాత్పర్యము:— మానవశరీరములోని స్థితినిబట్టి యోచించనగును. మనస్సు అతివేగముగా నడచుచుండును, హృదయములో నేదికలదో లోకములో నేదికలదో దానిని సమీపించునట్లు దానిని పొందునట్లు అగపడుచుండును. బ్రహ్మయిచ్ఛచేతనే ఈ మనస్సు యేర్పడి జీవాత్మ ప్రేరణచే గమనవేగముకలిగి సంచరించుచుండును. కాని జ్ఞానోత్పత్తి యయినపిమ్మట బ్రహ్మను జూడకలుగును. సహజమగు చంచలత్వమును పోనాడి బ్రహ్మదర్శనమునందు బ్రహ్మకార్యనిర్వహణమునందు కృతనిశ్చయమై ఆయనుభవమునే స్మరించుచు ధ్యానించుచునుండును. ఈనాలు

గైన మంత్రములకు భిన్నమగు తాత్పర్యములు ఇవ్వబడినవి. రామకృష్ణ మఠమువారిట్లు తెలుపుచున్నారు.

ఇది బ్రహ్మనుగూర్చిన వర్ణన, మెరుపుకు తేజస్నిచ్చువా డతడే, కన్ను మూత వేయించువాడతడే, ప్రకృతిశక్తుల్లుగా ఆయనవిభూతులిట్లుండును — 4 వ మంత్రము అంతరాత్మలో ఆయన విభూతులనుగూర్చిన వర్ణన ఏమనగా ఆయనవలననే మనస్సు బాహ్యాప్రపంచమును దెలిసికొనుచున్నది. జ్ఞాపక ముంచుకొనుచున్నది. విషయములనూహించుచున్నది— 5 వ మంత్రము శ్రీ శంకరులవారి అన్వయప్రకారము.

తాత్పర్యము:— ఇది బ్రహ్మనుగూర్చిన ఉపమానసహిత మగు ప్రబోధము ఆయన విద్యుత్తువలె మెరిసెను. కన్ను మూసి తెరచునంతలో ఆయన కనుపడి మరుగుపడెను. దేవతలకార్య పద్ధతినిబట్టి బ్రహ్మ దృష్టాంతమిది. 4 వ మన్త్రము.

శరీరములోనుండి బ్రహ్మనుగూర్చి తీసికొనిన దృష్టాంతము. ఎంత వేగముగా మనస్సు బ్రహ్మయొద్దకుబోవునో, ఎంత వేగ ముగా బ్రహ్మనుగూర్చి మనసుద్వారా యోచింతుమో ఎంత వేగముగా మనస్సు సంకల్పించునో 5 వ మంత్రము.

ఇంకొకవిధమైన వ్యాఖ్యానము. ప్రకృతికి సంబన్ధించినంత వరకు విద్యుత్ మెరుపువలెను, కనురెప్ప మూతవలెను బ్రహ్మ అంతర్దృష్టికి గోచరమగును. 4 వ మంత్రము.

నిరంతరము జ్ఞాపకముంచుకొనుటవలనను, ధ్యానించుటవల నను, మనస్సు బ్రహ్మను తెలిసికొనునట్లు అగపడును. 5 వ మంత్రము.

వరా:— 4-5 మంత్రములకు ఇచ్చట యివ్వబడిన తాత్పర్యమును పైనదెల్పిన మూడు విధముల తాత్పర్యముతో నుపోల్చి ఎవరికి ఏదివచ్చిన వారు దానిని అనుసరించవచ్చును.

౬ వ మన్త్రము శ్రుతిః ॥

తద్ధ తద్వనంనామ
తద్వనమిత్యుపాసితవ్యం
సయఏత దేవం వేదాభి
హైనం సర్వాణి భూతాని సంవాఞ్ఛన్తి ॥

తత్ = అది; హ = నిక్కముగా తద్వనం = తద్వనమని; నామ = ప్రసిద్ధి అయినది. తద్వనం = తద్వనము; ఇతి = అని; ఉపాసితవ్యం = ఉపాసింప తగియున్నది. యః=ఎవడు, ఏతత్ = దీనిని; ఏవం = ఈ విధముగా, వేద = తెలిసికొనుచున్నాడో; హి = నిక్కముగా; సః=అతడు, వేద= తెలిసికొనుచున్నాడు. ఏనం = దీనిని; సర్వాణి = అన్ని భూతాని = భూతములు; అభివాఞ్ఛన్తి = గాఢముగా కోరుచున్నవి, ప్రేమించుచున్నవి.

విశేషార్థము:— (1) తద్వనం=అనగా అందులోనన్నియు చేరియున్నవి. అందఱికినం దేయాత్మగనుక అది అందఱికి నారాధ్యమైనది. వనమనగా ప్రేమించుట తద్వనమనగా దానిని ప్రేమించుట లేక అదిగా ప్రేమించుట అనగా దానిని ఆత్మయని ప్రేమించుట కాన తద్వనమనగా ఎవరిచేతనది ఆత్మయని తెలిసి కొనబడి ప్రేమించబడుచున్నదో అయ్యది బృహదారణ్యకములో ౧౪-౮-౧౪-౫ లో ఆత్మకొఱకే భార్య, సంతానము,

ఆ సి అధికారము ప్రేమించబడుచున్నవని చెప్పబడెను. కాన తద్వనం అనగా ఆత్మయని పూజించెడితత్వము, అరవిందయోగి తద్వనమనగా ఆనన్దమని అర్థముచేసిరి, అదియే శ్రేష్ఠమయిన అర్థము. ఆత్మయొక్క ఉత్కృష్టలక్షణము ఆనందమే. తైత్తిరీయము 36 వ పనసలో " ఆనన్దోబ్రహ్మేతి వ్యజనాత్ " అని చెప్పబడినది. అదియే పరిశోధనకు పరాకాష్ఠ. అట్టి యర్థమే శ్రేష్ఠమని ఈ మంత్రములోని చివరవాక్యము తెలుపుచున్నది. ఆనందస్వరూపుడు గనుకనే అందఱు ఆ బ్రహ్మను కోరుదురు. పూజింతురు, ప్రేమింతురు.

* ( 2 ) ఉపాసితవ్యం = ఉపాసించవలెను. ఆనన్దమనియే ఆ బ్రహ్మను తెలిసికొనవలెను. ధ్యానించవలెను. అనుభవించవలెను. 1 ఖండములో 4-5-6-7-8 మంత్రములలో " నేదం యదిదముపాసతే " అను నిషేధము కలదు. ఇచ్చట ఉపాసించవలెనని విధికలదు, అచ్చట బాహ్యమగు దేవుని లేక వివిధదేవతలను భయముచేతనో, లేక ఫలవాంఛతోనో పూజించుట నిషేధింపబడెను. ఇచ్చట అందరికిని అంతరాత్మయైన దేవుని ప్రేమించి ఐక్యానుసంధానము చేసికొనవలెనని విధించబడెను.

( 3 ) సః = వాడు ఆ జీవుడు దేవుని ఆనందస్వరూపమని తెలిసికొనినవాడే నిజమైనజ్ఞాని ఇతరులుకారు అనిసూచనకలదు.

---

* బృ ౧-౪-౧౦ బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్ - తదాత్మానమేవావేత్ - అహం బ్రహ్మాస్మీతి తస్మాత్తత్సర్వమభవత్ - తద్యోయో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తదభవత్ - తదర్షీణాం తథా మనుష్యాణాం ఉపాసించుట యనగా ఆ ఉపాస్య దేవతయే యగుట.

*(4) ఏనం=అనగా పై తెల్పిన ఉపాసకుడని శ్రీ శంకరుల వారు అర్థముచేసిరి. అప్పుడట్టి యుపాసకుని సర్వభూతములు ప్రేమింతురని అర్థమగును. అతనియందుకలిగిన గుణగణములు తనయందు కలుగవలెనని అతనిని ప్రార్థించుచుందురు. ♦ముణ్డకములో "తస్మాదాత్మజ్ఞ మర్చయేద్భూతి కామః" విభూతిని కోరినవాడు ఆత్మజ్ఞుని పూజించవలెను. అని అర్థము ఏనం = అనగా బ్రహ్మయే అని అర్థము. సర్వభూతములు బ్రహ్మనే గాఢముగా కోరుచున్నవి. ప్రేమించుచున్నవి. అని అర్థము కలదు. ♦ తైత్తిరీయములో "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందోనస్యాత్ ఏషహ్యేవానందయాతి" ఆ ఆనందమే బ్రహ్మ. అతడే మనకు ఆనందము కల్పించు

* బృ ४-३-౨౦ అహమేవేదం సర్వోఽస్మీతి మన్యతేసో అస్యపరమో లోకః— నేను ఇదియంతయు అయితినని ఎంచును. అదియే ఉత్తమస్థితి.

४-3-౨3 అచ్చట ఇతరం రెండవది లేదుగనుక చూడుడు కానిచూచు శక్తి నశించదు. ४*४-౧౭ ఆయాత్మయే అమృతమైనబ్రహ్మ దానిని తెలిసి కొని నేనుగూడ అమృతుడనగుచున్నాను.

♦ ముండకం 3 అధ్యాయము ఖండము 1 మంత్రము 10

బృ ४-౧-3 ప్రియమి త్యేనదుపాసీత- ప్రియమనియే బ్రహ్మనుపాసించవలెను.

♦ తైత్తిరీయము 2.7 వనస బృ ౧-४-౮ తదేతత్ ప్రేయః పుత్రాత్ ప్రేయోవిత్తాత్ - ప్రేయోఽన్యస్మాత్సర్వస్మాత్ - అన్తరతరం యదయమాత్మా- ఆత్మానమేవ ప్రియముపాసీత. ౨-४-౫ నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియంభవతి ఆత్మనస్తు కామాయ సర్వంప్రియం భవతి.

చున్నాడు. కాన ఆనన్దరూపుని సర్వభూతములు ప్రేమించుట సహజము. ఏనం = జ్ఞాని అన్నను భేదముగలదు. జ్ఞాని బ్రహ్మయే అగుచున్నాడు. మాణ్డూక్యము 3—౨—౯ మంత్రము.

తాత్పర్యము:— ఆ బ్రహ్మము నిక్కముగా తద్వనము, అను పేరుతో ప్రసిద్ధమై యున్నది. తద్వనమనియే దానినుపాసించవలెను. ధ్యానించవలెను. అనుభవైక వేద్య మొనర్చుకొనవలెను. ఎవడు దానిని ఇట్లు తద్వనముగా అనుభవైకవేద్య మొనర్చుకొనునో వాడే నిజమైన జ్ఞాని. తద్వనమైన ఆ బ్రహ్మమును, తజ్జ్ఞానిని, లోకములోని భూతజాలమంతయు గాఢముగా వాంఛించుచున్నది. ప్రేమించుచున్నది. తద్వనమనగా సమస్త వస్తు భూతజాలమునకును అంతరాత్మయయి ఆరాధ్యమయి ప్రేమపాత్రమయి వెలుగొందెడి ఆనంద నిలయము.

౭ వ మంత్రము శ్రుతిః

ఉపనిషదంభో బ్రూహీత్యుక్తా
త ఉపనిషద్బ్రాహ్మీంవావత ఉపనిషద
మబ్రూమేతి ॥

భోః = స్వామీ; ఉపనిషదం = ఉపనిషత్తును; బ్రూహి = చెప్పగోరెదను. ఇతి = ఇట్లని (శిష్యుడడిగెను.) తే = నీకు; ఉపనిషత్ = ఉపనిషత్తు ఉక్తా = చెప్పబడినది; బ్రాహ్మీం = బ్రహ్మసంబన్ధమైన; ఉపనిషదం = ఉపనిషత్తును; వావ =

నిశ్చయముగా పూర్ణముగా; అబ్రూమ = చెప్పియున్నాము. ఇతి = ఇట్లని ( గురువు జవాబు చెప్పెను )

విశేషార్థము:— (1) ఉపనిషత్ శాన్తిమంత్రము రెండవ దానిలోని విశేషార్థము చూడవలెను.

(2) బ్రాహ్మీం = బ్రహ్మసంబన్ధమైనది 2 వ శాన్తిపాఠములో బ్రహ్మోపనిషదం అన్నదియె శ్రీ శంకరులవారు బ్రాహ్మణజాతిసంబన్ధమైన అని అర్థము చెప్పుచున్నారు. అట్లు చెప్పవలసిన అగత్యము లేదు. ఉపనిషత్తులలో * జాతి మతకుల భేదములు చేయబడలేదు. అట్లు చేసినారని ఎంచినను ద్విజులలో భేదము లేదు. బ్రాహ్మణ క్షత్రియులలో నసలే భేదము లేదు. ఛాందోగ్యములో క్షత్రియులు బ్రాహ్మణులకు ఉపనిషద్రహస్యములు బోధించినట్లుకలదు. ఇట్లు శ్రీ శంకరులవారు బ్రాహ్మణ జాతి సంబన్ధమైన అని చెప్పుటకు కారణము 8 వ మంత్రము అయియుండవచ్చును. అందులో తపస్సు, కర్మ, వేదవేదాంగాధ్యయనము చెప్పబడి యున్నవి. అవి అన్నియు శంకరులవారి కాలమున బ్రాహ్మణ విధులయి యుండనోపును. అందువలన వారిట్లు చెప్పిరాయని శంక కలుగును.

(3) అబ్రూమ = చెప్పితిమి, భూతకాలమును దెలుపును. దానిని శ్రీ శంకరులవారు భవిష్యత్కాలముక్రింద అన్వయించిరి. చెప్పెదము అని అర్థముచేసిరి. అదియు 8 వ మంత్రమునుబట్టియే

---

* శిష్యుని కులమేదియో చెప్పబడలేదు. అందుచేత బ్రహ్మవిద్య వర్ణ వివక్షత సేయక చెప్పవచ్చునని ఊహించవచ్చును.

అని ఎంచవలెను. ఈ మంత్రములో "ఉక్తా" "అబ్రూమ" రెండును భూతకాల సంబన్ధమైన క్రియలే వాడబడెను. రెండు మార్లు ఉపనిషత్ చెప్పబడెను. అందుచేత ఉపనిషత్ ఈ మంత్రముతో పూర్తి అయినది అని ఎంచవలెను. అంతమందే యిట్టి ద్వ్యుక్తి కలుగుచుండును.

(4) బ్రూహి = అనగా చెప్పవలెను అని శిష్యుడడిగినట్లు కలదు. * నాలుగు ఖండములలో జేసిన ఉపదేశమును విని మరల శిష్యుడిట్లు ప్రశ్నించుటకు కారణమేమి ఈ ప్రశ్నకు శ్రీ శంకరుల వారు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చిరి.

(1) ఇంతవరకు ఆత్మసంబన్ధమైన ఉపనిషత్ చెప్పబడినది. ఇక ముందు బ్రాహ్మణజాతి సంబంధమయిన ఉపనిషత్ చెప్పబడును.

(2) బ్రహ్మసంబన్ధమైన ఉపనిషత్ చెప్పబడినది, అది పూర్తిగా జెప్పబడనది. ఇంతకంటె మరేమీ లేదు అని తెలిసికొనుటకే శిష్యుడిట్లడిగెను.

(3) మీరు చెప్పిన ఉపనిషత్తుకు సహకారసాధనలుకలవా? ఉంటే తెలుపుడు అని శిష్యుడడిగెను, దానికి గురువు అట్టిది లేదని స్పష్టపరచెను. * ప్రశ్నోపనిషత్తులో "నాతఃపరమస్తి" అని పిప్పలాదమహర్షి తెలిపెను, అట్లె యిచ్చటను ఉపనిషత్ పూర్తి అయినదని గురువు తెలిపెను, అట్టయినచో 8 వ

* అతడు మూఢుడని ఎంచవీలుకాదు అయితే ఈ విద్యకొఱకు యత్నించడు. గురువులు ఇంత త్వరలో బోధించరు.

* ప్రశ్నోపనిషత్తు 6 వ ప్రశ్న 7 వ మంత్రములో

మంత్రము ఎందుకు చెప్పబడెనని ప్రశ్న ఉదయించును, దానికి శ్రీ శంకరులవారిట్లు ప్రత్యుత్తర మిచ్చుచున్నారు, అవి బ్రహ్మవిద్య తెలుపుటకుపాయములుగాక తత్పూర్వమందు జరుగవలసిన సాధనగా నుపయోగపడును, "మోక్షమిచ్ఛన్ సదాకర్మ త్యజేత్ ఏవసాధనం ౹ త్యజేదేవహితజ్జ్ఞేయం త్యక్తుః ప్రత్యక్ పరంపదం" అనువాక్యముల నుల్లేఖించి కర్మ వదలుటయే జ్ఞానము పొందుటకు అవకాశమిచ్చునని శ్రీ శంకరులవారు తెల్పిరి.

* ముణ్డకములో "పరీక్ష్యలోకాన్ " ———— "

* కఠోపనిషత్ "నహ్యధ్రువైః ప్రాప్య తే హిధ్రువంతత్" అని చెప్పబడియున్నది. బ్రహ్మసూత్రములలో "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని కలదు. వేదవేదాంగాధ్యయనము, వేద చోదిత కర్మాచరణము అయిన పిమ్మటనే సామాన్యముగా ఉపనిషద్విచారణ ఆరంభమగుచున్నది. బ్రూహి అని శిష్యుడు అడుగుటకు ఒక కారణము చెప్పవచ్చును. ఈ ఖండము ౩ వ మంత్రములో ఇంద్రుడు బ్రహ్మను తెలిసికొనెను అనికలదు. బ్రహ్మజ్ఞానము పొందిన ఇంద్రుడే 4-5-6 మంత్రములలో తన అనుభవములను ప్రకటించి యుండెను. తైత్తిరీయము పురుష సూక్తములో "వేదాహమేతం పురుషం మహాన్తమ్" అజ్ఞాని ప్రకటించెను. ఇట్టి ప్రకటనలు ఇతర ఉపనిషత్తులలోను కలవు. వసన్తకాలమున మామిడిచిగుళ్లు మెక్కిన కోకిల తన ఆనంద

* ముణ్డకము 1 ఖండము 2 మంత్రము 12

* కఠోపనిషత్తు 2 అ. 10 వ మం బ్రహ్మసూత్రములో 1.1-1

మును పట్టజాలక పంచమ స్వరమున గానము చేయుచుండును. అట్లే శ్రీ విద్యారణ్యస్వామి "ధన్యోఽస్మి" అని ప్రకటించెను. అట్లే శ్వేతాశ్వతరములో 3 వ ఖండము 21 వ మంత్రములో "వేదాహమేతం అజరం పురాణం" అని ఋషి ఘోషించెను. అదే అధ్యాయములో 8 వ మంత్రములో పురుషసూక్త వాక్యమునే ప్రకటించెను. మహానారాయణము 15 వ పనసలో "అహమస్మి బ్రహ్మాహమస్మి" తైత్తిరీయములో "స ఏకం" అనియు తైత్తిరీయములో 3–10 పనసలో "అహమస్మి ప్రథమజా" "అహమన్న మహమన్నం" అనియు జ్ఞాని ప్రకటించెను. ఈశావాస్యము 16 వ మంత్రములో "యోఽసావసౌ పురుషస్సోహమస్మి" నేనే ఆ పురుషుడను అని తెలిపెను. పురుషసూక్తములో ఇంద్రుడు తన బ్రహ్మజ్ఞానమును ప్రకటించెనని ప్రత్యేకముగా తెలుపబడెను. "శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః" ఆ శక్రుడు అనగా నింద్రుడు ప్రకటించిన వాక్యములు మూడని ఎంచవచ్చును. శిష్యుడే మూడు మంత్రములలో ఇంద్రుడు చెప్పుచున్న ఉపదేశమునుగ్రహించి అంతకంటెపరమ రహస్యము కలదాయని తెలిసికొనుటకై గురువును బ్రూహి అని అడిగెను. "గురువు" ఇదంతయు నుపనిషత్సారమే మా భావనే అని తెలుపుటకు రెండు పదములను వాడెను.

(1) ఉపనిషత్ = చెప్పబడెననగా దేవేన్ద్రుడు చెప్పినదంతయు ఉపనిషత్తే. అబ్రూమ = మేము చెప్పితిమి. దేవేంద్రుడు చెప్పినదంతయు మాభావమే అని చెప్పెను. ఈ అన్వయము సమంజసముగా నుండునో, విజ్ఞులు యోచింతురుగాక.

( 4 ) వావ=నిశ్చయముగా సంపూర్ణముగా ఏమాత్రమూ కొఱత లేకుండా చెప్పితిమి. పిప్పలాదమహర్షి వాక్యమే ఇచ్చట అనుస్మరించును. సమగ్రమైన బోధనే జరుగును. ఏసునాధుడు కూడ ఇతర ప్రవక్తలకును, పండితులకును తెలియని యంశములు దాచబడినదెల్ల అనగా ఉపనిషద్రహస్యమైనదెల్ల మీకు తెలుపబడినది. అని శిష్యులకు తెలిపెను. ఉపనిషద్రహస్య బోధను మహర్షులు అర్హులైన శిష్యులకు దాపరికము లేకుండ జ్ఞానదానము చేయుచుండిరి. ఇక్కాలమున రామకృష్ణ పరమహంసలవారు అర్హులయిన శిష్యులకు జ్ఞానానందానుభవము సమాధియోగమున సమకూర్చుచుండిరి.

తాత్పర్యము:— ఆర్యా! నాకు ఉపనిషత్ బోధించుడు అని శిష్యుడు ప్రార్థించెను. ఓ సౌమ్యుడా! నీకు ఇంతదనుక చెప్పబడినది ఉపనిషత్తే సుమా! బ్రహ్మసంబంధమైన ఉపనిషత్ రహస్యజ్ఞానమంతయును అరమర లేకుండ ఆవంతయు దాచకుండ సంపూర్ణముగా నిశ్చయముగా నీకు మేము ఉపదేశించియున్నాము. అని గురువు శిష్యునకు ప్రత్యుత్తరమిచ్చెను. ఇందు రీతి చెప్పినదెల్ల మాభావమేయని చెప్పెను.

౮ వ మంత్రము 8 శ్రుతిః ॥

తస్యై తపోదమః కర్మేతి ప్రతిష్ఠా
వేదాస్సర్వాఙ్గాని సత్యమాయతనం ॥

తపః = తపస్సు; దమః = దమము; కర్మ = కర్మ; ఇతి— ఇట్టివి తస్యై = దానికి ప్రతిష్ఠా=ఆధారములు, లేక పాదములు

వేదాః = వేదములు; సర్వాంగాణి = సర్వమైన అంగములు; సత్యం = సత్యము, ఆయతనం = నిలయము లేక నివాసము.

విశేషార్థము:— (1) తస్యై = ఉపనిషత్తుకు అని అర్థము చేయుచున్నారు. బ్రహ్మప్రతిపాదనమునకు అని అర్థముచెప్పు చున్నారు. అనగా ఉపనిషత్తులో చెప్పబడిన జ్ఞానమునకు అని అర్థము. ఉపనిషద్బోధకోరుటకును పొందుటకును ముందుగా నుండవలసిన అర్హతలను ఈ మంత్రము తెలుపుచున్నది, పూర్వ సాధనకు ముఖ్యాంగములు ఇచట ఉపహరింపబడెను. కాబట్టి ఉపనిషత్ ప్రతిపాదితమైన జ్ఞానమునుపొందు నధికారమునకు అని చెప్పవలెను.

తపః = శరీరేంద్రియ మనస్సమాధానము తపస్సనియు దమ మనగా విషయములనుండి నివృత్తి అనగా ఉపశమము అనియు కర్మయనగా అగ్నిహోత్రాది కార్యములనియు (శ్రీ) శంకరుల వారు తెలిపిరి, మొదటి రెండు భావ్యములు కర్మయను పదము నకు విపులార్థ మియ్యవలెను, సర్వసాధన కలాపమని చెప్ప వలెను, నిష్కామ కర్మయని కొందఱు చెప్పుచున్నారు, అట్టి నిర్వచనమునకు కారణము కనుపడదు,

(3) ఇతి = అని వాడుటవలన ఇతర సాధనములు కూడ సూచింపబడినవని (శ్రీ) శంకరులవారి అభిప్రాయము, అట్లే కావచ్చును.

(4) ప్రతిష్ఠా = వేదాధ్యయనమును నిలుపుకొనుట అని యొక అర్థమును చేయుచున్నారు, బ్రహ్మజ్ఞానమును నిలుపు కొనుటయని మరియొక అర్థము చెప్పుచున్నారు, ప్రతిష్ఠ అనగా

కాళ్లు అని ఒక అర్థము కలదు, కాళ్ళమీద మనుజుడు యెట్లు నిలబడునో యట్లే బ్రహ్మవిద్య యీ సాధనములమీద నిలువ బడినదని చెప్పుచున్నారు, అసలు పదమునకు అర్థము చక్కగా నిలువపెట్టబడినది ప్రతిష్ఠ ఈ సాధనముల ఫలితము చిత్తశుద్ధి "జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః" మహా భారతము శాన్తిపర్వము 204/౮ లో నున్నది, పాపకర్మము క్షీణించిన పిమ్మటనే పురుషునకు జ్ఞానోత్పత్తి యగునని తెలుపు చున్నది, మహాభారతమును "స్మృతి" యని శ్రీ శంకరులవారు పిలుచుచున్నారు, గమనించదగును.

* (5) వేదాః = 4 వేదములు పై ప్రతిష్ఠ అను పదము నకు "కాళ్ళు" అని అర్థము చెప్పిన యెడల వేదములను శిర స్సని పిలువవలెను, అని శ్రీ శంకరులవారు సూచించిరి. వేదము లందుండు గౌరవము అట్లు తెలుపబడుట భావ్యమే.

(6) సర్వాంగాని = అను పదమునకు వేదముల షడంగ ములు అనియొక అర్థము. అట్లుగాక బ్రహ్మవిద్యయను శరీరము నకు సర్వావయవములు అని మరియొక అర్థము. శంకరులవారు రెంటిని తెలిపిరి. 2 వ అర్థమే భావ్యము.

(7) సత్యం = అనగా సత్యవాక్యపరిపాలనమని యొక అర్థము. వాక్కు, మనస్సు, శరీరముల అమాయకత్వము సత్యమని పిలువబడుచున్నది. * ప్రశ్నోపనిషత్తులో "నయేషు

* వేదములనగా జ్ఞానబోధకములగు ప్రామాణగ్రన్థములన్నియు అని చెప్పవలెను.

* ప్రశ్నోపనిషత్ 1 వ ప్రశ్న 16 వ మంత్రము.

జిహ్మమనృతం నమాయాచ" ఎవనియందుమాయ, మోసము, అబద్ధము లేదో వారు సత్యవంతులు. విష్ణుస్మృతిలో వెయ్యి అశ్వమేధములకన్న ఒక సత్యవచనమే మేలని చెప్పబడెను. ఇచ్చట సత్యమనగా అచ్చముగా సత్యవాక్యపరిపాలనమేకాదు. * ముణ్డకములో "సత్యమేవజయతే" సత్యస్యపరమం నిధానమ్" సంపూర్ణ సత్యము మీద అనగా పరబ్రహ్మమీద ఆధారపడిన జీవితము ఇచ్చట పూర్ణార్థమే యివ్వవలెను. ఏలయన ఈ సత్యము ఉపనిషత్తు కాలితనము అనగా ఉపనిషత్తు నిలిచెడి ఆశ్రయము, నివాసస్థానము. ఈ సత్యమును వదలిన వారికి బ్రహ్మవిద్య లభించనేరదు. సత్యమనగా పరమాత్మయని కూడ చెప్పవచ్చును, చెప్పవలెను. * తైత్తిరీయములో "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అనగా ఆనందమునకు బ్రహ్మయే ఆధారము అని చెప్పబడినది. ఉపనిషత్ యొక్క ప్రయోజనము బ్రహ్మజ్ఞాన సంపాదనము, బ్రహ్మసందానుభవము అయియున్నవి. కాన ఆ పరమాత్మనే ఆధారముగాగొని సంపూర్ణ జీవితము నడుపవలెను. ఇదియే శ్రీ గాంధిమహాత్ములు సత్యమునకు చెప్పెడి అర్థమయియున్నది.

తాత్పర్యము:— ఈ ఉపనిషత్తులో చెప్పిన బ్రహ్మజ్ఞానమును ఒక శరీరముతో పోల్చిన యెడల దానికి మూలాధారము లగు పాదములు మూడు తపస్సు, దమము, విపులార్థమున కర్మ, వేదములు లేక జ్ఞానప్రబోధక ప్రమాణ గ్రన్థములు,

* ముణ్డకము 3 ఖండము 1 మంత్రము 6

* తైత్తిరీయము 2 అ 5 వ పనస.

దానికి సర్వావయవములు, సత్యమే పరమాత్మయే దాని ఆల వాలము, లేక నివాసస్థానము. ఈ మన్త్రిమునకు భావమేమ నగా సర్వోత్తమమైన అనిన్ద్యమైన చరిత్రముగల మానవుడే, బ్రహ్మజ్ఞానము పొందుటకు అధికారి. వానికే బ్రహ్మజ్ఞానము లభ్యమగును, పశుజీవితముగాని అసురజీవితముగాని నడుపు వానికి దీనియందధికారము లేదు.

౯ వ మంత్రము:— శ్రుతిః ॥

యోవా ఏతామేవం
వేదాపహత్య పాప్మాన మనన్తే స్వర్గే
లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి ॥

యః = ఎవరు; ఏతాం = ఈ బ్రహ్మవిద్యను; వై = నిశ్చయముగా ఏవం = ఈ విధముగా; వేద = తెలిసికొనుచున్నాడో; సః = వాడు, పాప్మానం = పాపమును; అపహత్య = నశించునట్లుగాగొట్టి; అనన్తే = అంతములేనిదియు; జ్యేయే = ఘనతమమైనట్టియు, స్వర్గే = ఆనందమయమయిన లోకే = లోకమునందు ప్రతితిష్ఠతి = సుస్థిరుడై యున్నాడు. ప్రతితిష్ఠతి = సుస్థిరుడయి యున్నాడు.

విశేషార్థము:— (1) ఏతాం = బ్రహ్మవిద్యను లేక ఉపనిషత్తును అని చెప్పవచ్చును. లేదా బ్రహ్మయనియే యనిచెప్ప వచ్చును. బ్రహ్మయని చెప్పుటయే సమంజసము.

(2). పాప్మానం = పాపమును అనగా పుణ్యపాపముల రెంటిని ధర్మాధర్మముల రెంటిని అవిద్యను, కామములను, కర్మ

మును పోగొట్టుకొనవలెను. అనగా అతీతుడు కావలెను. 2 వ భాగము 4 వ మంత్రములో చెప్పిన అమృతత్వమును పొందుటకు సర్వపుణ్యపాప కర్మలన్నిటిని దాటవలెను.

(3) స్వర్గేలోకే=సామాన్యార్థము స్వర్గలోకము. * ముండకములో చెప్పిన నాకముకాదు. ♦ (ముండకము 1 ఖండము 2 వ మంత్రము 5–6–10 లో) బ్రహ్మలోకము కాదు. * భగవద్గీతలో చెప్పిన విశాల స్వర్గలోకముగాదు. ఇచ్చట స్వర్గలోకమునకు రెండు విశేషణములు చెప్పబడినవి. (1) అనన్తము (2) జ్యేయము = అవినశ్వరమగు ఉత్తమోత్తమమగు ఆత్మానందఘనమగు అని అర్థము శ్రీ శంకరులవారును అట్లె అన్వయించిరి. లోకే అనగా ప్రత్యేకలోకము, ఒకచోట యున్నదని అర్థము కాదు. ఆ సంపూర్ణ పరమాత్మ యే స్థాయిలోనుండునో దానికే లోకమనిపేరు. ఇచ్చట నీమూడు పదములకు కలిపి నిరతిశయమగు పరబ్రహ్మానందము అని అన్వయించవలెను.

---

* ముండకము 3 ఖండము 2 మంత్రము 6 లో పరిముచ్యన్తి సర్వే అనియును, 9 వ మంత్రములో గుహాగ్రంధిభ్యో విముక్తః తరతి పాప్మానం అనియును చెప్పబడినవి. ఈ మంత్రములన్నియు నాకపరమార్థమును సూచించుచున్నవి,

♦ ముండకము 2 ఖండము 1 మంత్రము 10 లో చెప్పిన అవిద్యాగ్రన్థి యనియు, ముండకం 3 ఖండము 1 మంత్రము 3 లో పుణ్యపాపే విధూయ అనియును. 5 వ మంత్రములో “ క్షీణదోషాః ” అనియును

* భగవద్గీత 9 అ- 21 వ శ్లోకము,

తాత్పర్యము:— ఎవరీయుపనిషత్తులో చెప్పిన ప్రకారము బ్రహ్మను నిక్కముగా అనుభవైకవేద్య మొనర్చుకొను చున్నారో వారు పాపములను పాపమూల కారణములను పాప వాసనలను నశింపజేసి ప్రారబ్ధము సంచితము ఆగాములగు అన్ని కర్మలు నశించగా పుణ్యపాపముల కతీతులై అత్యుత్కృష్టమైన పరబ్రహ్మానందమును పొందుచు నాపరమాత్మలో సుప్రతిష్ఠిత మయి యున్నారు, నిజముగా సుప్రతిష్ఠితమై యున్నారు.



# ఉపనిషత్పత్రికె

ది 15–9–44 భాద్రపద బహుళ ౧౩ శీ శుక్రవారము.

## ★ కఠోపనిషత్ ★

### ప్రథమాధ్యాయః.

### ప్రథమవల్లీ-

శ్రుతిః ॥ హరిః ఓమ్. సహనావవతు । సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై ॥

దీని ప్రతిపదార్థము, విశేషార్థము, తాత్పర్యము, కేనోప నిషత్తునుండి ఉల్లేఖించవలెను.

ఓం నమో భగవతె వైవస్వతాయ మృత్యవె
బ్రహ్మవిద్యాచార్యాయ నచికేతసేచ ॥

౧ ॥ శ్రుతిః– ఓం ఉశన్హవై వాజశ్రవసస్సర్వ
వేదసందదౌ । తస్యహ నచికేతానామపుత్ర ఆస ॥

వాజశ్రవసః = వాజశ్రవుని కుమారుడగు వాజశ్రవసుడు, ఉశన్ = బుద్ధిపూర్వకముగా; సర్వవేదసం = తనకున్న దంతయు (లేదా) జ్ఞానులకు దదౌ = అర్పించెను; హ వై = నిశ్చయము, తస్య = అతనికి; నచికేతా నామ = నచికేతుడను పేరుగల, హ = నిక్కము (ప్రసిద్ధుడగు) పుత్రః = పుత్రుడు; ఆస = ఉండెను.

విశేషార్థము:— ఉశన్ = యాగములవలన కలుగు ఫలితము లందు అభిలాషకలవాడై అని అర్థము చెప్పుచున్నారు. స్వర్గ భోగాభిలాషియని మరియొకరీతిని అర్థము చెప్పుచున్నారు. ఉశన్ అను పదమునకు వైదికభాషలో సంతోషపూర్వకముగ బుద్ధి పూర్వకముగా అని అర్థము కలదు. ఇచ్చటను అట్లే అర్థము చెప్పుట భావ్యము. ఉశన్ అనునది ఉశనాయాపాన్తరమే, ఆస్తి సర్వస్వము ఇచ్చుచున్నాడుగాన బుద్ధిపూర్వకముగా నిచ్చు చున్నాడనియే చెప్పుట భావ్యము. లేనిచో నేకాంతయయినను అతడు మిగుల్చుకొనవచ్చును. సర్వార్పణము చేయవలసిన నిర్బన్ధము లేదు. ఫలాభిలాషతో చేసినాడన్న న్యూనత కల్పించు టకు తగిన కారణము అగుపడదు.

(2) సర్వవేదసం - వేద అనగా ధనమనిఅర్థముకలదు. వేదసం అనగా ఆస్తి ధనము అని అర్థము కలదు. సర్వవేదసం అనగా సమస్త ఆస్తి అని చెప్పవచ్చును. వేద అను పదమునకు జ్ఞాన మని అర్థముకలదు. వేదస్సనగా జ్ఞానమే ధనముగాకలవాడు సర్వవేదస్సనగా సంపూర్ణజ్ఞానముకలవాడని చెప్పవచ్చును. అట్టి జ్ఞానికే వాజశ్రవస్సు ఇచ్చుటచే దక్షిణలోని లోపములు

ఆ జ్ఞానికి తెలియకపోవు. ఉత్తమమయిన దానము పాత్రుడయిన వానికే చేయవలెను. జ్ఞాని అందరికంటె పాత్రుడనుట నిస్సందేహము.

(3) పుత్ర = పుత్రుడను పదమునకు = వ్యుత్పత్త్యర్థము పున్నామ నరకమునుండి తల్లిదండ్రులను కాపాడువాడు (పున్నామ్నో నరకాత్ త్రాయతే ఇతి పుత్రః) "ఆత్మావై పుత్రనామాసి, అంగాదంగాత్సంభవసి" భార్యాభర్తల అంగ సమ్మేళనమునుండి ఉద్భవించినవాడు, తండ్రియే పుత్రుడుగా అయినవాడు. అనగా పుత్రుడు తండ్రియొక్క ప్రతిబింబము. ప్రతినిధి. నచికేతస్సులో పరిణమించనున్న ఉత్తమ జ్ఞానస్థితికి బీజకారకుడు తండ్రి వాజశ్రవస్సే కాన అతని చరిత్ర నింద్యమని భావించుట వాడిగాదు.

(4) వాజశ్రవస్ = వాజమనగా యజ్ఞము, సంపద, నెయ్యి, యుద్ధము, అన్నము, శ్రవసః అనగా కీర్తికలవాడు. వాజశ్రవ అనగా యుద్ధములో ఖ్యాతిపొందినవాడు అని చెప్పవచ్చును. అప్పుడది క్షత్రియునకు తగిన విశేషమగును. ఇచ్చట వాజశ్రవస్సు బ్రాహ్మణుడని స్పష్టము. 7 వ మన్త్రము చూడనగును. అందులో నచికేతస్సు బ్రాహ్మణుడని చెప్పబడెను. తండ్రికూడ బ్రాహ్మణుడనియే యూహించవలెను. కాన నితడు తన సంపద నర్పించి యజ్ఞయాగాది క్రతువులుచేసి అధికముగానన్న దానము చేసి ఖ్యాతి పొందినవాడని యర్థము. నచికేతస్సు త్యాగ భూమిలో మొలచిన మొలకయే.

తాత్పర్యము:— యజ్ఞయాగాది క్రతువులు జేసి యన్న ప్రదాతయయి ప్రఖ్యాతివడసిన సార్థకనాముడగు వాజశ్రవస్సు సర్వస్వమును జ్ఞానులకు బుద్ధిపూర్వకముగా సంతోషముతో నర్పించెను. అతనికి ప్రసిద్ధుడును తండ్రిని ఉద్ధరించగలవాడును, నచికేతస్సను పేరుగలవాడును అగు పుత్రుడొకడుండెను.

౨ వ మన్త్రము- శ్రుతిః 2

తగ్ంహ కుమారం సన్తం దక్షిణాసు
నీయమానాసుశ్రద్ధా ఆవివేశ । సోఽమన్యత ॥

దక్షిణాసు = దక్షిణలు; నీయమానాసు = తీసికొనిపోబడు చుండగా; సన్తం = ఉత్తమకార్యసిద్ధి కలుగుటకు; తం = ఆ; కుమారం = నచికేతస్సులో, శ్రద్ధా = శ్రద్ధ; హ = నిశ్చయముగా ఆవివేశ = ప్రవేశించెను, సః = అతడు; అమన్యత = యోచించెను.

విశేషార్థము:— (1) దక్షిణాసు = దక్షిణలు అనగా ఋత్విజులకు ఇచ్చునవి దక్షిణలు అని చెప్పుదురు. ఇచ్చట ఋత్విజులకేగాక ఇతరులకుగూడ దానములిచ్చునవియే యని చెప్పవలెను. శ్రీ శంకరులవారును అట్లే చెప్పిరి. దక్షిణ అను పదమునకు కుడిచేతితో నిచ్చునదియని అర్థము, తీసికొనువానిని పోషింపు శక్తి కలిగి [illegible]

[illegible] ప్రతిగ్రహాలను పాపించ సమర్థమగు వస్తువునిచ్చినపుడే దక్షిణయని అనిపించుకొనును. ఇచ్చట దక్షిణాసు అనగా దక్షిణగా నిచ్చుటకై తేబడెడి వస్తుజాలము జీవజాలము అని చెప్పవలెను.

(2) కుమారం = అనగా పసివాడని అర్థముకాదు. సన్తానోత్పత్తి చేయజాలనివాడని అర్థము.

అట్లయినచో ఊనవయస్కుడు 14 లేక 15 సంవత్సరముల వయస్సు వాడని చెప్పవచ్చును, లేక కుమారుడు = పుత్రుడు అని సామాన్యార్థము చెప్పవచ్చును.

(3) సన్తం = దీనిని క్రియావిశేషణముగా ఎంచుచున్నారు. అప్పుడు పిల్లవాడయినప్పటికిని అను అర్థము చేయుచున్నారు. అట్లుగాక దీనిని క్రియగా నెంచవచ్చును. అప్పుడేదోయొక ఘన కార్యము నిర్వహించుటకై అని అర్థమగును. రానున్న మహత్తర కార్యమునకు సూచకముగా అని అర్థము,

(4) శ్రద్ధా = శ్రద్ధయని సామాన్యార్థము. తండ్రి క్షేమమును కోరెడి ఆస్తిక్యబుద్ధియని శ్రీ శంకరులవారు అర్థము చేయుచున్నారు. ఇంకొక విధమున యోచించవచ్చును. నచికేతస్సు తండ్రిచేయు యజ్ఞయాగాది క్రతువులను అన్నప్రదానమును, తన యింటికివచ్చెడి అతిథులను చూచుచుండెను. ఈ క్రియాబాహుళ్యమంతయు జ్ఞానప్రదమా? ముక్తిప్రదమా? కాదా? యను సందేహము అతనికి పొడమి యుండవచ్చును. బాహ్యయజ్ఞమందుగాక ఆంతరఙ్గిక యజ్ఞమునందు లక్ష్యము కుదిరి యుండవచ్చును. ఇచ్చట దైవము కలడను విశ్వాసమే గాక యజ్ఞమే జీవిత తరణోపాయమను విశ్వాసమేగాక ఆంతరంగిక యజ్ఞము కలదనియు ఆత్మజ్ఞానము పొందవలెననియు, స్ఫురింపచేయు నూతన భావాంకురమే శ్రద్ధయని చెప్పవలెను. ఏలయన:—అచ్చటనుండి సరాసరి యమునియొద్దకు బోయిన

నచికేతస్సుకు జ్ఞానమందు కలిగిన గాఢాభిలాషయు ఇతర విష యములందు కలిగిన విరక్తియు ఇప్పుడింకురించిన శ్రద్ధయొక్క పరిణామమే. ఈ మధ్యకాలమున అతనికస్యమైన బోధకలుగ లేదు. కాబట్టి శ్రద్ధయనగా నూతన దృక్పథము నూతనభావాం కురము. అన్తస్స్ఫురణలోని భాగము అని చెప్పవలెను. పవిత్ర స్నానమాచరించిన ఏసునాథునకు దైవానుగ్రహము పావురము రూపమున అతని శిరస్సుపైవ్రాలి లోన ప్రవేశించెనని కలదు. అట్లే యిచ్చట శ్రద్ధ నచికేతస్సునందు ప్రవేశించెను. ఆ శ్రద్ధ జ్ఞానార్థమాత కలిగించు అన్తఃస్ఫురణ, ప్రత్యేక దివ్యలక్షణము, అని ఎంచవలెను.

తాత్పర్యము:- యజ్ఞాన్తమందు సర్వులకు దానధర్మములు చేయుటకయి వస్తుసంభారము, జన్తుజాలమును తీసికొనువచ్చు వేళ ఊనవయస్కుడగు నచికేతస్సునందు ఉత్తమకార్యసంఘట నార్థమై నూతనశక్తి యతనిలో నంకురించెను, అతడు దాని ననుసరించి యచ్చటి విషయములనుగూర్చి యోచింపసాగెను.

3 వ మంత్రము- శ్రుతిః ॥

పీతోదకాజగ్ధతృణా
దుగ్ధదోహానిరింద్రియాః॥
అనందానామ తెలోకా
స్తాన్సగచ్ఛతి తాదదత్ ॥

పీతోదకాః = నీళ్ళు త్రాగజాలనవి, జగ్ధతృణాః = గడ్డి మేయజాలనవి, దుగ్ధదోహాః=పాలెండిపోయినవి, నిరింద్రియాః= కట్టి తప్పిపోయినవి, అయినతాః = ఆ గోవులను, దదత్ =ఇచ్చు

నత్ప్రి, సః = మానవుడు లేక వాడు అనందాః = ఆనందములేని నామ = పేరుగల, తే లోకాః = ఆలోకములు, తాన్ = వానికి గచ్ఛతి = పోవుచున్నాడు. అనగా పొందుచున్నాడు.

విశేషార్థము:— (1) "పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరింద్రియాః" మొదటి మూడు సమాసములలో వాడిన క్రియలు పీత, జగ్ధ, దుగ్ధ, లేక అనబడిన అర్థము త్రాగబడిన తినబడిన పితకబడిన అన్న అర్థము చెప్పిన యెడల త్రాగిన నీరు కలవి, తిన్న గడ్డి కలవి, పితికిన పాలు కలవి, అని చెప్పవలసి వచ్చును. అట్లు చెప్పుటవలన అసలు భావము బోధపడదు. ఈ మూడు పనులు ఇదివరకే జరిగినవనియు ముందు జరుగు నవకాశము లేదనియు భావము, ఎందుకనగ అట్టి దానము నిష్ఫలమని రెండవపాదములో చెప్పబడుచున్నది. కాబట్టి నీరు త్రాగుటకు గడ్డి తినుటకు పాలు యిచ్చుటకు త్రాణలేనివని చెప్పవలెను. నిరింద్రియా అనగా ఇంద్రియము, శుక్లము, లేక వీర్యములేనివి ఆడపశువులు గనుక కట్టి ఈనశక్తి లేనివని అర్థము.

(2) అనందాః = అనగా సంతోషము లేనివి, సంతోషము కలిగించనివి, అని అర్థము. దానము చేసినవాడు తత్ఫలితముగా నిహాలోక పరలోక సౌఖ్యములను కోరవచ్చును. మొదటి పాదములో తెల్పిన పశువుల దానము సౌఖ్యప్రదము కానేరదు. ఈ పశువులు ప్రతిగ్రహీతకు లాభించక భారమగును. దాతయొక్క భారము తొలగుటయే ఇట్టి దానముయొక్క ప్రయోజనము. 2 వ మంత్రములో దక్షిణనుగూర్చి చెప్పిన విశేషార్థము ఇచ్చట యోచింపనగును. ఈ పశువులలో యేదికాని,

కొన్నికాని, అన్నికాని ప్రతిగ్రహీతలను పోషింప లేవు. సామాన్యముగా గోదానము చేయునపుడు సంవత్సరము లోపుగా దానికి సరిపోవు మేతకూడ దానము చేయుదురు. అప్పుడు గోదానము తీసికొన్న వారికి సంతోషప్రదము. తీసికొన్న వాడు సంతసించినపుడు దాతకు సౌఖ్యము కలుగును. ( Give so as not to embarass ) అని మహాత్మాగాన్ధిగారి ప్రవచనము. ఏది యిచ్చినను పుచ్చుకొనువానికి ఇక్కట్లు కలుగకుండునట్లు ఇయ్యవలెను. ఆ సూత్రమే యీ మంత్రములో నిమిడియున్నది. ఇట్టి దానమువలన దాతకు శిక్షకూడ కలుగుచున్నది. అందుచేతనే రెండవ పాదములో అనందలోకము కలుగునని చెప్పబడెను. "అనందానామ తే లోకాః" అను పదములు బృహదారణ్యకోపనిషత్తులో వాడబడెను. "అసుర్యానామ తేలోకాః" అను పదములు ఈశావాస్యము ౩ వ మంత్రములో వాడబడినవి. అసుర్యా అనగా వెలుతురు జ్ఞానములేని లోకములు. అనందా అనగా సౌఖ్యము ఆనందములేని లోకములు ఈ రెండు ఒకటే యని తలంచవచ్చును. కాన విధి యుల్లంఘనము వలన కలిగెడి శిక్ష ఈ పదములలో నిర్దేశింపబడినది.

(౩) నామ = అనగా పేరుకలవి. లేక నిశ్చయముగా అని కూడ చెప్పవచ్చును. దదత్ =ఇచ్చువానికి, ఇచ్చువాడు దాత మొదటిపాదములో చెప్పిన దుర్లక్షణములుగల పశువులనిచ్చు వానికి రెండవపాదములో చెప్పిన అనందానామలోకములు కలుగుట నిశ్చయమే. ఇచ్చట వాజశ్రవస్సు విశ్వజిద్యాగముచేసెను. అని వ్యాఖ్యాతలు తెలుపుచున్నారు. తత్సూచకమగు పదము

సర్వవేదసం అని మొదటి మంత్రములో కలదు. కాన సాంప్రదాయ సిద్ధమగు ఈ ప్రతీతి నిశ్చయమై యుండవచ్చును. అట్టివాడు తనయందు స్థిరచరాస్తులను పశుధనమంతయును దానమియ్యవలెను. ఇచ్చునపుడు అధమాధమమైనవికూడ నందులో చేరును. అట్టి సర్వప్రదాతకు ఈ మూడవ మంత్రలోని సూత్రమును ఎట్లు వర్తింప చేయనగును. మంచివి యుంచుకొని చెడుగువి యిచ్చిన యెడల దాతయొక్క దుర్బుద్ధి ఋజువగును. అట్లుగాక వరుసగా నిచ్చునపుడు అన్నిటిలో చెడుపశువులును జేరును. ఈ చెడుపశువులును ఉంచుకొనరాదను నెపము చెప్పిన యెడల నట్టి పశుహింసకు ఆ యజమాని పూనుకొనకపోవచ్చును. ఇట్టి పశువులుండుట పోషణ లోపమునుకూడ సూచించదు. ఏలయన వృద్ధత్వమున ఇట్టి దుర్లక్షణములు ప్రతి పశువుకును కలుగును. కాన ఈ పశుదానమువలన వాజశ్రవసుడు దోషముచేసినాడని ఎంచుటకు వీలులేదు. ఒక్కఊహ చేయనగును మొదటినుండియు చేసిన అఖండ దానములను నచికేతస్సు చూచియుండకపోవచ్చు. లేదా చూచి సంతసించవచ్చును. చిట్టచివరకు జరిగెడి ఈ దానములవలన అతనిమనస్సు నొచ్చియుండవచ్చును. ఆ యాగములోని అఖండ దానభావమును గ్రహించకయో మరచియో చిట్టచివరకు కలిగిన దైన్యస్థితిచే వేదననొంది యుండును. ఆవేదనా ఫలితముగా జ్ఞాపకమువచ్చిన సూత్రమును నచికేతస్సు పఠించియుండును. ఆ ఆవేదనయు నిష్ప్రయోజనము కాలేదు. అతనికొక యుత్తమ సత్యమును గోచరింప జేసెను. తానును తన తండ్రికి ధనమేననియు ధనమంతయు

ఆఖరకు కాలేకనియు తననుకూడ నితరులకు దానముచేయవచ్చు ననియు తండ్రికి జ్ఞాపకము చేసెను. శునశ్శేపుని కథయు నిట్లే తండ్రికి తనయునిపైగల అధికారమును ఋజువుచేయుచున్నది. హరిశ్చంద్రునికథ భార్యపై పుత్రునిపై పురుషునికిగల అధికారము ఋజువుచేయుచున్నది. పూర్వపు రోమక సామ్రాజ్యమున (Patria potistas) తండ్రికి సంతానముపై దానము చేయుటకును, విక్రయించుటకును అధికారము కలదని శాసన రూపమున అంగీకరింపబడెను. కాన పూర్వపు సాంప్రదాయము నను సరించియే నచికేతస్సు ఇంకను ఆస్తి మిగిలియున్నదని తండ్రికి మనవిచేసెను. ఈ మంత్రమును వాజశ్రవసునకు కలిగెడి శిక్షా రూపమునుగా వ్యాఖ్యానము చేయక ఉత్తమ కార్యారంభమునకు సంకురార్పణగా నచికేతస్సుకు గలిగిన మనోవేదనగానే భావించవలెను.

తాత్పర్యము:— వృద్ధత్వమువలనగాని, జాడ్యమువలనగాని, చెడిపోయిన పశువులు నీరు త్రాగలేనివి, మేత మేయలేనివి, పాలు వట్టిపోయినవి కట్టి ఈనశక్తిలేనివి, అయినజంతువులను దానమిచ్చినవాడు. సౌఖ్యరహితమైన అనందయను లోకమునకుబోవుట నిశ్చయము. తన తండ్రిచేయు సర్వైశ్వర్య దానములో నిట్టి పశువులుకూడ నున్నందున దానివలన తండ్రికి ఆపద కలుగునాయని యోచించిన నచికేతస్సునకు తనవంటి ఉత్తమ ధనము మిగిలియున్నదని స్ఫురించెను. తననుగూడ దానముచేయుమని తండ్రిని కోరెను.

౪ వ మంత్రము శ్రుతిః ॥

సహోవాచ పితరం
తతకస్మై మాందాస్యసీతి ।
ద్వితీయం తృతీయం తగ్ంహోవాచ
మృత్యవే త్వా దదామీతి ॥

తత = ఓ తండ్రీ; కస్మై=ఎవరికి; మాం=నన్ను; దాస్యసి= ఇచ్చెదవు, ఇతి = ఇట్లని, సః = ఆ నచికేతస్సు; పితరం = తండ్రితో; ఉవాచ = పలికెను. హ=నిశ్చయము; ద్వితీయం= రెండవసారి, తృతీయం=మూడవసారి (కూడనడిగెను) త్వాం= నిన్నును, మృత్యవే = యమధర్మరాజునకు; దదామి = ఇచ్చుచున్నాను. ఇతి = ఇట్లని; తం = వానికి, హ = నిక్కముగా (తండ్రి) ఉవాచ = పలికెను.

విశేషార్థము:— (1) కస్మై = ఎవనికి అనునపుడు అచ్చముగా ఋత్విజులకేకాదు. యముడు లోకపాలకుడు లోకపాలకునిగా యముని ఆహ్వానించి యుందురు. అట్లే దేవతలనందఱకును యజ్ఞకాలమున ఆహ్వానములు చేయబడును. ఆరాధనయు జరుగును. యజమాని అర్హతనుబట్టి దేవతలు ప్రత్యక్షముగా నరుదెంచుచుండిరి. ఒక్కొక్కప్పుడు అప్రత్యక్షముగానుండి యజమానుని మనోభావములను యజ్ఞములోని కార్యవిధానమును పరిశీలించుచుండిరి. ప్రత్యక్షముగానున్నపుడు వారికిచ్చెడి యాహుతులను స్వయముగా స్వీకరించుచుండిరి. ప్రత్యక్షముగానపుడు అగ్నిముఖమున లేక బ్రాహ్మణముఖమున స్వీకరించు

చుండిరి. అగ్నిహవ్యవాహనుడు, అతనిలో వ్రేల్చిన ఆహుతులను దేవతలకందిచ్చును, బ్రాహ్మణముఖమునయిచ్చినపుడు బ్రాహ్మణుడు దానిని అనుభవించును. ఆయనపొందెడి ప్రీతివలన దేవతలుకూడ ప్రీతినొందుదురు. అని ప్రతీతికలదు. కాబట్టి యజ్ఞయాగాదులలో ఆహ్వానింపబడిన దేవతలకు దాన ధర్మములుచేయుట సమంజసమే.

(2) దాస్యసి = అనగా నిచ్చెదవు. అనగా తనను దానమిమ్మని అదివరకే సూచించియుండెను, తానుకూడ తండ్రి దానముచేయ తగిన ఆస్తియని తెలిపి తనను యెవరికో యొకరికి దానమిమ్మని తండ్రికి మనవిచేసి యుండెను. తండ్రికాయధికారమున్నను తన తనయునియందుండు మోహముచే వెనుకాడుట సహజము. స్థిరసంకల్పుడయిన నచికేతస్సు ముమ్మారు బ్రతిమాలెను. ముమ్మారు కోరినపుడు అంగీకరించక తప్పదు. బౌద్ధమతములో త్రిశరణ్యము కలదు. మనలో ముమ్మారు చెప్పినయెడల ఒట్టుపెట్టుకున్నట్టేయని యర్థము.

(3) మృత్యవే = అనగా మృత్యువునకు అనగా మరణదేవతకు, అందుచే నచికేతస్సు చనిపోవునను అశ్లీలస్ఫురణము కలదు. అట్లుగాక మృత్యవె అనగా ధర్మరాజునకు అని అర్థము చెప్పవచ్చును. యముడు ధర్మరాజని ప్రసిద్ధి. సర్వధర్మములను నిష్పక్షపాతముగా తేల్చువాడు, అందువలననే అగ్నిహోత్రములో నొకపాదమును మంచిగంధములో నొకపాదమును ఉంచి రెంటిని సమానముగా భావించుచు తీర్పులనిచ్చుచుండును. మృత్యువునకిచ్చుచున్నాను అన్నందువలన కోపముతో చెప్పె

నని యూహించుచున్నారు. అధికమైన కోపకారణమును లేదు, కోపమున్నను తండ్రి తనయుని మరణము కోరడు అట్లు కోరెనని ఊహించుట పాడిగాదు. నవగ్రహముల పేర్లుచెప్పి ఇచ్చెడిదానములు వలెనే నచికేతస్సును ఏ బ్రాహ్మణునకో అర్పించ నెంచియుండును. పుత్రునియందుండు మోహబన్ధమును వీడుటకు ఎట్టకేలకు సంసిద్ధుడయ్యెనని మాత్రము ఊహించనగును. ఈ దానమువలన ముగ్గురికును లాభముకలిగెను. యమునకుడుత్తమ శిష్యుడు దొరికెను, ఇందులో 2 వ వల్లి 9 వ మంత్రము చూడ నగును. నచికేతస్సుకు నుత్తమజ్ఞానప్రాప్తియు నమృతత్వమును కలిగెను, ద్వితీయాధ్యాయము 3 వ వల్లి 18 వ మంత్రముచూడ నగును. వాజశ్రవసునకు సర్వసంపద దానమిచ్చిన మర్యాద దక్కెను, అంతియేగాక పరితాపమును తీరెను. పుత్రప్రాప్తియు కలిగెను. ఈ వల్లి 11 మంత్రము చూడనగును. కాన వాజశ్రవసుడు కొడుకును తిట్టెననిగాని కోపముతో దానముచేసెనని గాని ఊహించనక్కరలేదు. కోపముతో చేసినను గూడ దానము కొంత ఫలితమునై నను ఇచ్చునని ఊహించవలెను. ఆంగ్లమహా కవి షేక్స్పియర్ చెప్పినట్లు (It blesses him that gives and him that takes) దాతను ప్రతిగ్రహీతను దానము ఉద్ధరించును. ఇచ్చట దాతను ప్రతిగ్రహీత నేగాక దత్తమును గూడ ఉద్ధరించునని ఈ ఉపనిషత్ ఋజువు చేయుచున్నది.

తాత్పర్యము:— నన్ను ఎవరికి దానమిచ్చెదవు, అని తండ్రిని నచికేతస్సు అడిగెను. మరలఅడిగెను. మూడవపర్యాయము కూడ బ్రతిమాలెను. ఇట్లు బ్రతిమాలుటలో నతని హృదయ

నైర్మల్యము విశదమగుచున్నది. మృత్యువను నామాంతరము కల యమధర్మరాజునకు నిన్ను ఇచ్చుచున్నానని తండ్రికుమారునకు జవాబు చెప్పెను. ఈ జవాబు కోపముతో చెప్పెనని ఊహించనక్కరలేదు. భయపెట్టుటకు చెప్పెనని యెంచనక్కరలేదు. తండ్రి తనయులు సత్యవాక్య పరిపాలకులే తండ్రి జంకుటకు పుత్రవాత్సల్యము కారణమైనను పుత్రుని ప్రార్థనవలన మోహమువీడి తనయుని దానము చేసెను.

శ్లో (5) వ మంత్రము శ్రుతిః ॥

బహూనామేమి ప్రథమో
బహూనామేమి మధ్యమః ।
కిగ్ స్విద్యమస్య కర్తవ్యం
యన్మయాద్య కరిష్యతి ॥

బహూనాం = అనేకమందిలో; ప్రథమః = మొదటివాడనుగా ఏమి అడుగుచున్నాను. బహూనాం = అనేకమందిలో; మధ్యమః=మధ్యవాడనుగా; ఏమి=పోవుచున్నాను, యమస్య= యమునియొక్క, కర్తవ్యం = చేయఁతగినపని; కిం = ఏది; స్విత్ = అనుమానముగానున్నది, తోచుట లేదు; యత్ = ఏది మయా = నాచేత; అద్య = ఇప్పుడు; కరిష్యతి = చేయనగుచున్నది.

విశేషార్థము:— (1) బహూనాం=అనేకమందిలో అనేకమంది వాజశ్రవసునియొక్క సంతానము కావచ్చును, లేదా శిష్యులు కావచ్చును, లేదా ఉభయులు కావచ్చును ఇట్లు శిష్యులు కుమాళ్లు ఉభయులు అని శ్రీ శంకరులవారు అన్య

యించిరి. అట్లన్వయించి "ఏమి" అనగా అగుచున్నాను, సంచరించుచున్నాను, అని అర్థము చేసిరి. శిష్యవర్గముండ వచ్చును, యజ్ఞయాగాది క్రతువులుచేసెడి బ్రాహ్మణునియొద్ద శిష్యులుండుట సహజమే శిష్యులలో ప్రథముడని చెప్పుటచేత విద్యాభ్యాసములోను గురుశుశ్రూషలోను మొదటివాడని అర్థమగును, అట్లు చెప్పవచ్చును. కుమారుళ్ళలో పెద్దవాడను అని అర్థము చేయవచ్చును. అట్లు చేసిన యెడల కొంత చిక్కుకలదు. తండ్రికి పెద్దకుమారునియందు ప్రేమ అధికము. అందుచే వదలి నొల్లడు మరియు ఇతరకుమారులు ఉన్న యెడల వారినికూడ దానము చేయవలసి యుండును. అట్లు చేయని యెడల కొంత ధనమును వాజశ్రవసుడు దాచుకొన్న వాడగును. అట్లు భావించుట న్యాయముకాదు. మరియు ౨వ మంత్రములో నచికేతస్సు చిన్నవాడని చెప్పబడెను. కాన అతని తరువాత పెక్కుమంది బిడ్డలుండకపోవచ్చును. మొదటి మంత్రములో నొక్కనిచేతే తెలుపుటవలన బహుమంది కలరని ఊహించుటకును వీలుకాకున్నది. మరియు 11-12 మంత్రములలో తండ్రి సుఖపడుచున్నట్లు చెప్పెనేగాని తల్లి సోదరులు ఉన్నట్లు సూచింపలేదు, కాన బహూనాం అన్నపుడు సంతాన ప్రసక్తి చేయకుండుట మేలు. బహూనాం అనగా అనేకమంది మనుష్యులలో అని చెప్పుట భావ్యము. అనేకమందిలో ప్రథముడుగా నడచెదనని యర్థము. అనగా ఇట్లు తనను దానముచేయమని కోరినవారిలో నేనే మొదటివాడనని అర్థము. అప్పుడు బహూనామేమి మధ్యమః అనునపుడు యమునివద్దకుపోవు అనేకులలో నేనొక్కడనని

యర్థము పొసగును. దీనికి శ్రీ శంకరులవారు సామాన్యమైన తెలివితేటలుగలవాడనుగాని అధముడనుగాను అని అర్థము చేసిరి. కుమాళ్ళో, శిష్యులో పలకరింపబడిరని యెంచిన యెడల ఆ అర్థము పొసగును లేదా ఇచ్చట చెప్పిన అర్థమే సరిపోవును.

(2) యమస్యకర్తవ్యం = యముని కర్తవ్యము అనగా ఈ యజ్ఞములో యముని భాగమేమి? లేదా తనను స్వీకరించు విషయములో యముని కర్తవ్యమేమి? తనను స్వీకరించినపిమ్మట యముడేమిచేయును అని అర్థమగును. స్విత్ అనుపదము వాడుటవలన ఈ అన్నిటిలోనే యొక్కటియు నచికేతస్సుకు స్పష్టముగా తేలక సందేహాస్పదముగానున్నదని ఎంచవలెను. ఈ రెండవ పాదమునకు శ్రీ శంకరులవారిట్లు అర్థముచేయుచున్నారు. నన్ను యమునకు ఇచ్చుటచేత యమునకెట్టి ప్రయోజనము కలుగగలదు? అట్లుగాక ఈ పాదమును రెండువాక్యములుగా విభజించి అన్వయించవచ్చును. అప్పుడు యమునికి ఈ యజ్ఞములో భాగమేమి? నన్ను దానముగా స్వీకరించునా లేదా? స్వీకరించిన పిమ్మట నన్నెట్లు ఉపయోగించును? ఇది మొదటి వాక్యమునకు అర్థము. రెండవ వాక్యమున కర్థము నావల్ల చేయబడ తగిన కర్తవ్యమేమి? యముడిచ్చట ప్రత్యక్షముగా లేడు. తండ్రి నన్నాయనకు దానమిచ్చెను. ప్రతిగ్రహీతను నేను వెదకికొనవలెనా లేదా ఆయన వచ్చువరకు మా తండ్రిగృహముయొద్ద యుండవచ్చునా? దానమివ్వబడిన నేను దాత గృహములో నిలుచుటెట్లు? అట్లు నిలచినచో నాకును నా తండ్రికిని మర్యాద నిలుచునా? అను భావములు అతనికి

తోచి యిందులో నాకర్తవ్యమేమి? యని యోచించుచుండెను. ఈ మన్త్రమంతయు నచికేతస్సు స్వగతము. 6 వ మంత్రము కూడ నతని స్వగతమే. అది నచికేతస్సు తండ్రితో చెప్పిన వాక్య మని శ్రీ శంకరులవారు అభిప్రాయపడిరి. తండ్రి కుమాళ్ళమధ్య సంభాషణ జరిగినట్లు సూచనకనపడదు, ఈ రెండు మంత్రములు స్వగతముగానే యెంచవలెను.

తాత్పర్యము:— ఇట్లు నన్ను నేనే దానమిమ్మని అడుగుటలో నేనే మొదటివాడనని తోచును. ఏ ఇతర కుమారుడును తండ్రిని ఏకాలముననుఇట్లడిగియుండక పోవచ్చును. అనేకమంది యమునియొద్దకు పోవుచున్నారు. ఆ పోవువారిలో నేనొకడను. ఈ యజ్ఞమునందు యమునిని ఎందుకు ఆహ్వానించిరి? అతని కర్తవ్యమేమి? అతడు నన్ను దానముగా స్వీకరించునా? స్వీక రించిన పిమ్మట నన్నేమి చేయును? నాకర్తవ్యమేమి? ఆయము డిచ్చుటలేదే. అతనియొద్దకు పోవుదునా! అతడు వచ్చువరకు మా తండ్రి గృహమున నుందునా! ఆయన ఉండనిచ్చునా! ఉన్నచో మేమిద్దఱము మాటతప్పిన వారమని అపఖ్యాతిపాలగు దుమా? ఇట్లనేకవిధముల తనలో తాను (నచికేతస్సు) యోచింపసాగెను.

౬ వ మంత్రము— శ్రుతిః 6

అనుపశ్య యథాపూర్వే
ప్రతిపశ్య తథాఽపరే।
సస్యమివ మర్త్యః పచ్యతే।
సస్యమివాజాయతే పునః॥

పూర్వే = పూర్వమందు; యథా = ఎట్లు ( జరిగెనో ) అనుపశ్య = స్మరింపుము; అపరే = ఇతరకాలములందు, తథా = అట్లే ( జరిపిరని ) ప్రతిపశ్య = గమనించుము, మర్త్యః = మనుష్యుడు; సస్యం = పైరు; ఇవ = వలె; పచ్యతే = పండబారు చున్నాడు పునః = మరల; సస్యమివ = పైరువలెనే, ఆజాయతే = పుట్టుచున్నాడు.

విశేషార్థము:— (1) అనుపశ్యప్రతిపశ్య = పశ్య అనగా చూడుము. అను, ప్రతి, కలుపుటచే అధికముగా విశేషముగా తదేక ధ్యానముతో అని అర్థము. తప్పులేకుండ నుండునట్లు పరిశీలించి చూడవలెనని యర్థము.

అందుచేత భూతకాలమును గూర్చి సంస్మరించుమనియు ప్రస్తుత కాలమునుగూర్చి గమనించుమనియు చెప్పుట భావ్యమే.

(2) అపరే = ఇతరకాలములందు అనగా పూర్వకాలము గాక తక్కిన సమయములందు అని చెప్పవచ్చును. ఇతరులు అని కూడ అర్థముకలదు. ఇతరులు ఎట్లు ప్రవర్తించిరో చూడ మని భావము. పూర్వకాలమందును, ఈ కాలమందును ఉన్న జనులు ప్రవర్తించిన విధానము గమనించమని తనకుతానే ఉద్బోధించుకొనుచున్నాడు, ఇది సత్యవాక్య పరిపాలననుగూర్చి కావచ్చును, అట్లే శ్రీ శంకరులవారు అభిప్రాయపడిరి. తండ్రికి నచికేతస్సు చేసిన బోధగా ఎంచిరి. ఇది స్వగతమని పైన తెలుప బడెను. కాన తనను తానే యుద్బోధించుకొనుట యగును. తనను దానము ఇమ్మని తండ్రిని కోరెను. తండ్రి దానమిచ్చిన పిమ్మట వెనకాడుట సమంజసముకాదు. పూర్వకాలమునను

ఈ కాలముననుకూడ అనేకులు సత్యవాక్యపరిపాలననే చేయుచున్నారు. అని భావించెను. అట్లుగాక పూర్వకాలముననుఈ కాలముననుకూడ నశ్వరులయిన మానవులు పరిపైరువలె పుట్టుచున్నారు, దానివలెనే పండబారి యెండిపోవుచున్నారు. సస్యజీవితము కొన్ని మాసములు మాత్రమే. మనుజజీవితము దానికంటె నత్యధికము. కొన్ని సంవత్సరములు పట్టును. అయిననుకాలస్వభావమును గమనించినప్పుడు మనుష్యజీవితముగూడ స్వల్పమే. ఇచ్చట కాలపరిమితికన్న జీవిత విధానముల పోలిక ముఖ్యము. ♦ పైరువలె ఆలోచనారహితముగా, ఆదర్శరహితముగా, సంకల్పిత సాధనారహితముగా జరిపెడి మనుష్య జీవితము నిష్ప్రయోజనమని నచికేతస్సునకు తట్టెను. అంతియేగాక పూర్వకాలము పరకాలము అని చెప్పుటచేత ఇంకొక ఊహకూడ నతనికి కలిగియుండుననని ఎంచవచ్చును. పూర్వమందు చేసిన యజ్ఞయాగాది క్రతువులే మరల మరల చేయుచుండుట దాని స్వభావము. దాని ఆవశ్యకత. దాని అంతరార్థము గ్రహించకయే ముణ్డకము 1-2-8 మంత్రములో చెప్పినట్లు "అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయం ధీరాః పణ్డితంమన్యమానాః" — అని మంత్రమున చెప్పినట్లు "అన్ధేనైవనీయ

♦ ఆంగ్లములో ( Why do you vegetate) అని ప్రశ్నింతురు. ఎవడు బుద్ధివికాసము చూపక మన్నుదిన్న పామువలె మందుడయి సోమరిగా ఆహారనిద్రాదులతో తృప్తిపడుచుండునో, వానిని పై విధముగ ప్రశ్నింతురు. అట్టి జీవితమునకు సస్యజీవితమని యర్థము. పశుజీవితములో కొంతవరకు స్థానికచలనముండును. కొంత మనోబీజములు కనపడుచుండును. సస్యజీవితములో ఆ రెండునుకూడ లేవు. సస్యజీవితము పశుజీవితముకన్న హీనమని అర్థము.

మానాయధాం థాః ” గృడ్డివానిచే నడిపించబడు గ్రుడ్డివారివలె ఇక్కాలమునగూడ నడచుట భావ్యముకాదని నచికేతస్సునకు తోచియుండును. సర్వసంగపరిత్యాగమునువిధించెడి విశ్వజిద్యాగము కూడ అతనికి నచ్చలేదని సూచనకలదు. కర్మకాండయందు నిర్వేదము ( ముండకం ) ( 1-2-12 ) కలిగెను, శ్రద్ధా ఆవివేశ. అని రెండవమంత్రములో చెప్పినదాని అంతరమే ఇది.

( 3 ) పచ్యతే=పచన అనగా వండుట లేక పండుట పరిణతి నొందుట, సస్యములనన్నిటిని సూర్యుడు మొలపించుచున్నాడు. పెంచుచున్నాడు పండించుచున్నాడు. ఇది యంతయు సూర్యుని వంటకమే పండుటతోనాగక పడిపోవుటకూడ ఇచ్చటసూచింపఁబడినది.

తాత్పర్యము:— పూర్వకాలమందెట్లు జరిగెనో స్మరించవలెను. ఇతరసమయములందు ఎట్లు జరుగుచున్నదో గమనించవలెను. పూర్వులు ఎట్లు ప్రవర్తించిరో అట్లే ఇక్కాలపువారును ప్రవర్తించుచున్నారు. సామాన్య సస్యమువలె ( పైరువలె ) పుట్టుచున్నారు, పెరుగుచున్నారు, పండుచున్నారు, ఎండుచున్నారు పడిపోవుచున్నారు. అంతకంటె మేలైనజీవితము గడుపుటలేదు. మానవులన్నందుకు మానసిక శక్తులనుగాని ఆధ్యాత్మిక శక్తులనుగాని వినియోగించుటలేదు. గ్రుడ్డివారివలె పూర్వప్రత్రోవనే పోవుచున్నారేకాని తమ జీవిత పరమార్థమునుగాని, తాము చేసెడి కార్యముల అంతరార్థమునుగాని గ్రహించుటలేదు. అని గమనించిన నచికేతస్సునకు సామాన్య మానవజీవితమునందును తన తండ్రులు మొదలగువారు చేయు

కర్మకాండయందును వైరాగ్యము పొడమెను. పూర్వులును ఇప్పటివారును అవలంబించెడి సత్యవాక్య పరిపాలనము మాత్ర మతనికి నచ్చి దానిననుసరింప స్థిరమనస్కుడయ్యెను.

౭ వ మంత్రము శ్రుతిః ॥ 7

వైశ్వానరః ప్రవిశత్యతిథిః
బ్రాహ్మణో గృహాన్ ।
తస్యైతాగ్ం శాన్తిం కుర్వన్తి
హర వైవస్వతోదకమ్ ॥

బ్రాహ్మణః = బ్రాహ్మణుడు; అతిథిః = అతిథి; వైశ్వానరః = వైశ్వానరుడు (అయి) గృహాన్ = గృహస్థుల ఇండ్లలో ప్రవిశతి = ప్రవేశించుచున్నాడు; తస్య = వానికి, ఏతాం = ఈ; శాన్తిం=శాన్తిని; కుర్వన్తి=గృహస్థులు చేయుచున్నారు. వైవస్వత = సూర్యునికుమారుడగు యముడా! ఉదకం = నీటిని; హర = తెమ్ము.

విశేషార్థము:— 6 వ మంత్రములో చెప్పిన ఆలోచనచేసిన పిమ్మట నచికేతస్సు యముని నివాసస్థానమునకు వచ్చెను. ఎట్లు వచ్చెనో, ఎన్నాళ్లు పట్టెనో ఈ ఉపనిషత్ తెలుపుటచేయు లేదు. కాని సశరీరుడై వచ్చినట్లే ఎంచవలెను. ఏలయన:— తన కాయమును ఎచ్చటను దాచినట్లు చెప్పలేదు. అంతియే గాక యమునిచే వీడ్కోలుపొంది తండ్రియొద్దకు పోవుచునని 10 వ మంత్రములో తెలుపుచున్నాడు. ఈ నచికేతస్సు కృత యుగమువాడై యుండనోపును, కృతయుగములో దశరథుడు దేవేంద్రుని సహాయార్థము పోయియుండెను. ద్వాపరయుగ

ములో దుష్యన్తుడు ఇంద్రుని సహాయార్థము దేవలోకమునకు బోయెను. అట్లే ద్వాపరాన్తమున అర్జునుడు స్వర్గమునకు వెళ్లి వచ్చెను. శ్రీకృష్ణుడు రుక్మిణీసమేతుడై పోయివచ్చెను. కాన పూర్వకాలమున మనుష్యలోక దేవలోకములమధ్య రాకపోకలు జరుగుచుండెను. ఋగ్వేదములో దేవతలు మనుష్యులును సామాన్య మిత్రులవలె బంధువులవలె అన్యోన్యముగా ప్రవర్తించినట్లు తెలుపు ఋక్కులు కలవు. అట్లే నచికేతస్సుగూడ బొందితోనె యమలోకమునకు బోయెనని ఎంచవలెను. అతడు మరణించెనని యెంచరాదు. ఈ మొదటి వల్లిలో భోగవిధానములను భోగ్యపదార్థములను ఎన్నిటినో ఆకర్షవన్తముగా యముడు తెలిపి యుండెను. అవన్నియు సామాన్య మానవశరీరముతోనే యుపయోగించతగినవి.

(1) అతిథిః=బ్రాహ్మణుడు=నచికేతస్సు బ్రాహ్మణుడని యర్థము, అతిథిగా యమునిసదనమునకు వచ్చెనని భావము. ఇచ్చట బ్రాహ్మణుడను పదమునకు బ్రహ్మజ్ఞానియని చెప్పుటకు వీలుపడదు. బ్రహ్మజ్ఞానమంతయు నింకను పొందవలసియే యున్నది. జాతి బ్రాహ్మణుడనియే యూహించవలెను. ఊన వయస్కుడుకూడ నయియుండుటచే నప్పటి సంఘమువలన బ్రాహ్మణుడని యెంచబడినవాడె. బ్రాహ్మణమాత్రుడే అయి యుండవలెను. అతిథియని వాడుటచే పూజార్హుడని యర్థము. అతిథివలె పూజనీయుడని ఋగ్వేదములోని ఋక్కు తెలుపుచున్నది.

2 వైశ్వానరః = సమస్త నరులయందున్నవాడు. అగ్ని

యని దీనికర్థము చెప్పుచున్నారు, కావచ్చును. అంతకంటె యుక్తముగా సమస్త జీవకోటిలోనుండు ఆత్మశక్తి లేక ప్రాణశక్తి యని చెప్పుట భావ్యము. భగవద్గీత 15 అధ్యాయము 14 వ శ్లోకము "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః"। నేను వైశ్వానరుడను పేర ప్రాణుల దేహమును ఆశ్రయించి యున్నాను. వైశ్వానరుడు పరమాత్మయేయని అర్థము. మాండూక్యములో 3 వ మంత్రములో వైశ్వానరుడు జాగరిత స్థానుడు ఆత్మయొక్క ప్రథమపాదమని చెప్పబడెను. కాన వైశ్వానరుడనగా దృశ్యవిశ్వమును గ్రహించగల ఆత్మశక్తి. 1 ప్రశ్న 7 వ బ్రాహ్మణములో "ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోఽగ్నిరుదయతే" ప్రజాపతినుండి పుట్టిన ప్రాణశక్తి వైశ్వానరుడను పేరు కలిగి అగ్నిగానుదయించుచున్నది. కాన వైశ్వానరుడనగా సర్వజీవకోటియందుండు ఆత్మశక్తియని చెప్పవలెను. ఇచ్చట ఆ వైశ్వానరుడు బ్రాహ్మణ రూపమున అతిథియగుచున్నాడు. కాబట్టి బ్రాహ్మణుడు సర్వజీవకోటికి ప్రతినిధిగా వచ్చెనని అర్థము. దానినే ఆంగ్లములో (Representative soul) అని చెప్పవచ్చును. ఇచ్చట ఈ భావము పొసగుచున్నది నచికేతస్సు సమస్త లోకములనుగల సమస్యలను తీర్చబోవుచున్నాడు. కాన మానవాళికి జీవకోటికి అతడు ప్రతినిధియని చెప్పనొప్పును. "అభ్యాగతస్స్వయంవిష్ణుః" అతిథి అభ్యాగతులు స్వయముగా విష్ణువేయని ఆరాధించవలెను, అందుచేత గూడ నిచ్చట బ్రాహ్మణ అతిథి జీవకోటికి ప్రతినిధియనియే చెప్పవలెను.

(3) శాన్తిం = శాన్తి అనగా శ్రమపడివచ్చిన అతిథికి శాన్తి కల్పించుట. పూర్వసంప్రదాయము, మొట్టమొదట పాద్యమివ్వవలెను. దానితో నతిథి కాళ్లు చేతులు కడుగు కొనును. తరువాత ఆసన మివ్వవలెను, దానిపై అతిథి ఆసీను డగును, పిమ్మట అర్ఘ్యమివ్వవలెను. ఆ అర్ఘ్యము పానకము గాని తేనెగాని తత్తుల్యమగు నితరపదార్థములుగాని ప్రయాణా యాసము తీరుటకై యివ్వవలెను. పిమ్మట భోజనాదీతరసత్కార ములు చేయవలెను. ఇట్లతిథికి శారీరక మానసిక శాన్తినికల్పించ వలెను. బౌద్ధాశ్రమములలో నిదియే ఆచారమనుసరింపబడెను. అక్కడ నొక చిన్న వస్త్రముకూడ నుంచెదరు, దానితో కాళ్లు చేతులు తుడుచుకొందురు. పాద్యముతో నతిథికి స్వయముగా గృహాసే కాళ్ళుకడుగు ఆచారమును కలదు.

(4) వైవస్వత=వివస్వతుని కుమారుడు. వివస్వతుడనగా సూర్యుడు. సూర్యునికుమారుడు వైవస్వతుడు, సూర్యుడు సమస్త ప్రాణికోటికి రక్షకుడు. అతనికుమారుడుకూడ నదే లక్షణములు కలవాడు, అందుచేతనే యతనికి ధర్మరాజనుపేరు రూఢియయ్యెను. అతని కర్తవ్యములలో నొకటి శరీరపరివర్తన ములు చేయించుట, అనగా శరీరనాశము లేక మరణము కలిగిం చుట, ఈ మరణముయొక్క ప్రధానోద్దేశము ఆత్మరక్షణమే జీవరక్షణమేయని భావించవలెను. అజ్ఞానముచే మృత్యువు భీకరముగా కనపడుచున్నది. జ్ఞానదృష్టితో జూచిన యెడల నయ్యది అవసరమైన పరిణామమే. ఆత్మ విశ్వములో జరిపెడి తీర్థయాత్రలో కొన్ని కొన్ని మజిలీలు లేక విశ్రాన్తిస్థానములు

కలవు. నిష్ప్రయోజనమైన శరీరమును సకాలమున విడిపించి భవిష్యత్పరిణామమునకు అనువగు నూతన శరీరమును కల్పించుచుండును. (Tennyson) అను ఆంగ్లమహాకవి భీకర ముఖముగల మృత్యువు నిజమునకు ముద్దులుగొలుపు పదునారేండ్ల బాలకుమారుడని తెలిపెను. (Goareth and Lynetee) రవీన్ద్రకవిసార్వభౌముడుకూడ భీకరమగు మృత్యువు మరుజన్మమున మాతృరూపమున ప్రత్యక్షమగుచున్నదని చెప్పెను. ఇచ్చట వైవస్వత అను పదమువాడుట సమంజసము. ఏలయన యముడు తన భీషణకర్మను నచికేతస్సుపై ప్రయోగించక అతనికమృతత్వమిచ్చు విద్య నేర్పుచున్నాడు. అతనికిచ్చుటయేగాక ఇతరులకందఱకును అట్టి యవకాశమునే ఇచ్చుచున్నాడు. కాన యముడు అమృతప్రదాతయయి లోకరక్షకుడయి తండ్రి పేరును నిలువబెట్టుచున్నాడు. ద్వితీయాధ్యాయము 6 వ వల్లి 18 వ మంత్రము చూడనగును. "అన్యోప్యేవం యో విత్ అధ్యాత్మమేవం" ఈ విధముగా నధ్యాత్మను తెలిసిన ఇతరులుకూడ రక్షింపబడుదురు.

(5) హర = తెమ్ము. ఇది ♦ యమునకు ఆజ్ఞ లేక సలహా, అచ్చట గాథ ఇట్లున్నది. నచికేతస్సు యమపురికి వచ్చునప్పటికి యముడింటలేడు, ఇతరచోట్లకు పోయెను. యముని యింట నచికేతస్సు మూడురోజులుఉపవసించెనుఆయనరాగానెఆయన భార్యయోపరివారమోనచికేతస్సుయొక్కసంగతిచెప్పిఉదకముమ

♦ యముడు పరీక్షాధికారిగూడ ఈ వల్లిలో నచికేతస్సును పరిశోధించియే పిమ్మట అమృతవిద్య బోధించెను.

తెచ్చినసరి ఈకథలో నొకటి రెండు చిక్కుసమస్యలు కనుపడుచున్నవి.

(1) యముడు ఎచ్చటికిపోయెను? ఆయన లేనపుడు తనస్థానె ఎవరుండి పనులు నిర్వర్తించిరి? ఆయన లేకున్నను ఇంటనున్న ప్రతినిధిగాని, భార్యగాని, నచికేతస్సునకు ఏల ఆతిథ్యమియ్యలేదు? యముడు తిరిగి వచ్చినపుడు ఉదకమును నీవే తీసికొని రమ్మనమని సలహా లేక ఆజ్ఞయిచ్చుటకన్న వారేల తెచ్చి అందించలేదు, ఏల హర అను పదమునకు తీసికొనిరమ్మ అనిగాక నేమిచ్చినది పుచ్చుకొనుము అని అర్థము కలదు. అదియే సమంజసము. అతిథి ప్రారంభమునుబట్టి గృహస్థు తానే నీరు తెచ్చుటయును మర్యాదగానే యుండును. యమునియొద్దకు వచ్చెడివారిలో నతిథులెవరో, మరణించి వచ్చినవారెవరో ఆయన పరోక్షమున నిర్ణయించువారు లేరని యూహించవచ్చును. పైన తెల్పిన క్లిష్టస్థితులు విచారించ తగియున్నవి. అథితిపూజ ప్రశస్తమని తెలుపుటకు ఉపనిషత్కారుడు 7-8 మంత్రములను ప్రవేశపెట్టినాయని ఎంచవచ్చును. కాని యదియును భావ్యముకాదు. ఏలయన:— 9 వ మంత్రములో మూడు రాత్రుల ◆ ఉపవాసమునుబట్టి మూడు వరములు యివ్వబడినట్లు

---

◆ దేవతలు ఆహ్వానింపబడి మానవుల గృహములకు వచ్చినప్పుడు వారికి అతిథిపూజ జరుగుచున్నది. అట్లే దేవతల యొద్దకు మానవులు పోయినపుడు వారికిని అతిథిపూజ జరుగుచున్నది. యముడుకూడ తాను పిలువని నచికేతస్సును నతిథిగా భావించి సత్కరించెను. అందుచేత నతిథి సత్కారము ఎంతయో ప్రశస్త కర్మగా ఎంచబడెనని విశదమగుచున్నది. ఆ కాలమందలి దేవతల మానవుల సమానత్వముకూడ సూచితమగుచున్నది. సమ్మతినిచ్చువాడు (ఓటర్) ప్రతినిధి (Representative) ఇద్దరును సమానులు;

కలదు. కాన ఈ మూడురాత్రుల ఉపవాసము కథలోని ఆవశ్యక మయిన అన్తర్భాగమే అయియున్నది. ఈ నచికేతస్సునికథ వివిధరూపముల అనాదిగా లేక ఆదినుండి పరిణామము నొందు చున్నది. దానిని గూర్చి పీఠికలో చూడవలెను.

తాత్పర్యము:— గృహస్థుల యిండ్లకు సమస్త జీవకోటికి ప్రతినిధిగా నెంచతగిన బ్రాహ్మణుడు అతిథిగా వచ్చినపుడు ఆ గృహస్థులు ఆ అతిథికి అర్ఘ్యపాద్యాదులొసంగి శరీరమనశ్శాన్తు లను కల్పించి సంతోషపెట్టెదరు. యథావిధిగా నతిథిపూజ చేయుట పూర్వాచారమై యున్నది. అతిథిని మహావిష్ణువుగాను సమస్తమునకు ప్రతినిధినిగాను ఆదరించవలెను. ఈ సూత్రము ననుసరించి యముడును నచికేతస్సును ఆదరించెను. అచ్చటి నున్నవారెవరో ఉదకమును తెచ్చి ఓ సూర్యకుమారుడా! దీనినిగైకొని అతిథిపూజ చేయమని యమునితో మనవిచేసిరి.

౮ వ మంత్రము శ్రుతిః ‖ 8

♦ ఆశాప్రతీక్షె సంగతగ్ం సూనృతాంచ ।
ఇష్టాపూర్తె పుత్రపశూంశ్చ సర్వాన్ ।
ఏతద్వృఙ్క్తె పురుషస్యాల్పమేధసో
యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణోగృహే ‖

యస్య = ఏ; అల్పమేధసః = స్వల్పబుద్ధిమన్తుడగు; పురు

♦ “ పరస్పరం భావయన్తః శ్రేయః పరమ వాప్స్యథ ‖ భగవద్గీత 3 అధ్యాయము 11 శ్లోకము. అన్యోన్యము గౌరవించుకొనుచు అని చెప్పినదే ఇచ్చటను వర్తించుచున్నది.

పస్య=మానవునియొక్క, గృహే=గృహమందు; బ్రాహ్మణః= బ్రాహ్మణుడు, అనశ్నన్ = భుజించకుండ ఉపవసించి, వసతి= నిలుచునో తస్య=అతనియొక్క, ఆశాః=ఆశలును; ప్రతీక్షాః= ఆతురతతో ఎదురుచూచుచుండెడి ఫలితములును, సంగతం= సత్సాంగత్యమువలని ఫలితములును; సూనృతాం = సత్యజీవితము వలని ఫలితములును; చ = మరియు ఇష్టాపూర్తే = ఇష్టాపూర్త కర్మలవలన కలిగెడి ఫలితములును; పుత్రపశూన్ = బిడ్డలు పశువులును, చ = మరియు ఏతత్ = ఈ; సర్వాన్ = సమస్తమును; వృఙ్క్తే = నాశనమగుచున్నది.

విశేషార్థము:- (1) ఆశాప్రతీక్షే=ఆశయనగా సాధ్యమో అసాధ్యమో తెలియకనే యేదియో లభించవలెనని కోరిక. ప్రతీక్షయనగా తప్పక లభించునని ఊహాకలిగి ఎదురుచూచుచుండెడి ఫలితము. రానున్నదని తోచి త్వరలోవచ్చునని, రావలెనని కాంక్షించెడి ఫలితము.

(2) సంగతం = పూర్తిగా కలసిపోవుట మంచివారితో కలసిపోవుట లేక సత్సాంగత్యము.

(3) సూనృతాం = సత్యవచనమువలన కలిగెడి ఫలితము అని చెప్పవచ్చును. సత్యముమీద నాధారపడిన జీవితమనియు చెప్పవచ్చును.

(4) ఇష్టాపూర్తే = ఇష్టకర్మలు శ్లో॥ అగ్నిహోత్రం తపస్సత్యం భూతానాంచాను పాలనం। ఆతిథ్యం వైశ్వదేవశ్చ॥ పూర్తకర్మలు శ్లో॥ వాపీకూప తటాకాది దేవతాయతనానిచ।

అన్నప్రదాన మారామాః ౹౹ ఇట్టి కార్యములవలన కలుగు ఫలితములన్నియు

(5) అల్పమేధసః = మేధస్సు అనగా:— యోచనశక్తి అని, అల్ప = కొద్దిగాకలవాడు అల్పమేధస్కుడు అనగా దూరపాలోచన లేనివాడని యర్థము. ఆ వ్యక్తి బుద్ధిహీనుడని అర్థము. చెప్పరాదు. అతనికి సత్సాంగత్యము సూనృతము ఇష్టాపూర్త కర్మలు ఆరోపించబడినవి. కాన కొంతవరకు ధార్మికాభివృద్ధి కలవాడే అతనికి తెలియని విషయము అతిథిపూజ. అతిథిగా వచ్చిన బ్రాహ్మణుని ఆదరించకపోవుట మహాలోపమని అర్థము దైవమెచ్చటనో నున్నాడనిగాక తన యింటికివచ్చు ప్రతి జీవి లోను దైవమున్నాడనియు ప్రతిజీవియు నా దైవముయొక్క స్వరూపమో ప్రతినిధియో అయినాడని గ్రహించక పోవుటయే అతనియందుండు లోపము. ఈశావాస్యము 6-7 మంత్రములలో చెప్పిన సత్యము గ్రహించలేదని అర్థము. అట్లు పరాత్పరుని సర్వ వ్యాపకత్వము గ్రహించి యాచరణలో పెట్టకపోవుటయే లోపము.

(6) వృక్తే = నాశనమగుచున్నది. అతిథిని నిర్లక్ష్యము చేయుటవలన పూర్వపుణ్యకర్మలు నాశనమగుచున్నవి. బుద్ధి పూర్వకముగా కాకపోయిననుకూడ అతిథి నిర్లక్ష్యము పాప కారి అని స్ఫురించుచున్నది.

తాత్పర్యము:— ఎవరు దూరపు ఆలోచనలేక తనయింటికి వచ్చిన అతిథికి అన్నము పెట్టక ఆదరించడో, ఆదరణలేకుండ అతిథి ఎవని యింట్లో ఉపవసించి నివసించునో, ఆ గృహస్థు

యొక్క ఆశలను. అతడు కాంక్షించెడి ఫలితములును సత్సాంగత్యము, సత్యజీవితము, ఇష్టాపూర్త కర్మలు వలన కలిగెడిఫలితమంతయు అతని సంతానమును, అతని పశుధనమును, అంతయును ఈ యతిథి అనాదరణచే నశించిపోవుచున్నది.

౯ వ మంత్రము — శ్రుతిః ॥ ౯

తిస్రోరాత్రీర్యదవాత్సీర్గృహే మే ।
అనశ్నన్బ్రహ్మన్నతిథిర్నమస్యః ।
నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తి మేఽస్తు
తస్మాత్ప్రతిత్రీన్వరాన్వృణీష్వ ॥

నమస్యః = పూజింపతగిన అతిథిః = అతిథివైన; బ్రహ్మన్ = బ్రాహ్మణుడా! తే = నీకు; నమః = నమస్కారము అస్తు = అగుగాక, యత్ = ఎందువలన; మే = నాయొక్క గృహే = గృహమందు, తిస్రః = మూడు; రాత్రీః = రాత్రులయందు, అనశ్నన్ = నిరాహారముగా; అవాత్సీః = నివసించితివి. తస్మాత్ = కాన ప్రతి = బదులుగా, త్రీన్ = మూడు, వరాన్ = వరములను; వృణీష్వ = కోరుము, బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణుడా! మే = నాకు; స్వస్తి = భద్రత; అస్తు = కలుగుగాక!

విశేషార్థము:— (1) * త్రిస్రోరాత్రీః = మూడురాత్రులు_ యముని యింట మూడురాత్రులు నచికేతస్సు ఉపవసించి యుండెను. మూడు రాత్రులనగా:— మూడు పగళ్ళు, మూడు రాత్రులు అనగా మూడుదినములని అర్థము. ఈ దినమునకు మనుష్యమాన ప్రకారముగల కాలపరిమితికిని దేవమాన ప్రకారముగల పరిమితికిని కొంత భేదము కలదు. మానవులకొక్క సంవత్సరము దేవతలకొక్క రోజుగానుండును. అట్లు భావించిన యెడల మూడు సంవత్సరములు జరిగియుండవలెను. కాని ఆ కాలమున దేవతలు, మానవులు, స్వేచ్ఛగా రాకపోకలు జరుపుచున్నందున ఉభయులకును ఒక్కటే కాలమానమని యూహించనగును. మూడురోజులవరకు నచికేతస్సు ఉపవసించవలసిన కారణము స్ఫురించుటలేదు.

(2) నమస్యః = పూజింప తగినవాడు. అతిథి సర్వదా పూజనీయుడని భావము. యముడుకూడ నుత్తమమార్గవర్తకుడగుటకు నిట్లొనర్చెనని ఊహించవచ్చును. లేదా దేవతలకు కూడ నతిథిపూజ కర్తవ్యమగుటచే మానవులకు అత్యావశ్యక

* యముడు ఇతర ప్రదేశములకు పోయినట్లు ఈ మంత్రమునందు చెప్పబడ లేదు. ఆయన అచ్చటనేయుండి నచికేతస్సునకు దర్శనమివ్వలేదని యూహించవచ్చును. దానికిని అతని ఉపవాసమునకును కారణముండి యుండవచ్చును. నచికేతస్సుకు కలిగిన శ్రద్ధను పరీక్షించుట ఒక కారణమై యుండవచ్చును. నచికేతస్సు పూర్వ చరిత్రలో లోపములేవైన యున్నచో వానిని తొలగించుటకు ఇట్టి అవకాశము కలిగించి యుండవచ్చును. మూడు రాత్రులను భావముకూడ నచికేతస్సు ఊహాకల్పితమై యుండును. అనగా (Subjective feeling)

మని ఊహించవచ్చును.

(3) స్వస్తి మే అస్తు = యముడు తన యింటిలో జరిగిన అపరాధమునకు చేసిన పరిహారము గమనించ తగియున్నది. 7వ మంత్రములో సూచించినట్లు (1) అర్ఘ్యపాద్యాదుల నిచ్చెను. (2) అతిథికి నమస్కరించెను, కోరిన మూడువరముల నిత్తునని వాగ్దానముచేసెను, ఇంతటితో నతిథి తృప్తిపడునని తలంచి అనుమానము తీరుటకై నాకు మీ ఆశీర్వచనము కావలెనని నచికేతస్సును యముడు కోరెను. ఆ కాలమున మానవులలో నగ్రగణ్యులు దేవతలను శపించుటయు ఆ శాపఫలములను వారనుభవించుటయు సంభవించుచుండెను. శాపవిమోచనము కూడ దేవతలకు మానవు లనుగ్రహించుచుండిరి. సనకసనంద నాదులు వైకుంఠ ద్వారపాలకులగు జయవిజయులను శపించి శాపవిమోచనమును కూడ అనుగ్రహించిరి. ఇట్టి నిదర్శనములు అనేకములుకలవు. అందువలననే యముడు నాకు స్వస్తికలుగు నట్లాశీర్వదింపుడని ప్రార్థించెను.

(4) ప్రతి = బదులుగా ఈ వరములివ్వనిచో నతిథి శపించు నని భయపడి యీ వరములిచ్చునట్లు వాగ్దానము చేసెనని ఊహించనక్కర లేదు. నచికేతస్సుకు కోపమువచ్చినట్లు సూచన లేదు. ఉపవాసమువలన బాధపడినట్లు సూచనలేదు, దాన మివ్వబడి వచ్చినవాడుగాన ప్రతిగ్రహీతను కలియుటకై ఆతు రత పడుచుండెను. అందుచేత నిరాహారమతనికి బాధాకరముగా నుండియుండదు. మరియు యమలోకమున కలిగెడి ఆహారమును మనుష్యలోకములో కలిగెడిదానికన్న భిన్నముగానుండియుండ

వచ్చును. అది ఎట్లున్నను యముడు తన యౌదార్యమునుబట్టి వరములనీయ సంకల్పించెను. ఆ నచికేతస్సు ప్రవర్తనను ఊహించి మెచ్చుకొని వరములనియ్య పూనెనని ఊహించవలెను.

తాత్పర్యము:— నీవు పూజనీయుడవు అతిథివి. బ్రాహ్మణుడవు నీకిదె నమస్కారములు, నీవు మూడురోజులు నాయింటిలో నుపవసించితివి. అట్టి అపచారమునకు కినియకుము బ్రాహ్మణుడవు కనుక నీ ఔదార్యమునుబట్టి నాకాపదరాదని నాకు తెలియును, నీవుచేసిన అఖండత్యాగమును నీ పూర్వ చరిత్రనంతను నేను దివ్యదృష్టిచే కనిపెట్టితిని. నీ సచ్చరిత్రకును నీ సంపూర్ణ త్యాగమునకును నేను మెచ్చి నీకు వరములనీయ సంకల్పించితిని. ఇష్టమైన మూడు వరములను కోరుమా నాకు భద్రము కలుగునట్లు నన్నాశీర్వదింపుము.

౧౦ వ మంత్రము శ్రుతిః 10

శాంతసంకల్పస్సుమనాయథాస్యాత్
వీతమన్యుః గౌతమోమాభిమృత్యో ॥
త్వత్ప్రసృష్టం మాభివదేత్ప్రతీత
ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే ॥

మృత్యో! ఓ యముడా గౌతమః = నాతండ్రియగు గౌతముడు; మా అభి=నాయెడ లేక నన్నుగూర్చి, శాన్తసంకల్పః= శాన్తించిన సంకల్పము కలవాడును; సుమనాః=మంచి మనస్సు కలవాడును; వీతమన్యుః = దుఃఖరహితుడును; యథా = పూర్వమెట్లో (అట్లు) స్యాత్ =అగుగాక, త్వత్ =నీవలనః

ప్రసృష్టం = పంపబడిన, మా = నన్ను గూర్చి, ప్రతీతః=తృప్తి పడినవాడై; అభివదేత్ = నాతో మాట్లాడుగాక! ఆదరించు గాక! ఏతత్ = దీనిని; త్రయాణాం = మూటిలో, ప్రథమం= మొదటిదైన; వరం = వరముగా, వృణే = కోరుచున్నాను.

విశేషార్థము:— నచికేతస్సు యముని ఆదరణకు ప్రసన్నతను సంతోషించినవాడై కృతజ్ఞుడయ్యెను. కాగానే అతనికి తోచిన మొదటి విషయము తండ్రి దురవస్థ దానిని తొలగించుటకై మొదటి వరము కోరెను. తండ్రి కోపగించి తన మరణమునకు కారకుడయ్యెనని నచికేతస్సు తలంచలేదు.

(1) శాంతసంకల్పః = సంకల్పమనగా మనోవృత్తిని సూచించును. వివిధమైన ఊహలు కలుగుచుండును. వాజశ్రవసుడు విశ్వజిద్యాగము చేయుటయు నందులో సంతర్యాగముగా జ్యేష్ఠపుత్రుని యమధర్మరాజుకు దానమిచ్చుటయు తత్ఫలితముగా తనయుడదృశ్యుడగుటయు తలంచుకొని పరిపరి విధముల వాజశ్రవసుడు ఆలోచనా పరంపరలో మగ్నుడయి యుండవచ్చును. ఆవేదనపొంది యుండవచ్చును. దుఃఖము చెంది యుండవచ్చును. మొట్టమొదట కోపము ఒక్కింత కలిగెనని ఊహించినను కూడ నదియెప్పుడో సమసిపోయి యుండును. ఇతర భావములే మిక్కుటమగుచుండును. అందుచేత వివిధ విపరీత ఆలోచనలు నన్ను గూర్చి పొందకుండుగాక అని తండ్రి యొక్క మనశ్శాంతిని తనయుడు కోరెను.

(2) వీతమన్యుః = మన్యుః అను పదమునకు కోపము దుఃఖము దురవస్థ నీచత్వము అని అర్థములు కలవు. కోపమును

అర్థమును శ్రీ శంకరులవారు గ్రహించిరి. అంతకంటె దుఃఖము దురవస్థ అను అర్థము గ్రహించుట మేలు అట్లు చేయుటచే వాజశ్రవసుడు చేసిన దానమునకు కళంకము తొలగును. అస హాజ భావము లేకుండును. ఎప్పుడు విపరీత సంకల్పములుపోయి దుఃఖాదిదురవస్థలు తొలగునో అప్పుడే సుమనాః మనః ప్రసాదము కలుగును. ప్రహ్లాదునిచరిత్ర విష్ణుపురాణములో చూచిన యెడల అచ్చటను ఇట్టి విశేషమే గోచరమగును. విష్ణువు మొట్ట మొదటి పర్యాయము ప్రత్యక్షమయినపుడు తండ్రి మనస్సు పరివర్తన మొందునట్లు ప్రహ్లాదుడు వరముకోరి పొందెను. ఇచ్చటను అట్లేజరిగెను. తండ్రికావేదన లేకుండుటయే తనకును శ్రేయస్కరమనియు శాంతినిచ్చుననియు నచికేతస్సు తలంచెను. ఏసునాథుడు చెప్పిన ప్రవచనముకూడ గమనింపతగును. దేవ పూజకు పూను సమయమున నీ పొరుగువానికి నీపై కోపభావ ముదయించెనని స్మరణకు వచ్చిన యెడల పూజనాపి ఇంటికిపోయి వానిని సమాధానపరచి తిరిగివచ్చి పూజించుము. ఇచ్చట నచికేతస్సు యముని అనుగ్రహమున తండ్రికి తనయెడ ఏదైన అనాదర భావము కలుగునన్న సంశయముకూడ తీర్చుకొనెను.

(౩) త్వత్ప్రసృష్టం=నీవలన పంపబడి, నచికేతస్సుయొక్క బుద్ధివిశేషము యిందులో విశదమగుచున్నది. అతని విశ్వాసమును తెలియుచున్నది. యముడు తనను మరల తండ్రియొద్దకు పంపునని అతడూహించెను. ప్రసృష్ట అనగా విడిగాపెట్టిన ఉద్యోగము నుండి తొలగించిన అని అర్థము కలదు. ఇచ్చట తాను

నాసముగా నివ్వబడి వచ్చినవాడు తనతో ప్రయోజనము తీరిన పిమ్మట ఆ కర్తవ్యమునుండి తనను తొలగించి పంపించునని నచికేతస్సు ఊహించియుండును. నచికేతస్సు మరణించలేదని నిశ్చయించవచ్చును. సశరీరుడై యుండెనని నిశ్చయము.

(4) ప్రతీతః = గుర్తించుట అని అర్థము చెప్పుచున్నారు. ఇచ్చుట అట్లును చెప్పవచ్చును. తిరిగి వచ్చినవాడు తన బిడ్డయే యని గ్రహించి అని అర్థము చెప్పవచ్చును. అందువలననే తృప్తిపడి సంతసించి అనియు చెప్పవచ్చును. తృప్తి సంతోష భావములే స్థిరముగానుండునవి. తండ్రి తనయుని గుర్తించుట నిమేషమాత్రములో జరిగిపోవును.

(5) అభివదేత్ = స్వాగతమిచ్చుగాకయని అర్థము చెప్పుచున్నారు. మాట్లాడుగాక అని చెప్పుటయే మేలు.

తాత్పర్యము:— యమధర్మరాజునకు నచికేతస్సు కృతజ్ఞుడయ్యెను. తనతండ్రి దీనావస్థను తలంచుకొని దానిని తొలగించుటకై యతడు ప్రయత్నించెను. మా తండ్రికి పరిపరి విధముల ఆలోచనలును ఆవేదనలును దుఃఖములును దురవస్థయు కలుగుచుండును. నన్ను తలంచుకొని యతడు చిన్తాక్రాన్తుడయి యుండును. అట్టి దుఃఖమును దైన్యస్థితిని ఆయనకు తొలగింపుము. ఆయనకు శాంతము సంతోషము మనః ప్రసాదము కలుగునట్లు అనుగ్రహించుము నన్ను నీకు నాతండ్రి దానమిచ్చెను గనుక నావలన పొందవలసిన ప్రయోజనమునంతను పొంది మరల నన్ను నా తండ్రియొద్దకు నీవు పంపుదువు. అట్లు నీవు పంపునప్పుడు నన్ను నాతండ్రి గుర్తించి సంతసించి నాతో

ప్రేమపూర్వకమయిన సల్లాపములు జరుపుగాక నీవిచ్చెదనన్న మూడు వరములలోను దీనిని మొదటి వరముగా నేను కోరు చున్నాను.

౧౧ వ మంత్రము శ్రుతిః 11

> యథాపురస్తాద్భవితాప్రతీత
> ఔద్దాలకిరారుణిర్మత్ప్రసృష్టః ।
> సుఖగ్ం రాత్రీః శయితావీతమన్యు
> స్త్వాం దదృశివాన్ మృత్యుముఖాత్ప్రముక్తమ్ ॥

ఆరుణిః = అరుణుని కుమారుడు, ఆరుణియని పేరుగలవాడు ఔద్దాలకిః = ఉద్దాలకుని కుమారుడు ఔద్దాలకి అని పేరుగల వాడు ( అయిన మీతండ్రి గౌతముడు ) పురస్తాత్ =పూర్వమువలె, యథా = ఎట్లు; మత్ = నావలన; ప్రసృష్టః = పంపబడిన, ( త్వయి = నీయందు ) తథా = అట్లు; ప్రతీతః = గుర్తించి, ఆదరించువాడు సంతోషించువాడు భవితా = అగునుగాక! రాత్రీః = రాత్రులయందు, సుఖం = హాయిగా; శయితః = నిద్రించుగాక! మృత్యుముఖాత్ = యముని ముఖమునుండి; ప్రముక్తం = విడువబడిన; త్వాం = నిన్ను, దదృశివాన్ = చూచినవాడై, సః = అతడు, వీతమన్యుః = దుఃఖమునుండి తొలగి సంతోషించినవాడు; భవితా = కాగలడు.

విశేషార్థము:— ఔద్దాలకిః ఆరుణిః అని వాజశ్రవసునికి పేర్లు. ఉద్దాలకుడు అరుణుడు అను వారిద్దరు ఇతనికి తండ్రులు. అట్లుండుటకు రెండు విధముల వీలుకలదు.

(1) ఇద్దఱిలో నొకరికికుమారుడై రెండవవానికి దత్తుడగుట అప్పుడు దత్తత తండ్రికి కర్మాధికారము కలవాడగును లేదా ఉభయులకు కర్మాధికారముగల "ద్వ్యాముష్యాయణ" అను ప్రత్యేకదత్త విధానప్రకారము స్వీకరించబడిన కుమారుడు కావచ్చును. కలియుగములో ద్వ్యాముష్యాయణత్వము లేదు. ఏదో యొకవిధమైన దత్తుడనియే ఎంచవచ్చును.

(2) మత్ ప్రసృష్టః=త్వత్ ప్రసృష్టః అని10 వ మంత్రములో కలదు. త్వత్ అనగా నీవలన మత్ అనగా నావలన ప్రసృష్టః అను పదమునకు 10 వ మంత్రములోని విశేషార్థము చూడవలెను.

(3) ప్రతీతః = 10 వ మంత్రములోని విశేషార్థము చూడ నగును. (చూడవలెను)

(4) శయితా=నిద్రించగలడు, నచికేతస్సు ఇంటికిపోయిన పిమ్మట సుఖముగా తండ్రి శయనించునని అర్థము చేయుచున్నారు. అట్లు చేసినయెడల కుమారుని సమాచారము తెలియక అతడు వచ్చువరకు తండ్రి ఆవేదనపొందుచునే యుండును. అట్లుగాక ఈ వాక్యమును (సుఖగ్ం రాత్రీశ్శయితా = అతడు రాత్రులయందు సుఖముగా నిద్రపోవును) స్వతంత్ర వాక్యముగా తీసికొన్న యెడల నేటినుండి నీ తండ్రికి నిన్ను గూర్చిన ఆందోళన యుండదని అర్థమగును. అట్లు చెప్పుట సమంజసముగా నుండును. అదెట్లు సంభవించును అనిన యెడల యముని అనుగ్రహముచేత గౌతమునకు నచికేతస్సు క్షేమసమాచారము

అన్తస్స్ఫురణవలననో, లేక ఆకాశవాణి మూలమునసనో తెలియు కలదు.

(5) దదృశివాన్ = కన్నులార కాంచినపుడు పితమన్యుడు దురవస్థతీరినవాడై సంతోషమును పొందును.

(6) ప్రముక్తం=విడువబడినవాడు. ఇది యమునివాక్యము. ప్రత్యక్షముగానడుగక గర్భితముగా మొదటి వరములో ఇమిడ్చి నా తండ్రియొద్దకు నన్ను పంపమని నచికేతస్సు చేసిన ప్రార్థనను యముడంగీకరించి నిన్ను పంపెదనని అభయమిచ్చెను. కావున సీ మంత్రములో ముప్పిధమైన వరము కలదు.

(1) తన తండ్రి యాందోళన తీరవలెనని నచికేతస్సు కోరిన దానికి నట్లే నీతండ్రి యాన్దోళనరహితుడై నేటినుండి హాయిగా నిద్రించును. అని యముడు సెలవిచ్చెను. ఇది ఇప్పటినుండి అమలులోనికి వచ్చునది. ఇట్లు నచికేతస్సు తండ్రిబాధ తీర్చెను.

(2) నన్ను మాతండ్రియొద్దకు పంపుమని నచికేతస్సుకోరిన దానికి నట్లే పంపెదను నీ తండ్రి నిన్ను శరీరముతో జూచును. సంతసించును అని యముడు తెల్పెను.

(3) నా తండ్రి పూర్వమువలె నన్నాదరించవలెను అని నచికేతస్సు కోరిన దానికి అట్లే ఆదరించునని యముడు సెల విచ్చెను. నచికేతస్సు తండ్రి గౌతముడు అతనికిద్దఱు తండ్రు లున్నట్లు ఈ మన్త్రములో చెప్పుటచేత గౌతమునకు పితృ ఋణము భారముకాగలదనియు నచికేతస్సును దానమిచ్చుట చేత నితరపుత్రులు లేక బాధపడుచుండెననియు నచికేతస్సును జూచిన పిమ్మట తన తండ్రులిద్దఱికి గతులు కలుగునని సంతసించు

ననియు ఊహించవచ్చును.

తాత్పర్యము:— ఓ నచికేతస్సూ నిన్నుగూర్చిన ఆన్దోళన లేకుండ నీతండ్రి నేటినుండి హాయిగా నిద్రపోవును. నీవునా వలన విడువబడి నీ తండ్రియొద్దకు చేరెదవు. అట్లు చేరిన నిన్ను కన్ను లారగాంచి నీతండ్రి సంతోషస్వాంతుడగును. పూర్వపు దుఃఖ మును మరచిపోవును. మధ్యజరిగిన ఈ సంఘటనను మరచిపోయి నీయెడ పూర్వమువలె ప్రీతుడై నిన్ను ఆదరించుచుండును. అతడు ఇద్దఱు తండ్రులకు ఒక్కడే కర్మాధికారి. కనుక నీమూలమున వంశము నిలచి యాయన తదనన్తరము ఆ ద్విగుణీకృత పితృఋణము నీవు తీర్చెదవని నిస్సందేహముగా నూరడిల్లును.

౧౨వ మన్త్రము- 12 శ్రుతిః

స్వర్గేలోకే నభయంకించనాస్తి
న తత్రత్వం నజరయాబిభేతి।
ఉభే తీర్త్వా అశనాయా పిపాసె
శోకాతిగో మోదతె స్వర్గలోకే ॥

స్వర్గేలోకే = స్వర్గలోకమునందు; కించన=కొంచెమైనను. భయం = భయము; నాస్తి = ఉండదు, తత్ర = అచ్చట. త్వం = నీవు ( యముడు ) న = లేవు. జరయా=ముసలితనము చేత; నబిభేతి = భయపడరు, అశనాయా = ఆకలిని; పిపాసె= దప్పిని; ఉభె = రెంటిని; తీర్త్వా = దాటి ( ఉందును ) శోకా తిగః = దుఃఖము నతిక్రమించును, స్వర్గలోకే = స్వర్గలోకము నందు; మోదతె = సంతోషించును.

విశేషార్థము:— (1) స్వర్గేలోకే = మామూలు స్వర్గలోకము దేవతలుండుచోటు. నరకమునకు భిన్నమైనది. పాపులు నరకమునకు జేరెదరు. పుణ్యాత్ములు స్వర్గమునకు జేరెదరు. దీనికి పరమపదమని కొందఱర్థము చెప్పుచున్నారు. అదిభావ్యము కాదు. నిరాకార నిర్గుణ పరబ్రహ్మను లేక సాకార సగుణ బ్రహ్మను సూచించుపదములు ఇందులో లేవు. ఇచ్చట స్వర్గమును గూర్చి యేడు అంశములు చెప్పబడినవి. (1) అచ్చట భయము లేదు. (2) అచ్చట యముడు లేడు, అనగా మరణము లేదు. (3) అచ్చట ముసలితనము లేదు. (4) అచ్చట ఆకలి లేదు. (5) అచ్చట దప్పిక లేదు. (6) అచ్చట దుఃఖము లేదు. (7) సుఖమున్నది. ఈ ఏడును చూడగా నీ లోకములోనుండు స్థితికి భిన్నమైనస్థితి యచ్చట చెప్పబడినది. ఇందులో రంభా సంభోగము మొదలగునవి చెప్పబడ లేదు. అవియన్నియు సుఖములో నంతర్భాగము లే. అవి పురాణకాలములోని సంగతులు. ఇక్కడ నుండవలక్షణము లచ్చట లేవు. దేవతలకు త్రిదశులని పేరు. ఎప్పుడును ముప్పది సంవత్సరముల ప్రాయముగలవారని యర్థము. వారు అనిమేషులు అనగా ఎన్నడును కన్ను మూయరు నిద్రలేనివారని యర్థము.

(2) అశనాయాపిపాసె = ఆకలిదప్పులు, ఈ లోకములో పంచభూతమయమయిన శరీరముండుటచే పంచభూతమయమైన ఆహారపానీయములనది కోరుచున్నది. ఆ కోరిక తీరుటకు పంచభూతములలో నొక్కటైన భూమి ప్రత్యేక ఆస్తిగా పరిగణింపబడి దానికై పోరాటములు జరుగుచుండుటచేత సహజముగా

లభించతగిన అన్నపానములు దొరకక దుఃఖము కలుగుచున్నది. భూమిని స్వర్గతుల్యముగా జేయదలచినవారు అన్నపానముల కొఱత తీర్చదలచినవారు అందఱకును దేవలోకములోవలె అమృతమునే ఆహారముగా నిష్పించవలెను. లేదా పంచభూత మయమయిన ఆహారమే కావలెనన్నచో దానిని పరిసాదించు కొనుటకు సస్యములకు హక్కగునట్లు చేయవలెను.

( 3 ) త్వం = నీవు; న = లేవు, అచ్చట చేరినవారు చావ నని అర్థము. ఇది కేవలము నిరపేక్షకముగా చెప్పరాదు. స్వర్గ లోకమనుభవించువారు పుణ్యకర్మ క్షీణించగానే మరలమనుష్య లోకమునకో, హీనతరలోకమునకో, వత్తురు. ముణ్డకము 1-2-10 వ మంత్రము "సుకృతే అనుభూత్వా ఇమం లోకం హీనతరం వావిశన్తి" అని చెప్పుచున్నది. అయినను అచ్చట న త్వం = నీవు లేవు అనగా నిర్బన్ధమరణము లేదని యూహించ వచ్చును.

మోదతే = ముదమనగా మోదమనగా తాకోరిన లేక కామించిన వస్తువు లభించినందువలన కలిగెడి సంతసము. తైత్తి రీయము 2 వ అధ్యాయము 5 వ అనువాకము, "మోదోదక్షి ణః పక్షః ప్రమోద ఉత్తరః పక్షః ఆనన్ద ఆత్మా" ఆనందము లోని అంశము లేక అంశములు ఈమోదము ప్రమోదము ఇవి ఆనన్దమువలె స్థిరమైనవికావు. తాత్కాలికమైనవి. వస్తు సంబంధమువలన కలుగునవి. కాన స్వర్గలోకములో కలిగెడి ముదము బ్రహ్మానందమని చెప్పుటకు వీలులేదు. తైత్తిరీయము 2 వ అధ్యాయములోనె 8 వ అనువాకములో ఆనందములవరుస

క్రమము చెప్పబడెను. స్వర్గలోకములోనుండు ఇంద్రుని ఆనంద మునకు మించి బృహస్పతి ఆనందము దానిని మించి ప్రజాపతి ఆనందము దానిని మించి బ్రహ్మానందముకలదు. కాన స్వర్గ లోకములోని యీ యానందము దానితో పోల్చతగదు. కేనోప నిషత్తులో 4 వ ఖండము 9 వ మంత్రములో స్వర్గలోకమను పదమునకు నిర్గుణ బ్రహ్మలోకమని యర్థము చేయబడెను. అట్లు చేయుటకు నచ్చట రెండు విశేషణములు కలవు. "అనన్తే జ్యేయె" అవి యిచ్చట లేవు. కాన దేవేన్ద్రుని స్వర్గలోకమే యని చెప్పవలెను.

తాత్పర్యము:— స్వర్గలోకమందు కించిత్తైనను భయము లేదు. యముడా! నీవచ్చట లేవు. వారు నీవలన నిర్బన్ధముగా మరణమును పొందరు. వారికి ముదిమివలన భయము లేదు. వారి శాకలిలేదు. దప్పిక లేదు. వారికి శోకము లేదు. వారికచ్చట సంతసముకలదు.

౧౩ వ మంత్రము 13 శ్రుతిః ५

స త్వ మగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో
ప్రబ్రూహిత్వం శ్రద్దధానాయమహ్యమ్ ।
స్వర్గలోకా అమృతత్వం భజన్త
ఏతద్ద్వితీయేన వృణెవరేణ ॥

సః = ఆ; మృత్యో = ఓ యముడా! త్వం = నీవు, స్వర్గ్యం = స్వర్గసంబన్ధమైన; అగ్నిం = అగ్నిని, అధ్యేషి=జ్ఞాపక ముంచుకొని యున్నావు, అనగా తెలుసును. శ్రద్దధానాయ=

శ్రద్ధాళువగు; మహ్యం = నానిమిత్తము; తం = దానిని; ప్రబ్రూహి = చక్కగా నుపదేశించుము. స్వర్గలోకాః = స్వర్గ లోకములు; అమృతత్వం=అమృతత్వమును; భజన్తే=భజించు చున్నవి. ఏతత్ = దీనిని ద్వితీయేన=రెండవదియగు; వరేణ= వరముచేత; వృణే=కోరుచున్నాను.

విశేషార్థము:— (1) * అగ్నిం == యజ్ఞములు చేయు విధానమని యొక అర్థము. తేజస్సు, జ్ఞానము, ప్రబోధము అని అర్థములుకూడకలవు. అగ్ని=జాతవేదుడు అనగా పుట్టుకనుండి సహజమైన జ్ఞానముకలవాడు, లేదా పుట్టుకగలదానినెల్ల ఎరింగిన వాడు. అనగా సృష్టినంతను ఎరిగినవాడు. అట్టిజ్ఞానము స్వర్గ్యం= స్వర్గసంబన్ధమైనది, అనగా స్వర్గమునుగూర్చినది. కాన అనుస రించిన వారికి స్వర్గమును ఇచ్చునది. స్వర్గములోనివారు కోరు నది సామాన్యమగు లౌకిక ఫలములనుగాక పారలౌకిక ఫలితము లను ఇప్పించగలదియని అర్థము.

(2) అధ్యేషి=స్మరసి, జానాసి అని శ్రీ శంకరులవారు అర్థము చెప్పుచున్నారు. అనగా ఎరుగుదువు, జ్ఞాపకముంచు కొనియున్నావు, యమునకు ఈ స్వర్గ్యాగ్ని సమాచారము అనాదిగా తెలియును. మరచిపోకుండ స్మరించుచున్నాడు.

* సామాన్య యజ్ఞవిధానమే అయిన మొదల నదియదివరకే భూలోకము నకు తెలిసియుండెను. ఆ విధానము ననుసరించియే నచికేతస్సు తండ్రి గౌతముడు విశ్వజిద్యాగము చేసియుండెను. దానితో నచికేతస్సు తృప్తి పొందలేదు. కాన నంతకుమించిన యజ్ఞవిధానముగాని, జ్ఞానరహస్యముగాని నచికేతస్సు కోరుచున్నాడు.

యముడు నరకమునకు పాలకుడని ప్రతీతి, మరణము కలిగించు నను కొందుము కాని స్వర్గమును ఇప్పించగల విధానమును ఆయ నకు తెలియును. అమృతత్వమును ఇప్పించగల విధానమును ఆయనకు తెలియును అని విశదమగుచున్నది.

(3) శ్రద్దధానాయ=శ్రద్ధకలవాడు ఈ వల్లి 2 వ మంత్ర ములో శ్రద్ధయొక్క స్వరూపము తెలుపబడెను. ఉత్తమజ్ఞానము పొందుటకు ఆసక్తి అర్హతకలదని అర్థము. నచికేతస్సు తన్ను గూర్చి యీ పదము వాడినాడు తనలో ఏర్పడిన నూతనశక్తి అతనికి చక్కగా గోచరమైయున్నదని భావము, ఇది గర్వోక్తి కాదు. సత్యమని ముందు ఋజువగును.

(4)స్వర్గలోకాః=స్వర్గలోకములు, స్వర్గలోకములుకూడ తమకు మించిన అమృతత్వమును కోరుచున్నవని అర్థము చెప్పవచ్చును. స్వర్గలోకనివాసులని అర్థము చెప్పవచ్చును. అప్పుడుకూడ తమకు లభించిన 12 వ మంత్రములో చెప్పిన సంపదతో తృప్తి పొందక హెచ్చైన అమృతత్వమును కోరుచున్నారని చెప్ప వచ్చును. అప్పుడు స్వర్గ్యం అగ్నిం అనునపుడు స్వర్గలోకవాసులకు అమృతత్వ మిప్పించగల యజ్ఞము లేక జ్ఞానము అని అర్థము చేయవచ్చును.

(5) అమృతత్వం = స్వర్గమందుసంభవించు అమృతత్వమే అయిన యెడల నదియొక కొంత కాలము వరకే పరిమితమై యుండును. సగుణబ్రహ్మయొద్ద అమృతత్వమయిన యెడల మహాప్రళయమువరకు నిలుచును. పరమాత్మయొద్ద అమృతత్వ మయిన యెడల అది శాశ్వతముగానుండును. నరకలోక నివా

సులు ఎల్లకాలము బాధపడుచుందురు. స్వర్గలోక నివాసులు ఎల్లకాలము సుఖపడుచుందురు. సుఖసంబంధముగల అమృతత్వమని గూడ నర్థము చేయవచ్చును.

(6) భజన్తె = పూజించుట, ఉపాసించుట। పొందుట అని అర్థములు కలవు. ఇచ్చట పొందుచున్నారని అర్థము చెప్పవచ్చును. అట్లు (శ్రీ) శంకరులవారు చెప్పియున్నారు, కోరుచున్నారనియు చెప్పవచ్చును. అప్పుడు స్వర్గలోకములోనున్న వారుకూడ కోరెడి నూతనమగు అమృతత్వమని అర్థము చెప్పవచ్చును.

తాత్పర్యము:— ఓ యమధర్మరాజా! ఉత్తమమయిన అమృతత్వమునిప్పించగల యజ్ఞ రహస్యమును నూతన జ్ఞానమును నీకు అనాదినుండియు తెలిసియున్నవి. నేను ఉత్తమ శ్రద్ధచే ఆవేశింపబడి అర్హుడనై యున్నాను. నాకు నీవా రహస్యము నుపదేశింపుము. స్వర్గలోకవాసులు గూడ ఆ అమృతత్వమును గోరుచున్నారు. ఇది రెండవ వరముగా ప్రసాదించుమని నేను నిన్ను ప్రార్థించుచున్నాను.

౧౪ వ మంత్రము శ్రుతిః ॥ 14

ప్ర తే బ్రవీమి తదు మేనిబోధ
స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్
అనన్తలోకాప్తిమథో ప్రతిష్ఠాం
విద్ధి త్వమేతం నిహితం గుహాయాం ॥

నచికేతః = ఓ నచికేతసస్సా; స్వర్గ్యమగ్నిం = స్వర్గ్యమైన అగ్నిని; తే = నీకు; ప్రబ్రవీమి = బాగుగ తెలిపెదను, తత్ =

దానిని, ఉ = నిక్కముగా; మె = నావలన; నిబోధ=ప్రబోధ పరచుకొనుము. ప్రజానాన్ = దాని స్వభావము తెలియగా; అనన్తలోకాప్తిం = అంతములేని లోకమును పొందించునది.

అథో = మరియు; ప్రతిష్ఠాం = ఆధారభూతమైనది; గుహాయాం=గుహాలో; నిహితం=నివసించుచున్నది. (అని) ఏతం= దీనిని; త్వం=నీవు, విద్ధి= తెలిసికొనుము.

విశేషార్థము:— (1) స్వర్గ్యం అగ్నిం= 13 వ మంత్రము యొక్క విశేషార్థము చూడవలెను. స్వర్గములోనుండు వారు కూడ నంతకంటె నుత్తమస్థితిని పొందుటకై కోరెడి యజ్ఞ విధానము లేక జ్ఞాన రహస్యము.

(2) ప్రజానన్=జాన అనగా తెలియుట ప్రజాన అనగా బాగుగా తెలియుట, అట్లు తెలిసినవాడు యముడు. ఆవిషయము 13 వ మంత్రములో నచికేతస్సు ఒప్పుకొని యుండెను. దానిని యముడిచ్చట చెప్పినట్లు వ్యాఖ్యాతలు అర్థము చేయుచున్నారు. అట్లు యముడు తన జ్ఞానపరిమితిని వర్ణించుట అనవసరమనవచ్చును అప్పుడీ ప్రజానన్ అను పదము తే=నీవు అనగా నచికేతస్సునకు వర్తించును. కాని నచికేతస్సుకు ఇది తెలిసిన విషయముకాదు. అందుచేత ప్రజానన్ అనగా బాగా తెలియకోరెడియనియర్థము చెప్పవలసివచ్చును. ప్రజానన్ అనగా ఈ అగ్ని స్వభావమును గూర్చి తెలియగానే అనన్తలోకాప్తిం అనన్తలోకప్రాప్తి కలుగునని చెప్పవచ్చును. ఇంకొకయూహ చేయనగును. ప్రజానన్ అనగా బాగా యోచించగా అని అర్థము చెప్పిన యెడల ఈ అగ్ని అనన్తలోకాప్తి పొందించగ

డని చెప్ప వీలగును. అప్పుడు నచికేతస్సుకు బోధించెడి విష యము మహత్తరమైనదని స్ఫురించును.

( 3 ) ప్రతిష్ఠా=మూలాధారము జగత్తునకు ప్రతిష్ఠ సృష్టి కంతకును ఆధారము.

( 4 ) అనన్తలోకాప్తిం=అంతము లేనిలోకమును పొందించు నది. అంతము లేని లోకము స్వర్గము కాజాలదు. స్వర్గలోక మంతముకలదని 12 వ మంత్రములో చెప్పబడెను. ఇచ్చటవాడిన పదము కేన 4 వ ఖండము 9 వ మంత్రమును పోలియున్నది.

( 5 ) నిహితం గుహాయాం=గుహాలోనివసించునది, యముడు నచికేతస్సునకు ఉపదేశించు అగ్నినిగూర్చి మూడు విషయ ములు తెలుపబడెను. [1] ఆయగ్ని విశ్వసృష్టికి మూలాధా రము. [2] అది అనన్తలోకములను పొందించును. [3] అది మానవుని హృదయగుహాలో నివసించి యున్నది. కాన నీయగ్ని పరమాత్మయే అని తోచును. * యజ్ఞయాగాది క్రతువులలో నుపయోగించెడి అగ్నిహోత్రము కానేరదు నిహితంగుహాయాం

* యజ్ఞయాగాది క్రతువులు చేయువారు తమకన్న భిన్నమగు దేవుడు లేక దేవత కలరని యెంచి వారిని తృప్తిపరచుటకును ఇహలోక, పరలోక ఫలితములను పొందుటకును శాస్త్రవిహిత కర్మలను చేయుచుందురు. ఎవరి నుద్దేశించి తియాకర్మలు చేయుచున్నారో ఆ దేవతలందఱును ఒక్కరే అనియును వారితరచోట్లనుండక తమ హృదయములోనే యున్నారనియు ఆ యజ్ఞకర్తలు ఋత్విజులు తెలియజాలరు, ఆ దేవతలందఱు ప్రత్యేక ప్రత్యేకముగాగాని సమిష్టిగాగాని విశ్వసృష్టికి మూలాధారమనియు ఈ యజ్ఞకర్తలు ఋత్విజులు తెలియజాలరు. అట్టివానినుండి కోరతగినది. నశ్వర ఫలితములు కాదని వారు గ్రహించుటలేదు. ఇచ్చట యముడు నచికేతస్సుకు నవీనమయిన మహత్తరమయిన అంశమును బోధించుచున్నాడు.

అనునపుడు బుద్ధిమంతుల హృదయగుహాలో నిల్చినదని శ్రీ శంకరులవారు అర్థముచేసిరి. ఆ భావమునే యితరులనుసరించిరి. అట్లు క్లప్తపరచుటకు తగినకారణము కనుపడదు. సర్వమానవ హృదయగుహా అనియే అర్థము చేయవలెను. రెండవవల్లి 12వ మంత్రములో "గుహానిహితం" అయిన దేవుని తెలిసినవానికి హర్షశోకములు లేవని తెలుపబడెను. కాన నట్టిఫలితము ఇప్పించ గలవాడు పరమాత్మయే. ఈ వల్లిలో 29 వ మంత్రము చూడ వచ్చును. "గూఢమనుప్రవిష్టః" గూఢమైనది, హృదయ మధులో ప్రవేశించినది. ఈ పదములే మరల 2 వ వల్లి 12వ మంత్ర ములో వాడబడెను. ఇచ్చట యముడు పరమాత్మను గూర్చియే బోధించుచున్నాడని తలంచవలెను. లేదా ఆత్మయజ్ఞమును గూర్చి బోధించుచున్నాడని ఎంచవలెను. సామాన్య యజ్ఞ యాగాది క్రతువులనుగూర్చి కాదని నిశ్చయించవలెను.

తాత్పర్యము:— ఓ నచికేతస్సా నేను నీకు చక్కగా ఉప దేశించెదను. ఈ స్వర్గ్యాగ్నిగూర్చి నావలన చక్కగా ప్రబోధ పరచుకొనుము. దీని తత్వము బాగా తెలిసినపుడు ఇయ్యది యనన్తలోకమని చెప్పదగు పరమపదమును కలిగించును. ఇదియే విశ్వసృష్టికాధారము. ఇదియే మానవుల హృదయగుహాలో నిలిచియున్నది. కావ దీనిని నీవు తప్పక తెలిసికొనుము. అట్టి మహాత్తరమైనదని గ్రహించుము.

౧౫ వ మంత్రము- శ్రుతిః ॥ 15

లోకాదిమగ్నిం తమువాచతస్మై
యాఇష్టకాయావతీర్వా యథావా ।
సచాపి తత్ప్రత్యవదద్యథోక్తం
మథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః ॥

తస్మై=అతనికి [ నచికేతస్సునకు ] లోకాదిం=సృష్టికి ఆధారభూతమయిన, తం అగ్నిం = ఆ అగ్నినిగూర్చి [ యముడు ] ఉవాచ=చెప్పెను, యాః=ఎట్టివి; యావతీః=ఎన్ని, వా=లేదా, ఇష్టకాః=ఇటుకలు, యథా=ఎట్లు, వా=లేక చ=మరియు, సః=అతడు, అపి=కూడ తత్=దానిని, యథా=ఎట్లు; ఉక్తం=చెప్పబడెనో; ( తథా=అట్లే ) ప్రత్యవదత్=తిరిగిచెప్పెను, అథ = పిమ్మట; అస్య=అందుకు; మృత్యుః = యముడు, తుష్టః = సంతుష్టుడై; పునః = మరల; ఏవ = నిశ్చయముగా; ఆహ= చెప్పెను.

విశేషార్థము:— ( 1 ) లోకాదిం = విశ్వమునకాధారము. వెనుకటి 14 వ మంత్రములో ప్రతిష్ఠాం అని చెప్పినదే.

( 2 ) ఉవాచ=చెప్పెను ఆ పరమరహస్యమేదియో బయట పడలేదు.

( 3 ) ఇష్టకాః = ఇటుకలు అని సామాన్యార్థము. ఏరకము ఇటుకలు, ఎన్ని ఇటుకలు, ఎట్లు వాడవలసిన ఇటుకలు అను మూడు పదములు ఈ రెండవపాదములోగలవు. దాని వివరము లేవియు ఇచ్చట చెప్పబడి యుండలేదు. సామాన్య యజ్ఞమందు ఇటుకలు వానిసంఖ్య వాని రకము వానిసలవరచు విధానము

దానికి తగిన గణితశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము మొదలగు వన్నియు తెలియవలసి యుండును. ఇచ్చట వివి తెలుపబడ లేదు దాని వివరములును (శ్రీ) శంకరులవారుకూడ యిచ్చియుండ లేదు. అవసరములేదని వదలి యుండవచ్చును. సూత్రకల్ప సూత్రములను గ్రంథము కలదు. అందులో నీవిభాగమంతయు గలదు. 14 వ మంత్రములో చేసిన అన్వయమునుబట్టి యిది ఉత్తమ జ్ఞానరహస్యమో లేక ఆత్మయజ్ఞమో, అన్యోన్యమొదల నీ యిటుకల ప్రసక్తియే యుండదు. అప్పుడీపదములకు వాక్యార్థముగాక ఆలంకారికార్థము చెప్పవలెను. అట్లు చెప్పిన యెడల ఈ పదములవలన బాహ్యచిహ్నములు సాధనసంపత్తి అని అర్థమగును. ఏసునాథుడు (I am life (Goal) and I am The way అని చెప్పియున్నాడు. అనగా నేనే దివ్యజీవితమును అనగా పరమార్థమును, నేనే సాధనను అని చెప్పియున్నాడు. పరమాదర్శమును పొందుటయు దాని సాధనయు రెంటికి నవినాభావసంబన్ధము కలదు. మొదట సిద్ధిగా కనపడునది రెండవ మెట్టునకు సాధనగా పరిణమించును. సిద్ధి సాధనలభివృద్ధినిబట్టి మారుచుండును. "సత్యేన పన్థా వితతో దేవయానః" 3 వ ముండకం 1 ఖండము 6 వ మంత్రము. దేవయానమను దివ్యమార్గము సత్యముతో నిర్మితమై వ్యాప్తమై యున్నది. అందుచే సిద్ధి సాధనలు ఒక్కటేయనని తెలుపవచ్చును. ఈ ఆత్మయజ్ఞమునకు గాని ఉత్తమజ్ఞాన సంపాదనకుగాని పూనకముందు చేయవలసిన కొన్ని పూర్వ విధులు (Preliminaries) కలవు.

అట్టిదానికి వేదచోదితమైన కొన్ని కర్మలు కలవు. ఆ కర్మలు ఆ హోమములు చేయుటకు ఈ ఇటుకలు అవసరమని ఎంచినను ఎంచవచ్చును. సన్న్యాసము తీసికొనక పూర్వము విరజా హోమము కలదు. ఆత్మశ్రాద్ధము కలదు. మహానారాయణము 65-66 అనువాకములో కిరరాహోమ మంత్రములు కలవు. ఆ మంత్రములనుబట్టి అగ్నిలో ఆహుతులు వెయ్యవలెనని కనుపడును. ఆ యిటుకలు అట్టి పనికి ఉపయోగించవచ్చును.

(4) ప్రత్యవదత్ = గురువు, శిష్యులకు పనస చెప్పినపుడు వారు తిరిగి చెప్పుచుందురు. అట్లే నచికేతస్సుయును చెప్పెననియు ఆ స్వరమునకు యముడు మెచ్చుకొనెననియు శ్రీ శంకరులవారు అర్థముచేసిరి. అట్టి ఉచ్చారణకు యముడు సంతసించి మరియొక వరము ప్రసాదింప పూనుకొనెనని ఊహించియున్నారు. ఇతడు బ్రాహ్మణుడు వేదవేదాంగముల నదివరకే పఠించియుండును. అందుచేత యముడు చెప్పిన మంత్రములను మరల చెప్పుటలో ఆశ్చర్యముండదు. ఇచ్చట అట్లు సుస్వరముతో జెప్పుట ముఖ్యమని భావించరాదు. దానిని పూర్తిగా గ్రహించెనని అన్వయించవలెను. ఏకసంతగ్రాహిగా యముడు చెప్పినదంతయు కంఠతః పట్టి తిరిగిచెప్పుట యొక్క బుద్ధివిశేషము, దాని భావమును అంతరార్థమును గ్రహించి యానందించుట అతని జ్ఞానాభివృద్ధి సూచకము, ఈ రెండును యమునకు గోచరమయి యుండవలెను, అందుచేతనే అతడు తుష్టుడై యుండును,

తాత్పర్యము:— విశ్వసృష్టికి మూలమైన జ్ఞానరహస్యమును యజ్ఞరహస్యమును యముడు నచికేతస్సునకు ఉపదేశించెను,

దానితోపాటు దానికి పూర్వాకర్మగా చేయవలసిన విధానమును అంటకవసరమయే హోమాదులును దానికిగాను ఏర్పఱచ తగిన అగ్నికుండమును దానికి వలయు ఇటుకలు రకము సంఖ్య మొదలగునవియును తెల్పెను. తాను బోధించిన రహస్యములకు బాహ్యక్రియలును చిహ్నములును తెల్పెను, యముడుబోధించిన దంతియును దాని భావమును భాషయును స్వరమును నచికేతస్సు అవగాహనము చేసికొని తాను జీర్ణముచేసికొనినట్లు యమునకు విశదపరచెను, యముడు అతని నైపుణ్యమునకును, సంసిద్ధతకును, సంతసించినవాడయి మరల ఇట్లు పలికెను,

౧౬ వ మంత్రము శ్రుతిః 16

తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా<br>
వరంతవేహాద్య దదామి భూయః ।<br>
తవైవనామ్నా భవితాయమగ్నిః<br>
సృంకాంచే మామనేకరూపాం గృహాణ ॥

మహాత్మా = మహాత్ముడగు యముడు, ప్రీయమాణః = సంతోషించినవాడయి; తం = నచికేతస్సుతో; అబ్రవీత్ = చెప్పెను, ఇహ = ఇక్కడ; అద్య = ఇప్పుడు; తవ = నీకు, భూయః = మరల, వరం = వరములు; దదామి = ఇచ్చుచున్నాను, అయం = ఈ; అగ్నిః = జ్ఞానరహస్యము యజ్ఞరహస్యము, తవ = నీయొక్కపేరుతో, ఏవ = మాత్రమే, భవితా = వర్తించును, నామ్నా = పేరుతో ~

ఇమాం = ఈ; అనేకరూపాం = బహురూపములుకల

సృంకాం = దణ్డను; గృహాణ = తీసికొనుము, [గ్రహించుము]

విశేషార్థము:— (1) ప్రీయమాణః=15 వ మంత్రములో "తుష్టః" అని చెప్పిన విషయమునే ఇచ్చట మరల చెప్పెను.

(2) మహాత్మా = సహజమైన ఔదార్యముకలవాడు. ఆత్మశక్తి అధికముగాగలవాడు, భీకరరూపుడేగాక, కఠిన హృదయుడేగాక, హృదయమార్దవము దయాదాక్షిణ్యములు కలవాడని సూచించుచున్నది. మృత్యుదేవతయొక్క స్వభావ మదియెయని లోగడ 2 వ మంత్రము 4 వ అంశములో తెలుప బడెను.

(3) ఇహ అద్య=ఇచ్చట ఇప్పుడే ఆ వరము ఆచరణలోనికి వచ్చుటకు కాలవ్యవధి అవసరములేదని అర్థము. నచికేతస్సు ఈ నూతన మార్గమునకు ప్రవర్తకుడు వ్యాపింపచేసిన వాడు దానిని లోకములో స్థిరపరచుటకు వ్యాపింపచేయుటకు యముడు నచికేతస్సునకు పూర్ణాయుర్దాయమును అధిక సామర్థ్యమును ఆత్యన్తావకాశమును ప్రసాదించెనని యర్థము. నచికేతస్సు తండ్రియొద్దకు తిరిగి పోవుటయేగాక పూర్ణాయుర్దాయమును లోకోద్ధరణావకాశమును అధిక ప్రఖ్యాతిని బడసినవాడయ్యెను. నిష్కామమయిన త్యాగమునకు అనుగుణమైన ఫలితము అవాంఛితముగా అప్రయత్నముగా లభించెను. "యోగక్షేమం వహామ్యహమ్" యోగక్షేమమును నేను వహింతును. అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో 9 వ అధ్యాయము 22 వ శ్లోకములో చెప్పెను. అన్నియు నీకు నమకూరును (All else will be added unto you) దైవరాజ్యమును మీరు మొట్టమొదట సంపాదిం

చును. తక్కినదంతయు మీకు కల్పింపబడును, అని చెప్పెను.

(4) అనేకరూపాం = అనేకరూపములు కలది. అనేక ముంది జనులకు వారి వారి పరిణామస్థితినిబట్టి అనేకరూపములతో లేక అనేక విధములుగా స్ఫురించునది. అనేక రూపములుగా బడుటకు కనపడినను ఒకటే అంతరార్థము కలది. అనగా బహు విధ కార్యములకు సమన్వయ సూత్రమును కల్పించునది. ఆ నచికేతాగ్నియే ఇన్ని రూపములు పొందినదని తెలిసికొనుట చేత రూపములు పరస్పరము స్వతంత్రములు భిన్నములు కావ నియు వానికి అన్తర్గతమగు సూత్రమొక్కటియే యనియు తెలియనగును. దీనికి శ్రీ శంకరులవారు "శబ్దవతీ రత్నమయీ" యని అర్థము చెప్పిరి. అనగా శబ్దములను కల్పించు లేక శబ్దము గల రత్నమయమయినది. అని అర్థముచేసిరి. ఇంకొక విధమున అనిందితమైన కర్మమార్గముకలది అని చెప్పిరి. మరియొకవిధమున కర్మ విజ్ఞానము తెలుపునది అనిరి. ఈ మూడవది భావ్యమని తోచును. సర్వకర్మలకును పరస్పరభిన్నములయిన రూపములు కలిగియున్నను వాటినన్నిటిని సమన్వయపరచగల అంతరార్థము ఇందులో కలదని అర్థము. గనుక యజ్ఞమునొక్క బాహ్యార్థము గాక అంతరార్థము తెలుపునది.

(5) సృంకాం మాల లేక దండ లేక సంఘా అని అర్థము ఈ నచికేతాగ్నియే ఒక దండ దానిపై గుచ్చబడిన రత్నములు పలువిధములయిన కర్మలు విధులు కర్తవ్యములు యజ్ఞయా గాది క్రతువులు అనగా వానినన్నిటికిని ధరించు సూత్రమిదియే అని అర్థము "మణిగణాఇవ" భగవద్గీత 7 అధ్యాయము 7 వ

శ్లోకము సర్వభూతములలో నుండెడి పరాత్పరుడు మణుల హార ములో నుండెడి దారమునకు పోల్చబడెను. అట్లే ఈ నచికే తాగ్ని సర్వయజ్ఞ యాగములలోగుండ గ్రుచ్చబడిన దారము. రామకృష్ణమఠమువారు ఈ నాలుగవ పాదములో మరియొక రహస్యము చెప్పబడినదని ఊహించుచున్నారు. కాని దానికవ కాశము కనుపడదు. ఏలయన:— ఇమాం అను పదముకలదు. ఇది 'ఈ" అని అర్థము కలది. ఇది సర్వనామము, లోగడ చెప్పిన అయమగ్నికి వర్తిల్లును, పన్థా అను అర్థము, మరింత నవ్యముగానుండు నచికేతాగ్ని యను నూతన మార్గమును నీవు గ్రహించి నీపేర ప్రబోధ, అనుష్ఠానములు జరుపుము. అని యముడిచ్చిన సలహాగా ఎంచవచ్చును.

(6) గృహాణ = ఈ పదమునకు తీసికొనుము అని అర్థము కలదు. నేనిచ్చెడి మాలను గైకొనుము. అని శ్రీ శంకరులవారు అర్థము చేసిరి: యముడు పూలహారము లేక నూలుహారము ఇచ్చుటగాని లేక నచికేతస్సు తీసికొనుటగాని సంభవించదు. అది యాసందర్భముకూడ ఆపదమునకు తెలిసికొనుము. అర్థము తెలిసికొనుము, బోధపరచుకొనుము, అని అర్థములుకూడ కలవు. ఇచ్చట ఈ యర్థమే సమంజసము. ఎట్లు నచికేతాగ్ని సర్వయజ్ఞములకు నంతరార్థమగునో దానిని గ్రహించుమని యముడు నచికేతస్సును హెచ్చరించుచున్నాడు. నూతన సందేశకర్త కానున్నాడు కనుక దానిలో గర్భితమయియున్న సర్వసారమును నచికేతస్సు గ్రహించుట ఆవశ్యకము. అందు చేతనే ఈ హెచ్చరిక ఈ యగ్నికి నీపేరు పెట్టినంతమాత్రమున

తృప్తిపడి యూరకుందువేమో ఇయ్యది బాహుళ్యమైన వైదిక కర్మకంతకును సారవస్తమైన సమన్వయ సూత్రము ఈ విష యము ధ్యానమందుంచుకొని నీవు తెలిసికొని యితరులకు తెలుపుమాయని యముడు నచికేతస్సునకు ఉద్బోధించెను.

తాత్పర్యము:— ఔదార్యసస్తుతును ఉత్తమభావ సంభరితు డును అగు యముడు సంతుష్టాన్తరజ్ఞుడై మరల ఇచ్చుటనే ఇప్పుడే నీకొకవరమిచ్చెదనని నచికేతస్సుతో చెప్పెను. నేనిప్పుడు బోధించిన అగ్ని నీపేరనే నచికేతాగ్నియని లోకములో ప్రసిద్ధి కెక్కును. నీవే దానికి ప్రవర్తకుడవు, ప్రబోధకరుడవు, అయ్యె దవు. ఇయ్యది ఇదివరకు లోకములోనుండెడి సర్వవిధములగు యజ్ఞయాగాదికర్మలకును సర్వవిధమైన ప్రబోధమునకును అన్తర్గతమైన సారవస్తమైన సమన్వయ సూత్రమయి వెలయ గలదు. ఆ అన్తరార్థమును నీవు ధ్యానించి కనుగొనుము. కను గొని ఇతరులకు దెలుపుము. ఈ సూత్రముపై సర్వకర్మలు సర్వ విధములగు భావములు జ్ఞానములు ఆధారపడి యున్నవి. పూల మాలలోని పువ్వులను నిలిపెడి దారమువంటి ఏకమత్య సూత్ర మిది.

౧౭ వ మంత్రము- శ్రుతి: 17

త్రిణాచికేత స్త్రిభిరేత్యసన్ధిం
త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ।
బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా
నిచాయ్యేమాం శాన్తిమత్యన్తమేతి ॥

త్రిభిః = మూటితో; సన్ధిం=ఐక్యతను, కలయికను; ఏత్య=

పొంది; త్రికర్మకృత్ = మూడుకర్మలు చేసినట్టి; త్రినాచికేతః = మూడు నాచికేతస్సులుకలవాడు; జన్మమృత్యూ = జననమరణములను; తరతి = దాటుచున్నాడు, ఈడ్యం = పూజనీయుడు; దేవం = దివ్యమయిన కాన్తిగలవాడు; బ్రహ్మజజ్ఞం = బ్రహ్మనుండి పుట్టినవానిని తెలిసికొనినవాడు; విదిత్వా = బోధపరచుకొని; నిచాయ్య = అనుభవమొనర్చుకొని, ఇమాం = ఈ; అత్యన్తం = అత్యధికమైన, శాంతిం = శాన్తిని; ఏతి = పొందుచున్నాడు.

విశేషార్థము:— (1) త్రినాచికేతః = నాచికేతయజ్ఞములు మూడు చేసినని అర్థము చెప్పుచున్నారు. లేదా నాచికేత యజ్ఞముయొక్క జ్ఞానము అధ్యయనము అనుష్ఠానము ఈ మూడు కలవాడు అని చెప్పుచున్నారు. ఈ రెండు అర్థములు శ్రీ శంకరులవారు ఇచ్చినవే. త్రిణాచికేతః అనగా మూడు నాచికేతస్సులు కలవాడు, నాచికేతస్సనగా నచికేతుని పేరబరగు యజ్ఞరహస్యము, లేక జ్ఞానరహస్యము. ఆ రహస్యమును మూడువిధముల తనలో ననుభవమొనర్చుకొన్నవాడు. నచికేతస్సు 1ఆస్తికోను, 2తలిదండ్రులతోను 3 ఇహలోక పరలోక ఫలితముల నొసంగిన యజ్ఞయాగాదులతోను సంబన్ధమువదలుకొని వచ్చినవాడు. వానికియముడు నేర్పినఉత్తమజ్ఞానముమరల నచికేతస్సు వదలి వచ్చినవానిలోనే అతనిని ప్రవేశపెట్టజాలదు. కాన ఆ మూటికిగల సంబంధము మరల కలుగకుండ ధ్రువపరచునదై యుండవలెను. లోకములో మానవులకు కలుగు బాధలు మూడు. దారైషణ, ధనైషణ, లోకైషణ ఈ మూటి

స్వభావము తెలిపి దానిని త్యజించు విధానమును యముడు చెప్పి యుండును. త్రిణాచికేతుడనగా ఈషణాత్రయమును విసర్జించిన వాడని అర్థము చెప్పవలెను.

(2) త్రిభిః = మూడింటితో సీమూడు. మాతా, పితా, ఆచార్య, ముగ్గురు చెప్పెడి (ఇచ్చెడి) ఉపదేశమని శ్రీశంకరుల వారు అభిప్రాయపడుచున్నారు. వేదస్మృతి శిష్టాచారములను మూటివలన జ్ఞానము పొందినవాడని చెప్పుచున్నారు. లేదా ప్రత్యక్ష అనుమాన ఆగమములను మూడు ప్రమాణముల ద్వారా జ్ఞానము పొందినవాడని చెప్పుచున్నారు. ఈ మూడును చెప్పవచ్చును. లేదా యేయొక్కటైనను చెప్పవచ్చును. ఈ లోకములో ఈ సందర్భములో మాకా దేసిగా స్ఫురించునవి కొన్ని కలవు. త్రయీవిద్య=1. ఋగ్యజుస్సామవేదముల అధ్యయనము. (2) సత్వరజస్తమోగుణముల స్వభావము. (3) భూలోక, భువర్లోక, సువర్లోకముల, స్వభావము. (4) మనోవాక్కాయ కర్మల ఏకత్వము. (5) స్థూలసూక్ష్మ కారణ శరీరముల స్వభావము సంబన్ధము. (6) జగత్తు జీవాత్మ పరమాత్మ ఈ మూటి స్వభావము సంబన్ధము. ఈ మూటితో సన్ధిపొంది అనికలదు. సన్ధి యనగా కలయిక, సమ్మేళనము, ఐక్యత, సంబన్ధము స్నేహము అని అర్థములుకలవు. ఈ మూటితో సంబన్ధము లేక మూటికి పరస్పర సంబన్ధము పరస్పర ఐక్యముకలవాడు కావలెను. ఇచ్చట త్రిగుణముల సమన్వయమనిగాని మనోవాక్కాయ కర్మల ఐక్యభావమనిగాని చెప్పవచ్చును. లేదా జన్మజరామరణ

ములకు కారణమగు స్థూలసూక్ష్మ కారణ శరీరముల స్వభావమును సంబంధమును వాని జయించు విధానమును కావచ్చును. అంతకంటెను సమంజసమయిన భావము చిత్రించిపర చెప్పినది. మూడు ఏషణలు వదలినవాడు గనుక పిమ్మట చేయవలసినది. ఈ మూటి తత్వనిరూపణయే.

(౩) త్రికర్మకృత్ = మూడుకర్మలు చేసినవాడు. దేవ, ఋషి, పితృ, ఋణములు మూడును తీర్చినవాడనిచెప్పవచ్చును. యజ్ఞము, వేదాధ్యయనము, దానము, చేసినవాడని శ్రీ శంకరులవారు భావించిరి. భగవద్గీత 18 వ అధ్యాయము 5 వ శ్లోకములో "యజ్ఞ దాన తపః కర్మ" త్యాజ్యములుకావు. కర్తవ్యములేయని చెప్పుచున్నది. ఈ మూడు విశేషార్థములో సన్యాసులుకూడ చేయతగినదేయని సమర్థించ వచ్చును. బృహదారణ్యకములో 5-2-2-5-2-3-5-2-4 బ్రాహ్మణములలో దాన, దమ, దయలు కర్తవ్యములని ప్రజాపతి మనుజులకు, దేవతలకు, దానవులకు విధించెను. ఈ మూడును చేయతగినవేయని ఒప్పుకొనవచ్చును. స్థూల సూక్ష్మ కారణ శరీరములు మూడుకలవు ఈ మూటివలన కలిగెడి ఆవేదనకు తాపత్రయమందురు. ఈ తాపత్రయమును అణచెడి శాన్తి విధానమును త్యజించ వీలుండదు. బృహదారణ్యకములో 4-5-15లో "ఆత్మా వా అరెజ్ఞాతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" అని చెప్పియున్నారు. త్రికర్మయనగా ఆత్మను తెలిసికొనుట ధ్యానించుట సమాధిస్థితిలో అనుభవము పొందుట అని చెప్పవచ్చును. అట్టివానికిదియే నిరన్తర కర్మగానుండును. ముణ్డకము 3-1-4 వ

మంత్రము. "ఆత్మక్రీడః, ఆత్మరతిః, క్రియావాన్" ఆత్మరతి, ఆత్మక్రీడయే, కర్మగాకలవాడు.

4) బ్రహ్మజజ్ఞం = బ్రహ్మయనగా హిరణ్యగర్భుడనియు అతనినుండి పుట్టినవాడు బ్రహ్మజుడనియు అతని నెరిగినవాడు బ్రహ్మజ్ఞుడనియు రెండుగుణములుకలవాడు బ్రహ్మజజ్ఞుడనియు శ్రీ శంకరులవారు అర్థము చెప్పుచున్నారు. మరియొకరు బ్రహ్మనుండి కలిగిన జ్ఞానముకల జీవుని అని అర్థము చెప్పుచున్నారు. ఇక్కడ బ్రహ్మజజ్ఞుడన్న పదము దేవం ఈడ్యం అను పదములతో సంబంధము కలిగియున్నది. అంతియేగాక విదిత్వానిచాయ్య అను క్రియలచే నుపలక్షితమైనది. అనగా తెలిసికొని అనుభవించవలె నని చెప్పెడి వస్తువు. ఈ బ్రహ్మజజ్ఞనే దానిని తెలిసికొని అనుభవించి నపుడే అత్యన్త శాన్తి కలుగును, కాన యీ అర్థము పొసగదు. రామకృష్ణమఠమువారు బ్రహ్మనుండి పుట్టినవాడు అగ్నియనియు వాడు సర్వజ్ఞుడనియు అట్టి యగ్నినే తెలిసికొనవలెననియనని అర్థము చెప్పిరి. అదికొంత భావ్యముగానె యున్నది. ఏలయన:— యముడు తెలిపినది లోకాధారమయిన అగ్ని అని 14-15 మంత్రములలో తెలుపబడెను. ఆ యగ్నికూడ గుహలో నిహితుడని 14 వ మంత్రము తెలిపెను. దానినే తెలిసికొనుట భావ్యమని వాదించవచ్చును. ఈ పదమును ఇంకొకవిధముగా నాలోచింపనగును. బ్రహ్మ బ్రహ్మజము, బ్రహ్మజజ్ఞము ఇట్లు విభజించిన యెడల మొదటిది బ్రహ్మ = పరమాత్మ, రెండవది ఆయననుండి పుట్టిన విశ్వము. మూడవది ఆయనను ఈ విశ్వములో నున్నవారిలో తెలియువాడు జీవాత్మ. ఈ ముగ్గురను

ఒక టేఁకని తెలిసికొనుట లేదా ఈ ముగ్గురి స్వభావము తెలిసి కొనుట లేదా ఇట్లు మూడు రూపములుగా తోఁచు పూజనీయు డయిన దేవుని తెలిసికొనుట ఇదియొక విధానముగా నంగీకరించ వచ్చును. ఇంకొకవిధమేమన బ్రహ్మనుండి పుట్టినది విశ్వము దానిని జ్ఞ = తెలిసికొనువాడు, ఆత్మ ఆ ఆత్మ. దివ్యమయినది పూజనీయమైనది, అని తెలిసి కొనవలెను. ఈ అన్వయముకూడ భావ్యముగానే యుండును. మహానారాయణం 1 వ అనువాకం 10 వ పనసలో "బ్రహ్మజజ్ఞానం" అని రెండు పదములుగా వాడబడెను. ఇచ్చటకూడ నట్లే "బ్రహ్మజజ్ఞం" అని రెండు పద ములు చేసిన యెడల బ్రహ్మ అనియు విశ్వమును తెలియువాడ నియు పూజనీయుడయిన దేవుడన్నియు అర్థమగును. ఏ యర్థ మిచ్చినను తెలియ తగినవాడు అనుభవైకవేద్య మొనర్చుకొన తగిన వాడు. ఈ బ్రహ్మజజ్ఞం దేవం ఈడ్యం కాన మూడుపదములకిట్లు అన్వయము చేయుట భావ్యము. పరమాత్మనుండి వెల్వడిన ఆత్మ పూజనీయమైన ప్రకాశవన్తమైన దైవముగా తెలిసికొని అనుభవైకవేద్యము చేసికొనవలెను.

(5) అత్యన్తం శాంతిం = శ్రీ శంకరులవారు "వైరాజం పదం ప్రాప్నోతి" అనగా సగుణబ్రహ్మ సంబన్ధమైన పదమును పొందునని తెలుపుచున్నారు. జ్ఞాన కర్మ సముచ్చయము అను ష్ఠించుటచే నట్లు జరుగునని వారు సూచించిరి. ఇచ్చట వాడిన పదములు అత్యన్తశాన్తి ఈ పదములను హిరణ్యగర్భునకే వర్తింపజేయవలసిన అవసరము లేదు. ఈ రెండవ అధ్యాయము 2 వ వల్లి 13 వ మంత్రములో "తేషాంశాన్తి శ్శాశ్వతీనేతరే

షాం" (వారికే శాశ్వత మైన శాన్తి ఇతరులకు కాదు) అని చెప్పబడెను. వారికే అనునపుడు పరమాత్మను జూచినవారికే. ఇచ్చట అత్యన్తశాన్తి అచ్చట శాశ్వతశాన్తి రెండును ఒకటే. శ్వేతాశ్వతరము 6 వ అధ్యాయము 12 వ మంత్రము బ్రహ్మ జ్ఞానులకు శాశ్వత సుఖమును చెప్పుచున్నది. శ్వేతాశ్వతరము 4 వ అధ్యాయము 14 వ శ్లోకము "శాన్తిమత్యన్తమేతి" అచ్చట పరమాత్మ దర్శనమువలన గలుగు శాన్తి అనియే అన్వయింపబడెను. ఇటో 11 వ మంత్రము "నిచాయ్యేమాం శాన్తి మత్యన్తమేతి" ఇతనిని అనుభవములోనికి తెచ్చుకొనుట వలన అత్యన్త శాన్తి కలుగును. ఇచ్చటను పరమాత్మ దర్శనము వలన కలిగెడి ఫలితమే శాన్తియని చెప్పబడెను. కాన శాన్తి మత్యన్తం అనగా పరమాత్మ పదమనియే చెప్పవలెను.

తాత్పర్యము:— దారైషణ, ధనైషణ, లోకైషణయను మూటిని త్యజించుటయే. నాచికేత యజ్ఞములు అట్టి మూడు నాచికేత యజ్ఞములొనర్చినవాడును, జగత్తు జీవాత్మ పరమాత్మ మూటియొక్క కేయిక సంబన్ధము. ఐక్యత తెలిసినవాడును ఆత్మజ్ఞానము ఆత్మధ్యానము సమాధిలో ఆత్మదర్శనమును మూడే కర్మలు కర్తవ్యములగా చేయువాడును; జన్మ జరామృత్యు సంసారమును దాటును. సృష్టి విధానమును తెలిసికొనెడివాడు ఆత్మను పూజనీయుడగు పరమాత్మగా తెలిసి సాక్షాత్కార మొనర్చుకొనువాడును సుప్రసిద్ధమయిన శాశ్వతమైన అపారమైన శాంతిని పొందుచున్నాడు.

౧౮ వ మంత్రము - శ్రుతిః ॥ 18

త్రిణాచికేతస్త్రయమేతద్విదిత్వా
య ఏవం విద్వాంశ్చినుతే నాచికేతం ।
స మృత్యుపాశాన్పురతః ప్రణోద్య
శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥

యః = ఎవడు; త్రిణాచికేతః = మూడు నాచికేతస్సులు కలవాడగునో; విద్వాన్ = జ్ఞాని; ఏతత్ = ఈ త్రయం = మూటిని; ఏవం = ఈవిధముగా; విదిత్వా = తెలిసికొని నాచికేతం = నాచికేతమును, చినుతే = ఉపాసించునో, సః = అతడు, పురతః = శరీరపతనకు పూర్వమే; మృత్యుపాశాన్ = మృత్యుబన్ధములను; ప్రణోద్య = నశింపజేసి, ఇహైవ = ఇక్కడనే; శోకాతిగః = శోకమునుదాటి, స్వర్గలోకే = స్వర్గలోకమందలి సుఖము అనుభవించుచు, మోదతే = సంతోషమును పొందును.

విశేషార్థము:— (1) త్రిణాచికేతః నాచికేతం = 17 వ మంత్రములోని విశేషార్థము చూడవలెను.

(2) త్రయమేతత్ = ఈ మూటిని జీవాత్మ, జగత్తు, పరమాత్మలను తెలిసికొనవలెను, లేదా కర్మ భక్తి జ్ఞానమార్గములను ఈవిధముగా అనగా 14-15-16-17 మంత్రములలో తెలిపినట్లుగా అనికూడ చెప్పవచ్చును, చినుతే = చేసి లేక ఉపాసించి ఎట్లయినను చెప్పవచ్చును.

(3) పురతః = పూర్వము అనగా మృత్యువు సంభవించక పూర్వమే అనగా జీవించియుండగానే ఈ పదమునకిట్లర్థము

చేయక పునః ప్రణోద్యా=ముందుగా త్రోసివేసి యని యర్థము చెప్పుచున్నారు. అది సమంజసముకాదు. శ్రీ శంకరులవారు కూడ దేహపాతమునకు పూర్వమేయని అన్వయించిరి. పురుష సూక్తములోగూడ "తేహనాకంమహిమానస్సచన్తే" వారు స్వర్గమునిచ్చటనే యేర్పరచుచున్నారని చెప్పబడెను. కాన దేహపాతమునకు పూర్వమే ఇట్టి సుస్థితి సంభవించును. ప్రాక్ శరీరవిమోక్షణాత్ = శరీరపతనమునకు పూర్వమే కామక్రోధ ముల నాపగలవాడు యోగి అగునని భగవద్గీత 5 వ అధ్యాయము 19 వ శ్లోకము "ఇహైవతైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః। నిర్దోషం హి సమంబ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తేస్థితాః॥ ఇచ్చటనే తమ ప్రకృతిని జయించి బ్రహ్మయందు నిలువబడుదురు. ఇచ్చటనే యిట్టి శుభస్థితి కలుగునని ఇతరమైన ఉపనిషత్తులును తెలుపుచున్నవి.

(4) స్వర్గలోకే = స్వర్గలోకమునకు ఈ విద్వాంసుడుపోవునని అర్థముకాదు. శరీరపతనము పిమ్మట జరిగెడి పని అది ఇచ్చట స్వర్గలోకములో చెప్పెడి సుఖములన్నియు ఈ లోకములో నుండగనే ఈ లోకములోనె పొందునని యర్థము. ముణ్డకం 3-2-9 పరబ్రహ్మను తెలిసినవాడు పరబ్రహ్మయే యగును. అట్లే యిచ్చటను విద్వాంసుడు బ్రహ్మజ్ఞానముచే ప్రసాదింపబడు ఆ ఆనందమును అనుభవించునని అర్థము. ప్రశ్నోపనిషత్ 4 వ ప్రశ్న 10-11 బ్రాహ్మణములు "సర్వో భవతి సర్వమేవావివేశ" తాను సర్వము అగును. సర్వములో ప్రవేశించును, అట్టి యుత్తమస్థితిని పొందునని యర్థము. జ్ఞాని

యిచ్చుటనే స్వర్గలోకము నిర్మించుననని పురుషసూక్తముకూడ తెలుపుచున్నది. కాన నట్టి సుఖములు ఈ శరీరమందుండగనే అనుభవించుననని చెప్పవలెను.

తాత్పర్యము:— ఈ మూటిని జగత్తు జీవాత్మ పరమాత్మ లను ఈ విధముగా తెలిసికొని త్రిణాచికేతుడై అనగా దారైషణ ధనైషణ లోకైషణలను వదలినవాడై నాచికేతమును ఉపాసించిన విద్వాంసుడు లేక జ్ఞాని శరీరము నశించక పూర్వమే మృత్యుపాశముల ధ్వంసమొనర్చి వానినుండి విమోచనము పొందును అనగా జీవన్ముక్తుడగును. అందుచేత దుఃఖములను దాటును. స్వర్గమందు కలిగెడి అనుభవములను ఇచ్చుటనే పొందును.

౧౯ వ మంత్రము - శ్రుతిః ॥ 19

ఏష తేఽగ్నిర్నచికేత స్వర్గ్యో
యమవృణీథా ద్వితీయేన వరేణ ।
ఏతమగ్నింతవైవ ప్రవక్ష్యన్తి జనాస
స్తృతీయం వరం నచికేతో వృణీష్వ ॥

నచికేతః = నచికేతస్సు; ద్వితీయేన = రెండవదియగు; వరేణ = వరముచేత; యం = దేనిని ( త్వం = నీవు ) అవృణీథాః = కోరితివో, ఏషః = ఈ; స్వర్గ్యః అగ్నిః = స్వర్గ్యాగ్ని, తే = నీకు; జనాసః = జనులు, ఏతమగ్నిం = ఈ అగ్నిని; తవైవ = నీకుమాత్రమే అనిప్రవక్ష్యన్తి = ప్రకటింతురు. నచికేతః = ఓ నచికేతస్సూ, తృతీయం = మూడవదగు, వరం = వరమును వృణీష్వ = కోరుము.

విశేషార్థము:— (1) స్వర్గ్యమగ్నిం = 13-14 మంత్రముల విశేషార్థము చూడవలెను.

(2) జనాసః = ప్రవక్ష్యన్తి = జనులు తెలుపుదురు. ప్రవక్ష్యన్తి అనగా ప్రకటింతురు, వర్ణింతురు, విశదపరతురు అని అర్థములు కలవు. తైత్తిరీయం 1 అధ్యాయం 8 వ అనువాకము "బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపాప్నవానీతి" లోకములో ఈ నూతన పద్ధతు ప్రవర్తకుడు నచికేతస్సని ప్రఖ్యాతి కలుగును. ఆ మన్త్రములనుపదేశించుటకు ప్రచారము చేయుటకు నచికేతస్సుకే హక్కు కలదు. ఇట్టి యధికారమును యముడతనికి కలిగించుచున్నాడు.

తాత్పర్యము:— ఓ నచికేతస్సా దేనిని నీవు రెండవ వరముగా కోరియుంటివో ఆ స్వర్గ్యాగ్ని ఇదె నీదె లోకమంతయు నీ అగ్ని నీదెయని అంగీకరించి యశస్సు ప్రకటింతురు. ఆ పద్ధతు నీవే ప్రవర్తకుడవు. దానిని ప్రచారములోనికి తెచ్చుటకు, ఉపదేశించుటకు, బోధించుటకు నీవె అర్హుడవు. నూతన మార్గమును ప్రకటించువాడవు నీవె. ఇక మూడవదగు వరమును కోరుమా; ఈ మన్త్రము యమునియొక్క సద్భావమును, నచికేతస్సు నందుగల ప్రేమయును ఋజువు చేయుచున్నది.

౨౦ వ మన్త్రము శ్రుతిః ॥ 20

యేయం ప్రేతే విచికిత్సామనుష్యే-
ఽస్తీత్యేకేనాయమస్తీతిచైకే ।
ఏతద్విద్యామనుశిష్టస్త్వయాఽహం
వరాణామేష వరస్తృతీయః ॥

మనుష్యే= మనుష్యునియందున్నది ప్రేతే=చనిపోయినపుడు లేక ఇచ్చట విడిచినపుడు యా = ఏది (ఇతి=అని) ఇయం = ఈ; విచికిత్సా=సందేహము, అస్తి = కలదు, ఏకే=కొందఱు; అస్తి=కలదు, ఇతి=అని, (అందురు) చ=మరియు, ఏకే = మరి కొందఱు; అయం=ఇది. నాస్తీతి=లేదని (అందురు) త్వయా= నీవలన, అనుశిష్టః = బోధింపబడి; ఏతత్ = దీనిని, అహం= నేను, విద్యాం= తెలిసికొనగోరుచున్నాను, వరాణాం=వరము లలో, ఏషః = ఇది, తృతీయః = మూడవదియగు, వరః = వరము.

విశేషార్థము:— (1) మనుష్యే = మనుజునియందు మను జుని స్థూలశరీర మిచ్చటనేయుండును. ఇంద్రియముల సూక్ష్మాంశ ములును ప్రాణమును, ఆత్మయును ఈ మూడును ఈ శరీర మును విడచిపోవునని సామాన్యమైన ప్రతీతి. నచికేతస్సు ఈ మూడుగాని, ఈ మూటిలో నేదైనగాని మరణానంతమందుండునా ఉండదా యను దానిని గురించి ప్రశ్న వేయుచున్నాడని యెంచ వచ్చును. * ఇంకొక విధముగా ప్రశ్నించినాడని ఎంచవచ్చును. ఈ మనుజునిలోనున్న దేదో అది వ్యష్టిగానుండునా సమిష్టిలో లీనమైపోవునా అని కూడ ప్రశ్నకు అర్థము చెప్పవచ్చును.

(2) * ప్రేతే=చనిపోయినపుడు అని అర్థము జీవించియున్న

* ఇందులో నేదైన వెడలునా? ఏదిపోతె పడిపోవును? పోయినదేమ గును? బౌద్ధులు కర్మ సముదాయమే.

* జన్మ లెత్తుచుందురు, గాని ఆత్మ లేదందురు అదియే అవస్థల మార్పు అంతా నిత్యముగానుండునందురా? అంతేనా ఆత్మయనునది కలదా? యని పరీక్ష గావించవచ్చును.

సమయమునగూడ అవస్థ మారినపుడు ప్రేతయని చెప్ప వచ్చును. కేనోపనిషత్తు 1 వ ఖండము 2 వ మంత్రములో ప్రేత్య అని వాడినపుడు ఇట్టి అర్థము చేయబడెను. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలోగల భేదముకూడ గమనించ తగియున్నది. ఇంద్రియ జీవితమును వదలి ఆధ్యాత్మిక జీవితములో ప్రవేశించి నపుడు మానవుని జీవితములో పెద్ద మార్పు కలుగుచుండును. స్వార్థ జీవితమునువదలి ప్రజాహిత జీవితములో ప్రవేశించినపు డును క్రొత్త మార్పుండును. ఇచ్చట మాత్రము మరణించిన పిమ్మట అనియే చెప్పుట భావ్యము. మరణించిన పిమ్మట అనినచో మానవశరీరములోనుండు ఇంద్రియములు గాని అధిష్ఠాన దేవతలు గాని, ప్రాణముగాని ఆత్మగాని ఏదైన అన్యగాని శూన్యగాని మిగులునా? మిగులదా? మిగిలిన యెడల దాని వ్యక్తిత్వము నామరూపములు ఉండునా? ఉండవా? అనునదియే ప్రశ్న. అట్లే బ్రతికియున్న మనుజులలో పూర్వదశనుండి పరదశకు మార్పు కలిగినపుడు ఆ మార్పు అచ్చముగా భౌతికమా? మాన సికమా? ఆధ్యాత్మికమా? వివిధ దశలలో నిత్యమైన వస్తువు ఏదైన కలదా?

(౩) విచికిత్సా = సన్దేహము, తైత్తిరీయము 1 వ అధ్యా యము 11 వ అనువాకములో "కర్మవిచికిత్సా వా వృత్త విచి కిత్సావా" అని వాడబడినది. అచ్చటను సన్దేహమనియే అర్థము. ఇచ్చట నచికేతస్సుకు కలిగిన సందేహమేమో స్పష్ట ముగా గమనించవలెను. తాను మనుజలోకము వీడి సశరీరుడై యమలోకమునకు వచ్చెను మూడురాత్రులుపవసించెను.

కాన మనుష్య యమలోకములమధ్య తన శరీరము ఇంద్రియాదులు వ్యక్తిత్వము నిత్యముగానే గోచరమగుచుండును. స్వర్గలోకమునకు వెళ్లువారినిగూర్చి 12 వ మంత్రములో నచికేతస్సు వేసిన ప్రశ్నబట్టి మనుష్యలోకమును వీడివచ్చిన వ్యక్తి స్వర్గలోకమందున్నంతకాలము తన వ్యక్తిత్వమును తాను నిలుపుకొనుచునే యుండునని స్పష్టము. తాను ఫలానా మనుజుడననియు అచ్చట తానొనర్చిన పుణ్యకర్మల ఫలితమును భోగించుచున్నాననియు తెలిసికొనియే యుండును, గనుక అచ్చటను మర్త్య స్వర్గలోకములమధ్య నిత్యమైన పదార్థమేదో యొకటి కలదని నచికేతస్సుకు తెలిసియే యున్నది. అట్లే నరకలోకమున యమయాతనలను అనుభవించువారుకూడ మనుజలోక నరకలోకములమధ్య ఒక నిత్యపదార్థము కలదని గ్రహించియుందురు. అదియును నచికేతస్సుకు తెలిసియే యుండును. ఈ మూడు దృష్టాంతములలో నిత్యమైన వస్తువొకటి కలదని గ్రహించిన నచికేతస్సుకు ఆ మూటినిగూర్చి విచికిత్స కలుగుటకవకాశములేదు. కాన నతనికి కలిగిన సందేహము :—14–15–16–17 మంత్రములలో చెప్పబడిన జ్ఞానవిషయమున సందేహమేర్పడి యుండవలెను. గుహలో నిహితుడైన పరమాత్మను తెలిసికొని ఈడ్యమైన దేవుని గ్రహించి సాక్షాత్కారమొనర్చుకొనినవాడు ఆ ఆనందసమయమున, ఆ మోక్షకాలమున ఆ దేవునికంటే భిన్నముగానుండునా? లేక ఆ దేవుడును ఇతడును మగ్నమయి యొకటే యగుదురా? అనునదియే ప్రశ్న సామీప్య, సారూప్య, సాలోక్యములలో నేదైన స్థితికలిగి నిలిచియుండునా?

లేక సాయుజ్యమే శరణ్యమా? అనునదియే ముఖ్యమైన ప్రశ్న. దానినిగూర్చియే సందేహము. ఆ సన్దేహము తీర్చుకొనుటకే నచికేతస్సు ప్రశ్నించెను. ఆ ప్రశ్న మహత్తరమైనది. కనుకనే దేవతలకుకూడ ఇది తెలియదనియు యముడు తెలిపి ఆ ప్రశ్నను వారింపజూచ్చెను. అట్లు యముడు ప్రయత్నించిన కొలదియు నచికేతస్సు గట్టిపట్టు పట్టెను.

(4) విద్యాం = తెలిసికొనగోరుచున్నాను. నచికేతస్సు వయస్సులో చిన్నవాడైనను అతనియందు ప్రవేశించిన శ్రద్ధను బట్టి ముఖ్యమైన ప్రశ్నయే వేయకలిగెను. ప్రశ్నోపనిషత్ మూడవప్రశ్న 2 వ బ్రాహ్మణములో పిప్పలాదమహర్షి తెలిపినట్లు "అతిప్రశ్నాన్ పృచ్ఛసి" కఠిన ప్రశ్నను నచికేతస్సు వేసెను. అచ్చట పిప్పలాదునకు ప్రత్యుత్తరమీయ ఎట్లు తప్పలేదో ఇచ్చటను యమునకు అదేవిధముగా తప్పకపోయెను.

తాత్పర్యము:— మనుజుడు మరణించినపుడు లేక అవస్థ మారినపుడు అతనిలోనున్న ఏవస్తువు ఇచ్చటినుండి వదలిపోవును? పోయి అచ్చటనుండునని కొందఱు చెప్పెదరు. మరి కొందఱట్టిదేదియు నుండదందురు. నీవలన నుపదేశింపబడిన నేనా రహస్యమును తెలిసికొనగోరుచున్నాను. నాకు మీరొసను గ్రహించిన వరములలో దీనిని మూడవవరముగాగోరుచున్నాను. దానిమూలమున నాకారహస్యమును తెలుపుడు. సన్దేహములను తీర్చుడు. ఈ ప్రశ్నమూలమున మోక్షమునొందినవ్యక్తి ఆ మోక్షస్థితిలో పరమాత్మలో మగ్నమగునా? లేక వ్యక్తిత్వము నిలుపుకొని వేరుగానుండునా? అని నచికేతస్సు ప్రశ్నించెను.

౨౧ వ మంత్రము - శ్రుతిః ॥ 21

దేవైరత్రాపివిచికిత్సితంపురా
నహిసుజ్ఞేయ మణు రేషధర్మః ।
అన్యం వరం నచి కేతో వృణీష్వ
మా మోపరోత్సీరతిమాసృజైనమ్ ॥

అత్ర=ఈ విషయమై; పురా=పూర్వకాలమందు; దేవైః= దేవతలవలన, అపి = కూడ; విచికిత్సితం = సన్దేహింపబడినది, హి = ఏలనన; ఏషఃధర్మః = ఈ ధర్మము, లేక ఆత్మ అణుః = సూక్ష్మమైనది, సుజ్ఞేయం = సులభముగా తెలియతగినది, న= కాదు, నచికేతః = ఓ నచికేతస్సూ, అన్యంవరం = వేరగు వరమును, వృణీష్వ = కోరుకొనుము, మా = నన్ను, మోపరోత్సీః = బ్రతిమాలుటవద్దు, ఏనం = దీనినుండి, మా=నన్ను, అతిసృజ = విడిపించుము.

విశేషార్థము:— (1) దేవైః = దేవతలవలన ఈ దేవతలలో హిరణ్యగర్భుడుకూడ చేరియుండవచ్చును. విష్ణునాభి నుండి చతుర్ముఖబ్రహ్మ ఉదయించినపుడు తనను సృజించిన వానినిగూర్చి ఆయనకు సంశయము కలిగెనని పురాణగాధ కలదు. మొట్టమొదట దేవతలకు సందేహము కలిగినట్లు ఈ మంత్రము తెలుపుచున్నది. పురా = పూర్వకాలమును సూచించుపదము వాడబడినది. దానివల్ల నింకొకభావము స్ఫుట మగుచున్నది. పూర్వకాలమందు ఈ సందేహముండెడిది అనునపుడు ఇప్పుడు లేదని యర్థము. యముడు ఈ దేవతలలోనివాడే. ఇప్పుడాయనకు బ్రహ్మజ్ఞానము తెలియుటయేగాక ఉపదేశించు

అధికారముకూడ కలిగియున్నది. అగ్నీ ఇతర దేవతలకును జరిగి యుండవచ్చును. వీరెట్లీ జ్ఞానము సంపాదించిరో తెలిసికొనవలెను. కేనోపనిషత్తులో ఇంద్రునకు బ్రహ్మమే గురువై బోధించి నట్లు కలదు. ఛాన్దోగ్యము, కౌషీతకిలో ఇన్ద్రుడు ప్రజాపతి లేక సగుణబ్రహ్మయొద్దకు వెళ్ళి యీ జ్ఞానము సంపాదించినట్లు కలదు. దేవతలకు కర్మాధికారము లేదు అందుచే పుణ్యపాపములు లేవు, జ్ఞానాధికారము కలదు. బ్రహ్మసూత్రములీవిషయమును నిర్ధారణ చేసినవి. దేవతలకే ఇట్టి చిక్కున్నపుడు మానవులకిది యత్యన్త కఠినమైన సమస్యయని సూచింపబడుచున్నది, స్పష్టముగా కూడ చెప్పబడెను.

(2) ధర్మః = ధర్మము అని సామాన్యార్థము. ఆత్మయని ఇంకొకయర్థము కలదు. మతవిషయక జ్ఞానమని ఇంకొక అర్థము కలదు. ఇచ్చట ఆత్మ లేక దైవసంబన్ధమగు జ్ఞానమని చెప్ప వచ్చును.

(3) అణుః = సూక్ష్మమైనది, అనగా నత్యన్త నిగూఢమైనది. అందుచేతనే నహిసుజ్ఞేయం = తేలికగా తెలియదగినది కాదనియే యముడు చెప్పెను.

(4) ఉపరోత్సీః = బ్రతిమాలుట దీనికే నిర్బన్ధించుటయని అర్థము చెప్పుచున్నారు. బ్రతిమాలుటయని చెప్పుటయే భావ్యము. ఉపరత = వదలుట, విరమించుటయని అర్థము కలదు. ఇచ్చట యముడు నచికేతస్సును పరీక్షించుటకు ప్రయత్నించుచున్నాడు మాయపుచ్చి మడుగులోదింపుటకు కాదు. ఆంగ్లములో ( Testing, Tempting ) రెండు భావ

ములు కలవు. మొదటిది శోధించుట. రెండవది మాలిన్యములో మగ్నము చేయుట మొదటిది స్నేహితుడు చేయుపని. రెండవది శత్రువుచేయుపని యముడు మిత్రుడుగాని శత్రువు కాదు.

(౫) అతిసృజ=విడిపించుము తానదివరకు వాగ్దత్తముచేసి యున్నాడు. ఆ వాగ్దత్తప్రకారము ఈ వరమిచ్చితీరవలసినదే. ఇవ్వని యెడల అనృతదోషము సంభవించును. అందుచే నీవు నాప్రార్థన నంగీకరించి ఆవరమిచ్చు బాధ్యతనుండి తప్పింపుమని క్షమింపుమని యముడు కోరుచున్నాడు. అట్లు నచికేతస్సంగీకరించిన యెడల యమున కనృతదోషము రాదని తలచుట సామాన్యదృష్టిలో భావ్యమేకాని ఉత్తమోత్తమధర్మమది కాదేమోయని సన్దేహముపొడముచున్నది. శ్రీరామునిజీవితము తార్కాణముగా తీసికొనవచ్చును. కైక తనకొడుకు తన కుమారుడగు భరతునికొఱకు రాజ్యమునుకోరి రాముని అరణ్యమునకు పంపునట్లు దశరథునిద్వారా ఆజ్ఞనుపొందెను. దశరథుని మరణానంతమున అయోధ్యచేరిన భరతుడు రాజ్యస్వీకరణమున కంగీకరించనందున కైకయు భరతుడును అరణ్యమునకుపోయి రామునితో తమకీరాజ్యమక్కఱలేదనియు రాముడే స్వీకరించవలెననియు ప్రాధేయపడిరి. రాముడందుకంగీకరించకపోయెను. అదియె యుత్తమమని తోచును. రాముడు తన తండ్రికి వాగ్దత్తమిచ్చెను. దశరథుడుకూడ అచ్చటినుండి రమ్మని బ్రతిమాలినచో రాముడేమిచేసి యుండెడివాడో చెప్పవీలు లేదు కాని అట్టి యుత్తమపద్ధ సామాన్యమానవుల కగమ్యమగుచున్నది.

తాత్పర్యము:— ఓ నచికేతస్సా పూర్వకాలమందు దేవతలకు

క్రూడ నీవిషయమై సందేహముండెను. ఇయ్యది (ఈ ఆత్మ) (లేక జ్ఞేయధర్మము) అత్యన్త సూక్ష్మమైనది. సులభముగా తెలియతగినదికాదు, నన్నీవిషయమై ప్రశ్నించవద్దు. ఈ హాగ్రత్తమునుండి నన్ను విడిపించుము నీకిష్టమైన మరియొక వరమును కోరుము. నీకిచ్చెదను.

౨౨వ మన్త్రము - శ్రుతిః ॥ 22

దేవైరత్రాపి విచికిత్సితంకిల
త్వంచమృత్యో యన్న సుజ్ఞేయమాత్థ ।
వక్తాచాస్య త్వాదృగన్యోన లభ్యో
నాన్యోవరస్తుల్య ఏతస్యకశ్చిత్ ॥

అత్ర = ఈ విషయమై; దేవైరపి = దేవతలచేకూడ; విచికిత్సితం = సంశయింపబడినది, కిల = నిశ్చయము, మృత్యో = ఓ యముడా! యత్ = దేనిని, త్వం=నీవు, సుజ్ఞేయం=సులభముగా తెలిసికొనుట; న = వీలుకాదని; ఆత్థ = చెప్పితివో, అస్య = దీనికి, త్వాదృక్ = మీవంటి, వక్తా = బోధకుడు, అన్యః = ఒరులు, నలభ్యః = దొరకడు. ఏతస్య = దీనికి, తుల్యః = సమానమైనది. కశ్చిత్ = ఏదిన్నీ, అన్యః = మరొకటి, వరః=వరము, న = లేదు.

విశేషార్థము:— (1) దేవైః= దేవతలు దివ్యులు అనగా తేజోవిరాజితులు. ఆవరణమువలన ఆటంకములేకుండ జ్ఞేయ పదార్థమును తెలిసికొన తగినవారు.

(2) త్వాదృక్ = మీవంటి ఇది దేవతలకుకూడ సందేహము కలిగిన విషయము, తేలికగా తెలియతగినదికాదు. కాన మానవులకు కష్టసాధ్యము. తెలుపు పండితులుగూడ దొరకరు. ఇది నిత్యమైన ఆత్మనుగూర్చిన విషయము. ఇతర వరములలో నేనేది కోరినను అనిత్యమైన అనాత్మను గూర్చిన దేయగును.

(3) మృత్యోః = మృత్యువు నశ్వరమగు శరీరముపై మాత్రమే అధికారముకలవాడు. ఆత్మపై అతనికిగాని మరియొకరికిగాని అధికారములేదు. నశ్వరమగు శరీరమును అనశ్వరమని భావించియుండుటచేత మోహము కలిగి దాని వినాశము భయంకరము దుఃఖకరము అగుచున్నది. అందుచే మృత్యువు కూడ భయంకరుడగుచున్నాడు అట్టి భీతిలేనివానికి మృత్యువు మిత్రుడే.

తాత్పర్యము:— ఓ యమధర్మరాజా ఈ విషయమై దేవతలకు కూడ సందేహము కలిగియుండెనని మీరే తెలిపియుంటిరి. అదియు నిశ్చయమే. ఇది సులభముగా తెలియబడదని మీరు తెలిపి యుంటిరి. ఇట్టి గూఢవిషయమును తెలుపుటకు మీకంటె అన్యులు సమర్థులుకారు. మానవులలో దీని బోధకులు దొరకుట దుర్లభము. ఇది నిత్యమైన ఆత్మనుగూర్చిన వరము. అనిత్యమైన అన్యపదార్థములను గూర్చిన వరమువలన ప్రయోజనమేమి? ఇతరవరము దీనితో సమానముకాదని నానిశ్చితాభిప్రాయము కాన అన్యవరముల వంకకు నామనస్సు పోవుటలేదు. మీరు ధర్మనిర్ణాయకులు. నశించునది నశించనది తేల్చగల సమర్థులు. నేను నశించని దానినిగూర్చి కోరగా నా బుద్ధిని

మరల్ప మీరేల యత్నించెదరు? మరియొక నశించని పదార్థము నాకు స్ఫురించుటలేదు.

౨౩ వ మన్త్రము - శ్రుతిః ౹౹ ౨౩

శతాయుషః పుత్రపౌత్రాన్వృణీష్వ
బహూన్ పశూన్ హస్తిహిరణ్యమశ్వాన్ ।
భూమేర్మహదాయతనం వృణీష్వ
స్వయంచ జీవశరదో యావదిచ్ఛసి ౹౹

శతాయుషః = నూరేండ్లు జీవించు; పుత్రపౌత్రాన్ = కొడుకులునుమనుమలును, వృణీష్వ=కోరుకొనుము, బహూన్ = అనేకములగు, పశూన్ = పశువులను; హస్తి=ఏనుగులను, హిరణ్యం = బంగారమును; అశ్వాన్=గుఱ్ఱములను; భూమేః = భూమియందు; మహత్ = గొప్పదైన ఇండ్లు లేక రాజ్యమును; వృణీష్వ = కోరుము; స్వయం = నీవు; యావత్ = ఎన్ని; శరదః = సంవత్సరములు; ఇచ్ఛసి = కోరుదువో; తావత్ = అన్నాళ్లు, జీవ = జీవించుము.

విశేషార్థము:— (1) ఆయతనం = అనగా ఆశ్రయము ఇల్లు. దీనికే రాజ్యమని శ్రీ శంకరులువారును అర్థముచేసిరి. అది ఆలంకారికము. ఇచ్చట భవనములు ప్రాసాదములు అని చెప్పుటయే సందర్భమునుబట్టి సరిపోవును.

(2) జీవ = జీవించుము సిరిసంపదలు ఎన్నియున్నను తగిన ఆయుర్దాయము లేనిచో వానివల్ల ప్రయోజనముండదు. (ఇచ్చట

జీవితేచ్ఛ ఇన్ద్రియభోగము నిమిత్తమే) * అందుచే మనుమలకు నూరేండ్లు వచ్చువరకుకూడ నీవు జీవింపవచ్చును. అని యముడు నచికేతస్సుకు తెలిపెను. "యావదిచ్ఛసి తావజ్జీవ" ఎన్నాళ్లు కోరితే అన్నాళ్లు జీవించుము అనుదానికి అమృతత్వమని అర్థము కాదు. మానవలోకములో సామాన్యశరీరముతో ఇంద్రియ భోగములను అనుభవించగల జీవితమే అని అర్థము.

తాత్పర్యము:— నూరేండ్లు సంపూర్ణ ఆయుర్దాయముగల కొడుకులను కుమార్తెలను మనుమలను మనుమరాండ్రను కోరుకొనుము. లెక్కకుమించిన పశువులను, ఏనుగులను, గుఱ్ఱములను, అమితమైన ధనమును, భూమియందు విశాలములగు భవనములను, ప్రాసాదములనుకోరుకొనుము. నీవు స్వయముగా కూడ ఎన్నాళ్లు జీవించవలెనని కోరెదవో అన్నాళ్లు జీవించుము.

౨౪ వ మన్త్రము - శ్రుతిః ॥ 24

ఏతత్తుల్యం యదిమన్యసేవరం
వృణీష్వ విత్తం చిరజీవికాంచ ।
మహాభూమౌ నచికేత స్త్వమేధి
కామానాం త్వాకామ భాజంకరోమి ॥

ఏతత్ = దీనితో; తుల్యం = సమమయిన, వరం = వరము; మన్యసే యది = కలదని తలంచినయెడల; విత్తం = ద్రవ్యమును,

* జ్ఞానసంపాదననిమిత్తము కాదు. దైవసేవ మానవసేవ నిమిత్తమును కాదు. అని సూచనకలదు.

చిరజీవికాంచ= దీర్ఘాయుష్యమును, వృణీష్వ=కోరుకొనుము; నచికేతః= ఓ నచికేతస్సా, మహాభూమౌ=గొప్పరాజ్యమును, త్వం=నీవు, ఏధి=ఏలుకొనుము, కామానాం= కామములకెల్ల, కామభాజం=భోగిగా, త్వాం=నిన్ను, కరోమి=చేసెదను.

విశేషార్థము:— (1) తుల్యాం మన్యసే= 23 మంత్రములో చెప్పిన విషయములు గాక యితరవిషయములమీద నీకు బుద్ధి పోయిన యెడల వానినే కోరుము. నీకేకోరికలు కలిగిన వాని నన్నిటిని ఇచ్చెదను.

(2) ఏధి = అభివృద్ధిపొందుము. సౌఖ్యము పొందుము. బలవన్తుడవుకమ్ము. అని అసలు అర్థము ఇచ్చట పెద్ద ఆస్తిపరు డవుగా అభివృద్ధి పొందుము. లేక ఆస్తిని పాలించుము అని చెప్పవచ్చును.

తాత్పర్యము:— పైన తెల్పిన వస్తువులుగాక వానికితుల్య మైన ద్రవ్యమో దీర్ఘాయుష్యమో ఏది నీవు కోరిన దానినిచ్చె దను. భూలోకమున పెద్ద ఆస్తినిచ్చెదను పాలించుకొనుము. ఏ ఇతర కోరికలు కలిగిన వానినన్నిటిని తీర్చెదను అన్ని కోరికలు పొందగలవు.

౨౫ వ మన్త్రము - శ్రుతిః 25

యేయే కామా దుర్లభా మర్త్యలోకే
సర్వాన్కామాగ్ శ్ఛన్దతః ప్రార్థయస్వ ।
ఇమారామాస్సరథాస్సతూర్యా
నహీదృశా లంభనీయా మనుష్యైః ॥

ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ
నచికేతో మరణం మానుప్రాక్షీః ॥౨౫॥

మర్త్యలోకే = నశ్వరమగు మనుష్యలోకమందు, యెయే = ఏయేవి; కామాః = కోరికలు; దుర్లభాః = పొందుటకష్టమో; (తాన్ అట్టి) సర్వాన్ = సకల; కామాన్ = కోరికలను; ఛన్దతః = యథేచ్ఛగా, ప్రార్థయస్వ = కోరుకొనుము, సరథాః = రథములుగలట్టియు, సతూర్యాః = వాద్యములుగలట్టియు; ఇమాః = ఈ; రామాః = అందగత్తెలు, ఈదృశాః = ఇటువంటివారు, మనుష్యైః = మనుష్యులచేత; లమ్భనీయాః = పొందతగినవారు, నహి = నిక్కముకాదు, మత్ = నాచేత; ప్రత్తాభిః = ఇయ్యబడిన; ఆభిః = వీరిచేత; (ఈ అందగత్తెల చేత) పరిచారయస్వ = పరిచర్యలు పొందుము; నచికేతః = నచికేతస్సూ; మరణం = మరణముగూర్చి; అనుప్రాక్షీః = ప్రతిమాలుట, మా = వద్దు.

విశేషార్థము:— (1) మర్త్యలోకే = నశ్వరులగు మనుజులు కల లోకము ఆమాట వాడుటచే మనుష్యలోకములోని వస్తువులన్నియు నశించునవేయని నచికేతస్సుకు తోచక తప్పదు.

(2) రామాః = స్త్రీలు, అందకత్తెలు పురుషులను రమింపజేయువారు. కనుక రామాః ॥ ఇమారామాః అని చెప్పుటచేత తనయొద్దనున్న అప్సరసలను జూపిన నచికేతస్సును యముడు శోధించుచున్నాడు. నశించెడి మీలోకములో నశించని ఈ స్త్రీలతో రమింపవచ్చునని యముడు తెల్పెను. ఆ స్త్రీలతో

గూడ రథములు సంగీత పరికరములుకూడ చూపించెను. మానవులకు దుర్లభమనికూడ తెల్పెను.

(3) మత్ప్రత్తాభిః = నేను పంపుటచేత వచ్చుచున్నారు గాని మీలోకమును మెచ్చికాదు. నిన్ను మోహించికాదు అనికూడ సూచనకలదు.

(4) మరణం = చనిపోవుట దానినిగూర్చి నచికేతస్సు అడుగలేదు. మరణాన్తరము నిలిచెడి నిత్యపదార్థమును గూర్చి ఆయన ప్రశ్నించెను. ఆ ప్రశ్ననే వదలుకొమ్మని యముడు కోరుచున్నాడు. ఒకవిధమున మరణమునుగూర్చియే ప్రశ్నించె నని చెప్పవచ్చును. కొందఱు నిత్యపదార్థముకలదందురుగదా! అది నిత్యమా? మరణించునా? అని ప్రశ్న నచికేతస్సు చేసె నని తలంచవచ్చును.

తాత్పర్యము:— నశించు స్వభావముగల మనుష్యలోక ములో నున్నవారికి యే యే కోరికలు పొందుట దుర్లభమో అట్టివాని నన్నిటిని నీతలచుకొనుకలుగా కోరుము ఇచ్చెదను. భోగించుము. అంతియేగాక ఏ మనుష్యునకును ఎన్నడును లభ్యముకాని నీనాయెదుటనున్న ఈ రమణీయాంగనలను నీకిచ్చె దను. వారు రథములతోను సంగీతయన్త్రాదులతోను నీవెంట వచ్చి నీవు కోరిన పరిచర్య చేయుదురు. వారినందఱిని నేనాజ్ఞా పించి పంపెదను. నచికేతస్సా ఇవన్నియు తీసికొనుము. మర ణాన్తర విషయమునుగూర్చి మాత్రము ప్రాధేయపడకుము.

౨౬ వ మన్త్రము - శ్రుతి ॥ 26

శ్వోభావామర్త్యస్యయదన్తకైత
త్సర్వేన్ద్రియాణాంజరయన్తి తేజః ।
అపిసర్వం జీవితమల్పమేవ
తవైవవాహాస్తవ నృత్యగీతే ॥

అన్తక=యముడా! మర్త్యస్య=మనుజునియొక్క; (భోగాః=భోగములు) శ్వోభావాః=నశ్వరములు; సర్వేన్ద్రియాణాం=సకలేన్ద్రియములకు; యత్ = ఏ; తేజః= తేజస్సు లేక శక్తి; (కలదో) (తత్ = దానిని) ఏతత్ = ఈ; భోగాః= భోగములు; జరయన్తి=క్షీణింపచేయుచున్నవి. సర్వం=అంతటి, జీవితం = జీవితము, అపి=కూడ; అల్పం=స్వల్పము; ఏవ=మాత్రమే, వాహాః= గుఱ్ఱములున్ను, నృత్యగీతే= నృత్యము గీతమున్ను, తవ=నీవి, ఏవ=మాత్రమే.

విశేషార్థము:— (1) శ్వోభావాః = శ్వః అనగా రేపు భావాః=జీవులు లేక వస్తువులు రేపటివరకు ఉండునో లేదో నిశ్చయము కానివి. అని అర్థము. అనగా త్వరగా నశించునవని భావము.

(2) జరయన్తి =సడలింపచేయును, క్షీణింపచేయును. మీరు తెల్పిన భోగములు మా ఇంద్రియములను, వాని శక్తిని క్షీణింపజేయునేగాని మేలుచేయవు.

(3) సర్వం = అంతటి, పిపీలికాది బ్రహ్మపర్యన్తముగల సర్వజీవులలో ఏయొక్కరి జీవితముకూడ పరమాత్మతో పోల్చి

నపుడు స్వల్పమే. సగుణబ్రహ్మ జీవితముకూడ స్వల్పమే ఏ ప్రళయమువరకు ఏ మహాప్రళయమువరకు మాత్రమే నిలిచి యుండును. మీరందఱి జీవితము కలిసినగూడ అల్పమేనని సూచనకలదు.

( 4 ) తవైవ=నీవే అసలు వస్తువులు; నీవే=మీరు నాకు యివ్వదలచితిరి. ఆదానమును నేనంగీకరించినపుడు నావగును, నేనంగీకరించనొల్లనపుడు మీవిగానె యుండును మీయొద్దనే యుంచుడు.

తాత్పర్యము:— ఓ యముడా! మీరు తెల్పిన సర్వభోగములును అత్యన్తనశ్వరములుసుమా! రేపటికై నను నిలుచునో నిలువనో నమ్మకములేదు. ఆ భోగములవలన మా యింద్రియముల పటుత్వము పాడగును. ఇంద్రియములుగూడ శోషిల్లును. ఈ విశ్వములోనుండెడి పిపీలికాది బ్రహ్మపర్యన్తముగల ఏ జీవి యొక్క జీవితమైనను స్వల్పమే. అందఱి జీవితములు కలిపినను కూడ స్వల్పమే యగును. పరమాత్మ అమృతత్వముతో పోల్చినపుడు వీని యునికి ఎంతమాత్రము అతిస్వల్పమేకదా! మీరివ్వదలచిన వస్తువాహనము, వనితావిత్తములు, మేళతాళములును అంగీకరింపనేనొల్లను, అన్నియు తమయొద్దనే యుంచుడు.

౨౭ వ మన్త్రము - శ్రుతిః

నవిత్తేన తర్పణీయో మనుష్యో
లప్స్యామహే విత్తమద్రాక్ష్మచేత్త్వా ।

జీవిష్యామో యావదీశిష్యసి త్వం
వరస్తు మే వరణీయః స ఏవ ॥ 27

మనుష్యః=మనుష్యుడు; విత్తేన=ధనముచేత; తర్పణీయః=తృప్తిపొందినవాడు; న=కాడు, త్వా=నిన్ను, అద్రాక్ష్మ చేత్=చూచితిమేని. విత్తం=ద్రవ్యమును, లప్స్యామహే=పొందగలము. త్వం=నీవు, యావత్=ఎంతకాలము, ఈశిష్యసి=ఆజ్ఞాపింతువో, తావత్=అంతవరకు, జీవిష్యామః=జీవించగలము. తు=అంతేకాని, సః=ఆ; వరః=వరము, ఏవ=మాత్రమే, మే=నాయొక్క, వరణీయః=కోరబడిన వరము.

విశేషార్థము:— (1) అద్రాక్ష్మ చేత్ = చూచినవారమైతే అనగా నీ దర్శనము కలిగినవారికి. అట్టి అదృష్టము కలిగిన మనుజులకు విత్తము ఆయుర్దాయము లభించును, దేవదర్శనము నిష్ఫలము కానేరదు. అందుచేత మరల విత్తమును ఆయుర్దాయమును నేను ఏల కోరవలెను అని సూచన కలదు.

(2) ఈశిష్యసి=రాజ్యము చేయునంతవరకు అని అర్థము చేయుచున్నారు. అట్లు చెప్పుటచే నొకచిక్కు కలుగును. యమధర్మరాజు పాలించుచున్నంతవరకు అనగా సృష్టియున్నంతవరకు యముని జూచినవాడు బ్రతుకునని స్ఫురించును. అట్లు చెప్పుట భావ్యము కాదు. మీరాజ్ఞాపించినంత ద్రవ్యము ఆయుర్దాయము కలుగునని చెప్పుటయే భావ్యము.

(3) న తర్పణీయః=తృప్తిపొందడు. ఈ వాక్యము ఉత్కృష్టస్తోత్రమును దెలుపుచున్నది. మనుజుడు ద్రవ్యముతో తృప్తి

నొందడు. ద్రవ్యమనగా ఇంద్రియభోగములకు సాధనము. అధికారమునకు, ప్రాభవమునకు, ప్రఖ్యాతికి సాధనము అయినను దానితో తృప్తిపొందడు. అనగా మానవులలో నంతకు మించిన శక్తియొకటి కలదనియు సంకల్పమింకొకటి కలదనియు నాసంకల్పము తీర్చుటకు అన్యపదార్థము అనగా జ్ఞానము ఆవశ్యకమనియు నచికేతస్సు స్పష్టపరచి యున్నాడు, లోకములోని ప్రజలు ఈ సత్యమును గమనించిన యెడల భూతలము స్వర్గమగును.

తాత్పర్యము:— ఏ మానవుడును ధనముతోడనే తృప్తి పొందజాలడు. అంతకుమించిన భిన్నమగువస్తువు జ్ఞానానందానుభవమువలనగాని మానవుని స్వస్వభావము తృప్తినొందదు. ఓ యమధర్మరాజా! మిమ్మెరుగు నదృష్టముగల మానవునకు ద్రవ్యముకొఱతగాని, ఆయుర్దాయము కొఱతగాని ఉండజాలదు. మీ దివ్యదర్శనముచేతనే మేము కోరకుండగనే కొల్లలుగా మీ యనుగ్రహమువలన నవి మాకు లభించగలవు. 20 వ మంత్రములో నేను కోరిన వరమే నాకు నచ్చిన వరము మరియొక వరముపై నాబుద్ధి ప్రసరించుట లేదు,

౨౮ వ మంత్రము - శ్రుతిః

అజీర్యతామమృతానాముపేత్య
జీర్యన్మర్త్యః క్వధస్థః ప్రజానన్ ।
అభిధ్యాయన్ వర్ణరతి ప్రమోదా
నతిదీర్ఘే జీవితే కో రమేత ॥ 28

'అజీర్యతాం=జీర్ణించనట్టి; అమృతానాం=మరణము లేనట్టి వారిని; ఉపేత్య=సమీపించి; ప్రజానన్= వారి ఉత్కృష్టస్థితిని తెలిసికొని; క్వధఃస్థః=ఈ క్రిందనుండువాడు అనగా భూమిమీద నుండువాడు; జీర్యన్=జీర్ణించునట్టి, మర్త్యః=మరణించునట్టి, కః=ఎవరు; వర్ణరతి ప్రమోదాన్= వర్ణరతి ప్రమోదములను (ఆసక్తితో) అభిధ్యాయన్=ధ్యానించుచు, జీవితే=జీవితము నందు, అతిదీర్ఘేఽపి = అతిదీర్ఘమయిననుకూడ, రమేత = రమించును, కః=ఎవడు.

విశేషార్థము:— (1) అజీర్య=జీర్యమనగా క్షీణించునది. జరా అనగా ముసలితనము. అట్టి ముసలితనమును కలిగించునది. అట్టి ముసలితనములేనివారు దేవతలు. అట్టి ముసలితనము కలవారు మర్త్యులు.

(2) కధఃస్థః=స్థః అనుదానికి ఆస్థః అని పాఠాన్తరము కలదు. అనగా దానియందు ఆసక్తి మోహము కలవాడని అర్థము క్వతదాస్థః అని పాఠాన్తరము కలదు.

(3) తదాస్థః అనగా తత్పరుడు క్వతదాస్థః అని పాఠాన్తరము చూపుచున్నారు. వర్ణరతిప్రమోదాన్= ఈ పదములకు వర్ణములు అనగా సంగీతము, రతి అనగా స్త్రీ సంయోగము ప్రమోదాన్ అనగా అట్టి ఆనందములు ఇట్లు శ్రీ శంకరులవారు అన్వయించిరి. దీనికి పరమాత్మయొక్క కళ్యాణవర్ణములను చూచి ఆనందించుచు అని ఒక అర్థము చేసియున్నారు. ఇచ్చట ఆ అర్థము పొసగదు. అటు అమృతులకు ఇటు మర్త్యులకుగల

భేదమును యముడు 25 వ మంత్రములో చెప్పిన అప్సరసల వర్గరాలనుగూర్చి నిర్లక్ష్యము చూపుటకు ఈ మన్త్రముద్దేశింప బడెను.

( 4 ) *అభిధ్యాయన్ = అనగా మర్త్య అమర్త్యుల భేదములను విచక్షణచేయుచు అని అన్వయించుచున్నారు. అంతకంటె నధికముగా ధ్యానించుచు అని చెప్పుటయే మేలు. ఆ ధ్యానించ బడునవి వర్ణరతి ప్రమోదములు అనగా నింద్రియ సుఖములు భగవద్గీత 2 వ అధ్యాయం 62 వ శ్లోకము "ధ్యాయతో విష యాన్ పుంసః" విషయములను ధ్యానించుటచే సంగమనేర్ప డును. ఇచ్చటను అట్లే ఈ వర్ణరతిప్రమోదములను ధ్యానించుట పొందుటచే బన్ధనముపెరుగుచుండును.

అతిదీర్ఘే = మిక్కిలి పొడుగైన అను ఈ పదమును జీవితము నకు విశేషణము చేయవలెను. అపి అని అధ్యాహారము చేయ వలెను. అట్లు చేయుటచేత జీవితము దీర్ఘమైననుకూడ ఈ వర్ణ రతి ప్రమోదములు ధ్యానించుచు ఎవరుండగలరు?

తాత్పర్యము:— క్షీణము, ముసలితనము, మరణములేని వారియొద్దకు సమీపించి వారి యుత్తమస్థితిని గమనించియు భూమిమీద క్షీణము, ముసలితనము, మరణము కలిగియున్నట్టి వాడు. తనస్థితిని గమనించియు, సంగీత, సంభోగ, సంతోష సంరంభములనే ధ్యానించుచు దీర్ఘమైన జీవితము దొరకినను

---

* రెండవవల్లి 3 వ మంత్రములో కామానభిధ్యాయన్ = కామములను గూర్చి మనస్సులో ధ్యానించుచు లేక తహతహ లాడుచు అని అర్థము కలదు. ఇచ్చటను అచ్చటను ఒకేవిధమున అర్థము చేయుట భావ్యము.

గూఢ వానియందె మురియుచు ఎవడు జీవిత కాలమును వ్యర్థ చేయ తలంచును? ఇట్టి దీర్ఘజీవితము కలిగినప్పుడు ఇంద్రియారాముడుగాక ఆత్మారాముడగుటకు ఎవడు యత్నించకుండునో అట్టివాని జీవితము కేవలము నిష్ప్రయోజనము.

౨౯ వ మంత్రము - శ్రుతిః ॥

యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో
యత్సాంపరాయే మహతి బ్రూహి నస్తత్ ।
యోఽయంవరో గూఢమనుప్రవిష్టో
నాన్యంతస్మాన్నచికేతా వృణీతే ॥ 29

మృత్యో! = యముడా! యస్మిన్ = దేనియందు: మహతి = మహత్తరమయిన; సాంపరాయే = మరణాంత జీవితవిషయమై, యత్ = ఏ, ఇదం = ఈ (దీనిని గూర్చి) విచికిత్సన్తి = వారు అనగా (దేవతలు) సందేహించుచున్నారో, తత్ = దానిని, నః = మాకు, బ్రూహి = చెప్పుము, అయం = ఈ, గూఢం = నిగూఢమయిన విషయమును, అనుప్రవిష్టః = ప్రవేశించినట్టి, యః = ఏ, వరః = వరము, (అస్తి = కలదో) నచికేతాః = నచికేతస్సు, తస్మాత్ = దానికంటె, అన్యం = మరియొక వరమును, న వృణీతే = కోరజాలడు.

విశేషార్థము:— (1) విచికిత్సన్తి = 20-21 వ మంత్రముల విశేషార్థము చూడవలెను.

(2) సాంపరాయే = 2 వ వల్లి 6 వ మంత్రములో నీపద ముదహరించబడినది. మరణాంతర జీవితమనియు, అట్టి జీవిత

మును సంపాదించు సాధన అనియు రెండు అర్థములును కలవు. పోరాటమనియు భవిష్యద్విచారణ యనియుకూడ నర్థములు కలవు. లౌకికజీవితముచంచల ఆకర్షణతో పోరాడి అస్పష్టముగ నుండు భవిష్యద్విషయమును మరణాన్త విషయమును పరిశోధించి దానియునిక నిర్ణయించి దానిని చేరెడు సాధనను అవలంబించుట. ఈ వివిధ విషయములు ఇందులో చేరియున్నవి. అందు చేతనే దీనికి మహతీ అను విశేషణము చేర్చబడినది. మూడవ పాదములో దానిని గూర్చియే గూఢం అతిరహస్యమైనదికూడ తెలుపబడినది. "గూఢం అనుప్రవిష్టః" అను పదము 2 వ వల్లి 12 వ మంత్రములో కలదు. సూక్ష్మమయినది. అన్తర్యామి అయినది, అని అర్థము. ఇచ్చట గూఢం అనుప్రవిష్టః అనునది వరమునకు విశేషణముగా చేర్చబడినది. ఇయ్యది సాంపరాయః కు కూడ వర్తించగల భావనే. ఆమరణాంతము జీవితము అతినిగూఢమయినది. అది యిచ్చటి జీవితమునకు అన్తర్యామియై ఆధారమై యున్నది.

(౩) * అన్యం=మరియొకవరము ఈ వరము పరతత్త్వమును గూర్చి జ్ఞానమును కోరుచున్నది. గనుక మరియొక వరము వాంఛనీయము కానేరదు. మరియొక వరము మరియొక వస్తువును గూర్చునది. అనిత్యమైన వస్తువును గూర్చునదే కావలసి యుండును కాన నచికేతస్సు దానికి సమ్మతించడు. ఈ వరము

* నః = మాకు నచికేతస్సు ఒక్కడే ఏకవచనములో చెప్పక బహువచనము వాడెను. మర్యాదసూచకము. తనకును తనద్వారా లోకమునకంతకును బోధించుమని కోరెను.

నిగూఢములో ఇమిడియున్న సూక్ష్మాతిసూక్ష్మమును వెల్వరించుచున్నది. కాన ఈ వరమే గొప్పది.

తాత్పర్యము:— ఓ యమధర్మరాజా! సూక్ష్మాతిసూక్ష్మమైన ఈ లోకజీవితమునకు అన్తర్యామియయిన ఆధారమైన మరణాంతర తత్త్వమునుగూర్చి దేవతలుగూడ సందేహించుచున్నారు. గాన నామహత్తర విషయమును గూర్చియే మాకుపదేశించుము. ఆ నిగూఢ తత్త్వములోని అగాధ విషయమును బయలుపరచ యత్నించు ఈ వరముకన్న అన్యమయిన వరమును నచికేతస్సు కోరజాలడు. ఈ ప్రత్యుత్తరమువలన నచికేతస్సుయొక్క సుస్థిరభావము విస్పష్టమగుచున్నది. యముడు చూపిన ఇంద్రియ భోగలాలస నచికేతస్సును చలింపచేయలేదు. జిజ్ఞాసువునకుండవలసిన సాధనచతుష్టయ సంపత్తి (1) ఇహాముత్రఫలభోగవిరాగము= ఇహలోక పరలోకభోగములయందు విరక్తి (2) "నిత్యానిత్యవస్తువివేకః" నశ్వర అనశ్వరపదార్థ భేదమందలి విచక్షణ (3) శమదమాది షట్క సంపత్తి= ఆరు సద్గుణములు అన్తరింద్రియ నిగ్రహము బాహ్యేన్ద్రియ నిగ్రహము కామత్యాగము తితిక్ష లేక సహిష్ణుత శాన్తి శ్రద్ధ (4) ముముక్షుత్వము అనగా మోక్షేచ్ఛ ఈ నాలుగును నచికేతస్సునందు అసందిగ్ధముగా ప్రదర్శితమై యున్నవి. యముడు చేసిన అగ్నిపరీక్షలో నచికేతస్సు మొట్టమొదట శ్రేణిలో నెగ్గినాడని యర్థము.

ఇతి ప్రథమవల్లీ — సమాప్తా.

# కఠోపనిషత్

## ప్రథమాధ్యాయః — ద్వితీయవల్లీ

౧ వ మంత్రము శ్రుతిః ॥

అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయ
స్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః ।
తయోః శ్రేయ ఆదదానస్య సాధు
భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే ॥ 1

శ్రేయః = శ్రేయస్సు; అన్యత్ = వేరైనది; ఉత = మరియు, ప్రేయః = ప్రేయస్సు; అన్యత్ = వేరైనది, ఏవ = మాత్రము, తే = అవి; ఉభే = రెండును, నానార్థే = వివిధప్రయోజనములతో, పురుషం = మానవుని, సినీతః = ఆకర్షించును, లేక బద్ధించును. తయోః = ఈ రెంటిలో, శ్రేయః = శ్రేయస్సును, ఆదదానస్య = తీసికొన్నవానికి లేక స్వీకరించినవానికి, యః = ఎవడో, సః = వాడు, సాధు = యోగి ఋషి పూర్ణుడు, భవతి = అగుచున్నాడు. ఉ = మరియు, యః = ఎవడు, ప్రేయః = ప్రేయస్సును, వృణీతే = కోరుకొనునో, సః = వాడు, అర్థాత్ = గమ్యస్థానమునుండి లేక పురుషార్థమునుండి, హీయతే = పడిపోవుచున్నాడు.

విశేషార్థము:— (1) * శ్రేయః-ప్రేయః- శ్రేయస్సనగా

* ప్రేయస్సనగా అచ్చముగా ఇంద్రియభోగమార్గమే యని అర్థము చేయనక్కరలేదు. ముణ్డక॰ 1.2.1 " ఏషవః పన్థాః సుకృతస్యలోకే" ఇది సుకృతమార్గము లేక పుణ్యమార్గము కావచ్చును.

త్యాగమార్గమనియు, ప్రేయస్సనగా భోగమార్గమనియు చెప్ప వచ్చును. 4 వ మంత్రములో (ఈవల్లిలో) శ్రేయస్సు విద్యా మార్గమనియు ప్రేయస్సు అవిద్యామార్గమనియు తెలుపబడినది. మొదటిది మోక్షమార్గమనియు రెండవది మోక్షేతరమార్గ మనియు చెప్పనొప్పును.

(2) అన్యత్ ఏవ=రెండు వేరైనవి, తప్పకుండ వేరైనవి. నిశ్చయము రెంటిలో తరతమభేదముగాక రకమువారీ భేదనే కలదని అర్థము. ఈశావాస్యములో 10-13 మంత్రములలో విద్య అవిద్యమార్గములును, సంభూతి, అసంభూతి మార్గములును భిన్నత్వములు కలవి, అని తెలుపుటకు ఈ పదములే వాడ బడెను.

(3) నానార్థే = నానా అనగా అనేకములైన అర్థములు అనగా ప్రయోజనములు, ఆదర్శములు, గమ్యస్థానములు, ఫలితములు, కలవియని అర్థము. అర్థము అను పదమును పురుషార్థములు తెలుపుటకు వాడెదరు. ధర్మము అర్థము కామము మోక్షము ఈ నాలుగును పురుషార్థములుగా తెలిపె దరు. ధర్మార్థకామము లొకస్థాయిలోను మోక్షము మరియొక స్థాయిలోను ఉండునని చెప్పవచ్చును. ధర్మార్థకామములకు సంబంధించినంతవరకు ఉండెడి మార్గమును సుకృతమార్గము పుణ్యమార్గము అని చెప్పనొప్పును.

(4) పురుషం = పురుషుడనగా నిచ్చట మానవుడనియే అర్థము. సామాన్య మానవుడు పూర్ణుడని అర్థముగాక దేహ

మను పురమందు ఇంద్రియాది ఉపకరణములతో కూడినవాడని చెప్పవలెను.

( 5 ) సినీతః = బద్ధించునని అర్థము చెప్పుచున్నారు. అంత కంటె ఆకర్షించును, లేక లాగును అని చెప్పుటమేలు. స్వకీయ ప్రవర్తననుగూర్చి మానవుడెప్పుడు యోచింపసాగునో అప్పుడు ఈ రెండు మార్గములు వానికంటికి అగుపడును, ఆకర్షించును. ఏదో యొకమార్గమును అతడు గ్రహించవలసి యుండును. 3-4 పాదములలో ఆదదానః వృణీతె అను రెండు క్రియలు వాడబడి నవి. ఏ మానవుని యెదుట ఈ రెండు మార్గములు కనపడునో ఆ రెంటిలో నొకదానిని వృణీతె కోరుకొనుటకు ఆదదాన చేతితో తీసికొనుటకు వానికి స్వేచ్ఛకలదు. గ్రహించక పూర్వము ఆ మానవుని ఈ రెండు మార్గములు బద్ధించవు, తీసి కొన్నను శ్రేయస్సు ఎన్నడును బద్ధించదు. కాన సినీత అనగా బద్ధించునని చెప్పవీలులేదు.

( 6 ) సాధు = సాధువు అనగా మేలని అర్థము కలదు. శుభమని అర్థముకలదు అన్నియేగాక పరిపక్వస్థితి, సంపూర్ణస్థితి ఋషి లేక యోగికిగలస్థితి అనిగాని ఋషి లేక యోగి అని చెప్ప వచ్చును. సాధ్ అను క్రియకు జయించుట, ఉత్తమస్థితినొందుట అని అర్థములు కలవు. కాన ఇచ్చట శ్రేయోమార్గము స్వీక రించినవాడు ఆచరించుచున్నవాడు పరిపూర్ణస్థితిని పొందనగు దేవమార్గమును పట్టుచున్నాడని చెప్పవలెను.

( 7 ) అర్థాత్ = ప్రయోజనమునుండి తానుకోరిన ప్రేయస్సు నుండి లేదా శ్రేయోమార్గమువలభించు పరమార్థమునుండి

అని చెప్పవచ్చును. దీనిని తరచి చూడగా ఈ ప్రేయస్సును కోరినవాడు చిట్టచివరకు దానినికూడ పొందలేడని సూచన కలదు. ఇంద్రియ భోగమార్గమున చరించుచుండువారికి ఆ భోగమే ఆ ఇంద్రియముల తేజస్సును చివరకు ఆ ఇంద్రియములను కూడ నశింపజేయును. ఇదేభావమును 1 వ వల్లి 26 వ మంత్రము తెలుపుచున్నది. వ్యభిచారముచేసి సుఖసంకటములు తగులుకొన్నవానిగతి లోకవిదితమే.

(8) హీయతే = వియుజ్యతే అని శ్రీ శంకరులు వారు అర్థము చెప్పుచున్నారు. కలయికనుండి విడివడుచున్నాడని అర్థము. అనగా జారి పడిపోవుచున్నాడు.

తాత్పర్యము:— శ్రేయోమార్గము వేరైనది. మరియు ప్రేయోమార్గము నిక్కముగా నంతకంటె భిన్నమయినది. ఈ రెండును వివిధ ఆదర్శములు గమ్యస్థానములు ప్రయోజనములు సాధనలు కలవి. ఈ రెండును మానవులకు గోచరమై చెరియొక వైపునకు ఆకర్షించును. ఈ రెంటిలో నెవడు శ్రేయోమార్గము నవలంబించునో వానికి కళ్యాణప్రదమగు యోగము ఉత్తమ స్థాయి పూర్ణత్వము కలుగుచున్నది. ఎవడు ప్రేయోమార్గమును వరించుచున్నాడో వాడు పరమార్థమునుండి పతితమగుటయేగాక తాను కోరిన మార్గములోని ప్రయోజనములను సహితము చిట్టచివరకు పొందజాలడు.

౨ వ మంత్రము - శ్రుతిః ౫ 2

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత
స్తౌ సంపరీత్యవివినక్తి ధీరః ।

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత-
స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః।
శ్రేయోహి ధీరోఽభి ప్రేయసో వృణీతే
ప్రేయోమన్దో యోగక్షేమాద్వృణీతే ॥

శ్రేయః = శ్రేయస్సును, చ = మరియు; ప్రేయః = ప్రేయస్సును; మనుష్యం = మానవుని; ఏతః = ఎదుర్కొనును లేక కంటబడును. తౌ = ఈ రెంటిని, సంపరీత్య = చక్కగా విచారించి, ధీరః = ధీరుడు, వివినక్తి = విచక్షచేయుచున్నాడు. ధీరః = ధీరుడు, ప్రేయసః = ప్రేయస్సుకంటె, హి = నిక్కముగా, శ్రేయః = శ్రేయస్సును, అభివృణీతే = మేలైనదని వరించును, మన్దః = మన్దబుద్ధిగలవాడు, యోగక్షేమాత్ = యోగక్షేమమువలన, ప్రేయః = ప్రేయస్సునే, వృణీతే = వరించుచున్నాడు.

విశేషార్థము:— (1) ధీరః = వివేకవస్తుడని చెప్పవలెను. దైవదర్శనము చేసిన జ్ఞానియను అర్థము ధీరుడను పదమునకు వైదిక భాషలో రూఢియయి యున్నది. అట్టి అర్థమిచ్చట చెప్పుటకు వీలుపడదు. జ్ఞాని ఎప్పుడు ప్రేయస్సును వదలి శ్రేయస్సునే గ్రహించును నిశ్చయమే. ఇచ్చట సాధనలోనున్న పురుషుని గూర్చి చెప్పబడుచున్నది. ఈ ధీరునకు వ్యతిరేకుడు మందుడని చెప్పబడెను. వివేచనాశక్తి కలవాడు ధీరుడు, లేనివాడు మన్దుడు అని చెప్పనొప్పును.

(2) సంపరీత్య = తన యెదుటకు వచ్చిన రెండు మార్గముల చుట్టు తిరిగివచ్చును. అనగా సమగ్రముగా దాని లక్షణములను గుణదోషములను తెలిసికొనుటకై కృషిచేయునని అర్థము.

ఆంగ్లములో (Taking an alround view) అని చెప్పిన దానికి ఈ పదము సరిపోవును.

(3) యోగక్షేమాత్ = యోగమనగా లేని వస్తువును సంపాదించుట. క్షేమమనగా ఉన్నదానిని కాపాడుట. సామాన్యముగా ఆస్తిసంపాదన ఆస్తి సంరక్షణ అధికారసంపాదన అధికార సంరక్షణ ఇందులో నిమిడియున్నవి. ఈ యోగక్షేమము వలన ఇహలోక పరలోక సౌఖ్యములు కలుగుననెడి విశ్వాసము సర్వత్రి వ్యాపించియున్నది. కనీసము ఇహలోక సౌఖ్యమైనను కలుగునను విశ్వాసము కోటానుకోట్లకు కలదు. ఆధ్యాత్మిక జీవితము కోరువానికి ప్రారంభదశలోనె ఈ యోగక్షేమ త్యాగము అవసరమగుచున్నది. అందుకనియే శ్రీకృష్ణుడు భగవద్గీత 2 వ అధ్యాయం 45 శ్లోకములో "నిర్యోగక్షేమ ఆత్మవాన్" అని అర్జునునకు సలహానిచ్చెను. ఆస్తివంతుడుగాక ఆత్మవన్తుడు కావలెను. శ్రేయస్సు ప్రేయస్సులు రెండు ఎదుట వచ్చి నిలువబడినప్పుడు శ్రేయస్సునువదలి ప్రేయస్సును వరించిన వాడు మందుడనబడుచున్నాడు. ప్రేయస్సునువదలి శ్రేయస్సును వరించినవాడు వివేకియని చెప్పబడుచున్నాడు. ఈశావాస్యము మొదటి మంత్రములో "తేనత్యక్తేన భుఞ్జీథాః" త్యజించి అనుభవించమని ఇచ్చిన ఆజ్ఞయే. మానవజీవితమునకు ప్రధాన సూత్రము త్యజించక దాచి భుజించదలచుకొన్నవాడు మందుడగుచున్నాడు. త్యజించి భుజించ మొదలిడువాడు వివేకియయి పరిణామదశలో ఋషి ధీరుడు సంపూర్ణుడగుచున్నాడు.

విశేషార్థము:— (1) అభిధ్యాయన్ = ధ్యానించుట అనగా ఆ విషయములనుగూర్చి యోచించి తగులమును పొందుట, యోచించినమీదట వానిని విడుచుటకూడ కలదు. ఇచ్చట ధ్యానఫలితము విసర్జనమే.

(2) ప్రియాన్, ప్రియరూపాన్, కామాన్ = ప్రియములు ప్రియరూపములు కామములు. ప్రియరూపములనగా అందముగా నాకర్షవంతముగా కనపడు ఆకారములుకలవి. మొదట వల్లిలో యముడు తెలిపిన "ఇమాః రామాః" (1 వ వల్లి 25 వ మంత్రం) మొదలగు అప్సరాంగనలు. ప్రియములు అనగా దూరమందుండి ప్రియముగా కనబడుటయేగాక సంబన్ధము కలిగిన పిమ్మట కూడ ప్రియముగా తోచుచుండు భార్యాపుత్రాదులు ఆస్తి అధికారములు; కామాన్ = కామములనగా పై దెలిపిన రెండే కావచ్చును లేదా అంతకంటే భిన్నమగునవి కావచ్చును. మనస్సంకల్పము ఉత్సాహాతిశయములు గ్రన్థ కాలక్షేపము కీర్తి ప్రఖ్యాతులు. గర్వాహంకారాది మనోభావములును కావచ్చును.

(3) అత్యస్రాక్షీః = వదలిపెట్టితివి. యముడు ఈ మంత్రమున నచికేతస్సుకు యోగ్యతాపత్రము నిచ్చుచున్నాడు. నేచేసిన పరీక్షలలో నీవు కృంగిపోక గెలిచితివి. ఇట్లే భగవద్గీత 16 వ అధ్యాయం, 5 వ శ్లోకములో "మాశుచః సంపదం దైవీమభిజాతోఽసి" అని దైవసంపదయందు పుట్టితివి. చింతింపకుము అని అర్జునునకు శ్రీకృష్ణుడు చెప్పెను. అట్లే గురువులు శిష్యులకు అప్పుడప్పుడు అభయమిచ్చుచుందురు.

శిష్యులను ప్రోత్సాహపరచుట ఆవశ్యకము. వారిని అశక్తులని నిష్ప్రయోజకులని నిరుత్సాహపరచిన యెడల చివరకు పతనస్థానమునకే తేలును. గురువు శిష్యునిశక్తి అశక్తులను కని పెట్టి అశక్తతను తగ్గించుచు శక్తిని అభివృద్ధి చేయవలెను. నిస్పృహ, నిరాశను కల్పించరాదు.

4) విత్తమయీం=విత్తమయమైనది, అనగావిత్తముతో నిండియున్నది. లేక నిర్మింపబడినది. విత్తమనగా ఇయ్యబడినది. అభివృద్ధియగునది; లోకసంబద్ధమగు ధనము, ధాన్యము ద్రవ్యము, పశువులు, సన్తానము. కీర్తి మొదలగునవన్నియు ఇందులో చేరును. కాన భోగ్యబృన్దమని చెప్పవచ్చును.

(5) సృఙ్కాం = 1 వల్లి 16 వ మంత్రములో ఇదే పదము వాడబడినది. అచ్చట మాలయని అర్థము చెప్పబడెను. ఇచ్చటను అట్లే చెప్పవచ్చును, లేదా పన్థా అని చెప్పవచ్చును. అట్లు చెప్పిన యెడల భోగపన్థా అని అర్థమగును, లేదా భోగమార్గము.

(6) మజ్జన్తి = మునిగిపోవుచున్నారు. ఈ మార్గమున పోవు జనులు గమ్యస్థానమును చేరలేరు. ఇదియొక ఊబి పైకి గట్టిగా కనబడుచుండును కాలుపెట్టి మోపగానె దిగబడును. ఆ కాలు తీసికొనుటకు రెండవకాలు ప్రక్కన పెట్టగానే అదియు దిగబడును. అట్లే దిగబడుటయేగాని పైకి లేచుట యుండదు. దీనికే దొంగ ఊబులనిపేరు. మనుజులకు పశువులకు ఇట్టి అనుభవములు కలుగుచునే యుండును. ప్రేయోమార్గము యిట్టి దొంగ ఊబియని నచికేతస్సు గ్రహించి దానిని వదలిపెట్టెను.

(7) న అవాప్తః = ఆ మార్గము నిన్ను పొందలేదు. దాని చెంతకు నీవు చేరలేదు, చేరనివాడు ధన్యుడు, చేరి తప్పించుకొన్నవాడు మరింత ధన్యుడు. అజన్మాంతము బ్రహ్మచర్య మొనర్చిన రామకృష్ణుడును, భార్యాపుత్రాదులను లోకహితార్థమయి త్యజించిన బుద్ధుడును, లోకోద్ధారకులయిరి. బృహదారణ్యకము 3-51 "ఆత్మానంవిదిత్వా ఏషణాత్రయం వ్యుత్థాయాథ భిక్షాచర్యంచరన్తి" అనగా ఆత్మను తెలిసికొని ఏషణాత్రయమును వదలి భిక్షాటనమును జేసిరి. అట్లే ఈ వల్లి 15 వ మంత్రములో యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి" దేని కోరి బ్రహ్మచర్యమును చేయుచున్నారో అని అదే వాక్యము భగవద్గీత 8 అధ్యాయము 11 వ శ్లోకములో కలదు. కాన ఈ విత్తమయమయిన భ్రాన్తిమయమగు పన్థాను నచికేతస్సు విసర్జించెను.

తాత్పర్యము:— ప్రియములగు భార్యాపుత్రాదులను ప్రియరూపులగునే జూపిన అప్సరాంగనలను కామసంకల్పములను సూక్ష్మరూపములగు కీర్తి మొదలగు కామములనుగూర్చి దీర్ఘముగా యోచించి ఓ నచికేతస్సా నీవు బుద్ధిపూర్వకముగా వదలిపెట్టితివి. అనేకమంది జనము యీ భోగమార్గమునుబట్టి యందులోనే మునిగిపోవుదురు. ఆ ఏషణాత్రయ సంబద్ధమైన మార్గము నీదరికి చేరలేదు. కాన నీవు ధన్యుడవు. యముడు నచికేతస్సును బాగుగ పరీక్షించి తృప్తిపడినమీదట నచికేతస్సుతో నట్లు చెప్పెను.

౪ వ మన్త్రము - శ్రుతిః ॥ 4

దూరమేతే విపరీతే విషూచీ
అవిద్యా యాచ విద్యేతి జ్ఞాతా ।
విద్యాభీప్సినం నచికేతసం మన్యే
న త్వా కామా బహవో౽లోలుపన్త ॥

యా = ఏది; అవిద్యా = అవిద్యయనియు; చ = మరియు; విద్యా = విద్యయనియు, ఇతి = ఇట్లని; జ్ఞాతా = తెలియఁబడుచున్నదో; ఏతే = ఈ రెండును, దూరం = ఒండొంటికి దూరమైనవి. విపరీతే = పరస్పర విరుద్ధములయినవి, విషూచీ = భిన్న గమ్యస్థానములను సూచించునవి, విద్యాభీప్సినం=విద్యాభిలాషయని, నచికేతసం = నచికేతస్సును; మన్యే = నేను ఎంచుచున్నాను. బహవః = అనేకములగు, కామాః = కామములు, త్వాం = నిన్ను, అలోలుపన్త=ఆకర్షించి, మోహింపచేయఁజాలక పోయెను.

**విశేషార్థము:—** (1) విద్యా, అవిద్యా = 1-2 మంత్రములలో జెప్పిన శ్రేయస్సు, ప్రేయస్సుకే 1 వ మంత్రములో విశేషార్థము చూడవలెను.

(2) దూరం విపరీతె విషూచీ = యీ రెండు మార్గముల స్వభావమును ఈ మంత్రములో ఈ మూఁడు పదములు స్పష్టము చేయుచున్నవి. ఇవి రెండు ఒక్కొక్కటి దూరముగానుండును. ఎచ్చట కలియవు, పోయినకొద్ది దూరము, అతిశయించుచుండును. పరస్పర వైరుధ్యములు కలవి కాన రెంటినిసమన్వయ పరచుటకు వీలులేదు. రెండు భిన్న గమ్యస్థానములను చూపు

నవి. ఉత్తర ధృవమును దక్షిణ ధృవమును విడివిడిగా జూపు దిక్సూచీ యంత్రమువంటివి. బుద్ధభగవానుడు ఇట్లే వర్ణించెను. ఒక మార్గము ధనమువైపునకును రెండవమార్గము ధర్మము వైపునకును దారితీయుచున్నవి. అదె యివి రెండును. ఇట్లీ మంత్రము చెప్పుచుండగా విద్యామార్గమున పోవంగోరుడ యిన జ్ఞాని కర్మనొనర్పవలెనని చెప్పుట ఎట్లు భావ్యమో తోచుట లేదు. అట్టివాడు కర్మ చేయజాలడనియే శ్రీ శంకరులవారి భావము, చేసినను కర్తవ్యమనుదృష్టితోగాక స్వేచ్ఛననుసరించి చేయనోపును. భగవద్గీత 3 వ అధ్యాయం 17-18 శ్లోకములు చూడవలెను. ముండకం 3-1-4 మంత్రము చూడవలెను.

(3) అలోలుపన్త = అలోలుపత్వం, దైవీసంపదలో చెప్పబడినది. భగవద్గీత 16 వ అధ్యాయము 2 శ్లోకము చూడవలెను. దానికి అలుబ్ధత్వము అనగా లుబ్ధత్వము లేకుండుట అని అర్థము చేయబడినది. జ్ఞానేశ్వరి మహారాజు నిస్సంగమని అర్థము చేసెను. శ్రీ శంకరులవారు "నిస్సంగత్వేనిర్మోహత్వం నిర్మోహత్వే నిశ్చలతత్వం" అని తెలిపిరి. కాన అలోలుపన్త = అనగా చలంపచేయలేదు, ఆకర్షింపలేదు, భ్రమింపచేయలేదు అని అర్థము యముడు చూపిన ఆకర్షణలన్నియు అతని హృదయము భ్రమింపచేయ లేదు. ఈ భ్రమ కలుగకుండుటకు కారణము 1 వ వల్లి 2 వ మంత్రములో చెప్పినట్లు అతనిలో ప్రకాశించిన శ్రద్ధయే.

తాత్పర్యము:— ఈ రెండు మార్గములకును అనగా శ్రేయస్సు, ప్రేయస్సు, అని చెప్పబడినవానికి విద్యా, అవిద్య

లని కూడ ప్రశ్నకలవు. అవి రెండు ఒకదానికొకటి దూరమైనవి;
ఒకదానికొకటి విరోధమయినవి, ఒకదానినొకటి భగ్నము చేయునవి.
అన్యోన్య సంబన్ధములేనట్టియు పరస్పర విరుద్ధమగునట్టియు,
అన్యములను చూపించునవి. నచికేతస్సా నిన్ను మోహింప
చేయుటకై నేను చేసిన ప్రయోగ ఆకర్షణలకు నీవు లొంగ లేదు.
అందుచేత నీవు విద్యాభ్యాసమందు ధృఢసంకల్పము కలదని
నేనూహించుచున్నాను.

౫ వ మంత్రము – శ్రుతిః ౻ – 5

అవిద్యాయామన్తరేవర్తమానాః
స్వయం ధీరాః పణ్డితం మన్యమానాః ।
దన్ద్రమ్యమాణాః పరియన్తి మూఢాః
అన్ధేనైవనీయమానా యథాన్ధాః ౻

ఈ మంత్రము ముణ్డకము 1-2-8 మంత్రముగా నున్నది.
అచ్చట జంఘన్యమానాః అని వాడబడెను. ఇచ్చట ద్రానిస్థానె
( దంద్రమ్యమాణాః ) అని వాడబడినది. దీని అర్థము ఇటు అటు
తూలుచు పడిపోవుట. మత్తుపదార్థములు సేవించినవాడు
ఏతీరున అటు ఇటు తిరుగుచు పడుచుండునో ఆవిధముననే ఇత
డును తిరుగుచుండును. బుద్ధికి స్థిరత్వములేక వ్యవహారాత్మ
కముగాక నిశ్చితావస్థలేక తిరుగుచుండును. లోకములో
కలిగెడి సుఖదుఃఖముల లోపల ఆలంబనము లేనివాడై ( ఆలంబ
నము = ఆధారము ) లేనివాడై దానికి తెప్పలేక తిరుగు
చుండును. తక్కిన పదములకు ప్రతిపదార్థము విశేషార్థము
తాత్పర్యమును ముండకము 1-2-8 వ మంత్రములోనుండి

ఇచ్చట నుల్లేఖించవలెను.

6 వ మన్త్రము = శ్రుతిః ॥

నసాంపరాయః ప్రతిభాతిబాలం
ప్రమాద్యన్తం విత్తమోహేనమూఢం
అయంలోకోనాస్తి పర ఇతిమానీ
పునః పునర్వశమాపద్యతేమే ॥

విత్తమోహేన = ధనమునందలి మోహముచే, మూఢం = భ్రమపడిన, ప్రమాద్యన్తం = ప్రమాదములలో పడుచుండెడి; బాలం = బాలుని;ఎదుట సాంపరాయః = మరణాంతరలోకము గాని తత్సాధనగాని, నప్రతిభాతి = ప్రకాశించుటలేదు, అయం = ఈ; లోకః = లోకము, అస్తి — కలదు, పరః = దీనికంటె అన్యమయిన లోకము; నాస్తి = లేదు. ఇతి = అని, మానీ = తలంచువాడు; పునఃపునః = మాటిమాటికి; మే = నాయొక్క, (మృత్యువుయొక్క) వశం = స్వాధీనమును; ఆపద్యతే = పొందుచున్నాడు.

విశేషార్థము:— (1) సాంపరాయః = 1 వ వల్లి 29 వ మంత్రముయొక్క విశేషార్థము చూడవలెను.

(2) విత్తమోహేన = విత్తమువలన కలుగు మోహము చేత ఈ వల్లి 3 వ మంత్రములో విత్తమయీం సృఙ్కాం అని చెప్పబడిన విషయమే, దాని విశేషార్థము చూడవలెను.

(3) బాలం ప్రమాద్యన్తం మూఢం = బాలుడనగా వయస్సులో చిన్నవాడని అర్థముకాదు, వికసించని మనస్సుకలవాడని అర్థము. మూఢం అనగా అదే అర్థము. అజ్ఞాని అని భావము.

ధనమోహముచేత వివేకమునశించినవాడని చెప్పవలెను. ప్రమాద్యన్తం = ప్రమాదమనగా నిర్లక్ష్యము, అజాగ్రత, పొరపాటు, మాటిమాటికి అట్టిప్రమాదములలో పడువాడు. ఈ మూడు దుర్లక్షణములు విత్తమోహముచేతనే అనగా భోగలాలస చేతనే కలుగుచున్నవి. అందుచే బుద్ధికూడ వికసించుటలేదు, బుద్ధివికాసము లేనందున విచక్షణగా శక్తి కోలుపడుచున్నది. అందుచేతనే అతనికి కలిగెడి భావములును, ఆతడు చేసెడి నిర్ణయములును పొరపాటుగానే యుండును. అట్టివానికి భవిష్యజ్జీవితము కనపడదు.

( 4 ) అయంలోకః = ఈ లోకమేకలదు, మరియొకటిలేదు. అనగా ఈ లోకముకంటే వేరులోకము లేదు. కాన యీ జన్మకంటే వేరుజన్మలేదు. ఇట్టి వాదమునే అసురవాదమని భగవద్గీత 13 వ అధ్యాయము తెలుపుచున్నది. 7 మొదలు 18 వ శ్లోకము వరకు చూడవలెను. దీనిని చార్వాకవాదమందురు. పాశ్చాత్య వేదాన్తములలో ఈ పన్థాకు ( Epicuriavison ) భోగఇన్ద్రియ భోగవాదమని చెప్పదగు.

( 5 ) మెవశం = నావశమగుదురు అనగా మాటిమాటికి మరణింతురు. అనగా జననమరణ సంసారమునందు తగుల్కొని మోక్షమును పొందరు అని అర్థము. దీనికి నరకమును పొందుదురు అని అర్థము చేయుచున్నారు. బ్రహ్మసూత్రములలో కూడ అట్లే చెప్పబడెను. అట్లు చెప్పిన యెడల శ్రేయోమార్గమును పట్టినవారందరును,అవిద్యామార్గమందున్న వారందరును పాపులు నరకమునందు యమయాతనలు పొందవలసినవారు,

అని చెప్పవలసి వచ్చును. ఈ ముణ్డకములో కూడ కొందఱు పుణ్యాత్ములు కలరు అట్లు పుణ్యాత్ములయినవారు చంద్రమార్గము స్వర్గాదిలోకములనుజేరి పుణ్యఫలమనుభవించి తిరిగి జన్మ ఎత్తుచున్నారు. వారిని పాపులనుటకు వీలులేదు. ముణ్డకము 1-2-1 మంత్రములో ఇది సుకృతులమార్గమని చెప్పబడెను. యముని అధీనమందుండు లోకము అచ్చముగా నరకమేయని చెప్పుటకువీలు లేదు. ఆయన అధీనమందు సౌఖ్యవంతమైన లోకములు కలవని స్పష్టముగా తెలుపబడినది. (మహాభారతము ఆనుశాసనిక పర్వములో) స్వర్గనరకలోకములు రెండును యముని అధీనమందే యున్నట్లు కనబడును. ఆ లోకములో దేనికి చేరినను అంతటితో జన్మరాహిత్యము కలుగకపోవుటయే దాని ముఖ్యలక్షణము.

తాత్పర్యము:— ధనమందును ధనముకల్పించు భోగమందును అభిలాషకలిగి దాని మోహమందుచిక్కుకొని తప్పులు చేయుచు వివేకము నుపయోగించుకొనక మూఢత్వమున మునిగియున్న అపరిపక్వమైన బుద్ధిగల జనులకు పరలోకమున్నదనియే తోచదు. దానికైన సాధనతోచుట కవకాశములేదు. ఈ లోకమేకలదు పరలోకము లేనేలేదు. ఇదియే భోగస్థానము. ఇవియిచ్చు భోగములన్నియు పొందవలెనని తలంచువారు మాటి మాటికి జననమరణ సంసారచక్రమందు తగులుకొని బాధలు పొందుచుందురు. పరలోకమందు నమ్మకములేనివారగుటచే విద్యామార్గమునకన్న భిన్నమార్గమే స్వీకరించినవారగుదురు. అట్టివారిలో కూడ ధర్మనిరతికలవారుండవచ్చును వీరందఱును

పాపులనియు యమయాతనలకు లోనుకావలసినవారనియు ఎంచ నక్కరలేదు.

2 వ మన్త్రము - శ్రుతిః ॥ 7

శ్రవణాయాపిబహుభిర్యోనలభ్యః
శృణ్వన్తోఽపి బహవోయం నవిద్యుః ।
ఆశ్చర్యోవక్తాకుశలోఽస్యలబ్ధా
ఆశ్చర్యోజ్ఞాతాకుశలానుశిష్టః ॥

యః = ఏది; బహుభిః = అనేకమందిచేత; శ్రవణాయ = వినపడుటకు; అపి = కూడ; నలభ్యః = దొరకదు; బహవః = అనేకమంది; శృణ్వన్తః = విని; అపి = కూడ; యం = దేనిని; నవిద్యుః = తెలిసికొనజాలరు. అస్య = దాని; వక్తా = బోధకుడు, ఆశ్చర్యః = అరుదు, అస్య = దానియొక్క, లబ్ధా = పొందినవాడు లేక పరిగృహీత; కుశలః = నిపుణుడు; జ్ఞాతా = దానిని తెలిసికొన్నవాడు; ఆశ్చర్యః = అరుదు, అనుశిష్టః = బోధనొందినవాడును, కుశలః = నిపుణుడు.

విశేషార్థము:— (1) శ్రవణాయాపి = వినుటకుకూడ అనగా ఆత్మనుగూర్చి వినుటకుగూడ అనేకమందికి లభించదు. దీనినిగూర్చి తెలుపువారుకూడ తక్కువమందియే యుందురు. వినువారును కొలదిమందియే యుందురు. వినుచున్నను దాని యందాసక్తి కలవారుకూడ కొలదిమందియే యుందురు ఆసక్తి కలిగి విన్న వారిలోకూడ తెలిసికొనువారు ఇంకను తక్కువగనే యుందురు. ఇదేభావమును భగవద్గీత 7 వఅధ్యాయము 3 వ

శ్లోకము తెలుపుచున్నది. వేలకొలది జనములలో నన్నుగూర్చి తెలిసికొన యత్నించువారు ఏ ఒకడో యుండును. యత్నించు వారిలోకూడ తత్త్వరీత్యా తెలిసికొనువాడు వేలకొలదికి యే ఒకొ్కడో యుండును.

(2) ఆశ్చర్యః = రెండు పర్యాయము లీపదము వాడబడి నది. వక్త, జ్ఞాత ఆశ్చర్యులు అని చెప్పబడెను. వక్తయనగా దానినిగూర్చి మాట్లాడువాడు, లేక బోధకుడు, జ్ఞాతయనగా తెలిసినవాడు. ఆశ్చర్యః అనగా అద్భుతమును గొలుపునది. అనగా అట్టివారు దొరకుట అరుదని భావము.

(3) కుశలః = అనగా నిపుణుడు నేర్పరి సమర్థుడు అట్టి కుశలుదు ఇద్దఱు చెప్పబడిరి. అందులో నొకరు లబ్ధుడు అనగా దానిని పొందినవాడు శిష్యుడుకావచ్చును. అనుష్ఠించిన సిద్ధుడు కావచ్చును. అనుశిష్టః = బోధింపబడినవాడు అనగా శిష్యు డనియే అర్థము. ఎంతయో సమర్థుడైనగాని ఇతరులు చెప్పినను బోధపరచుకొనజాలరు. అంతకంటే సమర్థుడైనగాని సిద్ధుడు కానేరడు. భగవద్గీత 2 అ. 26 వ శ్లోకములో "ఆశ్చర్యవత్ప శ్యతి" మొదలగు వాక్యములు చెప్పబడెను. అచ్చటను అరుదు గానేయని ఆశ్చర్యవత్పదమునకు అర్థము చెప్పవచ్చును. శ్రీ అరవిందయోగి అచ్చట ఆశ్చర్యవత్ అను పదమునకు (My stery) నిగూఢతత్త్వము అని అర్థము చెప్పెను. ఆత్మ నిగూఢ పదార్థమని అందఱికి తెలిసిన విషయమే దానిని తెలిసినవారు దానిని బోధించువారును నిగూఢులుగానె యుందురు. అనగా

తమంతట తాము బయటపడక వెదకినమీాదగాని దొరకరనిచెప్ప వచ్చును.

(4) కుశలానుశిష్టః = దీనిని సమానముగా చేసిన దానిని జ్ఞాతకు విశేషణముగా తెలుపుచున్నారు. కుశలుడైన గురువుచేత బోధింపబడి తెలిసికొన్నవాడుకూడ అరుదే అని అర్థమగును. (శ్రీ) శంకరులవారును అట్లే అన్వయించిరి. అట్లుగాక యిక్కడ అన్వయించిన విధముకూడ సవ్యముగానే యున్నది బోధ పొందువాడుకూడ సమర్థుడయియే యుండవలెను.

తాత్పర్యము:— ఈ ఆత్మనుగూర్చి వినెడి అదృష్టము అనే కులకు లభించదు. అనేకమంది విన్ననుగూడ చాలమందికి దానిని తెలిసికొను అదృష్టము లభించదు. దానినిగూర్చి చెప్పువారు అరుదు. అతిసమర్థులు ఎవరోకాని దానిని పొందలేరు. దానిని గూర్చిన జ్ఞానముకలవారు అరుదు. దాని విషయమై ఇతరులచే బోధింపబడుటకు కూడ సమర్థత కావలెను. దీనిని గూర్చిన గురు శిష్యులు ఇద్దఱు అరుదు. దీనిని గూర్చిన జ్ఞానులు సిద్ధులు అరుదు. సమర్థులుకానివారు గురువులుగాగాని శిష్యులుగాగాని జ్ఞానులుగాగాని, సిద్ధులుగాగాని, ఉండజాలరు. జ్ఞానులును బోధకులును ఎచ్చటనో యుందురేగాని తమంతట తాము బయ టకు వచ్చి నలుగురకు కంటపడరు. ఆత్మతత్త్వము నిగూఢము. ఆ తత్త్వజ్ఞులు ఆ బోధకులు కూడ గూఢముగానే యుందురు.

౮వ మంత్రము – శ్రుతిః 8

నన రేణావరేణ ప్రోక్త ఏష
సువిజ్ఞేయో బహుధా చిన్త్యమానః ।

అనన్యప్రోక్తే గతిరత్రనాస్తి
అణీయాన్ హ్యతర్క్యమణుప్రమాణాత్ ౹౹

ఏషః = ఈ ఆత్మ; అవరేణ = తక్కువవాడైన; నరేణ = నరునిచేత; ప్రోక్తః = చెప్పబడినపుడు; బహుధా = అనేక విధముల, చిన్త్యమానః = తలపబడునది గనుక; సువిజ్ఞేయః = సులభముగా తెలియబడునది. న = కాదు. అనన్యప్రోక్తః = అనన్యప్రోక్తమైనపుడు; అత్ర = ఆ విషయములో, గతిః = మార్గము, ప్రయాణము నాస్తి = లేదు. అణుప్రమాణాత్ = అతిసూక్ష్మమునకంటే; అణీయాన్ = మిక్కిలి సూక్ష్మము; అతర్క్యం = తర్కమునకు అందనిది;

విశేషార్థము:— (1) నరేణావరేణ = తక్కువవాడైన నరుడు అనగా దేవతలకంటే నరుడు తక్కువైనవాడు. అందుచేత నరునిచే బోధింపబడినపుడు యీ ఆత్మ తెలియబడదు. యముడు దేవతలలో చేరినవాడు. కాన నాబోటివాడు చెప్పినపుడే తెలియనగును, నరులు చెప్పినపుడు తెలియదు. అని సూచన చేయుచున్నాడు. సువిజ్ఞేయః అని చెప్పబడినది, విజ్ఞేయః అనగా తెలియబడునది. సువిజ్ఞేయః అనగా సులభముగా తెలియబడునది. దేవతలు చెప్పినపుడు మిక్కిలి సులభముగా తెలియనగును. మానవుడు చెప్పినపుడు సులభముగా తెలియదుఅని అర్థము. ఇంకొకవిధమున యోచించనగును. నరేణ అవరేణ నరులలో తక్కువవాడు, అనగా అజ్ఞాని అనుభవము లేనివాడు చెప్పినచో తెలియదని అర్థము.

(2) బహుధాచిన్త్యమానః = అనేక విధములుగా తలవబడునది ఇది శ్రీ శంకరులవారు చేసిన అన్వయము, ఈ ఆత్మ

ఉన్నదనీ లేదనీ కర్తయని అకర్తయని సాకారమని నిరాకారమని అనేక విధములుగా దీనినిగూర్చి ప్రజలు భావించుచుందురు. ఈ పదమునకింకొక అర్థము కలదు. శిష్యుడు అనేక విధములుగా దీనిని గూర్చి యోచించినను చింతించినను కూడ అని అర్థము. అనగా గురువు ఉత్తమ గురువు కాదుగనుక శిష్యుడు యెంత కష్టించినను ఇది సులభముగా తెలియఃపడదు. అని భావము.

(3) అనన్యప్రోక్తః = ఈ పదమునకు రెండు మూడు విధములుగా నర్థముచేయుచున్నారు. 1. అన్యప్రోక్తః=అన్యుని వలన చెప్పబడినపుడు అన్యుడనగా నరునికంటే అన్యుడు. కానః దేవత చెప్పినపుడు అని ఒక అర్థము. 2. అన్యుడనగా అవరుడయిన నరునికంటే అన్యుడు అనగా సామాన్య గురువుగాక ఉత్తమ గురువు. ఈ రెండు విధములు అన్వయించిన పిమ్మట న అన్యప్రోక్తః అనగా అన్యప్రోక్తము కానపుడు "గతిఃత్ర నాస్తి" *దానిని పొందుటకు త్రోవలేదు అనన్యప్రోక్త అను పదమునకు శ్రీ శంకరులవారు రెండు విధముల అన్వయించుచున్నారు. (1) తానె ఆత్మ అయినవాడు బోధించిన యెడల (2) ఆ ఆత్మయు శిష్యుడును లేక గురువును ఒక్కటేయని బోధించిన యెడల నీ రెండు విధములును సమంజసముగానే యున్నవి. తానే ఆత్మయని గ్రహించినవాడు బోధించుటచే నుత్తమబోధ కలుగును. ఈ ఆత్మ గురుశిష్యులలోనున్న ఆత్మ ఒక్కటేయని బోధించుట ఉత్తమమైనబోధయే యగును. వక్త

---

*. జన్మచేత దేవతలు యముడు మొదలగువారు జ్ఞానముచేత దేవతలు మహర్షులు. ముండకము 3.2.9 జ్ఞానముచే పరబ్రహ్మ అయినవారు.

కన్న శ్రోతకన్న ఆత్మ వేరైన పదార్థమని బోధించుటచే భిన్నత్వమే తెలుపబడెను. భిన్నత్వమును చూచువారు మృత్యువునే పొందుదురని దీనిలో రెండవ అధ్యాయం 1 వ వల్లి 10-11 మంత్రములు తెలుపుచున్నవి. అమృతత్వము బడయుటకు ఏకత్వబోధ ఏకత్వానుభవము అవసరమగుచున్నవి. ఇట్టి అన్వయముచేసినపుడు "గతిరత్రనాస్తి" అను పదమునకు విడిగా అర్థము చెప్పవలెను. గతి అనగా అపుడు చిన్త లేదు. అపోహాలు లేవు కదా! పునర్జన్మలేదు అని చెప్పవలసి యుండును. ఈ పర్యవసానము జ్ఞానముయొక్క ఫలితమే.

(4) అతర్క్యం = తర్కమునకు అందనిది. అనగా చర్చచేత తేలనిది. 9 వ మంత్రములో "నైషాతర్కేణామతిరాపనేయా" అని చెప్పబడినది. ఇదే భావము.

తాత్పర్యము:— ఈ ఆత్మ అత్యన్త సూక్ష్మపదార్థమునకన్న సూక్ష్మమయినది. తర్కమునకు అందనిది, అందుచేత అల్పుడగు మానవునిచేత బోధింపబడినపుడు లేదా మానవులలో సామాన్య గురువుచేత బోధింపబడినపుడు శిష్యుడు ఎన్ని విధముల కష్టించి ధ్యానించినను కూడ అయ్యది సులభముగా తెలియబడదు. దానినిగూర్చి ఉన్నదని లేదని సాకారమని నిరాకారమని కర్తయని అకర్తయని బహువిధభావములు కలవుగాన అది సులభముగా తెలియతగినదికాదు. అన్యుడగు దేవతలచేగాని, మానవులలో జ్ఞానులచేగాని బోధింపబడని యెడల దానిని పొందుమార్గము లేదు. అయ్యది అనన్యమయిన వస్తువనియు గురుశిష్యులలో ఆయున్న ఆత్మ అదియు ఒక్కటేయనియు

బోధింపబడినపుడు దానిని గూర్చి చింతయుండదు. సందేహా ముండదు మరల జన్మకు పోవుటయుండదు గురు దేవుడయినను ఋషియైనను తాను ఆత్మ ఒక టేయని తెలిసికొని యనుభవజ్ఞుడయి ఆ ఏకత్వమును ఏకత్వప్రాప్తి సాధనను శిష్యునకు బోధించపలెను. అట్లు బోధించునపుడు శిష్యునకు నిజమయిన సాధనజ్ఞానము మోక్షము అమృతత్వము కలుగును.

౯ వ మంత్రము - శ్రుతిః ॥ 9

నైషాతర్కేణమతిరాపనేయా
ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయప్రేష్ఠ ।
యాం త్వమాపః సత్యధృతిర్బతాసి
త్వాదృఙ్నో భూయాన్నచికేతః ప్రష్టా ॥

ప్రేష్ఠ = ప్రియతముడా! ఏషా = ఈఆత్మ, తర్కేణ = తర్కమువలన, ఆపనేయా=పొందతగినది, న=కాదు, అన్యేన= ఇతరునిచేత, ప్రోక్తా = చెప్పబడినపుడు; ఏవ = మాత్రమే; సుజ్ఞానాయ = సులభముగా తెలియబడునది (భవతి) అగుచున్నది; యా=ఏ; మతిః = బుద్ధి; త్వం=నీవు; ఆపః=పొందియున్నావో; తత్=ఆ; సత్యధృతిః=సత్యమైననిష్ఠ లేక ప్రతిజ్ఞ కలవాడవు; అసి=అయితివి, బత=నిక్కము, తృప్తినొందితివి. నచికేతః = ఓ నచికేతస్సా, త్వాదృక్= నీవంటి; ప్రష్టా = ప్రశ్నించువాడు; నః=మాకు; భూయాత్=కలుగుగాక!

విశేషార్థము:— (1) మతిః = అనగా అభిప్రాయము. బుద్ధి తత్త్వజ్ఞానము ఏదైనను చెప్పవచ్చును. శ్రీ శంకరులవారు దీనికి బుద్ధియని యర్థముచేసిరి, ఈ పదమును ఏషాతో కలిపి

ఏషా, మతిః=ఇట్టి బుద్ధియనగా ఆత్మనుగూర్చిన బుద్ధి తర్కము వలన లభించదు, అని చెప్పియున్నారు, మతిః అనుదానికి అభిప్రాయము అని అర్థము చేసిన యెడల నచికేతస్సు సత్యధృతి కలవాడని యముడు తన అభిప్రాయము తెలిసినట్లు చెప్పవచ్చును, లేదా బుద్ధియని అర్థముచేసి నచికేతస్సు పొందిన బుద్ధి నచికేతస్సులో మొట్టమొదట ప్రవేశించిన శ్రద్ధ దానిఫలితమగు సత్యధృతియని అన్వయించవచ్చును, అన్యేనైవ ప్రోక్తా 8 వ మంత్రములో అనన్యప్రోక్తా అను అంశమును చూడ వగును, ఇచ్చట అన్యేన అనగా దేవుడయిన నావలనగాని జ్ఞానియైన మానవునివలనగాని చెప్పబడినపుడు అని అర్థమగును, వెనుకటి మంత్రములో అన్యుడు చెప్పనిదే మార్గము దొరకదని నిషేధరూపముగను ఈ మంత్రములో అన్యునిచేత చెప్పబడినపుడు సులభగ్రాహ్యమగునని విధిరూపమునను తెలుపబడెను, రామకృష్ణ మఠమువారు చేసిన వ్యాఖ్యానములో బ్రహ్మజ్ఞానము ఇప్పటికే నచికేతస్సునకు కలిగినదని సూచించుచున్నారు మతి అను పదమునకు వారు జ్ఞానమని అర్థముచేసిరి. అంతకంటే 1 వ వల్లి 2వ మంత్రములో చెప్పిన శ్రద్ధయని అన్వయించుటయే మేలు.

(3) ప్రేష్ఠ = ప్రియతముడు యముడు నచికేతస్సుయందు అత్యన్త వాత్సల్యము చూపుచున్నాడని అర్థము. చివరి పాదములోకూడ ఆ భావమే స్పష్టము చేయబడినది.

(4) సత్యధృతిః = సత్యమైనధృతి స్థిరసంకల్పము లేక ప్రతిజ్ఞకలవాడని అర్థము. నచికేతస్సుయొక్క దృఢ ప్రతిజ్ఞ.

యముడు చేసిన పరీక్షలో చూపబడెను. యముడు ఎన్ని ఆకర్షణలు చూపినను నచికేతస్సు తనకవి వలదని పట్టుపట్టెను. ధృతి అను పదము యిచ్చట నిర్దేశింపబడలేదు. దీనికి భగవద్గీతలో నిర్దేశము కలదు, ఇక్కడ సత్యధృతియని చెప్పబడినది, 18 వ అధ్యాయం 33 వ శ్లోకము చూడనగును. మనస్సు ప్రాణము ఇంద్రియములు యీ మూడిటియొక్క కర్మకలాప మంతయు చలించని యోగమున నిగ్రహింపబడుటయే సాత్విక ధృతియని చెప్పబడెను. ఇచ్చట నచికేతస్సుయొక్క మనస్సు ప్రాణము, ఇంద్రియములుకూడ పరీక్షింపబడెను. ఆమూటి వ్యాపారములు అతని దృఢ ప్రతిజ్ఞకు లోబడియున్నట్లు స్పష్టమయ్యెను.

(5) బత=ఈ పదమునకు ఆశ్చర్యమని ఒక అర్థముచేసిరి. నిశ్చయమని యింకొక అర్థముచేసిరి. * ఈ అవ్యయమువలన యముని అనుకంప లేక దయ చూపబడుచున్నదని శ్రీ శంకరుల వారు అర్థముచేసిరి. దీనికి దుఃఖమనియు, జాలి అనియు, సంతోషము లేక తృప్తి అనియు, ఆశ్చర్యమనియు, ఖండన అనియు

---

(6)* నః = మాకు యముడు తన్నుగురించి మాట్లాడునపుడు బహువచనము వాడెను. నచికేతస్సును గురించి మాట్లాడునపుడు ఏకవచనము వాడెను. అట్లే నచికేతస్సుకూడ తనను గురించి మాట్లాడునపుడు బహువచనమును, యమునిగూర్చి మాట్లాడునపుడు ఏకవచనము వాడెను. 1 వల్లి 27 మంత్రము త్వం = నీవు లప్స్యామహే = పొందినవారము. 28 వ మంత్రము నః = మాకు బ్రూహి = చెప్పుము. ఇది పూర్వసంప్రదాయమని ఎంచవలెను. ఇప్పుడు కర్త తననుగూర్చి ఏకవచనమును గౌరవనీయుడగు ఎదుటవానిని గూర్చి బహువచనమును వాడుచుండును.

అర్థములు కలవు. ఇచ్చట యముని తృప్తి చూపుటకు యీ పదము వాడబడెనని చెప్పుట భావ్యమని తోచెడిని. నీవు సత్యధృతివి. ఇది మా అభిప్రాయము. నేనట్లు తృప్తిపడితిని, అని చెప్పినను సమంజసముగానే యుండును

తాత్పర్యము:— ఓ ప్రియతముడగు నచికేతస్సా యీ ఆత్మ తర్కమువలన పొందవీలుకాదు. అన్యుడగు నాబోటి దైవముచేతగాని లేదా సంపూర్ణ జ్ఞానియగు మానవునిచేతగాని బోధింపబడినపుడు సులభముగా గ్రహింపవచ్చును. నీలో యే శ్రద్ధ ప్రకాశించెనో దానిమూలమున నీవు సత్యమైన స్థిరమయిన ప్రజ్ఞకలవాడవు అయితివి. ఇది నా భావము. ఇట్లు నాకు తృప్తి కలిగినది నీవలె ప్రశ్నలువేయు పుత్రుడు లేక శిష్యుడు మాకు దొరకుగాక!

౧౦ వ మంత్రము – శ్రుతిః ॥ 10

జానామ్యహగ్ం శేవధిరిత్యనిత్యం
నహ్యధ్రువైః ప్రాప్యతేహి ధ్రువం తత్ ।
తతో మయా నచికేతశ్చితోఽగ్ని
రనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్ ॥

శేవధిః=ధనము లేక ధనముండు నిలయము. అనిత్యం = అశాశ్వతము; హి= నిశ్చయము; ఇతి= అని, అహం= నేను; (యముడు) జానామి=ఎరుగుదును; అధ్రువైః=అనిత్యములు వలన, తత్ =ఆ; ధ్రువం=నిత్యపదార్థము; నప్రాప్యతే=పొంద పడదు, హి=నిశ్చయము, జానామి అహం=ఇట్లని నేను గ్రహింతును; తతః=కాన, అనిత్యైః=అశాశ్వతములయిన, ద్రవ్యైః=

ద్రవ్యములతో; నచికేత అగ్నిః = నచికేతస్సను యజ్ఞము; మయా=నాచేత; చితః=చేయబడినది, నిత్యం=నిత్యమైన వస్తువును; ప్రాప్తవాన్ = పొందినవాడను, అస్మి=అగుచున్నాను,

విశేషార్థము:— (1) శేవధిః=ధనమని ఒక అర్థము, ధనముంచు నిధులని యొక అర్థము. అనగా నిప్పుడు (Banks) అను చెప్పంబడు సంస్థలు. ఇచ్చట యీ ధనము సామాన్య ధనమేగాక కర్మఫలమనియు అర్థము చేయుచున్నారు, అట్లును ఊహించవచ్చును. అట్లుగాక భార్యాపుత్రాది పశుపక్ష్యాది ఆస్తిపాస్తులన్నియు అని చెప్పవచ్చును. ఏవేవి నచికేతస్సును చేసిన పరీక్షలో వానికి వాగ్దత్తము చేయబడెనో యట్టి భోగ సాధనసామాగ్రి యంతయు.

(2) అనిత్యం=అశాశ్వతములు నశ్వరములు అని యమునకు తెలిసియే యున్నది. అయినను నచికేతస్సుకు ఆతురత కలుగునేమోయని వీని నన్నిటిని వాని కంటి యెదుట ప్రదర్శించెను, ఇప్పుడు తన మనస్సులోనున్న నిజమైనభావమును నచికేతస్సుకు దెలుపుచున్నాడు. నీకిచ్చెదనన్న పదార్థముల స్వభావము నాకు తెలియకపోలేదు. నీవెట్లు గ్రహింతువో తెలిసికొనుటకే అవన్నియు నేకరువు పెట్టితిని. మరియొక సూత్రముకూడ యముడు తెలుపుచున్నాడు.

(3) అధ్రువైః= ఈ పాదములో యముడు తెలిపిన మహా సత్యమును అందరు గమనించవలెను. అధ్రువమువలన ధ్రువమైన ఆ వస్తువు దొరకదు, నిశ్చయము. అధ్రువమైనవి. ధనాది లోకసంపత్తి అంతయు, కర్మకాండ అంతయు, ధ్రువమయిన

ఆ వస్తువనగా ఆత్మ, మోక్షము, సత్యము, ధర్మము, ( If you gain whole world and lose your own soul what shall it benfit you or what will you give in exchange for your own soul? ) లోక మంతయు గెలిచియుకూడ నీ ఆత్మను కోల్పోయిన యెడల నీకేమిలాభము. నీ ఆత్మకు మారకముగా ఏమి యివ్వగలవు; అని ఏసునాధుడు చెప్పిన వాక్యమును గమనించవలెను. లోకములోని సిరిసంపదలు కర్మకాండ అంతయు అస్థిరములు. ఈ అస్థిరమైన వానిని ఇచ్చి ఆత్మను కొనజాలము. లేదా నిలుప జాలము. కర్మకాండ ఫలితముకూడ నశ్వరమైనదే. స్వర్గఫలముల నిచ్చినను అవియు స్థిరములుకావు. ముణ్డకం 1-2-12 లో "నాస్తి అకృతః కృతేన" చేయబడిన పనులవలన అకృతుడు అనగా సృష్టింపబడనివాని లేదా అక్రియుని పొందుటకు వీలు లేదు. కాన ఆత్మతో సమానమయిన వస్తువులేదు. సమానమయిన విలువగల వస్తువులను యిచ్చినపుడే ఆత్మను పొందవచ్చును. కాన ఆత్మనే యిచ్చి పరమాత్మను పొందవలెను.

( 4 ) తతః = కాన అనగా మొదటి రెండు పాదములలో చెప్పిన రెండు అంశములనుబట్టి తేల్చెడి పర్యవసానము. మొదటి రెండు పాదములలో చెప్పిన సంగతులు ( 1 ) శేవధి అనిత్యము ( 2 ) అధ్రువములవలన ధ్రువమైనది ఏదియు లభించదు. ధ్రువమయిన ఆత్మ అసలే లభించదు. కాన అధ్రువమయిన వాని నన్నిటిని నచికేతాగ్నిలో ఆహుతి చేసితిని.

(5) అనిత్యైర్ద్రవ్యైః = పై జెప్పిన శేవధి అధ్రువ వస్తువులు, ఇదియు నొకటే. పై తెలిపిన ధ్రువము యీ నిత్యము ఒకటే అనిత్య ద్రవ్యములవలన నిత్యమును పొందితిని. ఇత్యాది రెండవ సూత్రములో చెప్పిన దానికి విరోధముగా కనపడును. విరోధాభాసాలంకారము. కాని నిజమునకు విరోధములేదు. అనిత్య ద్రవ్యములను వినియోగించుటచేతగాక వానిని విసర్జించుటచేత, ఆహుతి చేయుటచేత అతడు అనిత్య పదార్థమును పొందెను. ఈ అనిత్య ద్రవ్యములలో దారైషణా ధనైషణా లోకైషణలు చేరియున్నవి. ఇహలోక పరలోక భోగేచ్ఛలు చేరియున్నవి. స్థూల సూక్ష్మ కారణ శరీరముల త్యాగము చేరియున్నది, పృథగాత్మ భావము అనగా తన ఆత్మ ప్రత్యేకముగా చిట్టచివరవరకు నుండునను భావము, ఆశకూడ చేరియున్నవి, అనగా జీవాత్మ పరమాత్మలో సంపూర్ణముగా మగ్నమగుటకు ఆటంకముగా నుండతగినవన్నియు చేరియున్నవి. ఇవన్నియు ఒకదానివెనుక నొకటి పోవుటచేతనే, నిత్యపదార్థము నిత్యముగా మిగిలెను. నాటకరంగమున రాజు వేషధారుని నావరించియుండు తెరలన్నియు నొకటివెనుక నొకటి తీసివేయగా సింహాసనాసీనుడైన రాజు ప్రత్యక్షమగును. అట్లే యమునకు అనిత్య ద్రవ్యములు అదృశ్యముకాగా నిత్యము మిగిలి యుండెను.

(6) నిత్యము = ఈ నిరపేక్షమైన బ్రహ్మ పదార్థముగాక, సాపేక్షకమైన యమాధిపత్యమని శ్రీ శంకరులవారభిప్రాయ పడిరి. అట్లెంచవలసిన ఆవశ్యకత లేదు. 1 వ వల్లి 17-18 వ మంత్రములలో త్రిణాచికేత పదమునకు దారైషణ ధనైషణ

లోకైషణా అను ఏషణాత్రయ యజ్ఞమని అర్థము చేయబడెను. దానినే యిచ్చట గ్రహించిన యెడల యముడు పరబ్రహ్మ జ్ఞానమును పొందిన మహాత్ముడని స్పష్టమగును. అపుడీ నిత్యమున కసలు నిత్యమైన పదార్థమేయని చెప్పనగును. యముడు తన జ్ఞానమును గూర్చి 2 వల్లి 9 వ మంత్రములలో తెలిపి యుండెను.

తాత్పర్యము:— లోకములోని సిరిసంపదలన్నియు, కర్మలు కర్మఫలితములు అన్నియు, అనిత్యమనియు; అనిత్యమైనసాధనల వలన నిత్యమైన పదార్థము లభ్యముకాదనియు నేనెఱుంగుదును. ఏ పదార్థమునకైనను తుల్యమైన మూల్యమిచ్చినపుడే అయ్యది లభ్యమగును. నిత్యమైన ఆత్మకు తుల్యమయిన పదార్థము లేదు గాన అనిత్యముల మూలముగా ఆ నిత్యమైన పదార్థము ఎన్నడును యెవరికిని లభింపదు. ఓ నచికేతస్సూ! నేను నీకు జూపిన ఆకర్షణలన్నియు అనిత్యములయినవేసుమా. నిన్ను పరీక్షించుటకే అవి యుద్దేశింపఁబడినవి, నేను నీకు దెలిపినమూతనయజ్ఞము మహా న్నర్య యజ్ఞములో, నీపేర ప్రచారమగు నాచికేత యజ్ఞములో ననిత్య పదార్థముల నన్నిటిని – సమస్త కోరికలను, ఇహలోక పరలోక భోగేచ్ఛలను, స్థూల సూక్ష్మ కారణ శరీరములను, వ్యక్తిత్వమును, అనగా మోక్షస్థితిలో కూడ భిన్నత్వమును ప్రత్యేకత్వమును --- అన్నిటిని నాహుతి చేసితిని. అన్నిటిని నాహుతిచేయగా నేనా నిత్యమయిన పదార్థము నైతిని. అహం బ్రహ్మాస్మి అను ననుభవము నాకు కలిగెను. ఈ మన్త్ర

మంతయు యమధర్మరాజు చెప్పినదే. ఇవి నచికేతస్సు వాక్యములుకావు.

౧౧ వ మంత్రము – శ్రుతిః ॥ 11

కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం
క్రతోరనన్త్య మభయస్య పారం ।
స్తోమమహా మురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా
ధృత్యా ధీరో నచికేతో ఽత్యస్రాక్షీః ॥

నచికేతః = ఓ నచికేతస్సూ, జగతః = జగత్తుయొక్క, ప్రతిష్ఠాం = ఆధారమైన; క్రతోః = క్రతువువలన పొందతగిన, కామస్య = కామములయొక్క; ఆప్తిం–=సిద్ధిని; అత్యస్రాక్షీః= వదలిపెట్టితివి, ఆనన్త్యం = అంతములేనట్టియు; అభయస్య పారం = అభయముయొక్క ఒడ్డు అయినట్టియు; మహత్ = గొప్పదైనట్టియు, లేక చిద్రూపమయినట్టియు; స్తోమ = పూజనీయమయిన; ప్రతిష్ఠాం=ఆధారమయినట్టియు, ఉరుగాయం= మహాశ్రయమయినట్టియు అనగా పరమావధియైనట్టియు (నన్ను) దృష్ట్వా = చూచి, ధీరః = ధీరుడవై; ధృత్యా = దృఢ నిశ్చయము కలవాడవై వదలి పెట్టితివి.

విశేషార్థము:— ఈ మంత్రములో నచికేతస్సుయొక్క నిత్యానిత్యవస్తు వివేకము తెలుపబడుచున్నది. ఇచట రెండు పరస్పర భిన్నములగు విషయములు తెలుపబడెను. 1. యజ్ఞయాగాది క్రతువులద్వారా ఇహలోక పరలోక వాంఛలను తీర్చుకొనుట 2 పరమాత్మ దర్శనము. ఈ రెంటిలో మొదటి

దానిని వదలుకొని రెండవదానినే నచికేతస్సు స్వీకరించెను. ఈ మంత్రము స్వర్గలోకమునకు లేక హిరణ్యాగర్భ లోకమునకో వర్ణించుననియు దానిని నచికేతస్సు త్యజించెననియు అర్థము చేయుచున్నారు. కాని అభయస్యపారం, ఉరుగాయం అను పదములు పరమాత్మనుగూర్చియే చెప్పతగినవి. మహత్ప్రతిష్ఠాం అనునదియు నతనిగూర్చి చెప్పతగినదే, ఇచ్చట యముడు మరణాధిపతిగాగాక జ్ఞానిగా లేక బృహదారణ్యాకములో చెప్పి న ట్లు సృష్టికి పూర్వముండే మృత్యుస్వరూపముగా ప్రవర్తించుచున్నాడు, 1 వల్లి 12 వ మంత్రములో చెప్పిన విశేషములకును యీ మంత్రములో చెప్పిన దానికిని చాల భేధముకలదు. ఈ మంత్రములో "దృష్ట్వా" చూచెను అని చెప్పబడియున్నది. నచికేతస్స యముని మాత్రమే చూచెను. స్వర్గనరకములను చూడలేదు. ధీరుడై అనగా ధైర్యముతో అని యొక అర్థము. లేదా జ్ఞాని యయ్యెనని మరియొక అర్థము, యమునికి నచికేతస్సుకు జరిగిన సంభాషణవలన అతడు నిజమైన జిజ్ఞాసువని ఋజువయ్యెను. యమునివలన మూడు వరములు పొంది నాలుగవ వరముక్రింద జీవాత్మయొక్క ప్రత్యేకాస్తిత్వమునుగూర్చి తెలిసికొన యత్నించు చున్నాడు. 1 వల్లి 14 వ మంత్రములో "గుహాహితుని" చూడుమని ప్రబోధింపబడెను. పిమ్మట రానున్న 12 వ మంత్రములో ఆ గుహాహితుని జూచిన ఫలితమే తెలుపబడుచున్నది,

విశేషార్థము:— (1) జగతః ప్రతిష్ఠాం క్రతోః = జగత్తంతయు యజ్ఞముమీద నాధారపడి యున్నది. భగవద్గీత 3 వ

అధ్యాయము 10 శ్లోకము చూడనగును, ప్రజలతోబాటు యజ్ఞమును కూడ ప్రజాపతి సృజించెను. అదియే వారి అభివృద్ధికి సాధనము అని యాశ్లోకము తెలుపుచున్నది. ఈ యజ్ఞములు బహువిధరూపములు కలవని భగవద్గీత 4 అధ్యాయం 25- 26 27- 28- 29- 30 శ్లోకములు తెలుపుచున్నవి. ఈ యజ్ఞముల మూలముగా ప్రజల కోర్కెలు తీర్చబడును, ఇది సామాన్యమయిన సుకృతజీవితముయొక్క పన్థా. దానిని నచికేతస్సువదలి పెట్టెను

(2) ఆనన్త్యం = అన్తము లేనిది. ఈపదమును క్రతువులకు సన్ధించి, క్రతువులయొక్క ఫలితము లనన్తములైనవని చెప్పబడెను, ఇదిసరియైన అర్థముకాదు. క్రతువులయొక్క ఫలితములు సాపేక్షకముగాన ననన్తము లనవచ్చునేమోగాని నిజమునకు అన్తవన్తములే. ముణ్డకము 1, 2, 10వ మంత్రము స్వర్గలోకసుఖములు త్వరలోనశించగానే తిరిగి ఇహలోకమున జన్మకలుగునని చెప్పబడెను. అట్టి అన్తవన్తములయిన ఫలితములను అనన్తములని చెప్పుట భావ్యముకాదు. ఆనన్త్యము అనుపదమునకు అమృతత్వము, శాశ్వతత్వము, అపారత్వము, అమితత్వము అని అర్థములుకలవు, దేశకాల సంఖ్యానిమిత్తములకు వశముకాని అపారత్వము సంపూర్ణత్వము అనిఅర్థము ఇచ్చుటను అట్లే అర్థముచేయవలెను.

(3) * అభయస్యపారం ఈపదములు పరమాత్మకే వర్తిం చును. 5 వ ప్రశ్న 7 వ మంత్రములో అభయంపరం అని పరమాత్మ వరింపబడెను. తైత్తిరీయం 2 వ అధ్యాయం 7 వ అనువాకము "అధసోఽభయంగతో భవతీ" "అధతస్యభవతీ" అనిచెప్పబడియున్నది. ఎప్పుడు అభయము కలుగునది ఎప్పుడు భయముకలుగునది చెప్పబడెను. ఏకత్వము తెలిసినపుడు అభయమున్ను కించిత్తైన భిన్నత్వము భావించబడినప్పుడు భయ మున్ను కలుగుచుండును ఇక్కడ అభయమునకు పారము= అవతలిబడ్డు తెలుపబడినది. అదిపరమాత్మస్థితియే.

(4) ఉరుగాయం=విశాలమైన స్థలము అత్యన్త అవకాశ మని అర్థముకలదు, అనగా సృష్టింపబడిన విశ్వమంతయు జేరుట కవకాశముగల స్థానముకాన పరమాత్మయే.

(5) మహత్ప్రతిష్ఠాం=గొప్ప ఆధారము. విశ్వమునకంతయు గొప్పదైన ఆధారము పరమాత్మయే. మహత్=అనగా చిత్ అని అర్థముచెప్పవచ్చును. చిద్రూపమే ప్రతిష్ఠగాగలది, అదియును పరమాత్మయే పరమాత్మ సచ్చిదానన్దుడు.

(6) స్తోమం=పూజనీయము ఇన్నిగుణములు కలదిగనుక సర్వదా పూజనీయమే స్తోమమనగా తలయని అర్థముకలదు. పరమాత్మయే విశ్వమున కంతకు తలముండకము 2-1-4

* అభయంఏతత్ అని ఒకటవప్రశ్న 10 వ బ్రాహ్మణములో కలదు. అచ్చటకూడ ఆత్మజ్ఞానము కలవాడు పోవు ప్రదేశము చూపబ డెను. కాని అది సగుణబ్రహ్మలోకమే అభయంపారం అని పరబ్రహ్మ లక్షణముగా 3 వ వల్లీ 2 వ మంత్రములో చెప్పబడెను. దానికదియే భావ మని శ్రీ శంకరులవారును అన్వయించిరి.

"అగ్నిర్మూర్ధా" అని చెప్పబడినది. ఈయనతల అగ్నితలచిత్కుస్థానము, కాన పరమాత్మయనియే చెప్పవచ్చును.

(7) దృష్ట్వా=చూచి నచికేతస్సు చూచినది భూలోకము యమునిని మాత్రమే తనతండ్రిచేసిన యజ్ఞ యాగాది క్రతువులయందు వైరాగ్యమేర్పడి నూతనమైనశ్రద్ధ అన్తస్స్ఫురణ కలిగెను. తన్కాలమున యముని చూచెను. ఆ యముడు జ్ఞానమూర్తి పరమాత్మ ప్రతినిధి పరమాత్మయే ఈ రెండును చూచినపిమ్మట క్రతువులయందుతత్ఫలితములయందు వైరాగ్యమును యమునియందు నిశ్చలభక్తినిష్ఠలను అచంచల లక్ష్యమును నచికేతస్సుకు కుదిరెను, అట్లుకుదరగానె ధీరత్వము ఏర్పడ సాగెను. చూచి అనగా పరిశోధించి అనికూడా చెప్పనొప్పును. ఈ రెంటియొక్క తారతమ్యము పరిశోధనానన్తరము గ్రహించి అని అర్థము. 12 వ మంత్రములో "తం" వానిని అని చెప్పబడెను. ఆ సర్వనామముచే సూచింపబడినవాడు ఈ మంత్రములో ఆనన్యం మొదలగు పదములచే నిరూపింపబడినవాడే.

(8) మృత్యో!=యమధర్మరాజను పేరు మృత్యువునను వాడినట్లు కనపడదు గ్రంథమంతటిలోను మృత్యువనుపదమే వాడబడుటచేత బృహదారణ్యములో చెప్పిన అనాదిపురుషుడే ఉద్దేశింపఁబడెనని ఊహింప వచ్చును. 1 వ వల్లి 4 వ మంత్రములో "మృత్యవెదదామి" అని గౌతముడు పలికెను. మూడు రాత్రులయందు వైవస్వతునియింట నచికేతస్సు అతిథిగానుండెనని 1 వ వల్లి 7 వ మంత్రము తెలుపుచున్నది. వసుజీవ

జాలమంతకును కలిగెడి అంతిమదశ వానినామరూపములు అదృశ్యమగుదశ. దానికే మృత్యువందురు. దానినే నశ్వర స్థితియందురు. ఈ మూడుకోజులలో సర్వజీవవస్తుజాలమున కును విశ్వమునకును కలిగెడి ఈ పరివర్తనమును గూర్చి నచి కేతస్సు అఖండమైన తపస్సుచేసి దానిస్వభావమును కనుగొనె నని చెప్పవచ్చునా? మృత్యువు నచికేతస్సుల సంవాదమం తయు అతని హృదయములో పూర్వపు వాసనలకును నూతన ముగా అంకురించిన శ్రద్ధకును కలిగిన సంఘర్షణమని చెప్ప వచ్చునా?

తాత్పర్యము:— ఓ నచికేతస్సా ఈజగత్తంతయు యజ్ఞ ములపై ఆధారపడియున్నది. ఆ యజ్ఞములమూలమున సర్వ కామములను పొందువిధానమును దాని పర్యవసానమును నీవు చూచియున్నావు. భయరహితమై అభయమునకు ఉత్తమ నిలయమై దేశకాల నిమిత్తములకతీతమై అపారమై చిదూప మున సర్వమునకు ఆధారమై సర్వవిశ్వమునకు పరమోత్తమ గమ్యస్థానమై వెలయుచున్న అనంత తత్వమును పొడగాంచి యుంటివి. ధీరత్వము నిన్ను ఆవరించగా అత్యన్త దృఢనిశ్చ యుడవై పరతత్వము నిమిత్తము భోగతత్వమును పూర్తిగా విడనాడితివి. నీ విచక్షణ ధన్యమయినది.

౧౨ వ మన్త్రము శ్రుతిః ౻ 12

తందుర్దర్శం గూఢమనుప్రవిష్టం
గుహాహితం గహ్వరేష్ఠం పురాణం ।

అధ్యాత్మ యోగాధి గమేన దేవం
మత్వాధీరో హర్ష శోకౌజహాతి ॥

దుర్దర్శం=కష్టముమీాదగాని చూడవీలుకానిది. గూఢం=నిగూఢమయినది. అనుప్రవిష్టం=అన్తర్యామి అయినది. గుహాహితం=హృదయగుహాయందు నిలచియున్నది, గహ్వరేష్ఠం=అగమ్యప్రదేశమందున్నది. పురాణం=సనాతనమైనది, తం=ఆ; దేవం=తేజోమూర్తిఅయిన పరబ్రహ్మను, అధ్యాత్మయోగాధిగమేన=ధ్యానయోగముచేపొంది. మత్వా=వేద్యమొనర్చుకొనిన, ధీరః=జ్ఞాని, హర్షశోకౌ=సుఖదుఃఖములను రెండింటిని, జహాతి=విడచుచున్నాడు, లేక నశింపచేయుచున్నాడు.

విశేషార్థము:— (1) తం దేవం = ఆ దేవుని అనగా 11వ మంత్రములో వర్ణించిన దేవుని దేవుడనుపదమునకు తేజోమూర్తి అని అర్థముకలదు. పురుషసూక్తములో "ఆదిత్యవర్ణం తమసఃపరదస్తాత్" చీకటికి అతీతుడు, సూర్యవర్ణముకలవాడు అని చెప్పబడెను. అతడే ఇతడు.

(2) గూఢమనుప్రవిష్టం = 1 వ వల్లి 29 మంత్రములో నీసమాసముకలదు. విడిగా గూఢమను ప్రవిష్టము అని అన్వయించ వచ్చును. లేదా దాని గూఢతత్వములలోని లోతునంతయును తెలిసి ప్రచురించువాడు అని చెప్పవచ్చును.

(3) గుహాహితం = ఈ పదము 1 వ వల్లి 14 వ మంత్రములో కలదు. ఈ దేవుని జూచుటకు మృత్యులోకమున పోనక్కర లేదు. కాలహరణము ధనహరణము శరీరాయాసము

కలిగించు ప్రమాణమక్కరలేకయే తన హృదయ గుహలోనే చూడవచ్చును.

(4) గహ్వరేష్ఠం = గహ్వరమనగా ఒక గుహ లేక అడవి అగాధస్థానము చేరుటకు దుర్గమమైన ప్రదేశము. హృదయ గుహలో యున్నను అది సమీపమందున్నను అట్లు భావించి గ్రహించుట దుష్కరము గనుక దానినే దుర్గమ ప్రదేశమని చెప్పిరి.

(5) పురాణం = అనగా సనాతనము అనాదినుండి ఉన్న వస్తువు అనాదినుండి ఈ గుహలోనె యున్నవస్తువు. ఎప్పుడు సృష్టి ఆరంభమయ్యెనో యే జీవి వెల్వడెనో అప్పటినుండి కూడ ఆయాజీవి హృదయములో లభించుచున్నవాడే.

(6) అధ్యాత్మయోగాధిగమేన = అధిగమము అనగా పొందుట అధ్యాత్మయోగము. ఆత్మయోగము ఆత్మలో సర్వేంద్రియ సమ్మేళనము అని చెప్పవచ్చును. లేదా జీవాత్మ పరమాత్మలయోగమని చెప్పవచ్చును. అట్టి యోగములో అత్యధికస్థితిగనుక అధి ఆత్మయోగమని చెప్పవచ్చును. శ్వేతాశ్వతరములో ఈ ఆధ్యాత్మయోగము మూలముననే పరమాత్మను పొందవలెనని చెప్పుచున్నది. 2 వ అధ్యాయము 4 వ మంత్రము చూడవలెను. దీనినే సమాధిస్థితి యందురు.

(7) హర్షశోకౌ=సుఖదుఃఖములు రెండు ఈశావాస్యము 7 వ మంత్రములో "కోమోహః కశ్శోకః" మోహము శోకము ఎచ్చటివి. అని చెప్పబడెను. అనగా ఆత్మబ్రహ్మైక్యము కలిగినపుడు దుఃఖముండదు. తైత్తిరీయము 2 వ అధ్యా

యము 9 వ అనువాకము "ఉభేహ్యేవైష పతే ఆత్మానగ్ం స్పృణుతే య" ఆత్మజ్ఞానము కలవాడు పుణ్యపాపములనుండి విడివడునని చెప్పబడెను.

N. B. ౧ వ వల్లి ౨౦ వ మంత్రములో వేయబడిన ప్రశ్నకు ఇందులో ప్రత్యుత్తరము కలదు. కర్మసముదాయమేగాక ఆత్మయను నొక సంధానకర్తను గురించి దానిని ధ్యానసమాధు లలో చూడనచ్చును. అని యీ మంత్రములో తెలుపబడెను. భగవద్గీత 2 అధ్యాయము 38 శ్లోకములో సుఖదుఃఖములను రెంటిని అతీతము కావలెనని చెప్పెను. ఈ సమత్వము కలుగుటయే యోగమని ఆ అధ్యాయము 48 వ శ్లోకము తెలుపు చున్నది. ఈ రెండును ఆత్మజ్ఞానముకలిగిన పిమ్మట నిలువ నేరవు. ఇవి నశ్వర పదార్థములు అనశ్వరము ప్రత్యక్షముకాగా ఈ నశ్వరము తనంతటతానే సెలవు తీసికొని పోవును.

(8) దుర్దర్శం = అతిసూక్ష్మమగుటచే పొందుట కష్టము.

తాత్పర్యము:—చూచుటకు కష్టసాధ్యమయినదియు గూఢమైనదియు, అన్తర్యామియైనదియు అగాధగూఢ రహస్యములను వెల్వరచునదియు దుర్గమ ప్రదేశమైన హృదయ గుహయందు నిలచి దాగియున్నదియు సనాతనమయినదియు సనాతనమునుండి అచ్చటనే యున్నదియు ఆ అనన్తతత్వమగు దివ్యజ్యోతియగు పరమాత్మను ధ్యానసమాధిలోపొంది అనుభవమొనర్చుకొనిన ధీరుడగు జ్ఞాని సుఖదుఃఖాదులను వదలి అతీతమగు ఆనందస్థితిలో అల్లాడుచుండును.

౧౩ వ మంత్రము – శ్రుతిః 13

ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః
ప్రవృహ్య ధర్మ్యమణుమేతమాప్య ।
స మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా
వివృతగ్ం సద్మ నచికేతసం మన్యే ॥

మర్త్యః = నశ్వరుడైన మానవుడు, ఏతత్ = దీనినిగూర్చి శ్రుత్వా = విని; ప్రవృహ్య = మననముచేసి; సంపరిగృహ్య= ధ్యానముచేసి; అణుం = సూక్ష్మమయిన; ధర్మ్యం = ధర్మ స్వరూపమయిన, ఏతం=దీనిని, ఆప్య=పొంది, మోదనీయం= ఆనందప్రదమగుదానిని; హి=నిక్కముగా; లబ్ధ్వా=సంపాదించి, సః = వాడు, మోదతే = ఆనందించును, నచికేతసం = నచికేతస్సునకు; సద్మ= ఇల్లు, వివృతం = తెరువబడినదని, మన్యే = తలంచెదను.

విశేషార్థము:— (1) శ్రుత్వా, ప్రవృహ్య సంపరిగృహ్య, ఆప్య=శ్రవణ మనన ధ్యానవిధి ధ్యానసాక్షాత్కృత్వా అనగా వినుట దానిపేరే శ్రవణము ప్రవృహ్య అనగా వృహుధాతువు మీద వచ్చిన పదము వృహ అనగా పెరుగుట వ్యాపించుట అనియు ప్రవృ అనగా ఏరుకొనుట వరించుట అనియు అర్థములు కలవు గాన ప్రవృహ్య విన్నదానిలో మంచి చెడ్డలను తెలిసికొనుటకై మననముచేసి వివేకమువలన చెడుగునువీడి మంచిని వరించుట తన్నిమిత్తమయిన ఆలోచన మననము. గృహ్య అనగా తీసి కొనుట, పరిగృహ్య అనగా అన్నివిధముల యోచించి గ్రహించుట సంపరిగృహ్య అనగా పూర్తిగా గ్రహించుట ఇది ధ్యాన

మంతు సాధ్యము. ఆప్య అనగా పొందుట అనగా అనుభవైక వేద్యమొనర్చుకొనుట సమాధిస్థితిలో కలిగెడి అనుభవము. బృహదారణ్యకములో "ఆత్మావా అరెజ్ఞాతవ్యో మన్తవ్యో నిధిధ్యాసిత్యః" అని చెప్పిన వాక్యమును యీ మంత్రము పోలి యున్నది.

(2) ధర్మ్యం-అణుం = అణువనగా సూక్ష్మమయినది. ఆత్మ అత్యన్త సూక్ష్మమయినది. అని అందఱు యెరిగినదే ధర్మ్యం అనగా ధర్మమునకు మూలమయినది. ధర్మస్వరూప మయినది, అమృతమునకు నిలయమయినది. అని చెప్పవలెను. ఆత్మ ధర్మస్వరూపమే. బృహదారణ్యకము 1-4-14 ధర్మము. సత్యము, ఒకటేయని తెలుపుచున్నది. సనాతన ధర్మము ఆత్మ నుండియే ప్రవర్తిల్లుచున్నది. ఆత్మయే ధర్మప్రవర్తకము కాని యెడల వేరొండు ధర్మము యేర్పడుటకే వీలులేదు. ధర్మ్యం అను పదమునకు ప్రాపంచకములు అని అర్థము చేయుచున్నారు అది భావ్యముగా కనబడదు.

(3) మోదనీయం = ఆత్మ ఆనందస్వరూపము. సచ్చిదా నన్దమూర్తి దానిని పొందినవాడు తానును ఆనందమూర్తియే యగును. ఆత్మ అట్టి ఆనందరూపికాని యెడల శాశ్వతముగా ఉండనేరదు. తైత్తిరీయము 2 అ. 7 వ అనువాకము "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్" అనందమే లేని యెడల ఎవరు బ్రతుకజాలరు. ఎంత దుర్భర దుఃఖమయినను శాశ్వతముకాదు.

(4) సద్మవివృతం = ఇక్కడ సద్మమనగా ఇల్లు దీనికి బ్రహ్మలోకమని అర్థము చెప్పుచున్నారు. పరమాత్మ యనియే చెప్పవలెను. ఈ పరమాత్మను 12 వ మంత్రములో బహుహేతు నిగా చూడమనిరి. ముణ్డకము 3-2-1 లో దీనికి బ్రహ్మ ధామ మని చెప్పబడెను. 2-2-7 లో బ్రహ్మపురియని చెప్పబడెను. ఈ బ్రహ్మపురి యితరులకు గహ్వరము. అనగా మార్గముకాని నచికేతస్సునకు దాని ద్వారములు వివృతం తెరువబడినవి. అనగా నచికేతస్సుయొక్క హృదయము మాలిన్యవిహీనమై ఆవరణరహితమయి యెప్పుడు అన్తర్ముఖమగునో అప్పుడే ఆ పరమవ్యోమమందు ఉన్న ఆత్మను చూడగలడు. ఇట్లు నచికే తస్సునకు మృత్యుదేవత అభయమిచ్చుచున్నది,

తాత్పర్యము:— ఈ ఆత్మ అత్యన్త సూక్ష్మము. ఉత్త మోత్తమ ధర్మమూలము దానినిగూర్చి విని మననముచేసి ధ్యానించి సమాధిలో దానిని పొందిన మనుజుడు అద్వైది ఆనందరూపము ఆనన్దప్రదముగాన తానును నిక్కముగా ఆనందించును. ఓయీ నచికేతస్సా! ఇట్టి ఉత్తమ ఆనందాను భవమునకు నీవర్హుడవు. నీహృదయగుహ పరమ పవిత్రమైన బ్రహ్మపురి అయియున్నది. ఆ పురద్వారములు తెరువబడి యున్నవి. నీవు అన్తర్ముఖుడవై అందులో ప్రవేశించి ఆయా త్మనుపొంది అనుభవించవచ్చునని నాభిప్రాయము.

౧౪ వ మన్త్రము శ్రుతిః ౧౪ 14

అన్యత్రధర్మాదన్యత్రాధర్మా
దన్యత్రాస్మాత్కృతాఽకృతాత్ ।

అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ
యత్తత్పశ్యసి తద్వద॥

ధర్మాత్ = ధర్మముకంటె; అన్యత్ర = వేరగుచోటు; అధర్మాత్ = అధర్మముకంటె; అన్యత్ర = వేరగుచోటు; అస్మాత్ = ఈ; కృతాత్ = చేయబడినదానికంటె; అకృతాత్ =చేయబడనిదానికంటె; అన్యత్ర = వేరగుచోటు; భూతాత్ = గతమునకంటె; భవ్యాత్ = భవిష్యత్తుకంటె; అన్యత్ర = వేరగుచోటు (అట్టిదానిని) యత్ = దేనిని; పశ్యసి = చూచుచున్నావో; తత్ =దానిని; వద = చెప్పుము

విశేషార్థము:— ఈ మంత్రము నచికేతస్సు వాక్యమని చెప్పుచున్నారు, అట్లు ఎంచుటకు వీలుకనుపడదు. ఈ వల్లి మొదటినుండి మృత్యుదేవతయే సంభాషించుచున్నది. మధ్య నచికేతస్సు మాట్లాడు అవకాశము కనుపడదు. భావప్రవాహముకూడ అట్లే నిరాటంకముగానే సాగుచున్నది, 4 వ పాదములో చెప్పిన వాక్యము నచికేతస్సు మృత్యుదేవతను అడుగ తగినదికాదు. బ్రహ్మసూత్రములలోకూడ ఇది నచికేతస్సు వాక్యముగానె ఎంచబడెను. శ్రీ శంకరులవారును అట్లే చెప్పుచున్నారు, కాని మృత్యుదేవత వాక్యముగా తీసుకొనవలెనని ఇచ్చట సూచింపబడుచున్నది.

(1) ధర్మాత్, అధర్మాత్ =పుణ్యపాపములని సామాన్యార్థము శాస్త్రవిధి ననుసరించిన ప్రవర్తన, శాస్త్రనిషిద్ధమైన ప్రవర్తన అనియు చెప్పవచ్చును. అట్లుగాక ధర్మమనగా

గుణము లక్షణము. అధర్మమనగా అగుణము లక్షణములేనిది. సగుణనిర్గుణస్వరూపము, ఈరెంటికీ అన్యత్ర, అని చెప్పబడునది అన్యత్ర అనగామరియొక చోట ఉండునది. అచ్చముగా సగుణ స్వరూపమందేగాక అచ్చముగా నిర్గుణ స్వరూపమందేగాక ఉండుతత్వము.

(2) కృతాకృతాత్ = కృతమనగా చేయబడినది అకృత మనగా చేయబడనిది. కృతమునకు కార్యమనియు అకృతమునకు కారణమనియు చెప్పుచున్నారుకాని ఈపదమునకు విశేషముగా అస్మాత్ కలదు. అనగా ఈ తమకంటెఎదుట నున్న విషయమును గూర్చి కృత, అకృత పదములు వాడబడినవి. కాన అస్మాత్ కృతాత్ = అనగా ఈవిశ్వమునకంటే అనిఅర్థముచెప్పవలెను. అస్మాత్ అకృతాత్ = అనగా ఈవిశ్వమును సృజించిన తాను ఇతరులచే సృజింపబడని వస్తువుకంటే.

(3) భూతాత్, భవ్యాత్ = భూతముఅనగా గతించినది. అంతయు దేశము కాలము నిమిత్తము భవ్యాత్ = రాగల దం తయు రాగలకాలము దేశము నిమిత్తము అంతయు ఇట్లు ఈ మూడు జంటలపదములు (1) దర్మాధర్మము (2) కృతా కృతము (3) భూతము భవ్యము ఈ మూటికి అన్యత్ర వేరుగా నుండునది. అనగా మూడుద్వంద్వములకు అతీతమయినది.

(4) యత్ పశ్యసి = దేనినిచూచుచున్నావో అనగా పై దెల్పిన మూడుద్వంద్వములకు అతీతముగా దేనిని నీవు బాహ్య దృష్టిచే లేక మనోదృష్టిచే లేక అన్తస్ఫురణ యనెడి దివ్య దృష్టిచే దేనిని గ్రహించుచున్నావో అది ఆత్మస్వరూపము.

సామాన్యార్థము పుణ్యాపాపములకు కార్యకారణములకు భూత భవిష్యత్తులకు ఆత్మ అతీతము. విశేషార్థము అచ్చముగా సగుణమనిగాని, అచ్చముగా నిర్గుణమనిగాని, అచ్చముగా సృష్టియనిగాని అచ్చముగా సృష్టికి పూర్వపుదశలోనున్న కర్తయనిగాని కాలస్వరూపమనిగాని ఎంచక ఆత్మ స్వస్వరూపమున నిన్నిటిలో నుప్రవర్తించుననియు నిన్నిటికిని అతిశయించుననియు భావము.

(5) తద్వద = అట్టిదానిని నీవు ఊహించకలిగినది లేనిది చెప్పుము. ఊహించకలిగిన యెడల నీమనస్సుకు కలిగిన తత్వ నిరూపణ తెలుపుము. అని యముడు నచికేతస్సును ప్రోత్సాహ పరచెను. 13 వ మంత్రములో మోక్షద్వారములు తెరచి యున్నవి. నీవందులో ప్రవేశించుమని యముడు నచికేతస్సును హెచ్చరించెను.అట్లు ప్రవేశించినచోటనుండు తత్వముఈమంత్ర ములో నిరూపింపబడినది. దానిని ధ్యానించుసాధన దాని ప్రతీకము 15 వ మంత్రములో తెలుపబడనున్నది. కాన ఈమం త్రము మృత్యుదేవతవచనముగానే గ్రహించుట భావ్యము.

తాత్పర్యము:—పుణ్యాపాపముల కతీతమైనది; కార్యకార ణముల కతీతమైనది. భూతభవిష్యత్తుల కతీతమైనది అట్టిదానిని నీవు నీహృదయగుహాలో చూడుము. చూచి నీకు కలిగెడి అనుభవములను దెలుపుము. దానిని సగుణముగాను నిర్గుణము గాను మాత్రమే ఎంచవద్దు దానిని విశ్వముగాను సృష్టికి పూర్వపు దశగాను మాత్రమే ఎంచవద్దు దానిని భూతకాలము గాను భవిష్యత్కాలముగాను మాత్రమే ఎంచవద్దు. ఇవన్నియు

అగుచున్నది. అన్నిటిని అతిశయించుచున్నది. అట్టి ఉత్తమ స్థాయిలోనున్న వానినిగా నీ సమాధిస్థితిలో కనిపెట్టి అనుభవించుము. అట్టి అనుభవమును పొందకలిగితివో లేదో తెలుపుము పొందిన అనుభవములను దెలుపుము.

౧౫ వ మంత్రము - శ్రుతిః ౹౹ 15

సర్వే వేదాయత్పదమామనన్తి
తపాంసి సర్వాణిచ యద్వదన్తి ౹
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ౹౹

సర్వే = సమస్తమయిన; వేదాః = వేదములు; యత్ = ఏ; పదం = గమ్యస్థానమును, ఆమనన్తి = ప్రకటించుచున్నవి; చ = మరియు, సర్వాణి=సమస్తములయిన, తపాంసి = తపస్సులు, యత్ = దేనిని; వదన్తి=చెప్పుచున్నవి, యత్ = దేనిని ఇచ్ఛన్తః= కోరుచున్నవారై, బ్రహ్మచర్యం= బ్రహ్మచర్యమును, ( జిజ్ఞాసువులు ) చరన్తి=ఆచరించుచున్నారు. తత్ = ఆ; పదం = పదమును, తే = నీకు, సంగ్రహేణ = సంగ్రహముగా లేక క్లుప్తముగానే; బ్రవీమి= తెలుపుచున్నాను, ఏతత్ = అది, ఓమితి= ఓం అని ( తెలిసికొనుము )

విశేషార్థము:— (1) సర్వేవేదాః = అన్ని వేదములు అన్ని ప్రమాణ గ్రన్థములు ప్రతి ఒక్క వేదము ఆ పరమాత్మనే తెలుపుచున్నది. అన్ని వేదములు కలసికూడ ఆ పరమాత్మనే తెలుపుచున్నవి. అన్ని వేదములయొక్క అన్ని ప్రమాణగ్రంథ

ముల యొక్క అన్ని మతములయొక్క పరమోద్దేశము పరమాత్మ ప్రకటనయే. ఏ వేదములోనైన ఏ ప్రమాణగ్రంథములోనైన ఏ మతములోనైన యీ పరమోద్దేశమునకు భిన్నముగా ఏదైన కనపడినను అయ్యది అన్వయభేదముగాని అసలు తత్వభేదము కాదని తెలిసికొనవలెను. ఋగ్వేదము 1 మండలము 164 సూక్తము 46 వ ఋక్కు (1730) వ ఋక్కు) "ఏకం సద్విప్రా బహుధావదన్తి" అసలు పరతత్వము ఒక్కటియే విప్రులు దానిని అనేక విధములు తెలిపెదరు కాన అన్ని ప్రమాణగ్రన్థములు పరతత్వమునే ఐకకంఠ్యముతో ప్రకటించుచున్నవి.

(2) తపాంసి=తపస్సనగా అనశనము అన్నము తినకుండుట "తపో అనశనాత్" మహానారాయణము 78 వ అనువాకము. మహాభారతము అనుశాసనిక పర్వము అన్నవిసర్జనమే తపస్సని చెప్పుచున్నది. ఇచ్చట తపాంసి అనగా తపః కర్మలు అయినను ఉత్తమ తపస్సుచేసినవారే అని చెప్పవలెను.

(3) బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యమనగా గురుకులవాసమని అర్థము చేయుచున్నారు. అట్లు చెప్పుట భావ్యముకాదు. బ్రహ్మయె పరమార్థమని ఎంచి బ్రహ్మేతరసర్వమును త్యజించి తత్సంపాదనకై సాధనముచేయుచు బ్రహ్మయందే మగ్నమైన జీవితమును గడపుట అట్టివారె బ్రహ్మను పొందగలరు.

(4) పదమ్=పదమనగా స్థానము. గమ్యస్థానము, శబ్దము, మూడు అర్థములు కలవు. ఇచ్చట యీ మూడును చెప్పవచ్చును. చివరపాదములో శబ్దమని చెప్పుటయే భావ్యము.

( 5 ) ఓమ్ = ఓంకారము మాహాత్మ్యములోను, ప్రశ్నోపనిషత్, 5 వ ప్రశ్నలోను దీనివివరములు కలవు. ఇది సగుణ నిర్గుణ బ్రహ్మమునకు ప్రతీకముగా నుండదగినది. ఇంతకంటె సూక్ష్మమయిన ప్రతీకమును లోకములో నెవరును తెలిపియుండ లేదు. వేలకొలది సంవత్సరములనుండి వైదిక సంప్రదాయమున యీ ఓం నిరూఢి బడసినది. తైత్తిరీయము 1 వ అధ్యాయము 8 వ అనువాకము. ఈ ఓం ను గురించి తెలుపుచున్నది. భగవద్గీత 17వ అధ్యాయము 23-24 శ్లోకములు ఈ ఓంయొక్క స్వరూపమును ప్రకటించుచున్నవి. శ్రవణ మనన ధ్యాన సమాధులలో ఈ ఓం ను ప్రతీకముగాగొని ఆత్మదర్శనమునకు యత్నించమని నచికేతస్సుకు మృత్యుదేవత బోధించెను.

తాత్పర్యము:— సర్వవేదములు ఏ యుత్తమ ఆదర్శమును గమ్యస్థానమును ప్రకటించుచున్నవో మహోత్తమ తపోధనులెల్లరును దేనినిగూర్చి బోధించుచున్నారో దేనిని పొందనిచ్ఛగించి జిజ్ఞాసులెల్లరును ఏషణాత్రయమును వీడి బ్రహ్మమందు నిశ్చలనిష్ఠులయి ప్రవర్తించుచున్నారో అట్టి పరమాశ్రయము క్లుప్తముగా వర్ణించెదను. దాని ప్రతీకము ఓం అని తెలిసికొనుము

౧౬ వ మంత్రము - శ్రుతిః ॥ 16

ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ<br>
ఏతద్ధ్యేవాక్షరం పరం ।<br>
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా<br>
యోయదిచ్ఛతి తస్యతత్ ॥

ఏతత్=ఇది; ఏవ=మాత్రమే; అక్షరం=అక్షరము, బ్రహ్మ=బ్రహ్మ, హి=నిశ్చయము, ఏతత్; హి; ఏవ; అక్షరం; జ్ఞాత్వా=తెలిసికొని, యః=ఎవడు; యత్ = దేనిని; ఇచ్ఛతి= కోరుచున్నాడో; తస్య = అతనికి; తత్=అది; (లభ్యమగును)

విశేషార్థము: = (1) అక్షరం==లిపిలోని అక్షరము. అక్షరమనగా నాశనము లేనిది. అన్ని లిపులలోనికి ఈ ఓం అను అక్షరమే నాశనరహితమయినదని అర్థము.

(2) బ్రహ్మ=పరబ్రహ్మ; బ్రహ్మ అనియు పరం అనియు రెండు పదములే వాడబడినవి కాని పరం పిమ్మట బ్రహ్మ అను పదమును అధ్యాహారము చేయవలెను. అట్లు చేసిన యెడల బ్రహ్మకును, అనగా అపరబ్రహ్మకును, పరం అనగా పరబ్రహ్మకును యీ అక్షరమే ప్రతీకము 5 వ ప్రశ్న 2 వ మంత్రము చూడనగును.

(3) జ్ఞాత్వా= తెలిసికొని అనగా పరబ్రహ్మనో, అపర బ్రహ్మనో అనుభవమొనర్చుకొని అపరబ్రహ్మను అయిన యెడల పొందుటనియు, పరబ్రహ్మను అయిన యెడల తెలిసికొనుటయే యనియు శ్రీ శంకరులవారు అర్థభేదము చేయుచున్నారు. అపరబ్రహ్మ తనకంటె భిన్నమై పొందతగినదనియు పరబ్రహ్మ తనలోనేయుండి అజ్ఞానరహితము కాగానే తెలియబడునది అనియు భావము.

(4) యదిచ్ఛతి = ఏదికోరునో; అనగా అపరబ్రహ్మను పరబ్రహ్మను, దేనినికోరునో అదిలభ్యమగునని ఒకఅర్థము, పరబ్రహ్మను, అపరబ్రహ్మను తెలిసికొనినపిమ్మట ఏదికోరునో

అట్టికోరికలన్నియు తీరునని ఇంకొక అర్థము. ముండకం 3-1-10 వ మంత్రములో యేయేలోకము యేయేకామము కోరబడునో అది ఆత్మజ్ఞుని వశమందుండును, అని చెప్పబడెను. అట్లే తైత్తిరీయము 3 వ అధ్యాయం 10 వ అనువాకము "ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యనుసంచరన్" ఆత్మజ్ఞానిఅయినవాడు కోరినదిపొంది కోరినలోకములలో నెల్ల తిరుగును అని చెప్పబడెను. ఇచ్చటను అట్లే అన్వయించ వచ్చును.

తాత్పర్యము:— ఈ నాశనరహితమైన అక్షరమే (ఓం) అపరబ్రహ్మ నిశ్చయము. ఈ నాశనరహితమైన అక్షరమును మాత్రమే ఎవరు నిక్కముగా తెలిసికొనుచున్నారో వారు ఏది కోరిన అది వారివశమగును. వారు అపరబ్రహ్మను ఉపాసించినయెడల దానిని పరబ్రహ్మను ఉపాసించినయెడల దానిని తప్పకపొందుదురు. తెలిసినపిమ్మట ఇంక ఏదేదికోరుదురోఅది యెల్లవారికి లభ్యమే.

౧౭ వ మంత్రము శ్రుతిః ॥ 17

ఏతదాలంబనగ్ం శ్రేష్ఠ
మేతదాలంబనంపరం ।
ఏతదాలంబనంజ్ఞాత్వా
బ్రహ్మలోకే మహీయతే ॥

ఏతత్ = ఇది; శ్రేష్ఠం = ఉత్తమమైన; ఆలంబనం=ఆధారము; ఏతత్ = ఇది; పరం=ఉత్కృష్టమైన; ఆలంబనం=ఆధా

రము; ఏతత్; ఆలంబనం; జ్ఞాత్వా=వేద్యమొనర్చుకొనినః సః=వాడు; బ్రహ్మలోకె = బ్రహ్మలోకమందు; మహీయతే=మహిమాన్వితుడగును, లేదా ప్రవేశమున కర్హుడగును, ఆనందించును.

విశేషార్థము:— (1) శ్రేష్ఠంపరం = శ్రేష్ఠమనగా ఉత్తమము ఈ ఇహలోకములోనుండు సాధనలలో తరతమ భావమునుబట్టి మిక్కిలి మేలయినది అని అర్థము. పరం అనగా ఇహలోకమునకుమించిన అనగా అతీతమైన సాధనలలో నుత్కృష్టమైనది శ్రేష్ఠమైన ఆలంబనమనగా అపరబ్రహ్మను పొందు సాధనమనియు పరం ఆలంబనం అనునపుడు పరబ్రహ్మను పొందు ఉత్కృష్టమైన సాధనమనియు చెప్పవలెను. ఆలంబనమనగా సామాన్యార్థము చేయూత. ఆధారము సాధనము విశేషార్థమేమన ఆత్మస్వరూపమును ధ్యాన సమాధులలో గోచరింపజేసికొనుటకు యోగులుచేసెడి కృషి అదే ఇచ్చట సరియైన అర్థము మౌనజపమనికూడ అర్థముకలదు. కాని అపరబ్రహ్మను పరబ్రహ్మను ప్రత్యక్షమొనర్చుకొనగోరు యోగులుచేసెడి మానసిక సాధన అనియే చెప్పవలెను.

(2) బ్రహ్మలోకం = పరబ్రహ్మ లేక అపరబ్రహ్మఉండు స్థాయి లేక ప్రదేశము అని చెప్పవచ్చును. లేదా ఈ విశ్వమంతయు బ్రహ్మలోకమే అనవచ్చును. లేదా బ్రహ్మను పొందెడి సమాధిస్థితియని చెప్పవచ్చును.

(3) మహీయతే = పూజింపబడుచున్నాడు అని అర్థము చేయుచున్నారు. శ్రీ శంకరులవారును అర్థము చేయుచున్నారు.

అపరబ్రహ్మలోకములో ఇతరులుందురు. కనుక ఇక్కడజ్ఞానిని ఆసరించువారు లేక గౌరవించువారుండవచ్చును. పరబ్రహ్మను పొందినప్పుడు భిన్నత్వము ద్వైతము ఉండనేరదు కాన ఈ జ్ఞానిని అచ్చట ఆదరించుట లేక గౌరవించుట లేక పూజించుట సంభవించదు. అందువలన బ్రహ్మలోకప్రవేశమునకు అర్హుడగుచున్నాడు అని చెప్పవలెను. భగవద్గీత 18 వ అధ్యాయము 53 వ శ్లోకము "బ్రహ్మభూయాయకల్పతే" బ్రహ్మయగుట కర్హుడగుచున్నాడు అని తెలుపుచున్నది. అట్లే 54 వశ్లోకములో "బ్రహ్మభూతః" బ్రహ్మ అయినవాడు అని తెలుపబడెను. భగవద్గీత 5 వ అధ్యాయం 24 వ శ్లోకములో "సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి" అట్టి యోగిబ్రహ్మయయి బ్రహ్మానందమును పొందుచున్నాడు, అని చెప్పియున్నదకాన ఇచ్చట మహిమనొందుచున్నాడు పూజింపబడుచున్నాడు అని చెప్పవీలులేదు. అప్టేనిఘంటుప్రకారము ఈపదమునకు సుఖమునొందుట సంతోషముగానుండుట అని అర్థముకలదు. ఇది వైదిక పరిభాషలోని అర్థమని తెలుపబడినది కాన ఇచ్చట ఆనందించును అని చెప్పవలెను.

తాత్పర్యము:— ఇది ఓంకారము అపరబ్రహ్మను ధ్యాన సమాధిస్థితులలో ప్రత్యక్షమొనర్చుకొనుటకు యోగులుచేసెడి సాధనలలో నుత్తమమైనది. ఇదిఓంకారము పరబ్రహ్మనుధ్యాన సమాధిస్థితులలో ప్రత్యక్షమొనర్చుకొనుటకు యోగులుచేసెడి అతీత సాధనలలోనికెల్ల పరమోత్తమమైనది. ఇట్టి ఉత్తమ పరమోత్తమ సాధనలను వేద్యమొనర్చుకొన్నవాడు అపరబ్రహ్మ

లోకమును కోరినపుడు అందులో ప్రవేశించి ఆనందించును. పరబ్రహ్మలోకమును కోరినపుడు పరబ్రహ్మయయి అనిర్వచనీయానందాబ్ధిలో నోలలాడును.

౧౮ వ మంత్రము శ్రుతిః ॥ 18

నజాయతె మ్రియతెవా విపశ్చి
న్నాయంకుతశ్చిన్న బభూవకశ్చిత్ –
అజోనిత్యశ్శాశ్వతో యంపురాణో
నహన్యతె హన్యమానెశరీరే ॥

అయం=ఇది; విపశ్చిత్=జ్ఞానరూపమైనది; నజాయతే=పుట్టుటలేదు, వా, లేక; నమ్రియతే=చచ్చుటలేదు; కుతశ్చిత్=దేనినుండి; నబభూవ=ఏర్పడలేదు, నకశ్చిద్=ఏదిన్నీలేదు, అయం=ఇది, అజః=జన్మలేనిది, నిత్యః=ఎప్పుడువర్తమానమునందే యుండునది, శాశ్వతః=స్థిరమైనది, పురాణః=సనాతనమైనది, శరీరే=శరీరము హన్యమానె=చంపబడినపుడు నహన్యతె=చంపబడదు.

విశేషార్థము, ఈమంత్రము:— ఆత్మస్వరూపమును దెలుపుచున్నది,

(1) విపశ్చిత్=ఇది విశేషణముగాను, నామవాచకముగాను కలదు. విశేషణమైనయెడల జ్ఞానముకల అని అర్థము. నామవాచకమైనయెడల జ్ఞాని ఋషియని అర్థము. ఇచ్చట నామవాచకముగా జేసి చిదాత్మపము అయినది అని చెప్పవచ్చును. వ్యాకరణములో ఆటంకము లేనియెడల దీని నిజస్వభావము విచారిం

పగా తేలుసారాంశము అని అర్థము చెప్పవచ్చును. అదియు సమంజసముగానే యుండును.

(2) నకశ్చిద్బభూవ = ఏదిన్నీ ఏర్పడలేదు. అనగా దీని నుండి ఏదిన్నీ ఏర్పడలేదు. ఈ భావమును సరిగా పరిశోధించిన యెడల సృష్టియే లేదని అర్థమగును. ఇంతమంది జీవాత్మలు లేరనియు తోచును. * రజ్జుసర్పభ్రాన్తి అనెడి వాదమునే ఈ మన్త్రము బలపరచుచున్నదని తోచును. భగద్గీత 2 వ అధ్యాయము 20 వ శ్లోకము ఈ మంత్రమును అనుసరించియున్నది. చివర రెండుపాదములలో భేదము లేదు. మొదటి రెండుపాదములలో భేదము కలదు. "నజాయతే మ్రియతేవా ఈ పదములు రెంటిలోను కలవు. ఇచ్చట "విపశ్చిద్ న్నాయంకుత శ్చిన్న బభూవకశ్చిగ్" అనియున్నదానికి బదులు అచ్చట "కదాచిన్నాయం భూత్వా భవితా వానభూయః" అను పదములు కలవు. అరవిన్దయోగి ఈ పదములకు ఇట్లు అర్థము చేసిరి.

* ఈ మంత్రములో నాలుగు "న" లు ఒక "వా" కలదు. నజాయతే మ్రియతేవావిపశ్చిన్నాయం కుతశ్చిన్నబభూవకశ్చిత్ ... నజాయతే వామ్రియతే అనునప్పుడు పుట్టలేదు లేక చావదు. అని చెప్పవలెను. కాని "వా" కు నిషేధార్థము లేదు. అందుచేత నజాయతే వామ్రియతె అనవలెను. అప్పుడు న బభూవకశ్చిత్ అను దానిలో : "న" లోపించును. అప్పుడు బభూవకశ్చిత్ మిగులును. దేనినైనను చేసెను అని అర్థమగునుకాని అట్టి అర్థము సందర్భానుసారముగా లేదు కాన "కుతశ్చిత్కశ్చిత్ న బభూవ అనగా దేనినుండి ఏవస్తువుగా ఏర్పడలేదు. అనగా దేనినుండి నామరూపధారిగా వ్యక్తిగా జీవిగా లేక వస్తువుగా యేర్పడలేదు. ఆత్మ మార్పులేనిదై తన తత్వములోనె నిలిచి యుండెను. యేొకక పరివర్తనమునుపొందలేదు ఏ ఒక రూపమును పొందలేదు.

( Nor is it that having been it will not be again )
అనగా ఒకప్పుడు ఈ ఆత్మ ఉన్నది గనుక మరల ఇది యుండదు.
అని చెప్పుటకు అవకాశము లేదు. ఒకానొకప్పుడు నుండగా
మరల న అభవితా ఉండదనరాదు. ఈ క్లిష్టపదముల భావనే
మన ఆత్మ ఉన్నదని యొకప్పుడు అంగీకరించిన యెడల మరల
అది లేదని చెప్పవలనుపడదు. సృష్టికి ఆదికారణముగా దాని
నంగీకరించినవారు సృష్ట్యాదిలోను సృష్ట్యన్తములోను అది
యున్నదని అంగీకరించవలెను. ఇచ్చటనున్న పదములకు అర్థ
మేమన అది చిద్రూపి దేనినుండి అది యేర్పడలేదు దానినుండి
యేదియు ఏర్పడలేదు. అనగా అది ఒక కారణముయొక్క ఫలి
తము కాదు. ఇంకొక దానికి కారణముకాదు. కార్యకారణ
సంబన్ధము దానికి వర్తించను. కాన ప్రత్యేకముగా తెలుపబడు
సిద్ధాన్తములు యీ ఉపనిషత్కారుని భావములో వర్తించవు.
గౌడపాదాచార్యులవారు తమ కారికలలో దెలిపిన అజన్మ
( అజాత ) వాదమును యీ మంత్రము బలపరచుచున్నదని
చెప్పవలసివచ్చును.

( 3 ) నిత్యః శాశ్వతః = సామాన్యముగా రెండును ఒకే
అర్థములో వాడెదను. కాని కించిద్భేదము కలదు. నిత్యః
అనగా భూతభవిష్యత్తులు లేక వర్తమానమే ఎల్లపుడువర్తించు
చుండును. శాశ్వతమనగా సుస్థిరమయినది, ఇది కాలమును
అది ప్రతిష్ఠను తెలుపును

( 4 ) పురాణః = పాతది క్రొత్తది, అను అర్థము లేదు
మార్పులేని వస్తువుకు పాత క్రొత్తలు వర్తింపవు.

(5) నహన్యతే = శరీరమునకును ఆత్మకుగల సంబన్ధము ఇక్కడ తెలుపబడినది. శరీరము తనంతట తాను నశించును, లేదా అన్యులచే నశింపచేయబడును. ఈ రెంటిలో నేదియు ఆత్మకు వర్తింపదు.

తాత్పర్యము:— ఈ ఆత్మ చిద్రూపము దీని స్వభావము పూర్తిగా విచారించగా తేలుచున్న దేమన యిది పుట్టుటలేదు. లేదా చచ్చుటలేదు దేనినుండి ఇది యేర్పడుటలేదు. దీనినుండి ఏదియు యేర్పడుటలేదు. అది జన్మలేనిది. దానికి ఎప్పుడును వర్తమానకాలమే వర్తించును. సుస్థిరమయినది. తానుచలించదు, చలింపబడదు. అనాదినుండి యున్నది. పాతక్రొత్తలు లేవు. శరీరము నశించినను నశింపచేయబడినను ఆత్మనశించదు, నశింపచేయబడదు. జీవశరీరములోనున్నను విశ్వశరీరములో నున్నను దాని ఉనికి ఇంతయే అది ఏకమేకాని అనేకముకాదు.

౧౯ వ మన్త్రము – శ్రుతిః ॥ 19

హన్తాచేన్మన్యతే హన్తుం
హతశ్చేన్మన్యతే హతమ్
ఉభౌ తౌ నవిజానీతః
నాయం హన్తి నహన్యతే ॥

హన్తా = చంపువాడు; హన్తుం = చంపుచున్నానని, మన్యతే చేద్ = తలచిన యెడల, హతః = చచ్చినవాడు, హతం = చంపబడితినని, మన్యతేచేత్ = తలచిన యెడల, తౌ = ఈ,

ఉభౌ = ఇద్దఱు, నవిజానీతః = చక్కగా తెలిసినవారు కారు, అయం = ఇది, నహన్తి=చంపదు, నహన్యతె = చంపబడదు

(1) *విశేషార్థము:— హన్తా=చంపువాడు ఒకరు ఇంకొకరిని చంపునపుడు నేను చంపుచున్నానని భావించును. రెండవవాడు తనను మొదటివాడు చంపుచున్నాడని భావించును. ఇట్లు ఉభయులకు కర్తృ కర్మభావమేర్పడును కాని 18 వ మంత్రములో చెప్పినట్లు ఆత్మ, అవినాశి, అవికారి, గనుక అయ్యది చంపదు. చావదు. చంపుట చంపబడుట అను భావములు శరీరమునకు మాత్రమే వర్తించును. శరీరధారియగు ఆత్మ అజ్ఞానదశచే తాను శరీరము ఒకటే అనుకొనుటచేత నీ కర్తృకర్మ భావమేర్పడుచున్నది. ఈ అజ్ఞానదశ లేనపుడు ఆత్మ అయిన తాను వేరు శరీరము వేరు అని తెలిసినపుడు ఈ కర్తృకర్మ భావము లేర్పడవు. ఆత్మజ్ఞానికొకే ధర్మముండును. ఆత్మానందానుభవమే. అజ్ఞానికి శరీర ధర్మము సంఘము (కులము) మొదలగు వివిధ ధర్మములు ఉన్నట్లు కనబడును. గౌతముడు చికేతస్సును యమునకు ఇచ్చెదనని చెప్పినపుడు తండ్రి కొడుకును చంపుచున్నానని తలచి యుండవచ్చును. తనను తండ్రి చంపుచున్నాడని కొడుకు దుఃఖించి యుండవచ్చును. కాని అవి రెండును పొరపాటభిప్రాయము లే/జ్ఞాని విషయములో నింకొక సూక్ష్మధర్మము కలదు. అతని అనుమతిలేనిదే అతని శరీరము

* ఈ మంత్రమే భగవద్గీత 2 వ అధ్యాయములో 19 వ శ్లోకముగా నున్నది. కొంచము పదములలో తేడా కలదు. దానివలన అర్థభేదము లేదు.

గూడ అతనినివిడిచిపోదు. అట్లు పోయేయెడల అతనిస్వాతంత్ర్య్ర మునకు అతని బ్రహ్మత్వమునకు లోటువచ్చును. అందునే భీష్ముడు స్వేచ్ఛామరణము కలవాడయ్యెను. అందుచేతనే బుద్ధభగవానుడు తనను చంపవచ్చిన వారితోను, దేవదత్తుని తోను నా శరీరముపై మీకధికారము లేదని తెల్పెను.

(2) విజానీతః = బాగాఎరుగరు అనగా వీరికి తత్వము తెలియదు. శరీరమే ఆత్మయని భ్రమించుచున్నారు. ఈ శరీరమునకు ఆపద ఆపాదించగనే తమకసిపీకునని (కసి) పట్టిన వాడు అనుకొనుచున్నాడు. వాడు పగతీర్చుకొనెనని బాధి తుడు దుఃఖించుచున్నాడు. లోకములోని దుఃఖమంతయు పగ అంతయు అజ్ఞానముచేతనే కలుగుచున్నది. మాతాపితరులచే సమకూర్చబడిన బీజము వారి కంటిఎదుట వృద్ధినొందుచుం డుటచేత అట్లువృద్ధిఅయిన శరీరమునందే మోహము కల్పించు కొని తన్మూలమున సుఖదుఃఖములు పొందుచున్నారు. ఆ శరీరములోనున్న ఆత్మకు తామిచ్చిన శరీరమువంటిదే ఎల్ల పుడు అవసరమునుబట్టి లభ్యమగును, అని ఈ తల్లిదండ్రులకు తెలియవలెను. తామిచ్చిన శరీరములో నున్నంతవరకే ఈ ఆత్మ తమకు మేలుచేయుననియు వేరొండు శరీరముననున్న పుడు తమకు మేలుచేయదనియు భావించుచున్నారు. ఇయ్యది ఆత్మగనుక ఆత్మస్వభావము పరోపకారమేగనుక ఏశరీరములో ప్రవేశించినను అయ్యది తమ యోగక్షేమమును అభిలషించు చుండుననియే తల్లితండ్రులకు తెలియవలెను. అపుడు మరణ వియోగము ఘోరదుఃఖముగా పరిణమించదు.

తాత్పర్యము:— ఈ ఆత్మ చంపదు చంపబడదు. ఎవరైనను నేను చంపుచున్నానని తలంచినను ఎవరైనను నేనుచంపబడుచున్నానని తలంచినను ఈ ఉభయులు అజ్ఞానదశయందుండుటచే కర్తృకర్మభావములు ఆరోపించుకొనుచున్నారు. వారిద్దరు శరీరము నశ్వరమను సత్యమునుగాని, ఆత్మ అనశ్వరమను సత్యమునుగాని ఆత్మ శరీరముకంటె అన్యమను సత్యమునుగాని గ్రహించలేదు. వారువిక్కమైన తత్వజ్ఞానమును పొందలేరు.

20 వ మంత్రము (శ్రుతిః 20

అణోరణీయాన్మహతో మహీయా
నాత్మాస్యజన్తోర్నిహితో గుహాయామ్ ।
తమక్రతుఃపశ్యతి వీతశోకో
ధాతుప్రసాదాన్మహిమానమాత్మనః ॥

అణోః = అతిసూక్ష్మవస్తువుకన్న; అణీయాన్ = సూక్ష్మతమమైనది; మహతః = మిక్కిలిగొప్పదానికన్న; మహీయాన్ = మరింతగొప్పదైనది; ఆత్మ = ఆత్మ; అస్య = ఈ; జన్తోః = జీవియొక్క; గుహాయాం = హృదయగుహలో; నిహితః = నివసించియున్నది; అక్రతుః = అక్రతువును; వీతశోకః = దుఃఖములేనివాడగుచున్నాడు; ధాతుప్రసాదాత్ = ధాతుప్రసాదమువలన; తం = ఆ ఆత్మను; ఆత్మనః = ఆత్మయొక్క; మహిమానం = మహిమను; పశ్యతి = చూచుచున్నాడు, అనుభవమొనర్చుకొనుచున్నాడు.

విశేషార్థము:— (1) అణుః = అత్యన్త స్వల్పమైనవస్తువు; ఆత్మ అత్యన్తస్వల్పమైనవస్తువులలోకూడ నున్నది. కనుక స్వల్పతమమని చెప్పబడుచున్నది. అట్లే పెద్దవస్తువులలోకూడ నున్నది, కనుక పెద్దది అని చెప్పబడుచున్నది.

(2) జన్తోః = జన్తువనగా అచ్చముగా మానవుడేకాదు అన్నిరకముల జీవులు అందులో జేరుదురు. ఒక్కొక్కప్పుడు అత్యన్త సూక్ష్మజీవియే జన్తువని చెప్పఁ బడుచున్నది. అణోరణీయానననపుడును అదేభావముకలదు. ప్రతి స్వల్పజీవికి హృదయముకలదనియు, ఆహృదయములో నీయాత్మకలదనియు విశేష సత్యమును ఈ మన్త్రము తెలుపుచున్నది. ప్రతిజీవిలో సత్ = ఉనికియు లేక జీవమును; చిత్ = జ్ఞానశక్తియు; సుఖం = సుఖభావనయు ఏస్వల్పముగానైనను అంకురరూపమునన్నైనను కలదనుట నిశ్చయము.

(3) * అక్రతుః = కోరికలులెనివారని యొకఅర్థము. మనస్సును విడనాడినవారు, అతిక్రమించినవారు అని మరియొక అర్థము. ఈశావాస్యము 17 వ మంత్రములో "ఓం క్రతోస్మర" అనునపుడు క్రతుః అనగా మనస్సనికూడ అర్థముచేయబడెను. క్రతుః అనగా యజ్ఞమని ఒక అర్థముకలదు. అక్రతుః=అనగా ఆ యజ్ఞము లేనివాడు అనగా కర్మకాండను వదలి నైష్కర్మ్య

* శ్రీ శంకరులువారును బ్రహ్మ మొదలు స్తంబపర్యంతిముగల ప్రాణి సముదాయముయొక్క గుహలో ఆత్మకలదని అన్వయము చేసిరి. భగవద్గీత 18 వ అధ్యాయం 61 శ్లోకము " ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి " అన్ని భూతములయొక్క హృదయ గుహాలయందున్నవాడు అని చెప్పబడెను.

సిద్ధిని పొందినవాడు. భగవద్గీత 18 వ అధ్యాయం 49 వ శ్లోకము నైష్కర్మ్యసిద్ధి ఉత్తమమని తెలుపుచున్నది. ఇట్లు అక్రతుడు దుఃఖరహితుడగును అందుచేతనే వీతశోకుడు అని చెప్పబడెను ముణ్డకం 3-1-4 లో ఆత్మక్రీడ ఆత్మరతి కలవాడగుచున్నాడు. భగవద్గీత 3 వ అధ్యాయం 17-18 శ్లోకములు ఇట్లు ఆత్మరతుని వర్ణించుచున్నవి.

(4) ధాతుప్రసాదాత్ = దీనిని పరమాత్మయొక్క అనుగ్రహమని అర్థము చేయుచున్నారు. ధాతు అనగా ఒకవస్తువును భరించునది పరాత్పరుడు విశ్వమునంతను భరించువాడు గనుక ఆయన అనుగ్రహమువలన అని చెప్పబడెను. ఇదియును సమంజసమే. కాని యిచ్చట జీవాత్మ పరమాత్మల భేదము ప్రసంగించబడుటలేదు ఆత్మస్వరూపమే తెలుపబడుచున్నది. అందుచేత శ్రీ శంకరులవారు చెప్పినట్లు సర్వేంద్రియముల పవిత్రతవలన శాంతస్థితివలన అని చెప్పవచ్చును. ప్రసాదస్థితి యనగా శాంతిస్థాయియని భగవద్గీతలోకూడ కనపడును. 2 వ అధ్యాయము 64-65 శ్లోకములు చూడనగును. 17 వ అధ్యాయము 16 వ శ్లోకము మనః ప్రసాదమును తెలుపుచున్నది. అందుచేత ధాతుప్రసాదాత్ అనగా సర్వేంద్రియోపశమన శాంతస్థాయి. ఇంద్రియోపరతి యని చెప్పవచ్చును. ధాతువనగా శరీరములోగల సప్తధాతువులు అని ఒకఅర్థముకలదు. అప్పుడుశరీరమంతయు ప్రసాదస్థితికివచ్చినపుడు అనిచెప్పవలెను. సత్వగుణ మతిశయించినపుడు శరీరమంతయు తేజోభరితమగునని భగవద్గీత 14 వ అధ్యాయం 11 వ శ్లోకము తెలుపుచున్నది.

కాన శరీరము సత్వమయమైనపుడు జ్ఞానప్రకాశము వెలుగు చున్నపుడు ఇంద్రియములు ఉపరమించినపుడు అని చెప్పనొప్పును. అప్పుడాత్మమహిమ తెలియును. ఈ మన్త్రము మహానారాయణోపనిషత్తులో 12 వ అనువాకములో 1 వ మంత్రముగా కలదు. అచ్చట " మహిమానమీశం " అని కలదు. ఇచ్చట " మహిమానమాత్మనః " అనికలదు. ఈశమనగా ప్రభువు అని అర్థమగును. అనగా జీవాత్మ, పరమాత్మల భేదము అచ్చట చేయబడినది, ఇచ్చట చేయబడలేదు.

( 5 ) వీతశోకః = శోకరహితుడు ఆత్మయొక్క మహిమ చూడగానే తానే ఆత్మయని తెలిసికొనగానె దుఃఖరహితుడగుచున్నాడు. ముండకం 3-1-2 పశ్యతీశం అస్యమహిమానమితివీతశోకః " మహిమ తెలియగానె శోకరహితుడగుచున్నాడు.

తాత్పర్యము:— అత్యన్త సూక్ష్మమైన అణువుకన్నను సూక్ష్మమైనదియు అత్యన్త విశాలమైనదానికన్న విశాలమైనదియు అయిన ఆత్మ ప్రాణిసముదాయముయొక్క హృదయ గుహలో నివసించియున్నది. కోరికలులేనివాడు కర్మకలాపము నుండి విరమించినవాడు ఇంద్రియాదులను అతిక్రమించినవాడు ఆవరణనైర్మల్యమువలన, ధాతువుల ప్రసాదస్థితివలన ఆ ఆత్మను ఆత్మమహిమను వేద్యమొనర్చుకొని దుఃఖరహితుడగుచున్నాడు.

౨౧ వ మన్త్రము శ్రుతిః॥ 21

ఆసీనో దూరంవ్రజతి
శయానోయాతి సర్వతః ।
కస్తంమదామదం దేవం
మదన్యో జ్ఞాతుమర్హతి ॥

ఆసీనః= కూర్చుండియే; దూరం = దూరమునకు; వ్రజతి= పోవుచున్నాడు; శయానః = పరుండియే; సర్వతః = అన్ని చోట్లకు; యాతి = పోవుచున్నాడు; మదామదం = సుఖదుఃఖాతీతుడగు; తందేవం = ఆ దివ్యమైన ఆత్మను; మదన్యః = నాకంటెఇతరుడు; కః = ఎవడు; జ్ఞాతుం = తెలియుటకు; అర్హతి = అర్హుడగుచున్నాడు.

(1) విశేషార్థము:— ఆసీనఃశయానః = కూర్చుండిపడుకొని ఇవి ఆత్మకు వర్తించు అవస్థలుకావు. కాని దానిసర్వవ్యాపకత్వమును తెలుపుటకై సాపేక్షకముగా తెలుపబడినవి. ఈశావాస్యము 5 వ మంత్రము ఇట్టిభావమునే సూచించుచున్నది. "తదేజతి తన్నైజతి.......................
ఈ పదములో సాపేక్షకములు నిరపేక్షకములుగా ఆత్మకు వర్తించవు. నిద్రించుసమయమున ప్రాజ్ఞస్థితిలో సర్వము అగుననియు, స్వప్నస్థితిలో సర్వానుభవములు పొందుననియు, ప్రతిరాత్రి సుషుప్తిలో బ్రహ్మను పొందుననియు 4 వ ప్రశ్నలోను మాండూక్యములోను తెలుపబడెను. ఆత్మవ్యుత్పత్త్యర్థము ప్రకారము సర్వము అగుచున్నదని భావమునుగూడ ఈ మొదటిపాదము స్ఫురింపజేయుచున్నది.

(2) మదామదం = మద అనగా తృప్తి, సంతోషము; అమద అనగా దానికి వ్యతిరేకము. అనగా దుఃఖము. మదః అనగా ఆనందపారవశ్యమనికూడ కలదు. ఇచ్చట సుఖదుఃఖములు అనిచెప్పవచ్చును. కాని సుఖదుఃఖస్వరూపము ఆత్మ కానేరదు. కాన సుఖదుఃఖాతీతము అని చెప్పవలెను. మానవ శరీరములో జీవాత్మభావముతో నున్నపుడు ఈ స్వప్న సుషుప్తులలో నీలక్షణములు పొడగట్టుచున్నవి.

(3) మదన్యం = నాకంటె అన్యుడుయముడు. తనకంటె అన్యులు ఆత్మజ్ఞానము పొందుటకు అర్హులుకారని చెప్పుచున్నారు. ఈ వల్లి 10 వ మంత్రములో నేను నిత్యత్వమును పొందితిని అని యముడు తెలిపెను. 8 వ మంత్రములో అన్యప్రోక్తః అనునపుడు "అవరేణనరేణ" అనిచెప్పినపుడు చేయబడిన అన్వయము సమంజసమేయని ఈమంత్రము తెలుపుచున్నది. సర్వమందు నిష్పక్షభావము వహించు సమానస్థితికి యముడు వచ్చెనని అర్థము.

తాత్పర్యము:— ఈ ఆత్మ కూర్చుండియు దూరమేగుచుండును. పరుండియు సర్వత్ర వ్యాపించును. ఇట్టిభావములు దానికి వర్తించకపోయినను మానవులకు తెలిసినదాని కారోపించి దాని సర్వవ్యాపకత్వము ఇచ్చట తెలుపబడుచున్నది. ఈ ఆత్మ సుఖదుఃఖాతీతము దివ్యము నాకంటె ఒరులు దీనిని తెలిసికొనతగిన అర్హుడెవడు? అని మృత్యుదేవత తెలుపుచున్నాడు. అనగా ఈఆత్మస్వరూపము నాకు తెలిసినది. నాచే ప్రబోధితుడైనవానికి తెలియకలదు అని అర్థము.

౨ ౨ వ మన్త్రము (శ్రుతిః) ॥ 22

* అశరీగ్ం శరీరేషు
అనవస్థే ష్వవస్థితం ।
మహాన్తం విభుమాత్మానం
మత్వాధీరో నశోచతి॥

శరీరేషు = శరీరములు కలవారియందు;అశరీరం = శరీరము లేనివాడు; అనవస్థేషు = అస్థిరమైనవానిలో; అవస్థితం = స్థిరమైనది; మహాన్తం = ఉత్కృష్టమైనది; విభుం = వ్యాపించునది, ప్రభువైనదిఅగు; ఆత్మానం = ఆత్మను; మత్వా=వేద్యమొనర్చుకొనిన; ధీరః = ధీరుడు; నశోచతి = దుఃఖించడు.

విశేషార్థము:— (1) అనవస్థేషు = అనిత్యములగు అని అర్థముచేసి శరీరములకు విశేషము చేయుచున్నారు, ఇచ్చట అట్లుగాక ప్రత్యేకనామవాచకముగా గ్రహించి అన్వయింపబడినది. రెండువిధములుగాను చెప్పవచ్చును. కాని శ్రీ శంకరులువారు ఇచ్చటచెప్పిన విధముననే అన్వయించిరి. శరీరముగల వస్తువులను యోచించినపుడు అశరీరియనియు, స్థిరత్వమునుగూర్చి యోచించినపుడు అస్థిరులమధ్య సుస్థిరుడనియు చెప్పవచ్చును. శ్వేతాశ్వతరములో 4 అ 14 వ మంత్రములో కలిలస్యమధ్యే అని చెప్పబడినది. అట్లగా మహాగంధరగోళము

* 2 వ అధ్యాయము 2 వ వల్లీ 13 వ మంత్రము చూడవలెను. శ్వేతాశ్వతరం 6 ఖండము 13 వ మంత్రము చూడవలెను.

మధ్య సుస్థిరమైన సృష్టిచేసినవాడు అని అర్థముకలదు. అట్లే ఇచ్చటను చెప్పవచ్చును.

(2) విభుం = సర్వత్ర వ్యాపించువాడు, ప్రభువు. ఈ ఆత్మయే సర్వమునకు ప్రభువు. దానికిమించిన అధికారి లేడు. అందుకనియే సర్వస్వతంత్రము అందుకనియే ఆత్మజ్ఞానికూడ సర్వస్వతంత్రుడు.

తాత్పర్యము:— శరీరములుగలవానిమధ్య అశరీరి అయ్యును అనిత్యమైనవానిమధ్య సత్యమయ్యును, అన్నిటికి మించినదయ్యును సర్వవ్యాపియయి పరిపాలకుడైనదియును అయిన ఆత్మను వేద్యమొనర్చుకొనిన జ్ఞాని శోకరహితుడగుచున్నాడు.

23 వ మన్త్రము శ్రుతిః ॥ 23

నాయమాత్మా ప్రవచనేనలభ్యో
నమేధయాన బహునాశ్రుతేన ।
యమేవైషవృణుతే తేనలభ్య
స్తస్యైషఆత్మావివృణుతే తనూగ్ంస్వామ్ ॥

ఈ మంత్రము ముణ్డకము 3-2-3 గా నున్నది. అచ్చట నున్న ప్రతిపదార్థము విశేషార్థము తాత్పర్యము ఇచ్చట ఉల్లేఖించవలెను. ప్రవచనమనగా బోధించుట పరిశోధించుట అనికూడ చెప్పవచ్చును. వివృణుతే అనునపుడు ఏవిధమున ప్రత్యక్షము కావలెనో ఏకాలమున కావలెనో ఆ రూపము

ఆ కాలము ఆ విధానము ఆత్మయే నిర్ణయించుకొనును. ఆత్మ వలననే ఆత్మ తెలియబడును.

౨౪ వ మన్త్రము శ్రుతిః 24 ॥
నావిరతో దుశ్చరితా
న్నాశాన్తో నాసమాహితః ।
నాశాన్త మానసోవాపి
ప్రజ్ఞానే నైనమాప్నుయాత్ ॥

దుశ్చరితాత్ = దుష్ప్రవర్తననుండి; అవిరతః = విరమించనివాడు; న = పొందడు; అశాన్తః = ఇంద్రియములు శమించనివాడు; న = పొందడు; అసమాహితః = ధ్యాన సమాధి చేరనివాడు; న = పొందడు; అశాన్తమానసః=మనః ప్రసాదము లేక మనశ్శాన్తి లేనివాడు;న=పొందడు; ప్రజ్ఞానేన= ప్రజ్ఞానముచేత; అపి = కాని; ఏనం = దీనిని; ఆప్నుయాత్ = పొందగలడు.

విశేషార్థము:— (1) అవిరతః, అశాన్త, అసమాహితః అశాన్తమానసః, నలుగురు ఆత్మను పొందలేనివారు. ఇచ్చట తెలుపబడిరి. ఒకడు దుశ్చరిత్రము కలవాడు -2- శాన్తము లేనివాడు. 3 ధ్యానసమాధిస్థితులు లేనివాడు 4 మనఃప్రసాదము లేదా మనశ్శాన్తి లేనివాడు. ఈ నలుగురు ఆత్మను పొందలేరు. న ఆప్నుయాత్ అనునది అసలుక్రియ అంతవరకు సరిగానే బోధపడుచున్నది.

(2) ప్రజ్ఞానేనఅపి = ప్రజ్ఞానముచేతగూడ ఇచ్చట ప్రజ్ఞానమనగా తర్కజ్ఞానమని అర్థము చెప్పవచ్చును. అట్లు చెప్పినయెడల పైనలుగురు ఆత్మనుగూర్చి బౌద్ధికజ్ఞానము తర్కజ్ఞానము లేక సాహిత్యజ్ఞానము గ్రంథపరిచయము లేక సామాన్య విశ్వాసముచేత దానినిపొందలేరు. అని చెప్పవలసి వచ్చును. అనగా ఇదంతయు పరోక్షజ్ఞానమని అర్థము చెప్ప వలెను. కాని ప్రజ్ఞానమను పదమునకు వైదికభాషలో ప్రత్యేక మైన అర్థము కలదు. (ఐతరేయము 3 వ అధ్యాయము 1 ఖం 4 వ మంత్రము ప్రజ్ఞానంబ్రహ్మయని చెప్పుచున్నది.) అందు చేత ప్రజ్ఞానేన అనునపుడు బ్రహ్మజ్ఞానముద్వారా అనిచెప్ప వలెను. అట్లె శ్రీ శంకరులవారును అన్వయించిరి. అప్పుడీమంత్ర మును రెండుప్రత్యేకవాక్యములుగా విభజించవలసియుండును. పై దెలిపిన నలుగురు దీనిని పొందజాలరు. ఎవరైనను ప్రజ్ఞా నముచేతనే పొందగలరు. ఈ ప్రజ్ఞానముగాని, ఈ ఆత్మగాని పై తెలిపిన నలుగురుకు దుస్సాధ్యము. ఇట్లర్థముచేసినయెడల అపి అనుపదమునకు "కూడ" అని అర్థము చెప్పరాదు. అపి అనగా "కాని" యని అర్థము చేయవచ్చును. అప్పుడు రెండు వాక్యములును సరిగా సమన్వయింపబడును.

తాత్పర్యము:— దుష్ప్రవర్తనను వీడనివాడును, ఇంద్రియో ద్వేగము శమించనివాడును, ధ్యాననిధిధ్యాసలు లేనివాడును, మనశ్శాన్తిలేనివాడును, ఈ ఆత్మను పొందలేరు. ఆత్మదర్శ నమునకు సాధనమగు ప్రజ్ఞానమును పొందలేరు. కాని ఎప్పుడు

ఎవరికి ప్రజ్ఞాన మేర్పడునో ఆ ప్రజ్ఞానముచేతనే అపరోక్షా నుభూతిచేతనే ఆత్మను పొందగలుగుచున్నారు.

౨౫ వ మన్త్రము శ్రుతిః ॥ 25

యస్యబ్రహ్మ చక్షత్రంచ
ఉభేభవ తఓదనః ।
మృత్యుర్యస్యోపసేచనం ।
కఇత్థా వేదయత్రసః ॥

యస్య = ఎవనికి; బ్రహ్మ = బ్రాహ్మణుడు; చ = మరియు క్షత్రం = క్షత్రియుడు; చ = మరియు; ఉభే = ఇద్దఱు, ఓదనః = ఆహారము, భవతః = అగుచున్నారు; యస్య = ఎవనికి; మృత్యుః = మరణము; ఉపసేచనమ్ = ఫలహారము లేక చిరు తిండి; భవతః = అగుచున్నదో, (అట్టిదానిని) కః = ఎవడు, ఇత్థా = ఇట్టిదని; వేద = తెలిసికొనును, సః = అది; యత్ర = ఎచ్చట నున్నది.

విశేషార్థము:— (1) యస్య = ఎవరికి ఇచ్చట తెలుప బడినది ఆత్మయె పరమాత్మయె బ్రహ్మసూత్రములు యిట్లే అన్వయించుచున్నవి.

(2) బ్రహ్మక్షత్రం = ఇద్దఱు మానవులలో ఉత్తములని భావము. ఒకరు విద్యాదానము జ్ఞానదానము చేయువారు రెండవవారు శరీర సంఘ ఆస్తి రక్షణచేయువారు. ఉభయులు ఆత్మకు ప్రియులు భగవద్గీత 9 అ. 33 వ శ్లోకములో బ్రాహ్మ

ణులు క్షత్రియులు ఆయా నామధారులుగాక నిజమునకు పుణ్య పురుషులు ఋషులు అని తెలుపబడెను. ఇచ్చటను అదేభావము ఇద్దఱును ధర్మాత్ములు వీరిద్దఱు స్థూలశరీరముకలవారు వీరిని ఉపహరించుటవలన మానవసృష్టియంతకంటే తక్కువదియగు జీవరాశియంతయు సూచింపబడినది వీరిద్దఱు ఆత్మకు ముఖ్యమైన ఆహారము మృత్యువు అనగా దేవతాగణము సూచితము వారు సూక్ష్మరూపులు గనుక ఫలహారము లేక చిరుతిండి లేక అన్న సాధనమగు కూర పచ్చడి వగయిరాలు బృహదారణ్యకము 1–4–6 = 3–8–8 చూడవలెను. "సత దశ్నాతికించన సత దశ్నాతికశ్చన" ఈ సృష్టియంతయు ఆత్మచే సంహరింప బడును లేదా ఆత్మలో లీనమగును అని భావము.

(3) యత్రవేద=ఈ ఆత్మ ఎచ్చటనున్నదని చెప్పవచ్చును. దీని విధానము యేదియని చెప్పవచ్చును, అనగా సామాన్యులు ఆత్మ యథార్థస్థితిని గ్రహించలేరని అర్థము దానియొక్క విధానము కూడ నిర్ణయించచాలరు. జ్ఞానులకది దుస్సాధ్యమని అర్థముకాదు ఏలయనః— దానిని తెలిసికొనవచ్చునని 15–16–17–20–21–22 మంత్రములలో తెలుపబడెను. ఆత్మను తెలిసి కొన్నందువలన కలిగెడి ఫలితముగూడ చెప్పబడెను. 23 వ మంత్రములో దాని సాధన తెలుపబడెను 24 వ మంత్రములో అది ఎవరికి దుస్సాధ్యమో తెలుపబడెను. ఒక్క పదములో దాని సాధన నిరూపింపఁబడెను. ఈ మంత్రములోని భావము ఏమనగా అట్టి సాధనకలవారికే అట్టి జ్ఞానము లభ్యమగునని అట్టి ఆత్మ దర్శనము కలుగునని చెప్పబడెను. తక్కినవారు పుణ్యాత్ములగు

మానవులయినను జన్మచే ఉత్తమకులజులయినను జన్మచే దేవ యోనులయినను అంతమాత్రముచేతనే దీనిని పొందజాలరు, అని తెలుపబడినది దీని సమీపమున జన్మాధిక్యము నిష్ప్రయో జనమని సూచన కలదు.

తాత్పర్యము:— ఈ ఆత్మకు బ్రాహ్మణులుగాని క్షత్రియులు గాని ఉభయులుగాని అన్నప్రాయులే మృత్యువుకూడ ఉపాహా రమే. మానవసృష్టి ప్రతినిధులు ధర్మాత్ములు అయినవారు గాని అంతకుమించిన దేవగణముగాని జన్మచే లేక కర్మచే ఎంత పుణ్యాత్ములయినను దీనిని తెలియజాలరు. ఆత్మసాధనచే ప్రజ్ఞా నముచే అనుభవైకజ్ఞానముచే జాతి మత వివక్షతలతో నిమి త్తము లేకుండ నియ్యది లభ్యమగును. ఇతరులందఱును అది ఎచ్చట నున్నది? ఏ విధమున బరగుచున్నది? ఏ విధమున ప్రత్యక్షమగునది తెలిసికొనజాలకున్నారు. ఈ ఆత్మను సృష్టి కర్తగాను పోషణకర్తగానుగాక సంహారకర్తగా కూడ తెలిసి కొనవలెను.

ప్రథమోఽధ్యాయః ద్వితీయవల్లీ సమాప్తా



# అథతృతీయవల్లీ

## ప్రథమాధ్యాయె కఠోపనిషత్ –

౧ వ మంత్రము శృతిః ॥ 1

ఋతంపిబన్తౌసుకృతస్యలోకె
గుహాం ప్రవిష్టౌ పరమె పరార్థ్యె !
ఛాయాతపౌ బ్రహ్మవిదోవదన్తి
పంచాగ్న యోయెచ త్రిణాచికేతాః ॥

లోకె = లోకమునందు, సుకృతస్య = మంచిపనులయొక్క, ఋతం = యథార్థస్వరూపమును, పిబన్తౌ = గ్రహించినవారై; గుహాం = హృదయగుహలోని; పరమై = శ్రేష్ఠమైన, పరార్థ్యె = పైభాగమందు, ప్రవిష్టౌ = ఇద్దరు ప్రవేశించిరి; ఛాయాతపౌ = ఛాయాతపములని, బ్రహ్మవిదః = బ్రహ్మజ్ఞానులు = వదన్తి = పలుకుచున్నారు, చ = మరియు, యె = ఎవరు, పంచాగ్నయః = పంచాగ్నులుకలవారు, త్రిణాచికేతాః = త్రిణాచికేతములు కలవారు.

విశేషార్థము:— (1) లోకె = లోకమని సామాన్యార్థము లోకమనగా శరీరమనికూడ అర్థముచేయుచున్నారు. పిండాండమును గూర్చి యోచించునపుడు భూతశరీరమనియు బ్రహ్మాండమునుగూర్చి యోచించునపుడు విశ్వశరీరమనియు యెంచవచ్చును. భూతశరీరములో హృదయగుహ యెట్లో విశ్వశరీరములో కూడ హృదయము కలదు. "హృదయం విశ్వమస్య" అని ముణ్డకం 2–1–4 లో కలదు. బృహదారణ్యకములో 3-7-10 నుండి 23 వరకు చూచిన యెడల పఞ్చభూతములలోను

అన్నిటిలోను అన్తర్యామిగా ఆత్మకలదని కనపడుచున్నది. కాన రెంటిలో నాయాఅధిష్ఠాన దేవత పరమాత్మకలదని చెప్పవచ్చును శ్రీ మధ్వాచార్యులవారు సుకృతస్యలోకె = సుకృతముచే కలిగిన లోకము లేక శరీర ము అని అర్థము చేయుచున్నారు. అట్లుగాక "సుకృతస్య" ను "ఋతం" తో కలుపుటనేలు. ఈ లోకమను పదమునకు శరీరమనికూడ అని అర్థముచేయక విశ్వమనియె అర్థముచేసి విశ్వమునందు ఇదియొక ప్రధాన సంఘటనమని చెప్పవచ్చును. అప్పుడు గుహాం అను పదమునకు జీవి యొక్క హృదయ గుహయని అర్థము చెప్పవలెను.

( 2 ) సుకృతస్య ఋతం = కృతమనగా చేయబడినది. సుకృతమనగా బాగాచేయబడినది. లోకములో యెవరైనను తాచేయు కర్మ పుణ్యముగాని పాపముగాని బాగానే చేయుచున్నానని తలంచును. ఆ భావనలో సుకృతస్య అనునపుడు పుణ్యాపాపకర్మలన్నియు అర్థమగును, పుణ్యాపాప కర్మలను భే ద ము మానవులకేగాని యితరప్రాణులకు వర్తించదు. అవిచేయు కర్మ స్వభావప్రేరితము అనిచ్ఛితము, ( బుద్ధిపూర్వకము కాదు ) అట్టి కర్మయొక్క ఫలితమును ఆ ప్రాణులనుభవించుచుండును. సుకృతమను పదము వాఙ్మయములో పుణ్యమునకు రూఢియయినది. వైదిక సంప్రదాయమునుబట్టి సందర్భశుచికలిగినచోట పుణ్యకర్మయని చెప్పినపుడు పాపకర్మకూడ ఉదహరించబడినదని ఎంచవచ్చును. ఇచ్చట అట్లు చెప్పుటకు అభ్యన్తరములేదు. కాన పుణ్యాపాప అపాపకర్మలన్నియు

( Iniral Immoral Nonmoral ) అన్నికర్మలు అనిచెప్ప వలెను. ఋతం అనగా దీనినిగూర్చిన సత్యము కర్మయొక్క యథార్థ స్వభావము. దానిని పేరేపించు ఉద్దేశము దాని రూపము దానివలన ఫలితము కర్తకు ఇతరులకు కలిగెడిపర్యవసానము ఇవన్నియు ఋతములో ఇమిడియున్నవియని ఎంచవచ్చును. ఋతమనగా కర్మఫలితమని శ్రీ శంకరులవారును అన్వయించిరి. ఇచ్చట అచ్చుయుగా ఫలితమేగాక కర్మసంబద్ధమయిన ఆద్యన్త విషయమంతేయు అనగా దానికే కర్మసూత్రము The law of Karma అని చెప్పవలెను.

( ౩ ) పిబన్తౌ = పిబ అనగా త్రాగుట, భోగించుట అని శ్రీ శంకరులవారు అర్థముచేసిరి. పై తెలిపిన కర్మసూత్రము లేక కర్మానుశాసనము గ్రహించి Recognising అని అర్థము చెప్పవచ్చును. పిబన్తౌ అనునది ఇద్దఱిని సూచించును. ఈ కర్మశాసనమును చూచువారు ఒకడు దానికి బద్ధుడగును. రెండవవాడు దానిని పాలించుచుండును. లేదా గమనించుచుండును. ముణ్డకం ౩, 1, 1, లో ఒకడు పిప్పలమును తినుచున్నాడనియు ఒకడు చూచుచున్నాడనియు చెప్పబడెను. అక్కడ యిక్కడను అన్వయించుచుండును. పరమేపరార్ధే = హృదయగుహలో ఉత్తమ ప్రదేశమున 1వ ప్రశ్న 11వ మంత్రములో "పరేఅర్ధే" అని వాడబడినది. ఉత్తమభాగములో అనిఅర్థము. తైత్తిరీయము ౩-౬ వ అనువాకము "పరమేవ్యోమన్ ప్రతిష్ఠితా" అని చెప్పబడినది. హృదయగుహలో ఉత్తమ ఆకాశమున అని అర్థము. ఇచ్చట పరమే

పరార్ధ్యే అనునవుడు శ్రేష్ఠమైన హృదయమందుండెడి ఉన్నత స్థానమందున్న ఆకాశమునందు అని చెప్పవచ్చును.

(4) ఛాయాతపౌ = ఛాయ అనగా నీడ. ఆతపమనగా ఎండ ఈ రెండు పైన తెలిపిన హృదయగుహలో ప్రవేశించిన ఇద్దఱకు ఉపమానములని చెప్పబడు చున్నది. అనగా జీవాత్మ నీడ అనియు, పరమాత్మ ఎండ లేక ప్రకాశమనియు అర్థము. ప్రశ్నోపనిషత్తు 3 వ ప్రశ్న 3 వ మంత్రములో "ఆత్మ నఏష ప్రాణోజాయతె ఏషాపురుషె ఛాయైతస్మిన్ ఏతదాతతం" ఆత్మనుండి ప్రాణము పుట్టినది. అది పురుషునిమీద ఛాయవలెనున్నది అని చెప్పబడెను. జీవాత్మ ఛాయయనియు, ప్రతిబింబమనియు చెపుట సంప్రదాయముకలదు. ఛాయ అయినదానికి స్వతస్సిద్ధమయిన ఉనికి లేదు. ప్రకాశమునకు స్వతస్సిద్ధమైన అస్తిత్వము కలదు. శ్రీ మధ్వాచార్యులవారు ఛాయ యనగా సజ్జనులకు మేలు చేయువాడనియు ఆతపః అనగా దుర్జనులకు కీడుచేయువాడ నియు తెలుపుచున్నారు. అట్టి అన్వయము శబ్దమువలన కుదరదు. ఆలంకారికము సామాన్యార్థముచేయుటయే మేలు. హృదయములో ప్రవేశించు ఒకరు అసలుప్రకాశమనియు, రెండవవాడు దానిని పోలినవాడు లేక దాని బింబమనియు చెప్పుట భావ్యము. ఈ ఛాయాతపములు నీరిద్దఱికేగాక 4 వ పాదములో చెప్పిన పంచాగ్నులు కలవారికి త్రిణాచికేతులకు వర్తింపజేయవచ్చును. అట్లు చేసినయెడల పంచాగ్నులుకల గృహస్థులు సామాన్యులనియు, త్రిణాచికేతులు తత్వజ్ఞాను

లనియు అర్ధమగును. అది సమంజసమైన భావనే పంచాగ్నులు కర్మఫలితమును భోగించువారు. త్రిణాచికేతులు కర్మను కర్మఫలమును సన్యసించువారు.

( 5 ) బ్రహ్మవిదః = బ్రహ్మజ్ఞానులు ఈ మంత్రములోని అభిప్రాయమును తెలుపుచున్నారు. 4 వ పాదములో చెప్పిన రెండుతరగతులవారు బ్రహ్మవిదులని చెప్పినను చెప్పవచ్చును. అప్పుడు పంచాగ్నులనువారు బౌద్ధికజ్ఞానముకలవారనియు త్రిణాచికేతులు అనుష్ఠాన పరులనియు అన్వయించవలసి యుండును. ఇంకొకవిధమున ఊహించవచ్చును. హృదయ గుహలో ప్రవేశించువారు ఛాయాతపములని ముగ్గురియొక్క అభిప్రాయము పంచాగ్నులుకలవారియొక్క త్రిణాచికేతుల యొక్క బ్రహ్మవిదులయొక్క అని అగును. అట్లు మూడు తెగలవారు చెప్పుచున్నారు, అనుటచేతకలిగెడి ప్రత్యేక ప్రయోజనము స్పష్టమగుటలేదు. పంచాగ్నులు ఏవన ( 1 ) గార్హపత్యము ( 2 ) దక్షిణాగ్ని ( 3 ) ఆహవనీయము ( 4 ) సభ్య ( 5 ) ఆవసథ్య లేదా ఛాందోగ్యములో చెప్పినట్లు పంచాగ్ని విద్యనుపదేశించువారు అని చెప్పనొప్పును. ఇదియె సమంజసము అప్పుడు 4 వ పాదములో చెప్పిన ఇరు తెగలవారు బ్రహ్మవిదులను పదమునకు విశాలార్థము లేక వివరణముగా ఎంచవచ్చును.

( 6 ) త్రిణాచికేతః = 1 వ వల్లి 17–18 మంత్రములు చూడవలెను.

తాత్పర్యము:— ఈ లోకములో భూతశరీరములోను లేక విశ్వశరీరములోను ఉండెడి హృదయగుహాలో నుత్త మాకాశమునందు ఇద్దఱు ప్రవేశించి యున్నారు. ఆ యిద్దఱు ఈ సృష్టికి ఆధారమగు కర్మశాసనమును గ్రహించి యున్నారు. ఒకరు దానికి బద్ధులై సుఖదుఃఖములను పొందుచున్నారు. రెండవవారు దానిని పాలించుచు దాని ఆచరణను గమనించుచున్నారు. వీరిద్దఱు జీవాత్మ పరమాత్మలని చెప్పబడుచున్నారు వీరిలో నొకరు ప్రకాశమనియు రెండవవారు దానియొక్క బింబము లేక ఛాయయనియు బ్రహ్మజ్ఞానులు చెప్పుచున్నారు. అట్లే యీ బ్రహ్మజ్ఞానులలో చేరిన పంచాగ్ని ఉపాసకులును త్రిణాచికేతులును గూడ తెలుపుచున్నారు. ఈ రెండు తెగలలో త్రిణాచికేతులును అసలు తేజస్సుతోను పంచాగ్ని ఉపాసకులును ఆ తేజస్సు బింబముతోను పోల్చనగును. జ్ఞానపరులు అసలు జ్యోతియును కర్మపరులు దాని ఛాయ లేక బింబమును అని చెప్పవచ్చును.

౨ వ మంత్రము శ్రుతిః ॥ 2

యస్సేతురీజానానా
మక్షరం బ్రహ్మయత్పరమ్ ।
అభయం తితీర్షతాం పారం
నాచికేతగ్ంశకేమహి ॥ 2

ఈజానానాం = యజ్ఞయాగాది క్రతువులు చేయువారికి; యః = ఏది; సేతుః = వంతెనయో; తత్ = అట్టి; నాచికేతం = నాచికేతమును, శకేమహి = చేయగలము, తితీర్షతాం = మోక్షమును గోరువారికి; అభయం = అభయముయొక్క, పారం = ఒడ్డు అయినదానిని, అక్షరం = నాశరహితమయినదానిని; పరమం = శ్రేష్ఠమైన; బ్రహ్మ = బ్రహ్మను, (చేరుటకు; సేతుః = సేతువు నాచికేతము)

విశేషార్థము:— (1) ఈజానానాం = యజ్ఞయాగాది క్రతువులు చేయువారు. వారు స్వర్గాది నశ్వరఫలితములనే పొందుచున్నారు. బ్రహ్మను చేరుటలేదు. బ్రహ్మజ్ఞానులు నాశరహితుడగు పరబ్రహ్మను చేరుదురు. ఇట్లు చేరుటకు యజ్ఞకర్తకు ఏదైన మార్గము కలదా అని పరిశోధించినపుడు ఈ నచికేతాగ్ని దానికి వంతెనగా ఏర్పడుచున్నది. "అమృతస్య ఏష సేతుః" ఆత్మజ్ఞానము అమృత నిలయమగు పరబ్రహ్మను చేరుటకు వంతెనయని ముణ్డకము 2,2,5, తెల్పుచున్నది. ఇచ్చట నాచికేతముద్వారా ఆత్మజ్ఞానము లభించునని అర్థము. నాచికేతమనగా దారైషణా, ధనైషణా, లోకైషణా, ల త్యాగమని చేయబడిన అన్వయము సమమగుచున్నది.

(2) అభయంపారం = అభయముకల ప్రదేశమునకు ఒడ్డు "అభయస్యపారం" అని రెండవవల్లీ 11 వ మంత్రములో చెప్పబడెను అదియు నిదియు నొకటే.

(3) అక్షరంబ్రహ్మ = ఇచ్చట శ్రీ శంకరులవారు బ్రహ్మ అనునది ఒకటిగాను పరబ్రహ్మయనునది ఒకటిగాను రెండు చెప్ప

బడీనట్లు యెంచి ఒకదానికి నాచికేతయజ్ఞముద్వారాను రెండవ దానికి బ్రిహ్మజ్ఞానము ద్వారాను పొందవచ్చునని రెండింటికి రెండు వంతెనలున్నట్లు అన్వయించియున్నారు. సామాన్య యజ్ఞయాగాది క్రితువులుచేయువారు పొందెడిలోకనే నచికేతాగ్ని వలన వచ్చిన యెడల దానివలన పరమ ప్రియోజనము పుంతబోదు. మరియు నిచ్చట రెండు వంతెనలనుటకు తగిన పదజాలము కనపడదు. యజ్ఞయాగాదిక్రితువులు చేసినవారు యజ్ఞరూపమునందుండెడి నచికేతయజ్ఞము మూలమున బ్రహ్మను చేర వీలుకలుగవలెను.

తాత్పర్యము:— యజ్ఞయాగాది క్రితువులు చేయువారు తాము పొందెడి స్వర్గాది ఫలితములతో తృప్తినొందక సంసార సాగరమును దాటనిచ్ఛగించి అభయమునకు నిలయమును నాశనరహితమును శ్రేష్ఠమును అగు పరబ్రిహ్మను చేరుటకు కోరినచో నాచికేతము వంతెనగా నుపయోగపడుచున్నది. అట్టి నాచికేతమును మేము చేయగలము.

3 వ మంత్రిము శ్రుతిః ॥ 3

ఆత్మానం రథినం విద్ధి
శరీరం రథమేవతు ।
బుద్ధింతు సారథిం విద్ధి
మనఃప్రగ్రిహమేవచ ॥

ఆత్మానం = ఆత్మను; రథినం = రథికునిగా, విద్ధి = తెలిసికొనుము, తు = మరల; శరీరం = శరీరమును, రథం = రథమును,

ఏవ = నిక్కముగా లేక నిశ్చయము, తు=మరల, బుద్ధిం=బుద్ధిని, సారథిం=సారథిగాను, చ=మరియు, మనః=మనస్సును, ప్రగ్రహం=కళ్ళెముగాను, ఏవ=నిక్కముగా, విద్ధి= తెలిసికొనుము.

విశేషార్థము:— ( 1 ) శరీరం మానవునియొక్క లేక జీవియొక్క స్థూల సూక్ష్మశరీరములలో నేదైననుసరే ఆ జీవి ఆ సమయమున యే శరీరము ఉపయోగించుచున్నదో అది ఈ మంత్రము దేవమానవ యోనులలోనందరికిని వర్తించవచ్చును. తిర్యక్ యోనులలోకూడ కొన్ని జంతువులకు పూర్వజన్మవాసన ఉండును. అట్టివానికి కూడ ఈ మంత్రము వర్తించవచ్చును. ఈ రథమే జీవయాత్ర సాగించుటకుపయోగపడుచున్నది.

( 2 ) ఆత్మానం - రథినం=ఈ రథమునకు అధికారి దానిలో కూర్చొని ప్రయాణము చేయువాడు, వానిపేరు రథికుడు ఆ రథికుడు ఆత్మ, ఆతనినే జీవాత్మయందుము. 1 వ మంత్రములలో చెప్పిన యిద్దరిలో నొకరికి యీ శరీరముతో సంబంధముండదు. అవసరముండదు, చేయవలసినయాత్ర లేదు. రెండవవానికే ఈ యాత్ర ఈ సంబంధము ఈ అవసరము కలదు. అందుచేత నట్టి వాడే యీ రథమును అధిరోహించిన రథికుడు.

( 3 ) బుద్ధింసారథిం=రథికుడు స్వయముగా రథమును నడుపుటయు కలదు. లేక సారథిచేత నడిపించుటయు కలదు. ఇచ్చట ఈ రథమును ఆత్మయనురథికుడు బుద్ధియను సారథిచే నడిపించుచున్నాడు. బుద్ధి యనగా అంతరింద్రియములలో నొక్కటి మనోబుద్ధి చిత్త అహంకారములని నాలుగు అంతరింద్రియములుగా చెప్పబడును. అందులో బుద్ధియొక్క పని లేక,

విషయపరిచయము తనయొద్దకు తేబడిన దానిని పరిశీలించి నిర్ణయించుట. అందుచేతనే యతనికి సారథియనుపేరు వచ్చినది.

( 4 ) మనఃప్రగ్రహమేవచ = మనస్సు కళ్లెము మనస్సనగా ఇంద్రియములు కలిగించెడి పరిచయముల నన్నిటిని తీసుకొను వాడు. ఇతనిని కళ్లెమని చెప్పిరి. ఇంద్రియములను నిగ్రహించుటకు ఈ మనస్సు ఉపయోగపడును.

ఈ మంత్రము యముడు లేక మృత్యువు నచికేతస్సునకు చెప్పెను. మొదటిమంత్రమును అట్లే ఎంచవచ్చును. 2వ మంత్రము ఎవరు ఎవరికి చెప్పినది సరిగా స్ఫురించుటలేదు. మనము దీనినిచేయగలము అనునది సంపూర్ణక్రియ మనము అనగా మృత్యుదేవత నచికేతస్సు కావచ్చును లేక నచికేతస్సు ఒకడే కావచ్చును. నచికేతస్సు తననుగూర్చి తాను బహువచనములో మాట్లాడుట కలదు. లేదా మృత్యుదేవత బోధించునపుడు నచికేతస్సుతో పాటు వినెడి సభ్యులందరు కావచ్చును.

తాత్పర్యము:— ఓ నచికేతస్సా ! భూతముయొక్క శరీరము నిక్కముగా రథము. రథముతో పోల్చవచ్చును. ఆత్మయే రథికుడు బుద్ధి సారథి మనస్సు పగ్గము ఇవన్నియు నిశ్చయము. ఈ విషయములను నీవు గ్రహించుము.

౪ వ మంత్రము శ్రుతిః ॥ 4

ఇంద్రియాణి హయానాహు
ర్విషయాగ్ స్తేషు గోచరాన్ ।
ఆత్మేన్ద్రియమనోయుక్తం
భోక్తేత్యాహుర్మనీషిణః ॥

ఇంద్రియాణి = ఇంద్రియములను; హయాన్ = గుఱ్ఱములు; ఇతి = అని; మనీషిణః = జ్ఞానులు; ఆహుః = చెప్పెదరు; విషయాన్ = విషయములను; తేషు = ఆ ఇంద్రియములకు; గోచరాన్ = మార్గములు లేక నేల (ఆహుః = చెప్పెదరు) ఇన్ద్రియమనోయుక్తం = ఇన్ద్రియములతోను మనస్సుతోను కూడిన; ఆత్మా = ఆత్మ; భోక్తా = భోగించువాడు; అనిచెప్పెదరు.

విశేషార్థము:— (1) ఇన్ద్రియాణి=ఇన్ద్రియములన్నియు కర్మేన్ద్రియ జ్ఞానేంద్రియములు పది చెప్పవచ్చును. కర్మేన్ద్రియములకన్న జ్ఞానేంద్రియములనే చెప్పుట సమంజసము. జ్ఞానేంద్రియములే మొట్టమొదట విషయపరిచయములు కల్పించును. ఈ విషయములకును ఆ ఇన్ద్రియములకును రాగద్వేషములుద్భవిల్లును. ఈ ఇన్ద్రియములులేనిదే శరీరమునకు వెలుపల నున్న విషయములతో లోపలనుండు మనస్సునకుగాని బుద్ధిగాని పరిచయ మేర్పడదు. అందుచేత వీనిని అనగా ఈ ఇన్ద్రియములను గుఱ్ఱములని చెప్పిరి. రథమును గుఱ్ఱములు ఎట్లు లాగునో అట్లే ఇంద్రియములు శరీరమును లాగును. భగవద్గీత 2 వ అధ్యాయము 62, 63, 64 శ్లోకములు చూడవలెను. వరు

నగా ఎట్లు విషయములయందు ఇంద్రియములు తగుల్కొని మనస్సును బుద్ధిని భోక్తను వేధించునో తెలుపబడెను. ఎట్లు ఆవేశనుండి తప్పించవచ్చునో తెలుపబడెను. గుఱ్ఱములు ముందుచూపుగలవి. వానికి ప్రక్కచూపుకూడా నుండును. ఆ చూపుప్రకారము పోనిచ్చినయెడల బండిని (బోల్తాకొట్టించును) పడద్రోయును. అందుచేత ప్రక్కచూపు లేకుండ మఱుగుపరచుటకు గంతలు కట్టెదరు. (ముందుచూపుటకు) లోపమురాకుండుటకై కళ్లెముకూడ బిగించెదరు.

(2) తేషుగోచరాన్=గో అనగా ఇంద్రియములు చరాన్ అనగా తినుట లేక భోగించుట. గోచరమనగా ఇన్ద్రియముల దృక్పథములో జేరుట పశువులు పచ్చిమేతకొరకెట్లు పరిగిడునో అట్లే ఈ ఇన్ద్రియములు విషయములపై పొర్లి పడుచుండును. 2 వ అధ్యాయం 1 వ వల్లి 1 వ మంత్రములో "పరాఞ్చిఖాని వ్యతృణత్" దేవుడు ఈ ఇన్ద్రియములను బహిర్ముఖముచేసెనని చెప్పబడినది. మాణ్డూక్యము 3 వ బ్రాహ్మణము జాగరిత స్థానః బహిఃప్రజ్ఞః అని చెప్పుచున్నది. జాగ్రదవస్థలో ఇంద్రియములన్నియు వెలుపలనున్న విషయములపై తమశక్తులను ప్రసరింపజేయుచుండును. ఒకొక్క ఇంద్రియము తనకు స్వభావసంబద్ధముగల విషయములమీదకే పోవును. కన్ను రూపముమీదను, చెవి శబ్దముమీదను, ముక్కు వాసనమీదను నాలుక రుచిమీదను, త్వక్ స్పర్శమీదను ప్రసరించును. ఇవి ఆయా ఇంద్రియములకు భోజ్యములు మార్గములు లేక మేతలు.

( 3 ) ఇన్ద్రియమనోయుక్తం=కర్మేన్ద్రియ జ్ఞానేంద్రియ అన్తరిన్ద్రియములతో కూడుకొన్నపుడే ఆత్మకు జీవాత్మయనియు కర్తయనియు భోక్తయనియు సంసారియనియు పేర్లు తెలుపబడును. ఎప్పుడువీనితో యుక్తముకాడో అప్పుడు ఆత్మ స్వస్థితిలోనె యుండును. మాండూక్యము 5–6 మంత్రములలో చెప్పెడి ప్రజ్ఞానస్థితిలో వ్యష్టిభావన యుండదు. మొదటి మంత్రములోచెప్పిన ఇద్దరిలోనొకరు భోక్త అన్నపుడు అతడీ యుపాధుల సంబంధము కలిగియున్నాడని అర్థము. ఆత్మయొక్క సహజస్థితి అభోక్తృత్వ అకర్తృత్వమని చెప్పబడుచున్నది. బృహదారణ్యకము 4–3–7, చూడవచ్చును.

( 4 ) మనీషిణః = అనగా మేధాశక్తిసంపన్నులు వివేకవంతులు జ్ఞానులు మానసిక ఆధ్యాత్మిక తత్వవేత్తలు వారే మానసిక ఆధ్యాత్మిక సంబన్ధములును పరిశోధించి నిశ్చయపరచిరి.

తాత్పర్యము:— ఇన్ద్రియములు గుఱ్ఱములు ఆయా ఇన్ద్రియములకు గోచరమగువిషయములు వానికి గ్రాహ్యములు భోజ్యములు మార్గములు కర్మేన్ద్రియ జ్ఞానేన్ద్రియ అన్తరిన్ద్రియములతో సబంన్ధమేర్పరచుకొనిన ఆత్మను భోక్త యందురు. మానసిక ఆధ్యాత్మికతత్వవేత్తలు జ్ఞానులు ఇట్లు తెలుపుచున్నారు. 3–4 మన్త్రములు ఆత్మకు లోకములోని విషయములకు సంబన్ధము ఎట్లు ఏర్పడునో తెలుపబడెను.

౫ వ మన్త్రము శ్రుతిః 5 ॥

యస్త్వవిజ్ఞానవాన్భవ
త్యయుక్తేన మనసాసదా !
తస్యేన్ద్రియాణ్యవశ్యాని
దుష్టాశ్వా ఇవసారథేః ॥

అవిజ్ఞానవాన్=అనుభవములేని లేక నిపుణతలేని; సారథేః= సారథియొక్క; దుష్టాశ్వాః = చెడుగుఱ్ఱములు; ఇవ = వలె; యః = ఎవడు; తు = మరల; సదా = ఎల్లప్పుడు; మనసా= మనస్సుచేత; అయుక్తేన = కట్టబడని; ఇన్ద్రియాణి = ఇన్ద్రియములు కలవాడు; భవతి = అగుచున్నాడో; తస్య=అతని; ఇన్ద్రియాణి = ఇన్ద్రియములు; అవశ్యాని=లోబడనివి; భవన్తి= అగుచున్నవి,

విశేషార్థము:— *(1) అవిజ్ఞానవాన్=బుద్ధిమన్తులుగాని అనివ్యక్తికి చెప్పవచ్చును. కాని నిపుణుడు అనుభవము లేనివాడు అనియే చెప్పవలెను. 3-4 మంత్రములలో చెప్పిన ఉపమానమును ఈ మంత్రము సాగించుచున్నది. కనుక సారథి నిపుణుడు కానియెడల నష్టము సంభవించును. అకుశలుడనియే శంకరుల వారు అర్థముచేసిరి.

---

* విజ్ఞానమనగా బుద్ధియని చెప్పవచ్చును. 3 వ మంత్రము 9 వ మంత్రము కలిపి చదివినచో అట్లు కనపడును.

*(2) దుష్టాశ్వాఇవ=చెడుగుఱ్ఱములవలె అని ఒకఅర్థము. గుఱ్ఱములు చెడ్డవిగా తోచుటచేత అని ఒకఅర్థము. రౌతు మెత్తనయినచో గుఱ్ఱము మూడుకాళ్లతో నడచునను సామెత కలదు. గుఱ్ఱమునునడపు శక్తిలేనివాడు బండితోలుటకు మొదలిడునపుడు మంచిగుఱ్ఱములుకూడ చెడ్డవిగానే వర్తించును చెడ్డవానిసంగతి చెప్పనక్కరలేదు. రౌతునేర్పరితనము లేక అసామర్థ్యము ముఖ్యమగుచున్నది. అసమర్థుడైనవాని గుఱ్ఱములు అవశములగును.

(3) అయుక్తేనమనసా=అయుక్తము అనగా కలియనిది 3 వ మంత్రములో మనస్సు కళ్లెమని చెప్పబడెను. ఇచ్చట ఆ మనస్సనే కళ్లెముచే కట్టబడని నిగ్రహించబడని ఇన్ద్రియములు అని చెప్పవలెను. మనస్సు నిగ్రహింపబడుటలేదు, అని అర్థముచేయుచున్నారు. అట్లుగాక మనస్సనుపగ్గముతో కట్టబడని అనిచెప్పుటయే భావ్యము. భగవద్గీత 2 వ అధ్యాయం 67 వ శ్లోకము చూచినయెడల ఈ భావము స్పష్టమగును. ఇంద్రియములనే అనుసరించెడి మనసు చుక్కానిలేని నావ గాలిలో కొట్టుకొనిపోయినట్లు పోవును. మనస్సనుపగ్గమునకు ఇంద్రియములు లోబడినయెడల స్థితప్రజ్ఞత్వమునకు దారి తీయును.

---

* ఇట్లు అర్థము చెప్పిన యెడల ఇన్ద్రియములు స్వాభావికిత్యా చెడువి కావని స్ఫురించును. దుర్గుణము నైజముగా ఏర్పడక పిమ్మట వ్యవహార సంబంధములోనే ఏర్పడునని యెంచుటచేత సృష్టికర్తయందు లోపము ఆరోపించుటకు వీలుండదు.

తాత్పర్యము:— నైపుణ్యములేని సారథినడిపించెడు గుఱ్ఱములు మంచివైనను చెడువైనను చెడువానివలె ప్రవర్తించుచు స్వాధీనముతప్పి ఇష్టమువచ్చినట్లు రథము లాగుకొని పోవును. ఎవడు అట్లే నైపుణ్యము లేనివాడై మనస్సును పగ్గముచేత ఇంద్రియములను బంధించి నిగ్రహించడో పై తెలిపిన సారథివలె తనఇంద్రియములు తనకు అవశములగును.

6 వ మన్త్రము శ్రుతిః ॥ 6

యస్తు విజ్ఞానవాన్భవతి
యుక్తేన మనసా సదా
తస్యేన్ద్రియాణి వశ్యాని
సదశ్వా ఇవ సారథేః ॥

విజ్ఞానవాన్ = అనుభవముగల లేక నిపుణతగలః, సారథేః = సారథియొక్క; సదశ్వాః = మంచిగుఱ్ఱములు, ఇవ = వలె, యః = ఎవడు, తు = మరల, సదా = ఎల్లప్పుడు, మనసా = మనస్సుచేత, యుక్తేన = కట్టబడిన, ఇన్ద్రియాణి = ఇన్ద్రియములు కలవాడు, భవతి = అగుచున్నాడో, తస్య = అతనికి, ఇంద్రియాణి = ఇంద్రియములు, వశ్యాని = లోబడినవి ( భవన్తి = అగుచున్నవి )

విశేషార్థము:— (1) విజ్ఞానవాన్ = 5 వ మంత్రములో అవిజ్ఞానవాన్ ను గురించి వ్రాయబడెను. విజ్ఞానవన్తుడు కానివాడు అవిజ్ఞానవన్తుడు ఈ భేదముతో అక్కడ చెప్పిన అంశములను తగిన మార్పులతో నిచ్చట వర్తింపచేసుకొనవలెను.

(౭) యుక్తేనమనసా = ౬ వ మంత్రములో అయుక్తేన మనసా అను శీర్షిక క్రింద చూడవలెను. యుక్తమైనది యీ మంత్రములోను అయుక్తమైనది వెనుకటి మంత్రములోను (౫ వ మంత్రము) చెప్పబడినది. ఈ భేదమును గమనించి తగిన మార్పులతో నచ్చట అంశములను నిచ్చట వర్తింప చేసుకొన వలెను.

తాత్పర్యము:— నైపుణ్యముగల సారథి నడిపించెడు గుఱ్ఱములు మంచివైనను చెడువైనను మంచివానివలె ప్రవర్తించుచు స్వాధీనముననుండి సారథి ఇష్టమువచ్చినట్లు రథమును లాగుకొని పోవును. ఎవడు అట్లే నైపుణ్యముకలవాడై మనస్సను పగ్గముచేత ఇన్ద్రియములను బన్ధించి నిగ్రహించునో పై తెలిపిన సారథికి వలె తన ఇన్ద్రియములు తనకు వశములగును.

౮ వ మన్త్రము శ్రుతిః ॥ 7

యస్త్వవిజ్ఞానవాన్భవ
త్యమనస్కస్సదాఽశుచిః ।
న స తత్పదమాప్నోతి
సగ్ంసారం చాధిగచ్ఛతి॥

తు = కాని; యః = ఎవడు; సదా = ఎల్లప్పుడు; అవిజ్ఞానవాన్ = అనుభవజ్ఞానరహితుడగునో; అమనస్కః = అమనస్కుడగునో, అశుచిః = అపవిత్రుడగునో; సః = అతడు; తత్పదం = ఆ బ్రహ్మపదమును; నాప్నోతి = పొందడు, చ = మరియు,

సంసారం = జననమరణ రూప సంసారమును; అధిగచ్ఛతి = ప్రవేశించి కూరుకొని పోవును.

విశేషార్థము:— (1) అవిజ్ఞానవాన్ = 5 వ మంత్రము లోని విశేషార్థము చూడవలెను.

(2) అమనస్కః = మనస్సుకలవాడు మనస్కుడు అదిలేని వాడు అమనస్కుడు. మానవులందఱకును మనస్సుండును. ఇతర జీవులకును మనస్సు కొద్దిగనో గొప్పగనో ఉండును. కాని ఇచ్చట మనస్సు లేనివాడు అనగా అర్థము 3 వ మంత్రములో చెప్పిన విషయమునుబట్టి నిర్ణయించవలెను. రథికుని యోగ క్షేమము విచారించినట్టివాడు మంచి సారథి, మంచి కళ్లెము పగ్గములు ఉన్న యెడల వాడు రథమునీడ్చు పశువులను వశ మందుంచుకొని రథికుని ఆజ్ఞలను నెరవేర్చగలడు. అట్టి సారథి చేతిలోనుండు పగ్గములు కళ్లెములు తెగిపోయిన యెడల సారథి నిష్ప్రయోజకుడగును. రథికుడు నిస్సహాయుడగును. బండినీడ్చు పశువులు యథేచ్ఛగా పరుగెత్తి బండిబోల్తా కొట్టించును. అట్లే ఆ ఆత్మగతియు సంభవించును. కాన అమనస్కః అనునపుడు తెగిపోయిన లేక వీగిపోయిన పగ్గములు కళ్లెములు కలవాడు బుద్ధికి లోబడని మనస్సు మనస్సుకు లోబడని ఇంద్రియములు కలవాడని అర్థము చెప్పవలెను.

(3) అశుచిః = శుచి అనగా బాహ్యాభ్యన్తర శౌచము లేక పవిత్రతకలవాడు, కాన పుణ్యాత్ముడు. సదాచారి. స్నానా

దులచేతనేగాక పవిత్ర భావవాక్య క్రియలచే శుచిత్వము కలుగును, భావనే ముఖ్యము.

( Out of the fullness of thy heart the mouth speaketh what comes from the heart Like perjury forgery fornication etc, defileth a man. )

హృదయములో నిండియున్న భావములే వాగ్రూపమున వెలుపడును, హృదయమునుండి వెలువడు అబద్ధములు సృష్టి పత్రములు వ్యభిచారభావములు మనుజుని అపవిత్రుని జేయును, అని ఏసునాథుడు చెప్పియున్నాడు. కాన అశుచిః అనగా అపవిత్రమైన మనోవాక్కాయకర్మలు కలవాడు స్నానాది శౌచక్రియలు లేనివాడు.

( 4 ) తత్పదం = రెండవ మంత్రములో చెప్పిన పరబ్రహ్మపదము జ్ఞాని పొందతగినది. అది ఒక్కటే సవిజ్ఞేయః= మాండూక్యము 7 వ మంత్రము అతనే అనగా ఆత్మయే తెలిసికొనతగినవాడు పొందతగినవాడు.

( 5 ) సంసారం = ప్రపంచమంతయు జననమరణ భూయిష్ఠమై ద్వంద్వాదులచే బాధితమై అమృతత్వమునకు దూరమై అమృతనిలయముగాని ప్రదేశము.

తాత్పర్యము:— ఎవడు సామాన్యమగు శౌచక్రియలు లేనివాడో మనోవాక్కాయకర్మలయందు పవిత్రత లేనివాడో ఆత్మకును బుద్ధికిని లోబడని మనస్సుకలవాడో ఇంద్రియములను నిగ్రహించజాలని మనస్సుకలవాడో జీవితపరమార్థమును గ్రహించగల సామర్థ్యత లేనివాడో సంపాదించిన జ్ఞానము

అనుభవములోనికి రానివాఁడో అట్టివాఁడు పరబ్రహ్మపదమును పొందజాలఁడు. అంతియేగాక జననమరణభూయిష్ఠమగు సంసారములో క్రుంగిపోవును.

౮ వ మన్త్రము శ్రుతిః ॥ 8

యస్తు విజ్ఞానవాన్భవతి
సమనస్కస్సదా శుచిః ।
సతుతత్పద మాప్నోతి
యస్మాద్భూయోన జాయతే ॥

తు=కాని; యః=ఎవడు; సదా=ఎల్లప్పుడు; విజ్ఞానవాన్=అనుభవ జ్ఞానసహితుఁడగునో; సమనస్కః=సమనస్కుఁడగునో; శుచిః = పవిత్రుడగునో; సః = అతఁడు; తత్పదం = ఆ బ్రహ్మపదమును; ఆప్నోతి = పొందుచున్నాడు; తు = మరియు; యస్మాత్ = దేనినుండి; భూయః = మరల; నజాయతే = పుట్టడు, అట్టిదిచేరును.

విశేషార్థము:— (1) విజ్ఞానవాన్ = సమనస్కఃశుచిః= 7 వ మంత్రములో అవిజ్ఞానవాన్, అమనస్కః, అశుచిః=అను మూటికిని ఇచ్చట చెప్పిన మూఁడుపదములు భిన్నములు ఈ విషయమును గమనించి తగినమార్పులతో అచ్చటచెప్పిన అంశములు ఇక్కడ చేర్చుకొనవచ్చును.

(2) తత్పదం=7 వ మంత్రములో ఈ శీర్షిక క్రింద చూడవలెను.

(3) * భూయఃనజాయతె = పునర్జన్మలేదు. పరబ్రహ్మను చేరుచున్నాడుగనుక మరలజన్మలేదు. కాన మరణములేదు. అమృతత్వము లభించుచున్నది. సంసారము విడిచిపోవు చున్నాడు.

తాత్పర్యము:— ఎవడు సామాన్యమగు శౌచక్రియలు కలవాడో మనోవాక్కాయకర్మలయందు పవిత్రత కలవాడో ఆత్మకును, బుద్ధికిని, లోబడినమనస్సు కలవాడో జీవితపరమార్థమును గ్రహించగల సామర్థ్యముకలవాడో సంపాదించిన జ్ఞానము అనుభవములోనికి వచ్చినవాడో అట్టివాడు పరబ్రహ్మ పదమును పొందుచున్నాడు కాన అటనుండి మరల సంసారములో ప్రవేశించడు. మరల జన్మ ఎత్తడు. మరల మరణము పొందడు. అమృతత్వమును పొందునని భావము.

౯ వ మన్త్రము శ్రుతిః ॥ 9

విజ్ఞాన సారథిర్యస్తు
మనఃప్రగ్రహ వాన్నరః ।
సోఽధ్వనః పారమాప్నోతి
తద్విష్ణోః పరమంపదమ్ ॥

తు = కాని, యః=ఏ, నరః=మానవుడు, విజ్ఞానసారథిః= విజ్ఞానము సారథిగా కలవాడు, మనఃప్రగ్రహవాన్=మనస్సను

* భగవద్గీత 2 వ అధ్యాయం 61 వ శ్లోకం ఇన్ద్రియ నిగ్రహము జేవుని పతుడు యుక్తుడైనవాడు స్థితప్రజ్ఞుడు.

పగ్గముకలవాఁడో, సః=అతడు, అధ్వనః = మార్గముయొక్క, పారం = గమ్యస్థానమగు, తత్=ఆ, విష్ణోః = సర్వవ్యాపియగు ఆత్మయొక్క, పరమం = శ్రేష్ఠమగు, పదం = నిలయమును, ఆప్నోతి=పొందుచున్నాడు.

విశేషార్థము:— (1) నరః=నూతనమైన జీవితమార్గము కలవాడు పశుపక్ష్యాదులవలె అనిశ్చితమార్గముగాక తాను నిర్ణయించుకొను ఉత్తమ జీవితమార్గము కలవాడు.

(2) * విజ్ఞానసారథిః=విజ్ఞానమే సారథిగా గలవాడు. విజ్ఞానమనగా అనుభవజ్ఞానమని అర్థము. ఇచ్చట అట్లే చెప్ప వచ్చును. 3 వ మంత్రములో బుద్ధి సారథియని చెప్పబడెను. కాన ఇచ్చట విజ్ఞానమనగా బుద్ధియనిచెప్పుట సమంజసమే. ఏలయన:- “ మనఃప్రగహమేవచ ”అని మూడవమంత్రములో వాడినపదములే ఇచ్చటను వాడబడినవి.

(3) విష్ణోః=ఇచ్చట విష్ణువనగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వ రులలోచేరు విష్ణువుకాడు. విష్ణువనగా సర్వవ్యాపియని వ్యుత్పత్త్యర్థము. ఆయర్థమే ఆత్మకును బ్రహ్మకును వర్తిం చును. 1 వ మంత్రములో చెప్పిన రెండవవాడే ఇతడు. అందు

* భగవద్గీత 2 వ అధ్యాయములో స్థితప్రజ్ఞుని గూర్చిన శ్లోకము చూడ వగును.

ఆత్మన్యేవాత్మనాతుష్టః జీవాత్మ పరమాత్మల ఐక్యత పొందినవాడు. స్థితప్రజ్ఞుడు అతడు జ్ఞాని ఇచ్చట విజ్ఞానసారథి యనగా బుద్ధిసారధిగా నుండగా అట్టి జ్ఞానము కలుగునని ఎంచవలెను. లేనిచో పరమాత్మను పొందలేడు.

చేతనే తత్ పరమంపదం అనుపదములు వాడబడినవి. 2 వ మంత్రములో చెప్పబడిన పరబ్రహ్మను గూర్చిన పదము లేఇవి. 7–8 మంత్రములలోకూడ తత్పదంఅనివాడబడినది. అది ఇదియే.

(4) అధ్వనం=యాత్ర, దూరము, ప్రయాణము అని అర్థములుకలవు. కాలము అని అర్థముకూడాకలదు. జీవితయాత్రయొక్క లోకయాత్రయొక్క అంతము లోకయాత్రను సాగించుటకు ఆత్మనిర్ణయించుకొన్న కాలముయొక్క పారం చివర మెట్టుకు అవతలబడ్డకు అని అర్థముఅదియే. తత్ పరమంపదం కాన ఎప్పుడు పరబ్రహ్మనుచేరునో అప్పుడే ఆత్మయొక్క ఇహ లోకయాత్ర పూర్తియగుచున్నది.

తాత్పర్యము:— ఏమానవుడు బుద్ధినిసారథిగను మనస్సను కళ్లెము పగ్గములుగను కలవాడో, అనుభవజ్ఞానము కలవాడో అట్టివాడు ఆత్మనలిపెడి ఇహలోకయాత్రయొక్క పరమగమ్య స్థానమగు ఆ మహావ్యాపియగు పరబ్రహ్మయొక్క ఉత్కృష్ట పదవిని పొందుచున్నాడు.

౧౦ వ మన్త్రము శ్రుతిః ॥ 10

ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా
అర్థేభ్యశ్చ పరంమనః ।
మనసశ్చ పరాబుద్ధిః
బుద్ధేరాత్మా మహాన్ పరః ॥

౧౧ మన్త్రము (శ్రుతిః ౻)

మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషఃపరః ।
పురుషాన్న పరం కించిత్సాకాష్ఠా సాపరాగతిః

ఇన్ద్రియేభ్యః = ఇన్ద్రియములకంటె, అర్థాః = అర్థములు, పరాః = శ్రేష్ఠమైనవి మించినవి, చ = మరియు, అర్థేభ్యః = అర్థముల కంటె, మనః = మనస్సు, పరం = శ్రేష్ఠమైనది, మించినది, తు = మరల, మనసః = మనస్సుకంటె, బుద్ధిః = బుద్ధి, పరా = శ్రేష్ఠమైనది, మించినది, బుద్ధేః = బుద్ధికంటె, మహానాత్మా = జీవాత్మ, పరః = శ్రేష్ఠమైనది, మించినది, మహతః = జీవాత్మకంటె; అవ్యక్తం = అవ్యక్తము, పరం = శ్రేష్ఠమైనది, మించినది, అవ్యక్తాత్ = అవ్యక్తముకంటె, పురుషః = పురుషుడు, పరః = శ్రేష్ఠమైనది మించినది పురుషాత్ = పురుషునికంటె, పరం = శ్రేష్ఠమైనది, మించినది, కశ్చిత్ = ఏదిన్నీ, నాస్తి = లేదు. సా = ఆపురుషుడు, పరా = అతిశయమైన, లేక అతిశ్రేష్ఠమైన, గతిః = గమ్యస్థానము.

విశేషార్థము:—(1) ఈ రెండుమంత్రములలోను చెప్పబడిన వారు (1) పురుషుడు (2) అవ్యక్తం (3) మహత్ (4) ఆత్మ (5) బుద్ధి (6) మనస్సు (7) అర్థములు (8) ఇంద్రియములు ఇందులో ఆత్మ, మహత్, ఇద్దఱినికలిపి ఒకటిగా చెప్పుచున్నారు. రెంటిని కలిపి జీవాత్మయని ఒక అర్థముచేసిరి మహాన్ అనుపదమును పరఃతో కలిపి మిక్కిలిసూక్ష్మమనిఅన్వయించి. ఇట్లు అర్థము పొసగదు. మహాన్ అనగా మహత్తు దానిని 11 వ శ్లోకములో ఒకవ్యక్తిగా చెప్పిరి. కాన మహాన్

అనగా సూక్ష్మమని విశేషముగానింపరాదు. ఈ రెండవ మంత్రములలో పరా, పరం, పరాపరః, పరం, పరః, పరం, పరా, పర లేక పరాయొక్క రూపాంతరములుకూడ అర్థము చెప్పబడుచున్నవి. ఈ మంత్రములురెండు ఉన్నవిఉన్నట్లుగా అన్వయించేయెడల 3-4 మంత్రములతో 13వ మంత్రముతోను సమన్వయపరచేయెడల జీవాత్మయనియే చెప్పవలెను.

(3) పర=వేరైనది, అతీతమైనదని, ఉన్నతమైనదని చెప్పవచ్చును. అన్నిభావములునుకూడ సరిగా వర్తించును.

(4)* అర్థాః=విషయములు అని అర్థము చెప్పుచున్నారు. విషయములనుపదము నాలుగవమంత్రములో కలదు. అచ్చట విషయములనగా ఇంద్రియములను ఆకర్షించు బాహ్యమైన గ్రాహ్య లేక భోగ్యపదార్థములు. అవి ఇంద్రియములకంటె సూక్ష్మములని లేక అతీతములని చెప్పుటకు వీలులేదు.

---

* భగవద్గీత 3 అ. 42 వ శ్లోకము చూడవలెను. అందులో ఇన్ద్రియములు ఉత్తమములు అని చెప్పబడుచున్నవి. వానికంటే మనస్సు ఉత్తమము. దానికంటే బుద్ధి ఉత్తమము గానికంటే ఆతను అనగా ఆత్మ ఉత్తమము. మొట్టమొదట చెప్పిన ఇంద్రియములు ఎవరికంటే ఉత్తమమో అచ్చట చెప్పబడలేదు. కాని వ్యాఖ్యాతలు శరీరముకంటే ఇంద్రియములు ఉత్తమమని చెప్పిరి. విషయము అని చెప్పవలెను. ఇంద్రియములుకంటే మనస్సు ఉత్తమమని అచ్చట చెప్పబడెను. ఇంద్రియములు మనస్సుమధ్య అర్థములు చేర్చబడెను. ఆ అర్థములు లోకమునందలి విషయములే అయిన యెడల గీతప్రకారము ఇంద్రియములకంటె తక్కువస్థితిలో నుండవలెను కాన అర్థములనగా విషయములు కావనియు ఇంద్రియ విషయస్పర్శయని చెప్పవలెను.

ఇన్ద్రియములవలన మనస్సునకు తగిలెడి పరిచయము లేక మెదడులో నరములతో కూడిన పదార్థముమీద ఆయాఇంద్రియముల మూలమున ముద్రించబడెడి బింబములు లేక అంశలు లేక ముద్రలు అని చెప్పవలెను. అర్థః = అనగా వైదికభాషలో ఇల్లు, స్థలము, దేశము, అని అర్థముకలదని ఆఫ్రైక్ ఘంటు తెలుపుచున్నది. అట్లు అన్వయించినయెడల విషయములు ఇంద్రియముద్వారా తమపరిచయమును ఎచ్చట ముద్రించునో ఆ స్థలము అది మెదడులోని భాగమగును. ఐతరేయములో ఇంద్రియములుద్వారా కలుగు స్పర్శ లేక పరిచయమును, సంజ్ఞానం (Sensation) ఆజ్ఞానము (Perception) విజ్ఞానము (Ideation) ప్రజ్ఞానం (Conception) అని తెలిపియున్నారు. మొదటి రెండైనను సంజ్ఞానం, ఆజ్ఞానం అయినను ఈ అర్థములలో చేరును. ఛాయాపటముతీయు యన్త్రమును చూచినవారికి ఇయ్యది బోధపడును. తీయు వ్యక్తియొకరు, ఎవరిపటముతీయబడునో ఆ వ్యక్తి ఇంకొరు. వీనిరూపము ఒకఅద్దముద్వారా మరియొక అద్దముమీదముద్రితమగును. ముద్రితమైన రూపము సరిచేసి వృద్ధిచేసి అచ్చొత్తిన యెడల ఛాయాపటమగును. ఈ నాలుగింటిని మానవశరీరములోనున్న లోకగ్రహణయంత్రముతో పోల్చిన యెడల ఛాయాపటముతీయువాడు మనస్సు, రూపము ఏ అద్దముమీద ముద్రించబడునో అయ్యది మెదడు. ఏ అద్దముద్వారారూపము యొక్క ఛాయపడునో అయ్యది ఇంద్రియము. ఎవరిరూపము

నకు ఛాయాపటముతీయబడుచున్నదో వాడు విషయము. ఇట్లు అన్వయించినయెడల అర్థములు ఇంద్రియములకంటె అతీతమైనవి, అనునపుడు విషయపరిచయము లేక స్పర్శ అని చెప్పవలసియుండును. విషయములకంటె వానిని గ్రహించుటకు, ఉపకరణములు అగు ఇంద్రియములు గొప్పవి

(5) సాకాష్ఠా సాపరాగతిః = కాష్ఠా అనగా చిట్టచివర హద్దు ఆఖరిగమ్యస్థానము. గతిః అనగా ప్రయాణము. ఆశ్రయము అని అర్థము. ఇచ్చట పరమాశ్రయమని అర్థము. అయ్యదియే పరమాత్మప్రాప్తియని చెప్పవలెను.

తాత్పర్యము:— ఇంద్రియములకంటె వానిమూలమున కలిగెడి స్పర్శపరిచయము భావన ఉత్తమమైనది. ఆ స్పర్శపరిచయము భావనకంటె వానిని గ్రహించుమనస్సు ఉత్తమమైనది. ఆ మనస్సుకంటె మనస్సందిచ్చు అంశములను విమర్శించి నిర్ణయించు బుద్ధి ఉత్తమమైనది. బుద్ధికంటె ఆత్మ ఉత్తమమైనది. ఆ యాత్మకంటె హిరణ్యగర్భతత్త్వము ఉత్తమమైనది. దానికంటె పరిపూర్ణమగు పరమాత్మ ఉత్తమమైనది. దానికంటె నుత్తమమైనది ఏదియును లేదు. అదియే చిట్టచివర గమ్యస్థానము. అదియే పరమాశ్రయము. అంతకు మించిపోతగినది పొందతగినది ఏమియు లేదు.

౧౨ వ మన్త్రము శ్రుతిః ॥ 12

ఏషసర్వేషు భూతేషు
గూఢోఽఽత్మా నప్రకాశతే ।

దృశ్యతేత్వగ్ర్యయాబుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥

ఏషః = ఈ, ఆత్మా = ఆత్మ, సర్వేషు = సమస్తమైన, భూతేషు=భూతములయందు; గూఢః = మరుగుపడి; అస్తి= ఉన్నది; నప్రకాశతే = ప్రకాశించుటలేదు, కనపడుటలేదు; తు = కాని; సూక్ష్మదర్శిభిః = సూక్ష్మమును చూడగలిగిన వారిచేత; అగ్ర్యయా= మొట్టమొదటిదైన; సూక్ష్మయా = సూక్ష్మమైన; బుద్ధ్యా = బుద్ధిచేత, దృశ్యతే = చూడబడు చున్నది.

విశేషార్థము:— (1) గూఢోఽఽత్మా = ఈ రెండుపదములునుకలిపి శ్రీఅరవిందులవారు గూఢమైన రహస్యమైన ఆత్మయని అర్థముచేసిరి. అన్నభూతములలోనుండు రహస్యలేక గూఢఆత్మయని అన్వయించిరి. అట్లును చెప్పవచ్చును. లేదా ఈ ఆత్మ అన్నిభూతములయందు గూఢముగానున్నది, అనికూడ అన్వయించవచ్చును. ఈ ఆత్మ 11 వ మంత్రములో చెప్పినపురుషుడే.

(2) సర్వేషు భూతేషు=బ్రహ్మమొదలు స్తంబర్యన్తముగల సకలభూతములలో జీవములో జడములో స్థావరములో జంగమములో అన్నిటిలోను నీయాత్మ గూఢముగా అప్రకాశముగా కలదు.

(3) నప్రకాశతే = కనపడుటలేదు. అజ్ఞానులకు సాధనచేయనివారికి కనపడుటలేదు. అదియేమాయ. వారు దేహామే

ఆత్మయనిభ్రమించి లోపలనున్న ఆత్మనుజూచుటలేదు. చూడ సాధనకూడ చేయుటలేదు. గీత 7 అధ్యాయం 25 వ శ్లోకము " నాహంప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః " అందఱు నా యోగమాయచే కప్పబడుటచేత నేను వారికి కనుపడుటలేదు.

(4) సూక్ష్మదర్శిభిః = 10–11 మంత్రములలో సూక్ష్మముల పరంపర తెలుపబడెను. ఆయాపరంపరలోని అన్నింటని తెలిసికొనశక్తికలవారు సూక్ష్మదర్శులు.

(5) * అగ్ర్యయా = మొదటిది అని ఒకఅర్థము. అనగా అన్నిటికంటె ఉత్తమోత్తమమైనది, తీవ్రమైనది పదనుగలది అని ఒక అర్థము అట్లే ఏకాగ్రతకలది, అనిగూడ అర్థము. సూక్ష్మయా అనగా సూక్ష్మమయినది నిశితమైన కుశాగ్రబుద్ధి ద్వారా అని అర్థము సామాన్యమగుబుద్ధిగాక యోగసాధనచే నిరన్తరకృషిచే నిశితమొనర్చబడిన బుద్ధి తద్ద్వారా పైపాదములో చెప్పబడిన ఆత్మ గూఢత్వమునువీడి దృశ్యతే చూడబడుచున్నది. అగ్ర్యయా మొదటిది అనిచెప్పుటకు ఒకకార

---

* అగ్ర్యయా బుద్ధ్యాసూక్ష్మయా అనిచెప్పినపుడు అగ్రగణ్యమైన అతి నిశితమైన అతిసూక్ష్మమైన బుద్ధిచేత గూఢముగానున్న ఆత్మ చూడబడుచున్నది. అనిచెప్పినపుడు ఈ ఉత్తమబుద్ధి అని చెప్పవచ్చును. అది దివ్యమైనశక్తిఆత్మకుండు ప్రత్యేకలక్షణముఆ శక్తిచేతనే ఆత్మ తన్నుతా తెలిసికొనుచున్నది. భగవద్గీత 10 వ అధ్యాయం 15 వ శ్లోకము చూడవలెను. స్వయమేవాత్మనాత్మానం వేత్థత్వం పురుషోత్తమలో నీవునిన్నే నీ ఆత్మశక్తిచే తెలిసికొనుచున్నావు.

ణము కలదు. శరీరమను రథమును ఆరోహించిన ఆత్మకు లభించిన మొట్టమొదటి ఉపకరణము సారథి బుద్ధియే.

తాత్పర్యము:— పురుషుడని చెప్పబడిన ఈ ఆత్మ సమస్త వస్తు జీవజాలమందు నిగూఢమయి అన్తర్యామియై వర్తిల్లుచున్నది. సామాన్యులకు కనపడుట లేదు. కాని ఎవరు సూక్ష్మ పరంపరలను చూడగల శక్తి సంపాదించిరో వారివలన ఆత్మకు మొదటి ఉపకరణమై నిశితమై సంస్కరింపబడిన బుద్ధి మూలమున ఆ ఆత్మ చూడబడుచున్నది.

౧3 వ మంత్రము శ్రుతిః ౹౹ 13

యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞ
స్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని ।
జ్ఞాన మాత్మని మహతినియచ్ఛే
త్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని ౹౹

ప్రాజ్ఞః = ప్రాజ్ఞుడు; వాక్ = వాక్కును; మనసి = మనసునందు; యచ్ఛేత్ = మగ్నము చేయవలెను, జ్ఞానం = జ్ఞానమును; మహతి + ఆత్మని = గొప్ప ఆత్మ యందు; నియచ్ఛేత్ = పూర్తిగా మగ్నము చేయవలెను, తత్ = దానిని, శాన్త ఆత్మని = శాన్త ఆత్మయందు; యచ్ఛేత్ = మగ్నము చేయవలెను.

విశేషార్థము:— ( 1 ) వాక్ = అనగా వాక్ కాని అది ఒక్కటియే కాదు సర్వేంద్రియములు అని చెప్పవలెను. 4 వ ప్రశ్న 2 వ బ్రాహ్మణములో చెప్పినట్లు " తత్సర్వంపరె దేవె మనసి ఏకీ

భవన్తి" అన్నియు నుత్తమమైన దివ్యమైన మనసులో ఏకీభ
వించి అనగా మగ్నమై పోవును.

(2) జ్ఞానఆత్మని=అనగా బుద్ధియని అర్థముచేయుచున్నారు. మనసును మించినది బుద్ధియని 10 వ మంత్రములో చెప్పబడెను కాన ఇచ్చట జ్ఞానె ఆత్మని అనగా బుద్ధియనియే చెప్పవలెను. ఆత్మయని పదమునకు బుద్ధియనికూడ అర్థముకలదు. ఇచ్చట జ్ఞాన అను పదము విశేషణముగా వాడుటకు కారణమేమన బుద్ధి వివేకమునకు నిలయము తర్క-శక్తి కలది విచక్షణచేయు నైపుణ్యముకలది ఆత్మకు లభ్యమగు మొదటి ఉపకరణ మదియే కాన జ్ఞానె ఆత్మని యనగా బుద్ధియని చెప్పవలెను.

(3) మహతి+ఆత్మని=అనగా జీవాత్మ 10 వ మంత్రములో అట్లే స్థిరపరచబడెను. ఇచ్చటను అట్లే చెప్పవలెను. జ్ఞానము అనగా బుద్ధిని జీవాత్మలో లీనము చేయవలెను.

(4) తత్ = ఇది రెండు పర్యాయములు వచ్చినది. మొదటి పాదములో (పూర్వార్థములో) ఒకమారు, (రెండవపాద ములో) (ఉత్తరార్థములో) నొకమారు, పూర్వార్థములో తత్ అనగా మనస్సును సూచించును. ఉత్తరార్థములో మహాత్మ ఆత్మను సూచించును.

(5) శాన్త ఆత్మని = ఇది పరమాత్మ ఏలయన:- సృష్టి సంబన్ధమైన వ్యాపారములన్నియు నశించిన పిమ్మట ఉండు స్వరూపము మాణ్డూక్యము 7 మంత్రము "ప్రపంచోపశమం" శాన్తం" ప్రపంచమనగా సృష్టి ఉపశమము ఉపసంహారమైన పిదప మిగులునది నిర్గుణనిరాకార పరమాత్మయే.

(6) యచ్ఛేత్ = మగ్నము చేయవలెను. యచ్ఛేత్ అను క్రియ మున్మాఱు నియచ్ఛేత్ అని ఒకమాఱు మొత్తము నాలుగు క్రియలుగలవు. ఇట్లు మగ్నము చేయవలసినవి నాలుగు 1 వాక్ 2 మనస్సు 3 బుద్ధి 4 జీవాత్మ వీనిని వరుసగా మనస్సులోను, బుద్ధిలోను, జీవాత్మలోను, పరమాత్మలోను, మగ్నము చేయవలెను. ఇట్లు చేయగా చివరకు పరమాత్మ మిగులును. ఈ మంత్రమును యింకొక విధమున అన్వయించ వచ్చును. కొంచెము క్లిష్టముగానుండును. అయినను యోచింపతగినది. వాక్కును మనస్సులోను మనస్సును బుద్ధిలోను బుద్ధిని ఆత్మలోను, ఆత్మను హిరణ్యగర్భునిలోను హిరణ్యగర్భుని పరమాత్మలోను మగ్నము చేయవలెను. అప్పుడు 5 మెట్లు యేర్పడును. క్రియలు 4 ఉన్నను 5 వది అధ్యాహారము చేసుకొనవచ్చును. 10–11 మంత్రములలో చెప్పినవి 8 అని యెంచే యెడల, పురుషుడు, అవ్యక్తం, మహత్, జీవాత్మ, బుద్ధి, మనస్సు, ఇన్ద్రియ పరిచయములు, ఇంద్రియములు 8. అవ్యక్తము, మహత్, ఇంద్రియ పరిచయములు విడువబడినట్లూహించవలెను. ఈ లీనమగు విధానము 4 వ ప్రశ్నోపనిషత్తులో కూడ కొంతవరకు ఉదహరించబడినది. 7 వ బ్రాహ్మణములో "తత్సర్వంపరె ఆత్మని సంప్రతిష్ఠన్తి" 9 వ బ్రాహ్మణములో "సపరె అక్షరె ఆత్మని సంప్రతిష్ఠన్తె" 11 వ బ్రాహ్మణములో "ప్రాణాభూతాని సంప్రతిష్ఠన్తి యత్ర" 1 వ బ్రాహ్మణములో "పరెదేవె మనసి సంప్రతిష్ఠన్తె" అచ్చట చెప్పిన వరుస క్రమమునుబట్టి ఇంద్రియములన్నియు మనస్సునందు సుప్రతిష్ఠిత మగును.

మనస్సు, సర్వేంద్రియములు ప్రాణముతో సహా జీవాత్మయందు సంప్రతిష్ఠిత మగును. ఇంద్రియములు ప్రాణములు జీవాత్మ పరమాత్మయందు సంప్రతిష్ఠిత మగును. కాన అచ్చట, ఇచ్చట, చెప్పబడిన విధానము ఒక్కటే పదములలో కొంచెము తేడా కలదు. జ్ఞాన పరిసమాప్తిలో జీవాత్మ యనునది పరమాత్మలో లీనమయి పోవలెను. విడిగా వ్యక్తిత్వముండదు. ముణ్డకము 3-2-8 మంత్రములలోను, 6 వ ప్రశ్న 5 వ బ్రాహ్మణములోను చెప్పిన సంపూర్ణ మగ్నతయే ఇచ్చటను తెలుపబడినది. నచికేతస్సు 1-20 లో అడిగిన ప్రశ్నకు ఇచ్చట ప్రత్యుత్తరముకలదని యెంచవచ్చును. జీవించియుండగా వివిధ దశలలో కర్మసము దాయము, కర్మవాసనలేగాక ఆత్మయనునది ఒకటి యున్న దనియు మరణించిన పిమ్మట ఈ ఆత్మ పరమాత్మలో లీనమయి ఏకత్వము పొందుననియు యీ మన్త్రము తెలుపుచున్నది. ఈ మంత్రము యింకొక సూచన చేయుచున్నది. సమాధిస్థితి పొందువారికి కలిగెడి అనుభవవిధాన మిదియె. ముందు ఇన్ద్రియ ముల నన్నిటిని మనస్సులోనికిని మనస్సును బుద్ధిలోనికిని బుద్ధిని జీవాత్మలోనికిని జీవాత్మ పరమాత్మలోనికిని ఉపసంహరింతురు ఆ ఏకత్వము కలిగినపుడు సమాధియని చెప్పబడును. ఆనందము కలుగును. భగవద్గీత 2 వ అధ్యాయము స్థితప్రజ్ఞని గూర్చి 55 వ శ్లోకములో చెప్పిన ఉత్తమస్థితి యీ మంత్రము ననుసరించియే యున్నది. భగవద్గీత 6 వ అధ్యాయములో యోగమునుగూర్చి చెప్పిన విధానమును దీని ననుసరించియే ఉన్నది 6వ అధ్యాయము 25,26,27 శ్లోకములు చూడవచ్చును.

తాత్పర్యము:— సర్వజ్ఞానేంద్రియ కర్మేంద్రియములను మనస్సులో లీనముచేయవలెను, దానిని బుద్ధిలోను బుద్ధిని జీవాత్మలోను జీవాత్మను పరమాత్మలోను లీనము చేయవలెను. ఇదిజ్ఞానియొక్క కర్తవ్యము. ఇట్లుచేసిన సమాధి యోగమున్ను ఆత్మ బ్రహ్మైకత్వమున్ను నిరతిశయ ఆనందమును కలుగును.

౧౪ వ మంత్రము శ్రుతిః ॥ 14

ఉత్తిష్ఠత జాగ్రత
ప్రాప్యవరాన్నిబోధత !
క్షురస్యధారానిశితాదురత్యయా
దుర్గంపథస్తత్కవయోవదన్తి ॥

ఉత్తిష్ఠత = లెమ్ము, జాగ్రత = మేల్కొనుము; వరాన్ = వరములను; ప్రాప్య = పొంది; నిబోధత = ప్రబోధమొనర్చుకొనుము; అనుభవమొనర్చుకొనుము; నిశితా = వాడిగల; క్షురస్య = కత్తియొక్క; ధారా = అంచు; దురత్యయా = కాలుపెట్టుటకు కష్టమైనది; ( అధ్యా. తత్ = ఆ జ్ఞానమునుకలిగించు ) పథః = మార్గము; దుర్గం = పొందుటకు కష్టమైనది; ఇతి = ఇట్లని; కవయః = వేదాన్తులు,జ్ఞానులు; వదన్తి = చెప్పుచున్నారు.

విశేషార్థము:— ఈ మన్త్రము మృత్యుదేవత నచికేతస్సునకును తన్ముఖమున లోకమునకును తెలిపిన సన్దేశము.

(1) ఉత్తిష్ఠత, జాగ్రత=అజ్ఞానమను నిద్రనుండి మేల్కొనుము, శయ్యనుండిలెమ్ము, జ్ఞానసంపాదనకు నడుముగట్టుము అని హెచ్చరిక కలదు.

(2) ప్రాప్యవరాన్ = వరాన్ అనగా శ్రేష్ఠమైనవి. శ్రేష్ఠమైన ఉపాధ్యాయులను గురువులను అని శ్రీ శంకరులవారు అర్థముచేయుచున్నారు. అట్లుచెప్పవచ్చును. కాని యిచ్చట అది యసందర్భమనవచ్చును. నచికేతస్సుకు మృత్యువు స్వయముగా గురువై బోధించుచున్నాడు. అతడు ఇతరుల యొద్దకు మరలపోనక్కరలేదు. పోవచ్చునని యొకవిధముగ సమాధానము చెప్పవచ్చును. శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించుచున్నను 4 వ అధ్యాయం 34 వ శ్లోకములో జ్ఞానులు నీకుబోధింతురు. తెలిసికొనుము అని చెప్పినట్లుకలదు. అచ్చట అర్జునుడింకను శ్రీకృష్ణుని గురువుగా పూర్తిగా భావించలేదని చెప్పవచ్చును. ఇచ్చట అట్టిసందేహమునకు తావులేదు. కాని మొదటి రెండుపదములు నచికేతస్సుకు ఎట్లువర్తించునని ప్రశ్నించవచ్చును. నచికేతస్సు ఇంకను జ్ఞానికాలేదు. గనుక ఆ హెచ్చరిక న్యాయమనియే చెప్పవచ్చును. కాన వరాన్ అనగా ఉత్తములయిన గురువులనిగాక ఉత్తమమైన జ్ఞానమును తన్మూలమున ఆత్మనుపొంది అని చెప్పవచ్చును. లేదా నీవడిగిన వరములన్నియు పొందినవాడవై నిబోధత తెలుపబడిన అంశమును అనుభవములోనికి తెచ్చుకొనుము. అని మృత్యువు హెచ్చరించినట్లు ఎంచవచ్చును. నిబోధత అనుపదము అట్లు అన్వయమునకు సరిపోవును.

( 3 ) దురత్యయా=అసిధారావ్రతమని సామెత కలదు. పదనుగల కత్తిమీద అడుగిడినపుడుచుట ఆ పదునుచే కాలు కోసుకొనిపోవును. కాన అట్టి నడక అత్యన్త దుర్ఘటము. ఇన్ద్రియాదిజన్యమైన సుఖములను విడచి జ్ఞానమార్గమున పోవుట అత్యన్త కఠినము ఆ సామెత ఈమన్త్రమునుబట్టియే వచ్చినది.

( 4 ) దుర్గమ్=గమ్ అనగా నడచుట పోవుట దుర్గం అనగా పోవుటకు కష్టము. Strait is the way narrow is the gate that leads to heaven and few there be that take to it స్వర్గమునకుపోవు మార్గము ఇరుకైనది వాకిలిచిన్నది. అటుపోవువారు కొద్దిమందియే అని ఏసునాథుడు తెలిపెను. భగవద్గీత 7 వ అధ్యాయము 3 వ శ్లోకములో వేల కొలది మనుజులలో ఎవరోయొకరు నన్ను తెలిసికొన ప్రయత్నింతురు. వారిలో వెయ్యింటికొకరు జయముపొందుదురు అని చెప్పబడినది. 2 వ వల్లి 7 వ మంత్రములోకూడ గురువే అరుదు. శిష్యుడే అరుదు శిష్యత్వముచేసి జ్ఞానము సంపాదించు వాడు మిక్కిలి అరుదని చెప్పబడెను.

తాత్పర్యము:— ఓయీ ! అజ్ఞానమను నిద్రనుండి మేల్కొనుము. నిస్పృహుడవై చతికిలపడక లేచినిలువుము ఉత్తమమైన వరములను (శ్రేష్ఠులయిన గురువులను లేక శ్రేష్ఠమైన జ్ఞానమును ఆత్మను) పొంది బోధను గ్రహించి స్వానుభవములోనికి తెచ్చుకొనుము. పదునైన కత్తియొక్క అంచుమీద అడుగిడుట ఎంతకష్టమో అట్లే ఈ జ్ఞానమార్గము దుర్గమైనది.

లేక దుస్తరమైనది అని జ్ఞానులు చెప్పుచున్నారు. ఏమాత్రము ప్రమాదమురాకుండ జాగరూకుడవై నావలనపొందిన జ్ఞానమును అనుభవైకవేద్యమొనర్చుకొని తత్ఫలితమగు మోక్షమును ఆనందమును అనుభవింపుమా !

౧౫ వ మన్త్రము శ్రుతిః ॥ 15

అశబ్దమస్పర్శమరూప మవ్యయమ్
తథారసం నిత్యమ గన్ధవచ్చయత్ ।
అనాద్యనన్తం మహతఃపరంధ్రువం
నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే ॥

యత్=ఏది; అశబ్దం=శబ్దము లేనిది; అస్పర్శం=స్పర్శ లేనిది, అరూపం = రూపము లేనిది; అవ్యయం = వ్యయము లేక నాశము లేనది; తథా = అట్లే, అరసం=రసము లేనిది, నిత్యం=సర్వదా వర్తమానకాలమందే యుండునది, చ = మరియు, అగన్ధవత్=వాసన లేనిది, అనాద్యనన్తం = ఆది అంతము లేనిది, మహతః = మహత్తుకు, పరం = అతిశయించినది, ధ్రువం = శాశ్వతమైనది, తత్ = దానిని, నిచాయ్య = అనుభవములోనికి తెచ్చుకొనిన, ( సః = వాడు ) మృత్యుముఖాత్=మృత్యువు ముఖమునుండి, ప్రముచ్యతే = విడువబడుచున్నాడు.

విశేషార్థము:— ( 1 ) అశబ్దం అస్పర్శం అరూపం అరసం అగన్ధవత్ = శబ్దము లేదుగనుక చెవి వినలేదు. స్పర్శ లేదు గనుక త్వక్ తాకలేదు. రూపము లేదుగనుక కన్ను చూడ

లేదు. రసము లేదుగనుక నాలుక గ్రహించలేదు. వాసన లేదు గనుక ముక్కుకు గోచరముకాదు. ఇట్లయిదు జ్ఞానేన్ద్రియములకందనిది ఆత్మయని తెలుపబడెను. ఈ వర్ణనము నేతివిధానము అనగా ఇదిగాదని తెలుపు నిషేధవిధానము. ఈశావాస్యము 8 వ మంత్రములో "అకాయమవ్రణం అస్నావిరం అపాపవిద్ధం" అని చెప్పబడినది. అకాయముగనుక కర్మేన్ద్రియ జ్ఞానేంద్రియ అన్తరింద్రియములకు దొరకనిది అని అర్థము. మాండూక్యము 7 వ మంత్రములో "అదృష్టమవ్యవహార్యం అలక్షణం అచిన్త్యం అవ్యపదేశ్యం" అని ఆత్మను నేతిపదములమూలమున వర్ణించిరి. శారీరక మానసిక శక్తుల కందనిది మనమెరిగిన దేనితోడను పోల్చిచెప్పుటకు వీలు లేనిది. ముణ్డకం 1-1-6 "అద్రేశ్యం అగ్రాహ్యం, అగోత్రం అవర్ణం అచక్షుశ్శ్రోత్రం అపాణిపాదం" ఆత్మయని చెప్పబడెను. ఇచ్చటను నేతిపదములమూలముననే చెప్పబడెను. 5 వ ప్రశ్న 7 వ బ్రాహ్మణములో "అజరం అమృతం అభయంపరం" 4 వ ప్రశ్న 10 వ బ్రాహ్మణం "అచ్ఛాయం అశరీరం అలోహితం అక్షరం" అని చెప్పబడినది, అన్నివర్ణనలయొక్క ఫలితము ఒక్కటే. అవ్యాప్తి సృష్టిలోచేరిన ఎవరికిని శారీరక మానసికశక్తులవలన లభించెడిదికాదు. సామాన్యశక్తులకు అందదు. శరీరమునకు మించి ఆత్మకు సహజమైన దివ్యశక్తులను అతీతమైనశక్తులను ఉద్భవింపజేసినపుడే దానిని లభ్యపరచుకొనవచ్చును.

(2) నిత్యం—ధ్రువం - 2 వ వల్లి 18 వ మంత్రము చూడవలెను. అచ్చట శాశ్వతమని చెప్పబడినది. ఇచ్చట ధ్రువమని చెప్పబడినది.

(3) అనాద్యనన్తం=అయ్యది కార్యకారణరూపమును పొందినదికాదు. అయ్యది సృష్టింపబడలేదు. సృష్టింపబడిన వస్తువుకు ఆది అంతము ఉండును. దీనికవి లేవు. అందుచేతనే అవ్యయం అనగా క్షయములేనిది ఏవస్తుసంబన్ధములేనిది.

(4) మహతఃపరం= మహత్తుకుమించినది. ఈ మహత్తనగా సాంఖ్యులుచెప్పెడి అవ్యక్తము లేక ప్రధానముకాదు. మహతః అనగా 10-11 మంత్రములలో చెప్పినట్లే జీవాత్మయని అర్థముచేయవలెను లేదా హిరణ్యాగర్భుడనిచెప్పవచ్చును. ఈ వల్లిలో అంతట ఈ పదమునకు ఒకే యర్థముచెప్పుట భావ్యముగాన జీవాత్మయనియే చెప్పవలెను. జీవాత్మయని చెప్పుటచేత అద్వైతమునకు లోపమురాదు. ఏలయన అజ్ఞానదశచేత తాను జీవాత్మయని భావించునంతవరకు నయ్యది పరమాత్మ కానేరదు. అజ్ఞాననాశనమైనపిమ్మటనే ఆ ఏకత్వము గోచరమగును అనుభవమగును.

(5) మృత్యుముఖాత్ = మృత్యుముఖమునుండి అనగా ఆ జన్మలో కలిగెడి మరణమునుండియు, జనన మరణ రూప సంసారచక్రమునుండియు దానికి హేతుభూతములగు సర్వ విధానములనుండియు.

తాత్పర్యము:— ఏది పంచజ్ఞానేన్ద్రియములకు గ్రాహ్యమగు లక్షణములు లేదో ఏది వస్తుజీవరూపముదాల్చునందున

వృద్ధిక్షయాభివృద్ధులకు బన్ధముకాదో ఏది భూతభవిష్యద్వర్తమాన ములను కాలభేదముల కతీతమో ఏది శాశ్వతమో దేనికి ఆద్యన్తములు లేవో ఏది జీవునికంటె అతీతమో అట్టి ఆత్మను అనుభవైకవేద్యమొనర్చుకొనినవారు. జనన మరణ రూప సంసారచక్రమునుండి దాని హేతుభూతముల నన్నిటినుండి విముక్తులగుచున్నారు.

౧౬ వ మన్త్రము శ్రుతిః ॥ 16

నాచికేత ముపాఖ్యానం
మృత్యుప్రోక్తగ్ం సనాతనం ।
ఉక్త్వాశ్రుత్వాచ మేధావీ
బ్రహ్మలోకే మహీయతే ॥

సనాతనం = అనాదిఅయినదియు, మృత్యుప్రోక్తం = మృత్యువుచే నుపదేశింపబడినదియు, నాచికేతం=నచికేతస్సు సంబన్ధమైనదియునగు, ఉపాఖ్యానం = కధను, ఉక్త్వా=చెప్పి చ = మరియు, శ్రుత్వా = వినిన, మేధావీ = బుద్ధిమన్తుడు, లేక జ్ఞాని, బ్రహ్మలోకె = బ్రహ్మలోకమందు, మహీయతే = ఆనందముపొందును.

విశేషార్థము:— (1) సనాతనం=ఈకధ ఉపనిషత్కాలమునాటిదిగాదు. అంతకుపూర్వకాలమునుండి యున్నదియే. ఆకధ ఎట్లెట్లు మార్పులుపొందెనో పీఠిక చూడవలెను.

(2) ఉక్త్వా (శ్రుత్వా = శ్రుత్వా అనగా విని శ్రేష్ఠుడైన గురువువలన తెలిసికొని ఉక్త్వా అనగా అనుభవజ్ఞుడయి తా నితరులకు బోధించి ప్రచారముచేసి.

(3) మేధావీ = బుద్ధిమన్తుడుగనుక గ్రహించగలడు. బోధించగలడు. ఉత్తమబోధ అనుష్ఠానమేగనుక అనుష్ఠించి జ్ఞానిఅయినవాడు.

(4) మృత్యుప్రోక్తం = మృత్యువువలన నుపదేశింపబడి నది. అన్తియేగాక ఈ ఉపనిషత్తులో వాడబడినభాష తెలుప బడిన భావములు సరియయినవే, అని మృత్యువుయొక్క అంగీ కారమునుబడసి అని అర్థము. వ్యాసప్రోక్తం అనిచెప్పినపుడు రచయిత ఎవరైనను పర్యవసానమున వ్యాసుని ఆమోదమును పొందిన గ్రన్థమని అర్థము అట్లే ఇచ్చటను చెప్పవలెను.

(5) బ్రహ్మలోకే మహీయతే = 2 వ వల్లి 17 వ మంత్ర ములో నీపదములు వాడబడెను. అచ్చటచూడదగును. ఈ మన్త్రిమునుబట్టియు పిమ్మట మంత్రమునుబట్టియు 1-2-3 వల్లులు ఒకభాగమని తెలియనగును. ఈభాగమింతటితో అఖ రగుచున్నది.

తాత్పర్యము:— చిరకాలమునుండి వైదికవాఙ్మయములో చేరియున్న, మృత్యుదేవతచే నుపదేశింపబడిన, జ్ఞానామృత మును కలిగియున్న, భాష, భావము, మృత్యువుచేనా మోదింప బడియున్న, నచికేతో పాఖ్యానమును తెలిపెడి ఈ ఉపనిషత్తును ఉత్తమగురువులవలన బోధపరచుకొని తా ననుభవించి అర్హు లకు బోధించిన బుద్ధిమన్తుడు ఉదారుడు జ్ఞానియగువాడు

బ్రహ్మలోకమున ఆనందమున నోలలాడును.

౧౭ వ మన్త్రము శ్రుతిః ॥ 17

యఇమం పరమంగుహ్యం
శ్రావయే ద్బ్రహ్మసంసది ।
ప్రయత శ్శ్రాద్ధకాలేవా
తదానన్త్యాయ కల్పతె
తదానన్త్యాయ కల్పతెఇతి ॥

యః = ఎవరు; ప్రయతః = పవిత్రుడై, తన్మయుడై; పరమం = అత్యన్త శ్రేష్ఠమైన; గుహ్యం = రహస్యమైన ఇమం = దీనిని; బ్రహ్మసంసది = బ్రాహ్మణగోష్ఠియందు; వా = లేదా; శ్రాద్ధకాలె = శ్రాద్ధములుపెట్టు సమయమున; శ్రావయేత్ = వినిపించునో; తత్ = ఆ; పురుషః = పురుషుడు; ఆనన్త్యాయ = మోక్షమునకు, కల్పతె = అర్హుడగుచున్నాడు, ఇతి = ఇట్లని, ( తెలిసికొనవలెను )

విశేషార్థము:— ( 1 ) శ్రావయేత్ = వినిపించుట గ్రన్థమును చదివి వినిపించుటయేగాక దాని అర్థమును బోధించుట దానిరహస్యమును దెలుపుట పైమంత్రములో ఉక్త్వా = బోధించుట లేక ప్రచారముచేయుట అని చెప్పబడెను. అందులో నొకభాగమిది.

చెప్పు ఫలితము అతనికే కలుగవలెను. కాన తత్ అనగా "ఆ" అనిచెప్పి వక్తా లేక పురుషుడు అనుపదము అధ్యాహారము చేయవలెను. భగవద్గీత 18 వ అధ్యాయము 68 వ శ్లోకములో ఈ పరమగుహ్యమైన రహస్యమును బోధించినవాడు నన్నే చేరు నని తెలుపబడెను.

(7) ఆనన్త్యాయ = ఆనన్త్యం అనుపదము 2 వల్లి 11 వ మంత్రములో కలదు. అచ్చట చూడవలెను భగవద్గీత 18 వ అధ్యాయము 68-69-70-71 శ్లోకములు చూచినయెడలబోధ కుడును శ్రోతలునుకూడ పరమాత్మనుచేరుదురని చెప్పబడెను. ఇచ్చటను అట్లేఅన్వయించవలెను. కాని అధికమైనబహుమాన మును మాత్రము పొందునని చెప్పుట భావ్యముకాదు.

తాత్పర్యము:— ఎవడు ఈ ఉపాఖ్యానములో తెలిపిన ఉత్తమరహస్యమైన జ్ఞానమును అనుభవమొనర్చుకొని పుణ్య పురుషుడై తన్మయుడై జిజ్ఞాసువులు జ్ఞానులు ఉభయులుగల మహాపరిషత్తులో దీనిని వినిపించి వ్యాఖ్యానమొనర్చి బోధిం చునో లేదా శ్రాద్ధకాలమందు అట్లు చేయునో అట్టిపురుషుడు ఆ మహాత్కార్యమువలనగూడ ఉత్తమగతి అనగా మోక్ష మును పొందుటకు అర్హుడగుచున్నాడు. నిశ్చయము.

ఇతి తృతీయవల్లీ సమాప్తా

ద్వితీయోఽధ్యాయః ప్రథమవల్లీ – 4 చతుర్థీ - వల్లీ-

౧వ మన్త్రము శ్రుతిః ॥ 1

పరాఞ్చిఖానివ్యతృణ త్స్వయంభూ
స్తస్మాత్పరాఙ్ పశ్యతినాన్తరాత్మన్ ।
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షదా
వృత్తచక్షు రమృతత్వమిచ్ఛన్ ॥

స్వయంభూః = తానంతటతానే ఏర్పడినవాడు, ( వ్యక్తమైనవాడు ) ఖాని=ద్వారములను, పరాఞ్చి=బయటకుపోవునట్లు, వ్యతృణత్=హింసించెను, తస్మాత్=కాన, పరాఙ్ = బయటవిషయములను, పశ్యతి = చూచును, నాంతరాత్మన్=లోపల ఆత్మనుచూడడు, కశ్చిత్=ఎవరోఒకరు, ధీరః=ధీరుడు లేక జ్ఞాని, అమృతత్వం=మోక్షమును, ఇఛ్ఛన్=కోరుచున్నవాడై, ఆవృత్తచక్షుః ఆవృత్త = అన్తర్ముఖనుచేయబడిన లేక లోపలకు మరల్చబడిన, చక్షుః=కన్నులతో, ప్రత్యగాత్మానం = అన్తరాత్మను, ఐక్షత్=చూచెను చూచుచున్నాడు.

* విశేషార్థము:— ( 1 ) స్వయంభూః=భూ అనగా అగుట

* "తత్సోవై సదజాయత. తదాత్మానగ్ం స్వయమకురుత.

అది తనంతట తానె సత్తుఅయ్యెను కాన స్వయంభూః స్వయముగా నిరాకారుడయ్యెను. స్వయముగానే సాకారుడయ్యెను. లోకవిషయములను, లోకభోగములను, సంపూర్ణముగా విసర్జించినపుడే ఈ ఇన్ద్రియములు అన్తర్ముఖములగును. దారైషణ, ధనైషణ, లోకైషణలు పోయి మోక్షైషణపొందినపుడే ఆన్తరాత్మను చూచుశక్తికలుగును.

స్వయం=తానే, తానెఅయినవాడు అనగా నొరులచే సృజింప బడలేదు. ఒరులచే వ్యక్తపరచబడలేదు. అందుచే ఆయన సర్వస్వతంత్రుడు. తైత్తిరీయము 2 వ అధ్యాయం 7 వ అను వాకము " అసద్వా ఇదమగ్రఆసీత్ " అసత్తు మొట్టమొదట సృష్టికి పూర్వము ఉండెను. ఇందులోనె 1 అధ్యాయం 2 వ వల్లి 18 వ మంత్రము " కుతశ్చిన్నబభూవకశ్చిత్ " ఎవరివల నను ఏదిగాను ఏర్పడలేదు.

( 2 ) ఖాని=అనగా రంధ్రములు అదిగలది శరీరము. ఖాని అనగా అవయవములని అర్థము. అవిశరీరమునకు ద్వారములు అందుకనియే దీనికి నవద్వారపురియని పేరు భగవద్గీత 5 వ అధ్యాయం 13 వ శ్లోకము "నవద్వారెపురెదేహీ" నవద్వార పురియని చెప్పబడుచున్నది. తొమ్మిది వాకిళ్లుగల నగరమందు నిలిచియున్న ఆత్మ.

( 3 ) వ్యతృణత్ = హింసించెను. లేదా లోపముతో సృజించెను. అనగా ఆయా ఇంద్రియముల పుట్టుకతోనె బాహ్య స్పర్శ, లేక బాహ్యప్రజ్ఞకలవి. మాణ్డూక్యము 3 వ మంత్రము " జాగరితస్థానో బహిఃప్రజ్ఞః " జాగ్రదవస్థయందున్నపుడు ఇన్ద్రియములు బయటనుండు విషయములపై ప్రసరించుచుండును. ఇది ఇంద్రియముల స్వభావమని అర్థము. శ్రీ అరవిందయోగి ఈవ్యతృణత్ అను పదమునకు ఇంద్రియ ద్వారములను బయటకు దొలిచెను. బయటకు నెట్టెను అనునట్లు అని అనువదించెను అనగా బయటకు నెట్టెనని చెప్పవచ్చును.

(4) * పరాక్ పశ్యతి=పరాక్ అనగా బయటనున్నది. అనగా బయటనున్న వస్తువులను అని ఒక అర్థము చెప్పవచ్చును. వస్తువుల వెలుపలి రూపము మాత్రమే అని ఇంకొక అర్థము చెప్పవచ్చును. బయట చూచుటలోకూడ ఆయా వస్తువులలో అన్తర్లీనమగు ఆత్మను చూడక వాని బాహ్య నామరూపములను మాత్రమే గ్రహించు శక్తికలవి.

(5) * అన్తరాత్మన్ = ప్రత్యగాత్మన్ = లోపలనున్న ఆత్మ జీవాత్మ అని చెప్పవలెను. రెండు పదములకును ఒకటే అర్థము. ప్రత్యగాత్మయనగా లోకవిషయములను సంపూర్ణముగా తెలిసి

---

* పరా = బయటకు, అంచి = పోవునది ఆత్మయనుపదమునకు శ్రీ శంకరులవారు వ్యుత్పత్త్యర్థ మిచ్చుచున్నారు. శ్లో॥ యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ । యచ్చాస్య సంతతో భావః తస్మాదాత్మేతికీర్త్యతే

( 1 ) ఇదియన్నిటిలోను వ్యాపించును.

( 2 ) ఇది అన్నిటిని గ్రహించును.

( 3 ) ఇన్ని విషయములను భోగించును.

( 4 ) సర్వదా సద్భావముకలిగి యుండుటచే కాన ఆత్మ కేనోపనిషత్తులో 1 ఖండము 3-4-5-6-7-8 మంత్రములలో ఎట్లిన్ద్రియములు ఆత్మను గ్రహించలేవో చెప్పబడెను. 3 వ ఖండములో ఎదుటనున్న యక్షుని గూడ గ్రహించలేకపోయెను. తానసే శరీరముయొక్క యిన్ద్రియములయినను నందులోనుండు ఆత్మను కనుగొనలేకపోవుటయేగాక ఆ యింద్రియముల పన్నాలోనుండు శరీరములోనున్న ఆత్మనుగూడ కనిపెట్టజాలవు ఇది ఇన్ద్రియముల సామాన్యమయిన స్వాభావికమయినస్థితి. ఎప్పుడాత్మజ్ఞానముద్భవిల్లునో యప్పటినుంచి ఈ ఇంద్రియములుకూడ ఆత్మను గ్రాహ్యమొనర్చుకొనును.

కొన గలుగు శక్తికలది. అని శ్రీ శంకరులవారు తెలుపుచున్నారు. అందుకనే ఆత్మకు సర్వదిృష్టయని పేరు కలదు. బృహదారణ్యకములో 2-4-14 "విజ్ఞాతారం అరె కేన విజానీయాత్" తెలిసికొనునది అదియే దానిని ఎవరు ఏ సాధనలతో తెలిసికొన గలరు.

(6) అమృతత్వమిచ్ఛన్ = మరణరహితమైన స్థితిని అనగా మోక్షమును జీవన్ముక్తిని కోరువాడు కనుక జిజ్ఞాసువని చెప్పవచ్చును. మోక్షార్థియయినప్పటినుండి దీనినిజూచుశక్తి అనగా ఆత్మను జూచుశక్తి యలవడుచుండును.

(7) ఆవృత్తచక్షుః = అనగా మరల్పబడిన కన్నులు. ఇచ్చట కన్నులు ఒక్కటియేగాక యింద్రియములన్నియునని కూడ జెప్పవచ్చును. ఈ యిన్ద్రియములు బాహ్యాపేక్షయే కలిగి యున్నపుడు ఆత్మను జూడలేవు. 1 వ అధ్యాయము 3 వ వల్లి 15 వ మంత్రము, అశబ్దం అస్పర్శం మొదలగునవి చూడవలెను. ఈ చక్షుస్సులు ఆవృతములయినపుడు ఇవి దివ్యశక్తులగును. "యచ్ఛేద్వాఙ్మనసీ" 1 వ అధ్యాయము 3 వ వల్లి 13 వ మంత్రము మనసులో మునిగిన ఇంద్రియములు బుద్ధిలో మునిగిన మనసు జీవునిలోమునిగిన బుద్ధికలవాడు పరమాత్మలో ప్రవేశించి చూడగలడు. అందుకనియే మాణ్డూక్యము 12 వ మంత్రములో "సంవిశతి ఆత్మనా ఆత్మానం" ఆత్మ ఆత్మలో ప్రవేశించును. అని చెప్పబడెను. మరల్చబడిన అనగా యచ్ఛేత్ అని 1-3-13 లో చెప్పిన అర్థమే చెప్పవలెను.

(8) ఐక్షత్ = చూచెను, అనగా నీ కన్నులతో చూచె నని యర్థముకాదు, పరమాత్మను ఆత్మశక్తిచేత దర్శించెనని యర్థము. "దృశ్యతే త్వగ్ర్యయాబుద్ధ్యా" అని 1-3-12 మంత్రము తెలుపుచున్నది. అట్టి యతీత శక్తిచేతనే చూచెనని యిక్కడను జెప్పవలెను. ఇది భూతకాల క్రియకాని వర్తమాన కాలమందలి యర్థమే యిచ్చును, ఛన్దస్సునందు కాల నియమము లేదు.

తాత్పర్యము:— స్వయంభువు, సర్వస్వతంత్రుడు, అగు పరమాత్మ జీవాత్మ నివసించెడి దేహములోని ఇంద్రియ ద్వారములను బయటకు వెల్వరించెను. కాన నవి బాహ్యవస్తువులనే గ్రహించును, ఆ వస్తువులలోగూడ వాని బాహ్య నామరూపములనే గ్రహించును, వాని యన్తస్తత్త్వమును గ్రహించ జాలవు. అట్లే దేహములోనున్న అంతరాత్మను గ్రహించ జాలవు. ఇది యింద్రియములకు స్వభావసిద్ధముగా నేర్పడిన లోటుకాని యే కొలదిమందియో ధీరులు దారైషణ, ధనైషణ, లోకైషణలను వదలి మోక్షైషణకలవారై యన్తర్ముఖులగుచు నింద్రియములను లోకమునుండి యుపసంహరించి జీవాత్మలో నిలిపి లీనము చేతురు. అప్పుడు వారు జీవాత్మను సాక్షాత్కార మొనర్చుకొందురు. అప్పుడు పరమాత్మయు ప్రత్యక్షమగును, రెండును ఒక్కటేయని యనుభూతమగును,

౨ వ మంత్రము శ్రుతిః ॥ ౨

పరాచః కామానను యన్తి బాలా
స్తె మృత్యోర్యన్తి వితతస్య పాశమ్
అథధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువమధ్రువేష్విహ నప్రార్థయన్తె ॥

బాలాః = బాలురు; పరాచః=బయటనుండు; కామాన్= కామములను; అనుయన్తి = వెంటాడిపోవుదురు; మృత్యోః= మృత్యువుయొక్క; వితతస్య = విరవిగాపరచబడిన; పాశం= పాశము లేక వలయందు; యన్తి = పడుదురు; పోవుదురు; అథ = ఇపుడు, ఇహ = ఈ లోకములో లేక ఈ శరీరములో; అధ్రువేషు = అధ్రువములమధ్య, ధ్రువం = శాశ్వతమయిన దానిని; అమృతత్వం= మోక్షమును; విదిత్వా = తెలిసి; నప్రార్థయన్తె = ప్రార్థించరు.

విశేషార్థము:— (1) పరాచః = బయటకు పోవునవి, బయటనున్నవి. ఇంద్రియముల నాకర్షించునవి, విషయములు.

(2) బాలాః = బాలురు. వయస్సులో బాలురనియర్థము కాదు. జ్ఞానములో నభివృద్ధి పొందనివారని యర్థము. 1-2-5 వ మంత్రములో జెప్పబడిన మూఢాః వీరును ఒకటే, ముణ్డకం 1-2-9 "అభిమన్యన్తి బాలాః" బాలురు తలంతురు. అజ్ఞాన కారణము వలననే బాలురుగా పరిగణింపబడిరి.

(3) అనుయన్తి=అనుసరించి పోవుదురు. వెంటపడుదురు గీత 2 వ అధ్యాయం 67 వ శ్లోకము ఇంద్రియముల వెంటబడు మనస్సు అపకారము చేయును. ఓరుగాలి పడవను ముంచినట్లు ముంచును. 1–3–7 మంత్రము ఇంద్రియములననుసరించి పోవు వాడు, సంసారమునే పొందును.

(4) మృత్యోః= మృత్యువనగా జన్మము, మరణము, జాడ్యము వృద్ధత్వము మొదలగు పరివర్తనములన్నియు.

(5) ధ్రువం అధ్రువేషు= 1-2-22 "అనవస్థేష్వవస్థితమ్" అనునట్లు అధ్రువములమధ్య ధ్రువం అధ్రువములలోని ధ్రువం అధ్రువములలో నన్తర్లీనమయిన ధ్రువమయిన ఆత్మతత్వము అనగా సకల జీవజాలములోను వస్తుజాలములోను అన్తర్లీన మయిన ఆత్మతత్వమును 1-2–10 "అధ్రువైః ధ్రువః" ధ్రువ మనగా పరమాత్మయే. అవి నివసించు శరీరములన్నియు అధ్రువములు అది పొందు నామరూపములన్నియు నధ్రువ ములు Nonessentials అముఖ్యములగునవి.

(6) ఇహ=ఈలోకములోనె ఈశరీరములోనె మరణము నకుపూర్వమే ఈ ధ్రువమును విదిత్వా తెలిసికొని బృహదా రణ్యకము 4-4-23 మన్త్రము "నకర్మణావర్ధతె నోకనీయాన్" కర్మవలన హెచ్చక తగ్గక యుండు ధ్రువమైనతత్వము.

(7) * నప్రార్థయన్తే = కోర్కెలను కోరరు అని యర్థము చెప్పుచున్నారు. అధ్రువములను కోరరు అని అర్థము చెప్పుచు న్నారు. అధ్రువేషు అనుపదము వాడబడినది. ఇచ్చట అది కర్మ కానేరదు. ఈ వల్లి మొదటిమంత్రములో "అమృతత్వ మిచ్ఛన్" అమృతత్వమును కోరుచు అనిచెప్పఁబడెను. ఇచ్చట అమృతత్వంవిదిత్వా, ఆ కోరిన అమృతత్వమును తెలిసికొని అనుభవించినపిమ్మట వారికి కోరికలుండవు. ముణ్డకం 3-2-2 "ఇహైవసర్వేప్రవిలీయన్తికామాః" ఇచ్చటనే ఈ జీవితము లోనె కామములన్నియు లయమొందునుకాన కోరికయే పుట్ట చాలదు. నప్రార్థయన్తే అనగా కోరరు అనిగాక ప్రార్థించరు అనియె అర్థముచెప్పవచ్చును. తమలోను లోకములోను నున్న అనశ్వరములగు నామరూపధారులలో నున్న ఏకమైన అఖండ మైన ధ్రువమైన పదార్థమును తెలిసికొన్నారు గనుక తమ కంటె భిన్నమైనదే లేదుగనుక వారు ఎవరిని దేనినైనకూడ ప్రార్థించజాలరు.

---

* అమృతత్వమే ఈ నశ్వరలోకములోనికెల్ల ధ్రువమని తెలిసికొని అని శ్రీ శంకరులవారు అన్వయించిరి. అట్లును చెప్పవచ్చును కాని క్లియిచ్చట అన్వయమే మేలు. సకలలోకమునందున్న స్థిరపదార్థమును తెలిసికొని అని అర్థమగును. అపుడు తనలోను విశ్వములోను ఒక్కటే శాశ్వతపదార్థ మున్నదని స్థిరమగును.

భగవద్గీత 13 అ. 27 వ శ్లోకము "వినశ్యత్స్వవినశ్యన్తంయఃపశ్యతి సపశ్యతి" నశించేవానియందు నశించనిదానిని చూచువాడు నిజముగా జూచువాడు.

తాత్పర్యము:— అల్పజ్ఞులు లోకవిషయములందుండెడి కామములను అనుసరించి పోవుచు మృత్యుదేవతచే పరచబడిన విస్తారమైనవలలో లేక సంకెళ్లలో చిక్కుకొందురు. కాని ఈ లోకములోనుండెడి నశ్వరపదార్థములలో అన్తర్లీనమైయున్న అనశ్వరమును అమృతత్వమును ప్రబోధమొనర్చుకొనిన ధీరులు దేనిని కోరరు. వారి కోరికలన్నియు లయమై పోయినవి. తమకంటె భిన్నమైనది లేదుగనుక వారు దేనిని దేనికొఱకు ప్రార్థించజాలరు.

3 వ మంత్రము శ్రుతిః ౪।౩

యేనరూపం రసం గన్ధం
శబ్దాన్ స్పర్శాగ్శ్చ మైథునాన్
ఏతేనైవ విజానాతి
కిమత్ర పరిశిష్యతే; ఏతద్వైతత్ ॥

యేన = దేనిచేత; రూపం = రూపమును; రసం = రసమును, గన్ధం = వాసనను; శబ్దాన్ = శబ్దములను; స్పర్శాన్ = స్పర్శలను, చ = మరియు; ఏతేన = దేనిచేత; మైథునాన్ = మైథునసంబన్ధమగు సుఖములను; ఏవ = నిక్కముగా; విజానాతి = తెలిసికొనుచున్నది; ఏతత్ = ఇది, తత్ = అది; వై = నిశ్చయము, అత్ర = ఇచ్చట; కిం = ఏది; పరిశిష్యతే = మిగులుచున్నది.

విశేషార్థము:— (1) అత్ర = ఇచ్చట ఈ లోకమందు, ఈ శరీరమందు.

(2) పరిశిష్యతే = మిగులుచున్నది. ఒకదానినుండి మరి యొకటికి భేదమున్నట్లు గమనించుచున్నది. లేక వివేకించు చున్నది. అనికూడ నర్థము కలదు. ఇదిగాక ఇట్లు వివేకించ గలది ఏది కలదు? ఇంకేమి మిగులుచున్నది? అని రెండువిధము లుగా చెప్పవచ్చును. ఈ ఆత్మకు అవిజ్ఞేయమైనది అనగా తెలియనిది ఏది కలదు అని శ్రీ శంకరులవారు అన్వయించిరి. అప్పుడు పరిశిష్యతే అనగా మిగులును అని అర్థము చెప్పవలెను. భిన్నములుగా కనపడు విషయములను భిన్నముగా కనపడు ఇన్ద్రియములద్వారా గ్రాహ్యమొనర్చుకొనుచున్నది గనుక దానికి గ్రాహ్యముకాని విషయము ఉండచాలదని యపుడన్వ యించవలెను. కింపరిశిష్యతే ఏది వివేకించును? ఏది భేదము లను కనుగొనును? ఆత్మకన్న వేరైనది యిట్టి శక్తికలది యీ లోకమున యింకేమికలదు? అనగా ఆత్మ ఒకటే లోకములోని విషయములను గ్రహించగలది. విషయముల విషయములమధ్య గలభేదమును భిన్నత్వమును గ్రహించగలది. ఇంద్రియ జనిత పరి చయ భావములను వాని వాని విశేష లక్షణములతో కూడ గ్రహించగలది, ఆత్మయే యీ లోకమంతటిలో గ్రహణశక్తి యెచ్చటనున్నను అది ఆత్మవలననే కలుగుచున్నది. ఐతరే యము 3 అ. 1 ఖండము 4 వ మంత్రము. "సర్వంతత్ ప్రజ్ఞా నేత్రం ప్రజ్ఞానె ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ" అనగా యీ ప్రజ్ఞానమే లోకమునంతను

గ్రహించగలది. దాని పేరే చిత్ ఆత్మ చిద్రూపి అది యే గ్రహించగలది, ఆ చిత్ ఎక్కడ శూన్యమో లేక స్వల్పమో అచ్చట గ్రహణశక్తి అంతమాత్రమే యుండును. ఇదియే భావము బృహదారణ్యకములో గలదు. కేనోపనిషత్తు 1 వ ఖండం ౫ మంత్రము "తదేవ బ్రహ్మత్వం విద్ధి" అని చెప్పిన భావమునిదియె అనగా ఆ యే యే ఇంద్రియములకు ఆ యే యే గ్రహణశక్తి యెవరిచే నొసంగబడెనో ఏయే ఇంద్రియమును ఏది గ్రాహ్య మొనర్చుకొనునో అదియె బ్రహ్మ.

(౩) రూపం రసం ——— స్పర్శాన్ = ఇవన్నియు జ్ఞానేద్రియములచే గాహ్యములగు విషయములు. 1-3-15 వ మంత్రము లో ఆత్మ జ్ఞానేంద్రియముల కతీతమని చెప్పబడెను. ఆ జ్ఞానేంద్రియములకు గ్రహణశక్తి దీనివలననే ఆనుగ్రహింపబడుచున్నదని యిచ్చట తెలుపబడినది.

(4) మైథునాన్ = మిథునము అనగా జంట ఒక స్త్రీ ఒక పురుషుడు. అట్టి జంట సంబన్ధమైన కర్మ మైథునము ఆ సంబన్ధము ద్వారా కలిగెడి సుఖము లోకములో నింద్రియజనితమగు సుఖములలోనికెల్ల నాకర్షవన్తమయినదని భావము కలదు. ఆ సుఖమునకే ఆనన్దమను పదముకూడ వాడబడుచున్నది. 4 వ ప్రశ్న 8 వ బ్రాహ్మణము- "ఉపస్థశ్చ ఆనన్దయితవ్యంచ" అని వాడబడినది. అట్లే 2 వ బ్రాహ్మణములో కూడ ఆనన్దయతె అనే పదమే స్త్రీ పురుష సంపర్కమునుగూర్చి వాడబడెను. ఈ కర్మగాని దీనివలన కలిగెడి సుఖముకాని గ్రహించెడి శక్తి ఆత్మవలననే కలుగుచున్నది. ఇచ్చట మైథునాన్ అని

చెప్పుటచేత కర్మేంద్రియములన్నియు పలుకరించబడుచున్నవే ఎంచవలెను.

(5) ఏవ = నిక్కము అని అర్థము కలదు. మాత్రమే అని కూడ నర్థము కలదు. రెండును పొసగును. మాత్రమే అని యేనతోను అర్థము చేసేయెడల ఏతేనతోను కలుపవలెను. దీనిచే మాత్రమే అని అర్థమగును. ఏతేన-యేన రెంను ఆత్మకే వర్తించుచున్నట్లు శ్రీ శంకరులవారు అన్వయించిరి ఆ యన్వయమే యిచ్చట అనుసరింపబడెను. మరికొందఱు ఏతేన + ఏవ ఇవి రెండును జీవునకనియు యేన అనగా ఏ పరమాత్మచేత ననియు నర్థము చేయుచున్నారు. యేన - ఏతేన - రెండును ఆత్మకే వర్తింపజేయుటయే మేలు.

(6) తత్ = అది, ఏతత్ = ఇది, ఇది మానవశరీరములో నుండి పైన తెలిపిన కర్మేన్ద్రియ జ్ఞానేంద్రియములద్వారా లోక విషయములను గ్రహించునది. తత్ = అది అనగా ఆత్మ నచికేతస్సు ప్రశ్నించినది. 2 అ. 4 వ వల్లి 3 వ మంత్రములో ఏతద్వైతత్ = అనగా ఇది అదియే అనగా యీ ఆత్మయే పరమాత్మ "అయమాత్మా బ్రహ్మ" యని మహావాక్యము 2 వ బ్రాహ్మణములో చెప్పిన విషయమే దీనివలన బోధితమగుచున్న దని యెంచవచ్చును. "తత్త్వమసి" నీవు అది అగుచున్నావు, అన్న భావమే యిచ్చట స్ఫురించుచున్నది.

(7) విజానాతి = తెలిసికొనుచున్నాడు మానవుడు అను కర్త అధ్యాహార్యము.

తాత్పర్యము:— రూపము- రసము, గంధము, శబ్దము స్పర్శము దేనిచేతమాత్రమే నిక్కముగా మానవుడు తెలిసి కొనుచున్నాడో మైథునము మొదలగు కర్మేంద్రియ వ్యాపారము లన్నియు దేనిచేత మాత్రమే నిక్కముగా మానవుడు గ్రహించుచున్నాడో అదియే ఇది నిశ్చయము, అట్లు గ్రహించెడిది ఆత్మగాక మరి ఏది కలదు. ఈ లోకములోని వస్తువులను అది గ్రహించగలదు దానికి గ్రాహ్యము కానిది యేది యీ లోకములో కలదు?

౪ వ మంత్రము శ్రుతిః ॥ 4

స్వప్నాన్తం జాగరితాన్తం
చోభౌ యేనాను పశ్యతి ।
మహాన్తం విభుమాత్మానం
మత్వాధీరో నశోచతి ॥

స్వప్నాన్తం = స్వప్నావస్థయందును; చ = మరియు, జాగరితాన్తం = జాగరితావస్థయందును, ఉభౌ = రెంటి యందును, యేన = దేనిచేత; అనుపశ్యతి=చూచుచున్నాడు; తం = అట్టి; మహాన్తం = గొప్పదియగు; విభుం = సర్వవ్యాపి యగు; ఆత్మానం = ఆత్మను; మత్వా = అనుభవమొనర్చు కొనిన; ధీరః = జ్ఞాని; నశోచతి = దుఃఖించడు.

విశేషార్థము:— (1) స్వప్నాన్తం జాగరితాన్తం = స్వప్న + అన్తం=అనగాచివర, స్వప్నము మొదలిడి అన్తమగు

వరకు నేయే విషయములు గ్రాహ్యములగుచున్నవో యవి అన్నియునని యర్థము. అట్లే జాగరితావస్థ మొదలు అంతము వరకు గ్రాహ్యమగు విషయములు ఉభౌ=ఈ రెంటిలో గ్రాహ్యమగు సమస్త విషయములు అనగా జాగరితావస్థలోనే వైశ్వానర నామకునిచేత దెలియబడుచున్నవో [మాణ్డూక్యము ] స్వప్నావస్థలో ఏ తైజస నామకునిచే తెలియబడుచున్నవో [మాణ్డూక్యము 4] ఈ రెంటియందునుండు తైజస వైశ్వానర నామకులు ఇద్దఱు ఒక్కరేయని యర్థము. ఇచ్చట ప్రాజ్ఞుని స్థితి గాఢనిద్రస్థితి, తెలుపబడ లేదు, అచ్చట లోకవిషయములు గ్రహింపఁబడవు. జాగ్రత్స్వప్నావస్థలందువలెనే అని అన్వయించ వచ్చును. లేదా జాగ్రదవస్థనుండి స్వప్నావస్థను పొందిన పిమ్మట గాఢనిద్రపొంది తిరిగి జాగ్రదవస్థను యకాయకీని లేదా మధ్య మజిలీలతోనో చేరవచ్చును. అట్లన్వయించిన యెడల మూడవస్థలలోని సర్వవిషయములను ఆత్మవలననే గ్రహించబడుచున్నవని అర్థము.

(2) అనుపశ్యతి = చూచుచున్నాడు మానవుడు అను కర్త అధ్యాహార్యము. అను ఉపసర్గము వాడుట వలన బాగుగ గ్రహించుచున్నాడని అర్థము పశ్యతి అను పదమునకు చూచుటయను అర్థమయినను గ్రాహ్యమొనర్చుకొనుట యనియే చెప్పవలెను. సర్వేన్ద్రియ వ్యాపారమిమిడియున్నట్లే యెంచవలెను.

(3) మహాన్తం = 1-2-22 వ మంత్రములో 2 వ పాదమున్ను ఇందులో రెండవపాదమున్ను ఒకటే. యచ్చట విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము:— జాగరతావస్థయందును, స్వప్నావస్థయందును ఈ రెండవస్థలయందును దేని చేత విషయములకు గ్రహణశక్తి యెవరిచే గలుగుచున్నదో యట్టి యన్నిటికి మించినదై సర్వవ్యాపియయి పరిపాలకుడైన ఆత్మను వేద్యమొనర్చుకొనిన జ్ఞాని శోకరహితుడగుచున్నాడు.

౫ వ మన్త్రము శ్రుతిః ॥ 5 ॥

యఇమం మధ్వాదం వేద
ఆత్మానం జీవమన్తికాత్ ।
ఈశానం భూతభవ్యస్య
నతతో విజుగుప్సతే; ఏతద్వైతత్ ॥

యః=ఎవడు, ఇమం=ఈ, మధ్వాదం = ఆనన్ధభోక్తయను, జీవం = జీవాత్మను, అన్తికాత్ = సమీపమందుండే, భూతభవ్యస్య = గత, రానున్న కాలములకు (సృష్టికి) ఈశానం=ప్రభువగు, ఆత్మానం=ఆత్మను, వేద=అనుభవ వేద్యమొనర్చుకొనునో (సః=అట్టివాడు) తతః=అందువలన, పిమ్మట, నవిజుగుప్సతే=ఏవగించడు, జంకడు ఏతద్వైతత్ ఇదియే దేనిశ్చయము

విశేషార్థము:— (1) మధ్వాదం=మధువు అనగా తేనె అదం అనగా తినువాడు కర్మఫలభోక్తయని జీవాత్మను శ్రీ

శంకరులవారు అన్వయించుచున్నారు. Eater of the honey of existence జీవితమనే తేనెను భుజించువాడు. అనగా జీవించుట తేనెవలె రుచికరమనియు అట్లు జీవించ కోరిక కలవాడనియు అర్థము. మధు అను పదమునకు తియ్యతనము అని యర్థము సోమరసమని యర్థము కాన సంతోషము ఆనందము అని చెప్పవచ్చును. ఆత్మ ఆనందరూపుడు గాన మధ్వదమనగా ఆనన్దరూపి లేక ఆనన్దానుభవముకలవాడు అని చెప్పవచ్చును.

(2) జీవం = అనగా జీవాత్మ అట్లుగాక జీవమును, ప్రాణాదికమును కల్పించువాడని యర్థము చేయుచున్నారు. అట్లును చెప్పవచ్చును. కాని జీవాత్మయని చెప్పుటమేలు 1-3-1 లో హృదయగుహాలో ప్రవేశించిన యిద్దరిలో నొకరు జీవాత్మయనియు నొకరు పరమాత్మయనియు నిశ్చయించ బడెను. కాన ఇచ్చట జీవమన్తికాత్ = జీవాత్మకు సమీప మందున్నట్టి అని చెప్పినయెడల హృదయగుహాలో తనయొద్దనే యున్నదానిని తెలిసికొనవలెనని యర్థమగును. కురానులో Nearer than your jreggrelar vain అని చెప్పబడి యున్నది. కంఠరక్తనాళముకంటె సమీపమందున్నది.

(3) భూతభవ్యస్య=గతకాలము రానున్నకాలము ఇప్పటి ప్రస్తుతకాలముకూడ చెప్పవచ్చును. అనగా సర్వకాలమునకు అధిపతి. కాలమేగాక, గతసృష్టికి రానున్న సృష్టికికూడ అని యర్థము చెప్పవచ్చును. శ్రీ అరవిన్దయోగి అట్లే అన్వయించిరి. దీనికి ఈశానం ప్రభువు ఇట్టిప్రభువు ఆత్మానం. ఆత్మయనగా

హృదయగుహలోనున్న జీవాత్మ తనప్రక్కనున్నదానిని ఆత్మగాను లోకేశుడుగాను ఆనన్దరూపిగాను వేద్యమొనర్చుకొనవలెను. ముణ్డకం 3-1-2 ఎప్పుడిట్లు వేద్యమొనర్చుకొనునో అప్పుడు జుష్టం తృప్తి పొందును. వీతశోకః దుఃఖరహితుడగును. ముణ్డకం 3-1-3 "పుణ్యాపాపె విధూయ" పుణ్యాపాపముల నుండి విడివడును. "పరమం సామ్యముపైతి" ఉత్తమ సాయుజ్యమును పొందును. అట్టి ఫలితమంతయు జీవాత్మకు కలుగునని అర్థము.

(4) తతః=పిమ్మట, తెలిసికొనినపిమ్మట యని అర్థము. అందువలన ననికూడ అర్థము కలదు. రెండు చెప్పతగ్గవే.

(5) విజుగుప్సతే = ఈ మన్త్రములో "నతతో విజుగుప్సతే" అని కలదు. రెండు ఫలితములు నొక్కటే. పదక్రమములో స్వల్ప భేదము కలదు. అచ్చట సర్వభూతముల యందు తనను ఆత్మను, తనలో, ఆత్మలో సర్వభూతములను జూచినవానికి ఆ ఫలితము కలుగునని చెప్పబడెను. "నవిజుప్సతే" అనగా Notshrinking అని శ్రీ అరవిన్దయోగి అర్థము చేసిరి. దానికే ఎవరునిందింపరు అని ఇంకొకరు అర్థము చేసిరి. భయపడడని రామకృష్ణమఠమువారు అర్థము చేసిరి. తన ఆత్మను రక్షించుకొన ప్రయత్నము చేయడని శ్రీ శంకరులవారు అర్థముచేసిరి. అసలుపదముకుకల అర్థములు:— 1. నింద, 2. అనిష్టము, 3. అసహ్యము, 4. భీభత్సము, 5. భావమందుండు అసహ్యము అని అర్థములు కలవు. అక్షరశః దాగుకొన యత్నించడు. ఆత్మవిషయమై లోగడ భయముండె

ననియు నిర్భాణాభయము తీరినదనియు శ్రీ శంకరులవారు చెప్పిరి. ఇచ్చట ఏవగింపడు అన్నందుకు కారణమేమన లోకములోగల సమస్తమును పరమాత్మగానె తలచును. తాను గానె తలంచును. తనకన్న భిన్నముగా తలంచడు. కాన రాగ ద్వేషములకు తావుండదు. తా ననసమర్థుడను భావము నశించును. ఈ యంశమే ముణ్డకం 3-1-2 లో కలదు. తన సమర్థత పూర్తిగా తెలియును. తాను, పరమాత్మ యొక్కటె యని గ్రహించుటచేత తాను పరమాత్మగానె ప్రవర్తించును

తాత్పర్యము:— ఎవడు తన హృదయాన్తరాళమునందు తనకు సమీపమందున్న 2 వ వానిని త్రికాలములకు గత రానున్న సృష్టికంతకును అధీశునిగాను ఆనన్దరూపియగు పరమాత్మగాను వేద్యమొనర్చుకొనునో యంతటనుండి యా జ్ఞానముచేతనే యతడు సర్వసృష్టియెడల పరమాత్మవలె సమభావనతో వర్తిల్లును. ఇదియేయది నిశ్చయము.

౬ వ మంత్రము శ్రుతిః ॥ 6

యఃపూర్వం తపసోజాత
మద్భ్యఃపూర్వ మజాయత ।
గుహాంప్రవిశ్య తిష్ఠన్తం
యోభూతేభిర్వ్యపశ్యత; ఏతద్వైతత్ ॥

యః= ఎవడు, పూర్వం=ఆదిలో, తపసః=తపస్సునుండి, లేక తపస్సుతో; జాతం=పుట్టెనో, అద్భ్యః=నీటికి, పూర్వం=

పూర్వమందు, అజాయత = పుట్టెనో, యః = ఎవడు, భూతేభిః = భూతములతో, గుహాం = గుహయందు, ప్రవిశ్య = ప్రవేశించి, తిష్ఠన్తం = నిలిచియున్నాడు, తం = వానిని, వ్యపశ్యత = మానవుడు చూచుచున్నాడు, ఎతద్వైతత్ = ఇది యదే నిశ్చయము.

విశేషార్థము:— (1) పూర్వం = ఈపదము రెండు పర్యాయములు వచ్చినది. మొదటవచ్చినపుడు సృష్ట్యాదిలోనని యర్థము. రెండవపర్యాయము వచ్చినపుడు నీటికంటె ముందుగా అని యర్థము.

(2) తపసః = తపస్సువలన లేక తపస్సుతో తపస్సుతో పుట్టినవాడు హిరణ్యగర్భుడు "తపసాచీయతే బ్రహ్మ" ముండకం 1-1-8-1-1-9 "జ్ఞానమయంగ్ంతపః" మొట్టమొదట అసత్తునుండి నిరాకార నిర్గుణునినుండి సాకార సద్గుణుడు వెడలెను. ఆతడు తపోరూపుడు "తపోబ్రహ్మేతి" తైత్తిరీయం 3 వ అధ్యాయం 5 వ అనువాకము తపస్సే బ్రహ్మయని తెలిసికొనవలెనని తెలుపుచున్నది. పిమ్మట సృష్టియంతయు నతని తపస్సుమూలముననే జరిగెను. కాన నితని ప్రత్యేక లక్షణము తపస్సే.

(3) అద్భ్యః = నీరు అచ్చముగా నీరు ఒకటే యని అర్థముకాదు. పంచభూతములని భావము శ్రీ శంకరులవారును అట్లే చెప్పిరి. పురుషసూక్తములో "అద్భ్యస్సంభూతః" నీటినుండి పుట్టెను. సృష్టి యంతయు నీటినుండి పుట్టెనని భావించబడుచున్నది. బైబిలులో మొట్టమొదట Brooding over

the waters ప్రళయాబ్ధిపై వ్యాపించి తపస్సు చేయుచు లేక యోచించుచు దేవుడు సృష్టించెనని అర్థము కలదు. ఐతరేయము 1 అ. 1 ఖండం 2 వ మంత్రము అంభోలోకమును సృజించెనని చెప్పుచున్నది. 3 వ మంత్రములో "సోఽద్భ్య ఏవపురుషం సముద్ధృత్య" నీటినుండి పురుషరూపమును పుట్టించెను. ఇక్ష్వా 2 వ ఖండం 1వ మంత్రములో "అర్ణవే ప్రాపతన్" సముద్రములో పడవేసెను. సృష్ట్యాదియందు జల ప్రళయ మున్నట్లును దానినుండి సృష్టి కలిగినట్లును ఊహించవచ్చును. ఈ జలమను పదమునకు పంచభూతములు అని అర్థము చేసిన యెడల పంచభూతములు సూక్ష్మరూపమున ఉండెననియు దానికి పూర్వము వీని సృష్టికర్తయగు సాకార సగుణబ్రహ్మ యుండెననియు పిమ్మట వీటిని నుపయోగించి సకల స్థూల సూక్ష్మ సృష్టి చేసెననియు నూహించవచ్చును.

(4) భూతేభిః = భూతములతో గూడ ఈ పదములకు పంచభూతములని అర్థము చెప్పుచున్నారు. జీవులని మరియొక విధమునఅర్థము చెప్పుచున్నారు. దేహేన్ద్రియరూపభూతములని శ్రీ శంకరులవారు అర్థము చెప్పుచున్నారు. అదియే సమంజసము. గుహాలో ప్రవేశించినవాడు ఇన్ద్రియాదులమూలమున లోకమును గ్రహించగలుగుచున్నాడు. లేదా ఇన్ద్రియాదుల కట్టి శక్తిని ఒసగుచున్నాడు. ఆ శక్తినతడు ఇవ్వనియెడల ప్రాణప్రతిష్ఠలేని విగ్రహములు పూజార్హతలేని శిలలు లోహములుగా నుండునట్లే యీ యిన్ద్రియములును నిష్ప్రయోజ

నములగును. ఈ గుహలో ప్రవేశించినవాడే యింద్రియాదుల
కెల్ల ప్రాణప్రదాత శక్తిప్రదాత అయియున్నాడు.

(5) తిష్ఠంతం = ప్రవేశించి నిలిచియున్నాడు. ఈ వల్లిలో
"ఏతద్వైతత్" అను పదములతో నంతమయ్యే మంత్రములు
అనేకములు కలవు. అన్నియు నొక విషయమును దెలుపు
టకుగాక వివిధ వైఖరులను, వివిధ భావములను, తెలుపుట
కుద్దేశింపబడినవి. 3 వ మంత్రములో నచ్చముగా నిరాకార
నిర్గుణ పరబ్రహ్మనుగూర్చి చెప్పబడెను. 5 వ మంత్రములో
నట్టివాడు తనగుహలో సమీపమందున్నాడని తెలుపబడెను.
ఈ మంత్రములో నా గుహలో సాకార సగుణబ్రహ్మ కలడని
తెలుపబడినది. హృదయములో ప్రవేశించినవానిని సృష్టికి
పూర్వమును సృష్టికి పరమందును ఉన్న నిర్గుణ స్వరూపిగాను,
సృష్టి సంబద్ధయయిన సగుణ స్వరూపిగాను తెలిసికొనవలెనని
ఎంచవచ్చును ఇంకొక యోజనకూడ చేయవచ్చును.
వ్యష్టిగా జీవశరీరములో నున్నవాడను సమిష్టిగా విశ్వశరీర
ములో నున్నవాడను నొక్కరేయని యీ మన్త్రము
సూచించుచున్నదని తలంచవచ్చును. జీవశరీరములో నున్న
వాడు నిరాకార నిర్గుణస్వరూపియేయని 3-4-5 మంత్రములు
తెలుపుచుండ నీమంత్రములోని భావము దానినిబట్టియే యను
మానమగుచున్నది. అనగా నూహించ తగియున్నది.

తాత్పర్యము:— ఎవడు మొట్టమొదట తపస్సుతో
పుట్టెనో లేదా వ్యక్తమయ్యెనో తపస్సే జ్ఞానమే ప్రత్యేక
లక్షణముగా కలవాడో యెవడు పంచభూతములకంటె ముందు

వ్యక్తమైనవాడో యెవడు ఇంద్రియాదులకు శక్తిప్రదాత యగుచు హృదయగుహాయందు ప్రవేశించి నిలిచియున్నాడో యట్టివానిని మానవుడు వేద్యమొనర్చుకొనవలెను. ఇది యదియే నిశ్చయము.

౭ వ మన్త్రము శ్రుతిః ॥7

యాప్రాణేన సంభవతి
అదితిర్దేవ తామయీ ।
గుహాం ప్రవిశ్యతిష్ఠన్తీం
యాభూతే భిర్వ్యజాయత; ఏతద్వైతత్ ॥

యా = ఎవరు; దేవతామయీ = దేవతలకుతల్లి; ప్రాణేన = ప్రాణమువలన, ప్రాణరూపమున; సంభవతి = పుట్టుచున్నది, యా = ఎవరు, భూతేభిః = ఇంద్రియములతో కూడ; వ్యజాయత = సృజింపబడినది, గుహాం = హృదయ గుహాయందు, ప్రవిశ్య = ప్రవేశించి; ( సా = ఆమె ) తిష్ఠన్తీం = నిలిచియున్నది, ఏతద్వైతత్ = ఇది యదియే నిశ్చయము.

విశేషార్థము:— (1) దేవతలతల్లి లేదా దేవతల ఆత్మ, దేవతామయమయినది. సర్వదేవతలు కలది అని అర్థము. దేవ అనగా తేజస్సు కలది. దేవత అనగా నట్టిదే యట్టి తేజోమయ మైనదని యర్థము చెప్పవచ్చును. విశ్వమంతయు తేజోమయ

మయినదే, ప్రకృతి శాస్త్రజ్ఞులు యీ యంశమును ధ్రువపరచు చున్నారు.

(2) అదితిః = అనగా తినునది సర్వమును భోగించగలది, సృష్టి సమయమున చేయు పనియది. ప్రళయకాలమున సర్వమును తనలోనికి ఉపసంహరించుకొనగలది, కాన అదితి. ఈ అదితి యను పదమునకు ఋగ్వేదము 1 వ మండలము 89 వ అనువాకము 948వ ఋక్కునందు నిరూపణకలదు. " అదితిర్ద్యౌః అదితిర న్తరిక్షం అదితిర్మాతా సపితా సపుత్ర. విశ్వే దేవా అదితిః పంచజనాః అదితిః జాతం అదితిః అదితిర్జనిత్వం " అదితి ఆకాశము అదితి అంతరాళము. అదితి తల్లి అదితి తండ్రి అదితి సంతానము అదితి విశ్వే దేవతలు అదితి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాదులు, అదితి పుట్టినవాడు. అదితి పుట్టబోవువాడు. అదితి ఈ నిరూపణనుబట్టి అదితి అనగా విశ్వసృష్టి అంతయు నాదినుండి ప్రళయాన్తమువరకు చేయబడు సృష్టి యంతయు వె ను క టి మంత్రములో హిరణ్యగర్భుని చెప్పి యున్నాడు. ఈ మంత్రములో విశ్వమును తెలుపుచున్నాడు. ఈ విశ్వములోనిదంతయును అదితియే అదితి మయము అదితి కానిది యొకటియు లేదు. ప్రతియొకటి తాను తినుచుండును. తాను తరులకు తిండియగుచుండును. ఈ వర్ణననుబట్టి పిపీలికాది బ్రహ్మపర్యన్తము సమస్తమును ఒకే కుటుంబములోనివారు, ఒకే తల్లి తండ్రినుండి ఉద్భవించినవారు కాన సర్వసమానస్వత్వము కలవారు. ఉనికికి తిండికి ఇంటికి వసతులకు అన్నిటికి సమానమైన హక్కు బాధ్యతలు కలవారు. అందఱు ఏకోదరులు

భిన్నోదరులుకారు భిన్నమగు తల్లులు బిన్నమగు తండ్రులు లేరు. ఈశావాస్యము 1 వ మంత్రములో చెప్పినట్లు వీరికి త్యాగమే భోగమార్గము, ఏవిధమైన లుబ్ధత్వమునకును తావు లేదు.

(3) ప్రాణేన = ప్రాణమువలన ప్రాణమనగా హిరణ్యాగర్భుడు. హిరణ్యాగర్భునివలన విశ్వము సృష్టించబడినది దీనికి ప్రాణస్వరూపము అనికూడ అర్థము చెప్పుచున్నారు. అనగా అదితి అన్నిచోట్ల ప్రాణస్వరూపమున పొడగట్టుచున్నదని అర్థము అది స్వదృష్టి కలవారికి గోచరమగు విషయము సామాన్య దృష్టి మాత్రమే కలవారికి అట్లు కనపడుట లేదు. ప్రాణరహితమగు జడపదార్థమున్నట్లు కన్పట్టుచున్నది. ఈ మన్త్రమునుబట్టి జడమందుకూడ ప్రాణమున్నదని నిర్ణయించవచ్చును. అదితికి నివ్వబడిన నిర్వచనమునుబట్టి ప్రాణమయము కాని వస్తువే లేదు. ఒకదానితో నొకటి పోల్చినపుడు లౌకిక వ్యవహారములనుబట్టి కొన్నిటిలో ప్రాణమున్నదనియు కొన్నిటిలో లేదనియు తెలిపెదమేకాని నిజమునకు ప్రాణహీనమైన పదార్థమే లేదు. స్పష్టమగుటలోమాత్రము భేదముకలదు.

(4) భూతేభిః = 6 వ మంత్రముయొక్క విశేషార్థము చూడవలెను.

(5) సంభవతి, వ్యజాయత, రెంటికిని ఒకటే యర్థము. పూర్తిగా ప్రకటితమగుచున్నది. లేదా నిశ్శేషముగా పుట్టినది. ఈ మంత్రములో నిట్టిదానిని తెలిసికొన్నవాడు అనుపదములు. లుప్తమైనవి. ఉన్నట్లు ఏంచుకొన వచ్చును. తన

హృదయగుహాలో విశ్వమంతయు నిమిడియున్నదని తెలిసికొన వలెను.

తాత్పర్యము:— తేజస్సుకు నిలయమును, తేజోవస్తు లగు దేవతలకు మాతృస్థానమును అయిన అదితి హిరణ్యా గర్భునివలన ఉద్భవించినది. ప్రాణస్వరూపమున నెగడుచున్నది. ఇన్ద్రియములకు శక్తిప్రదాత అయి వెలయుచున్నది. ఇట్టి అదితి విశ్వస్వరూపిణి విశ్వసృష్టి హృదయగుహాలో ప్రవేశించి నిలచియున్నది. దానిని ఆత్మగా తెలిసికొన వలెను. ఇది యదియే నిశ్చయము.

८ వ మన్త్రము శ్రుతిః ॥ 8

అరణ్యోర్నిహితో జాతవేదా
గర్భఇవసుభృతో గర్భిణీభిః ।
దివేదివఈడ్యో జాగృవద్భి
ర్హవిష్మద్భిర్మనుష్యేభిరగ్నిః । ఏతద్వైతత్ ॥

గర్భిణీభిః=గర్భవతులగు స్త్రీలచేత; సుభృత = చక్కగా భరించబడిన; గర్భః = గర్భము; ఇవ = వలె; అరణ్యోః = అరణులను రెండు కర్రలయందు; నిహితః = ఉన్నట్టి; జాత వేదాః = జాతవేదుడను పేరుగల; అగ్నిః = అగ్ని; హవి ష్మద్భిః = యజ్ఞకర్తలును; జాగృవద్భిః = ప్రబోధమును పొందినవారును అగు; మనుష్యేభిః=మనుజులచేత; దివేదివే=

ప్రతిదినము; ఈడ్యః=కొనియాడబడుచున్నాడు, దానిని తెలిసి కొన నగును; ఏతద్వైతత్ = అదియిదియే నిశ్చయము.

విశేషార్థము:— (1) అరణ్యోర్నిహితః = అరణులు కఱ్ఱలురెండు ఒకదానికి ఉత్తరారణియనియు, రెండవదానికి అధరారణి యనియు పేళ్లు. ఈ రెండు కఱ్ఱలను ఒకదానిమీద నొకటిపెట్టి మధించినయెడల యందులోనుండి యగ్ని పుట్టును, యజ్ఞమునకు నిట్లు పుట్టించిన అగ్నియె యుత్తమము. ఈ రెండుకఱ్ఱలలోను అగ్ని గర్భితమై Potential రూపమున ఇమిడియున్నది. రెంటిని మధించుటచేత నయ్యది ప్రకటితము Kinetic అగుచున్నది. రెంటిలోనున్న యగ్ని ఆ కఱ్ఱలకు అపాయము కలిగించకుండ నితరుల కపాయముచేయకుండ ప్రకృతివలననే సురక్షితమై యున్నది. ఈ రెండుకఱ్ఱలవలెనే తల్లి తండ్రిలో సన్తానము గర్భితమై యున్నది. తైత్తిరీయము 1 అ. 3 వ అనువాకములో "మాతాపూర్వరూపం పితోత్తరరూపం ప్రజాసన్ధిః" అని చెప్పబడియున్నది. తల్లి మొదటిరూపమనియు, తండ్రి రెండవ రూపమనియు వీరి కలయిక సన్తానమనియు అర్థము. మాతృగర్భమునందు ఉన్న శిశువును ఎట్లు కాపాడుదురో యట్లే యరణులయందుండు అగ్నిని ప్రకృతియే కాపాడుచున్నది.

(2) జాతవేదాః = జాతవేదుడను పేరుగలవాడు. పుట్టినప్పటినుండి జ్ఞానముకలవాడు. సహజజ్ఞానియని అర్థము. సర్వజ్ఞుడనియు అర్థముకలదు. అతడు పుట్టుటచేత నితరులకు జ్ఞానము కలుగుచున్నదనికూడ అర్థము అగ్ని తేజోరూపుడు

గనుక అగ్ని ప్రజ్వరిల్లుచుండగా దృష్టి సఫలమగుచున్నది. అగ్ని ఉష్ణస్వరూపుడు ఆహారముగా తీసికొను పదార్థములను వైశ్వానరరూపమున జీర్ణింపజేసి మానసికశక్తులను వృద్ధి పరచుచున్నాడు. తద్వారా జ్ఞానమభివృద్ధియగుచున్నది. అగ్ని యని ప్రత్యేక దేవతగా పేరున్నను అగ్ని పరమాత్మయేనని 1730 వ ఋక్కు తెలుపుచున్నది. ఋగ్వేదము 1 వ మండలము.

(3) ఈడ్యః = పూజనీయుడు జీవకోటికంతకును పూజనీయుడు మనుజులకుమరింతపూజనీయుడు శీతప్రదేశమందున్న వారికిని చీకటిరాత్రులయందున్నవారికిని అత్యంత పూజనీయుడు. యజ్ఞయాగాది క్రతువులు చేయువారికి అత్యుత్కృష్టముగా పూజనీయుడు. దేవతలకు హవ్యములనందిచ్చువాడు దేవప్రియుడు.

(4) జాగృవద్భిః హవిష్మద్భిః ఈ రెండు పదములు మనుష్యేభిః అనుదానికి విశేషణములు జాగృవద్భిః అనగా జాగరణ శీలురు హవిష్మద్భిః హవిస్సు సర్పించు యజ్ఞకర్తలగు మనుజులని చెప్పవచ్చును. అట్లుగాక రెండు విశేషణములు రెండు తెగలను తెలుపునని చెప్పవచ్చును. హవిష్మద్భిః సామాన్యులగు యజ్ఞకర్తలు అనగా కర్మకాండపరులు జాగృవద్భిః కర్మకాండనుంచి మేల్కొనినవారు జ్ఞానకాండపరులు త్రిణాచికేత మొనర్చినవారు అని చెప్పవచ్చును, ఇట్లు చెప్పిన యెడల ఇరు తెగలవారును అగ్నిని దినదినము (ప్రతిదినము) పూజించుచున్నారు. ఒకసారి సామాన్య హవ్యవాహనునిగాను రెండవ

వారు పరమాత్మ స్వరూపునిగాను పూజించుచున్నారు. శ్రీ శంకరులవారును యోగులు యజ్ఞకారులు అని యిద్దఱిని ఉదహరించి యున్నారు. అదియే సమంజసము. ఈ మంత్రము విశ్వ సృష్టిలో ప్రకటితమయిన అగ్నిని స్థూలసూక్ష్మ దృష్టులతో భావించి పరతత్త్వమును గ్రహించువిధానమును తెలుపుచున్నది

తాత్పర్యము:— గర్భవతియగు స్త్రీ తన గర్భమును చక్కగా కాపాడుకొనుచుండును. అట్లే అరణులలోనుండు అగ్నియు సురక్షితుడై యున్నాడు. అతడు పుట్టుకతోడనే స్వయముగా జ్ఞాని. ఇతరులకు దృష్టిప్రదాత, ఆహార జీర్ణకారి. జ్ఞానప్రదాత యజ్ఞకర్తలగు మానవులచేతను కర్మకాండ నుండి మేల్కొనిన నచికేతాగ్ని పరులచేతను జ్ఞానముచేతను ప్రతి దినము పూజనీయుడయి వెలుగుచున్నాడు. విశ్వములో అగ్ని యనుపేర ప్రత్యేక దేవతగా బరగుచున్నను తత్త్వరీత్యా పరమాత్మయే ఇట్లని యెల్లరు తెలుసుకొనవలెను. ఇది యదియే నిశ్చయనే.

౯ వ మంత్రము శ్రుతిః ॥ 9

యతశ్చోదేతి సూర్యః
అస్తం యత్ర చ గచ్ఛతి।
తం దేవాస్సర్వే అర్పితా
స్తదునాత్యేతి కశ్చన। ఏతద్వైతత్ ॥

యతః = ఎక్కడనుండి! సూర్యః= సూర్యుడు, ఉదేతి = ఉదయించుచున్నాడు, చ = మరియు, యత్ర = యెచ్చట,

అస్తం గచ్ఛతి = అస్తమించుచున్నాడు, చ = మరియు, సర్వే = సకలమయిన లేక అందఱు దేవాః = దేవతలు, తం = వానిలో, అర్పితాః = ప్రతిష్ఠితమై యున్నారు, తత్ = దానిని, కశ్చన = ఎవరును, ఉ = నిక్కముగా, నాత్యేతి = అతిక్రమించజాలరు, ఏతద్వై తత్ = అది యిదియే నిశ్చయము.

విశేషార్థము:— (1) ఉదేతి - అస్తంగచ్ఛతి = ప్రతి దినము జరిగెడి ఉదయాస్తమయములను యెంచనక్కర లేదు. సూర్యుడు మొట్టమొదట ఎటునుండి పుట్టుచున్నాడో చివరకు ఎందులో చేరుచున్నాడో అదియే ముఖ్యము. అట్టి స్థానము పరమాత్మయే ప్రతిదినముజరిగెడి ఉదయాస్తమయములని యెంచే ఎడలసూర్యునిలోనిలచియుండుఅధిష్ఠాన దేవతయని చెప్పవచ్చును. లేదా సూర్యునిలోనుండు పరమాత్మయని చెప్పవచ్చును. ఆ అధిష్ఠాన దేవత లేక ఆ పరమాత్మ ఆత్మజ్ఞానవర్తియై సూర్యుడు ఉదయించుచున్నాడు. లేక అస్తమించుచున్నాడు అని చెప్ప వచ్చును. తైత్తిరీయము 2 వ అధ్యాయము 8 అనువాకము చూడనగును. అందులోనే " భీషోదేతి సూర్యః అని చెప్పబడి నది. ఆ పరమాత్మయొక్క అజ్ఞచే లేక భయముచే సూర్యుడు ఉదయించుచున్నాడు. అనగా పరమాత్మచేసిన ఏర్పాటు ప్రకా రము సూర్యాస్తమయములు ప్రతిదినము జరుగుచున్నవని యెంచవలెను. అట్లు యెంచిన యెడల యీ మంత్రము రెండు విషయములను తెలుపుచున్నదని భావించవలెను. స్థూలరూప మున నున్న సూర్యుడు తత్వరీత్యా పరమాత్మయే యనియు

ప్రకృతిలో నంతర్లీనమగు సృష్టి శాసనముకూడ పరమాత్మయే యనియు భావించవలెను.

(2) దేవాః = దేవతలు ప్రకృతిలోనున్న పంచభూతము లలో లేక ప్రత్యేక దేవతలుగా యెంచబడు వ్యక్తులలో నంద అను కలసి పరమాత్మయందే బ్రతిష్ఠితమయి యున్నారు. ఈ దేవతలు 3,11,33 3 కోట్లు 33 కోట్లు యెంతమందియైనను పరమాత్మయందే నిలచియున్నారు.

(3) నాత్యేతి = అతిక్రమించజాలరు, అనగా దాటిపో జాలరు. ఆత్మనుండి వచ్చినారు గనుక ఆత్మనుమించి పోలేరు. ఇదే భావము ఈశావాస్యము తెలుపుచున్నది. అచ్చట 3 వ మంత్రము చూడవలెను. "తత్ ధావతోన్యానత్యేతి తిష్ఠత్" ఒకచోట నిలిచియుండియు పరుగెత్తెడి యితరుల నందరిని ఆత్మ అతిక్రమించును. దీనికి నింకొక కారణముకూడ కలదు. ఈశా వాస్యము 1, 3 మంత్రములలో దెలిపినట్లు ఈ సృష్టియంతయు నాత్మలోనే చేయబడినది. ఆత్మచేతనే యావరింపబడియున్నది. కాన ఈ ఆత్మనుదాటి నైదొలగి పోజాలదు. ఆత్మ లేనిచోటు లేదు. గ్రీసుదేశపు తత్వవేత్త సోక్రటీస్ "మృత్యువు లేని చోటు చూపుడు అచ్చటికి పరుగెత్తుకొనిపోయి దాగెదను" అని కారాగృహమునుండి తప్పించుకొనిపొమ్మని సలహా దార్లకు తెలిపెను. మృత్యువు లేనిచోటు దొరికిన దొరుకును. ఆత్మ లేనిచోటు దొరకదు. మృత్యువు లేనిచోటుకూడ ఆత్మయే కలదు.

తాత్పర్యము:— ఎచ్చటనుండి సూర్యుడుదయించు చున్నాడో యెచ్చట సూర్యుడస్తమించుచున్నాడో అనగా సూర్యుని ఉదయాస్తమయములు జరుగుచున్నవో ఎవని శాసనము ప్రకారము ప్రతిదినము సూర్యోదయ సూర్యాస్తమయములు కనబడుచున్నవో ఎవనియందు సర్వదేవతలు బంధించబడి నిలిచియున్నారో ఆ యాత్మను నిజముగా నెవ్వరును అతిక్రమింపజాలరు. సూర్యాదిదేవతలు స్థూలరూపమున ప్రత్యేక దేవతలుగా కనబడినను తత్వరీత్యా ఆత్మయే ననియు నీ విశ్వముయొక్కయు నీ దేవతలయొక్కయు కార్యసరణియే శాసనము ననుసరించి జరుగుచున్నదో యదియు నాత్మయే ననియు తెలిసికొనవలెను. ఇది యదియె నిశ్చయము.

౧౦ వ మన్త్రము శ్రుతిః ॥ 10

యదేవేహ తదముత్ర
యదముత్ర తదన్విహ ।
మృత్యోస్స మృత్యుమాప్నోతి
య ఇహనానేవ పశ్యతి ॥

యత్ = ఏది, ఇహ = ఇక్కడ, ఏవ = మాత్రమే లేక నిక్కముగా, ( కలదో ) తత్ = అది, అముత్ర = అచట, ( కలదు ) యత్ = ఏది, అముత్ర = అచ్చట ( కలదో ) తత్ = దానిని, అను = అనుసరించియే, ఇహ = ఇచ్చట, ( కలదు ) యః = ఎవడు, నానా = అనేకములు, ఇవ = వలె

ఇహ = ఇచ్చట, పశ్యతి = చూచుచున్నాడో, సః = వాడు, మృత్యోః = మృత్యువునుండి, మృత్యుం = మృత్యువును, (మరణమును) ఆప్నోతి = పొందుచున్నాడు.

విశేషార్థము:— (1) ఇహఅముత్ర = ఇహ అనగా ఇచ్చట ఈ దేహమందు, ఈ లోకమందు మూడును చెప్ప వచ్చును. అముత్ర = అక్కడ ఆ శరీరములో ఆ స్థలములో ఆ లోకములో ఆ జన్మలో అని యర్థము. ఈ శరీరమనగా మానవ శరీరము లేక భూతశరీరము ఆ శరీరమనగా విశ్వశరీరము ఆంగ్లములో Microcosm macrocosm అట్లె పిండాండము బ్రహ్మాండము అని చెప్పనొప్పును. ఈ లోకమనగా ఇచ్చటనున్న లోకము అనగా సృష్టింపబడిన భూతకోటిగల లోకము ఆలోకమనగా సృష్టికర్తగల లోకము ఇచ్చట అచ్చట అనునపుడు ఈ భూతమునందు లేక కర్త యందు ఆ భూతమునందు అనగా పరునియందు ఈరెంటిలో నుండు తత్వము ఒక్కటేయని అర్థము. నాయందు నీయందు ఒరునియందు ఉండునది. ఒక్కటే వ్యష్టిశరీరమందు సమిష్టి శరీరమందు ఉండునది ఒక్కటే. ఈ సృష్టిలో సృష్టికి పూర్వము పరములోనుండునది ఒక్కటే. నామ రూపము లలో రకమువారిలో జాతిలో భాషలో దేశములో ఎంత భేదము కన్పట్టుచున్నను ప్రాణికోటి యన్నిటిలోనుండు తత్వ మొక్కటే ప్రాణికోటియే అననేల వస్తు జీవజాలములోనుండు తత్వ మొక్కటియే.

(2) అను=అనగా అనుసరించి ఇచ్చట ఉండునది. అచ్చట ఉండునది ఒక్కటే కాని అచ్చట ఉండుదానిని అనుసరించి యిచ్చట నున్నది యేర్పడినది. అనగా సృష్టికంతకును ఆత్మ మాతృక యనియు సృష్టియంతయు దాని నకలు దానిననుసరించుచున్నదనియు అర్థము. ప్లేటోయను గ్రీకువేదాన్తి ఇచ్చటనున్న ప్రతిదానికి అచ్చట మాతృకలు కలవని చెప్పెను. ముణ్డకం 2-2-10 " తమేవభాన్తమనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదంవిభాతి " అన్నియు దాని ననుసరించియే ప్రకాశించుచున్నవి. ఈ మన్త్రమే శ్వేతాశ్వతరము 6-14 లో కలదు. గీత 15 అ. 6 వ శ్లోకము కూడ చూడనగును.

(3) నానా = వివిధము, భిన్నత్వము వివిధ ప్రదేశములు వివిధమార్గములు అనికూడ నర్థము కలదు. నానా ఇవ భిన్నత్వమువలె లేక నిశ్చయమైన భిన్నత్వముగా ననవచ్చును.

(4) మృత్యుమాప్నోతి = మృత్యువును పొందుచున్నాడు అనగా జనన మరణ దుఃఖమును పొందుచున్నాడు. అనగా భిన్నత్వమే అవిద్య యనియు అవిద్యయే మృత్యు కారణమనియు ఈ మన్త్రము స్పష్టపరచుచున్నది.

తాత్పర్యము:— ఏది ఇచ్చట ఈ జీవదేహములో నీ లోకములో నిక్కముగా కలదో యదియే యచ్చట ఆ విశ్వదేహములో నా బ్రహ్మలోకములో కలదు. ఇచ్చట ఒక జీవదేహములో నేదికలదో యదియే యితర జీవదేహములలోను కలదు. వస్తు జీవభేదముకూడ లేదు. అన్నిటిలోనున్న తత్వ మొక్కటియే. అచ్చట ఆ విశ్వదేహములో ఆ లోకములో

ఏదికలదో దానిననుసరించియే యిచ్చట ఇది యీ దేహములోనిది కలదు. ఎవఁడు ఈ యన్నిటిలో నానాత్వము భిన్నత్వము భిన్న స్థితిగతులు భిన్న మార్గములు నిశ్చయముగా నున్నవనిగాని యున్నట్లు తోచుచున్నదనిగాని భావించునో వాఁడు అజ్ఞానియై జన్మ జరామరణ దుఃఖములపాలై బాధనొందుచున్నాఁడు. ఈ మంత్రముయొక్క ఆన్వయ మేమన తనకు విశ్వమునకు బ్రహ్మకు తత్వరీత్యా యేవిధమైన భిన్నత్వము లేదని తెలిసికొనవలెను.

౧౧ వ మంత్రము శ్రుతిః ॥ 11

మనసై వేద మాప్తవ్యం
నేహనానాస్తి కించన ।
మృత్యోస్సమృత్యుం గచ్ఛతి
య ఇహనా నేవ పశ్యతి ॥

ఇదం = ఇయ్యది; మనసా=జ్ఞానముచేత; ఏవ=మాత్రమే, ఆప్తవ్యం = పొందతగినది; ఇహ = ఇచ్చట; కించన=కొంచమైనను, నానా=భిన్నత్వము, నాస్తి = లేదు. యః=ఎవఁడు, నానా = అనేకము, ఇవ = వలె. ఇహ = ఇచ్చట, పశ్యతి-చూచుచున్నాఁడో, సః = వాఁడు; మృత్యోః = మృత్యువునుండి, మృత్యుం=మృత్యువునకు, గచ్ఛతి=పోవుచున్నాఁడు.

విశేషార్థము:— (1) మనసా = సామాన్య మనస్సుచేత నని యర్థము చెప్పుటకు వీలుకాదు. మనస్సు బ్రహ్మను చూడ

లేము. ఏకత్వమును చూడలేదు. కేనోపనిషత్తు 1 ఖండం 3-5 మంత్రములు యీ విషయమును స్పష్టము చేయుచున్నవి. తైత్తిరీయము 2 అధ్యాయము 4 వ అనువాకము "అప్రాప్య మనసాసహ" మనస్సు ఆత్మను పొందలేదు. ముణ్డకం 3-1-8 మంత్రము. కంటివలన, వాక్కువలన, ఇతరావయవములవలన, ఆత్మను పొందలేమని చెప్పుచున్నది. ఇచ్చట 1-1-3 లో "మనః ప్రగ్రమేవచ" మనస్సు కళ్లెము లేక పగ్గమనియె చెప్పఁబడినది. కాన దాని మూలమున తత్వము గ్రహింపఁబడనేరదు. ముణ్డకము 3-1-8 "జ్ఞానప్రసాదేన తం పశ్యతే" జ్ఞానప్రసాదము వలన దానిని జూచుచున్నారు. అట్లే "ఏషోఽణురాత్మా చేత సావేదితవ్యో" అని ముణ్డకము 3-1-9 చెప్పుచున్నది. కాన మనస్సను పదమునకు జ్ఞానమనియే చెప్పవలెను.

(2) ఇదం = అనగా 10 వ మంత్రము 1 వ పాదములో చెప్పబడిన తత్వము, అభిన్నత్వము, అనగా అద్వైత భావన.

(3) ఇహ=అనగా ఇచ్చట దీనికి బ్రహ్మలో అని శ్రీ శంకరులవారు అన్వయించుచున్నారు. బ్రహ్మతత్వములో స్వగత పరగత భేదము లేదని యందరంగీకరించినదే. ఇహ అనగా ఇచ్చట ఈ లోకములోనె నిజముగా భిన్నత్వము లేదు. దేవుడు ప్రకృతి అనిగాని వస్తుజీవమనిగాని వానిలో రకములవారీగాని యేమాత్రము భేదము లేదని చెప్పుట భావ్యము. సృష్టియనునది కూడ బ్రహ్మకంటె భిన్నముకాదని చెప్పినను చెప్పవచ్చును.

(4) మృత్యుం=రెండవపాదములోని శబ్దముల విశేషార్థమునకు 10 వ మంత్రములో విశేషార్థము చూడవలెను.

( 5 ) గచ్ఛతి = పోవుచున్నాడు. 10 వ మంత్రములో " ఆప్నోతి " అని కలదు ఫలిత మొక్కటియే.

తాత్పర్యము:— 10 వ మంత్రములో చెప్పబడిన అభిన్నత్వము జ్ఞానముచేతనే పొందతగియున్నది. ఇచ్చట ఈ సృష్టిలో వస్తువులు, జీవములునుధ్య వ్యక్తులమధ్య బ్రహ్మసృష్టిమధ్య ఏ కొంచెమును ఏ విధమునను భిన్నము లేదు. ఎవడు యీ యన్నిటిలో నానాత్వము భిన్నత్వము భిన్న స్థితిగతులు భిన్నమార్గములు నిశ్చయముగానున్నవనిగాని యున్నట్లు తోచుచున్నదనిగాని భావించునో వాడు అజ్ఞానియై జన్మ జరామరణ దుఃఖముల పాలై బాధనొందుచున్నాడు. ఈ మంత్రముయొక్క యాన్తర్యమేమన తనకు, విశ్వమునకు, బ్రహ్మకు, తత్వరీత్యా యేవిధమయిన భిన్నత్వము లేదని తెలిసికొనవలెను.

సూచన:— ఈ 10–11 మంత్రములు 12–13 మంత్రముల పిమ్మటగాని వల్లి యంతమునగాని యుండవలెనని తోచుచున్నది. " ఏతద్వైతత్ " అను వాక్యముతో 12–13 మన్త్రములు అంతమగుచున్నవి 14–15 మంత్రములలో గూడ కొన్ని భిన్నత్వ ఏకత్వ సూచనలు గలవు. కాన 10–11 మంత్రములు చివర యుండుటయే మేలని తోచును.

౧౨ వ మంత్రము శ్రుతిః ౹౹ 12

అఙ్గుష్ఠమాత్రః పురుషః
మధ్య ఆత్మని తిష్ఠతి ।
ఈశానో భూతభవ్యస్య
న తతో విజుగుప్సతే ౹౹ ఏతద్వైతత్ ౹౹

అఙ్గుష్ఠమాత్రః = బొటనవ్రేలంత పరిమాణము కలవాడు; పురుషః= పురుషుడు, ఆత్మని మధ్యే= హృదయమధ్యమందు, తిష్ఠతి=నివసించి యున్నాడు; భూతభవ్యస్య= భూతభవిష్యత్తులకు, ఈశానః=ప్రభువు, తతః=పిమ్మట, కాబట్టి; నవిజుగుప్సతే=ఏవగించడు, ఏతద్వై తత్=ఇదియదియే నిశ్చయము.

విశేషార్థము:— (1) అఙ్గుష్ఠమాత్రః = అఙ్గుష్ఠమనగా బొటనవ్రేలు చేతి బొటనవ్రేలు హృదయమందుండు ప్రదేశము బొటనవ్రేలంతమాత్రమే యనియు నందులో నాత్మ యున్నది గనుక అంతస్థలమును ఆక్రమించు పరిమాణము కలదనియు చెప్పెదరు, కాని అది సంపూర్ణ నిర్వచనముకాదు. ఏమన "అణోరణీయాన్ మహతోమహీయాన్" అని 1-2 20 వ మంత్రములో చెప్పబడియున్నది. అణువుకంటే చిన్నది, మహత్తుకంటె పెద్దది. అందుచేత నాత్మకు పరిమాణము చెప్పుటకువీలు లేదు. సర్వవ్యాపియయిన దానికి పొడవు పెడల్పు లోతు ఉండ నేరదు. కాన ఈ యఙ్గుష్ఠ పరిమాణము ఆత్మకుగాక హృదయమునకే వర్తించును. దీనినే ఔపచారికమందురు. "అఙ్గుష్ఠమాత్రః పురుషః అంగుష్ఠంచ సమాశ్రితః" అని మహానారాయణము 71 వ అనువాకము తెలుపుచున్నది. అఙ్గుష్ఠమాత్రుడైనను ఆపాదతలమస్తకము వ్యాపించియున్నాడని పై మంత్రము యొక్క అర్థము అగ్లే "సన్తాపయతి స్వందేహ మాపాదతల మస్తకః" అని మహానారాయణము 13 వ అనువాకములో కూడ కలదు. దీనినిబట్టి భావమేమన:— ఎంత పరిమాణముగల

వస్తువునుగూర్చి ప్రసంగించుచున్నారో దాని హృదయ పరిమాణము ఆత్మ పరిమాణముగా జెప్పుట ఆచారము అని అర్థము.

(2) పురుషః=పూర్ణుడు, పురుషుడు సచ్చిదానందరూపి.

(3) *మధ్యే ఆత్మని=శరీరమధ్యయందు అని యర్థము చెప్పుచున్నారు. శరీరమధ్యమందు హృదయమున్నదని యొక భావము అందుచే నాత్మకూడ నచ్చటనే యున్నదని చెప్పుచున్నారు. కాని హృదయమనునది శారీరక శాస్త్రములో చెప్పు గుండెకాయ కాదు. మెదడులోనుండెడి భాగమును దానికి సంబంధము కల భాగమును అని గ్రహించవలెను ఐతరేయములో "సఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత" అతడు శిరస్సుయొక్క మధ్యభాగమును చీల్చి యాద్వారముచే నందులో ప్రవేశించెను. కాన హృదయము శిరస్సులో నెకలదు. ఐతరేయము 1 వ అధ్యాయము 3 వ ఖండము 12 మంత్రము ఐతరేయము 3 అధ్యాయము 1 వ ఖండము 2 వ మంత్రము "యదేతద్ధృదయంమనశ్చైతత్" ఏది ఈ హృదయము

---

* అరవిందయోగి In the centre of our self అని అన్వయించిరి. self అనుపదమునకు సామాన్యార్థము ఆత్మ మన ఆత్మమధ్య పరమాత్మయుండుట అనునది సమంజసముగా కన్పట్టదు. self అనగా శరీరమే అయినయెడల శరీర మధ్యమందుకంటె హృదయ మధ్యమందె యని చెప్పుట భావ్యము. మహానారాయణము 13 వ అనువాకములో నాభికి 12 అంగుళములపైన హృదయమున ఆత్మకలదని చెప్పబడెను. నాభికి 12 అంగుళములపైన అనగా శిరస్సులోనె అయియుండవలెను.

మరియు మనస్సును అదియే యాత్మ. గనుక హృదయము మనస్సు ఆత్మయే యని భావము. ప్రశ్నోపనిషత్ 3 వ ప్రశ్న 6 వ మంత్రములో చెప్పిన వర్ణనను బట్టి చూడ హృదయము నగా శిరస్సులోనున్నదనియే యనియు అచ్చటనుండు వేల కొలది శాఖలన్నియు నరములేయనియు రక్తనాళములు కావనియు వ్యానమనగా నాంగ్లేయములో Nervous system నరముల కూటమి అనియే స్పష్టమగుచున్నది. కాన దేహ మధ్యమందుగాక శిరోభాగమందుండు హృదయమధ్యమునందు అని చెప్పనలెను.

(4) భూతభవ్యస్య = ఈ వల్లి 5 వ మంత్రములోని రెండవపాదమును ఈ రెండవ పాదము నొకటియే విశేషార్థ మక్కడ చూడనలెను.

తాత్పర్యము:— పూర్ణుడు ఆత్మ శిరోఽగ్ర భాగమందుండు హృదయాకాశములో నివసించుచు నఙ్గుష్ఠమాత్రుడని ఔపచారికముగా తెలుపబడుచున్నాడు. అతడు త్రికాలములకును గత రానున్న సృష్టికంతకును అధీశునిగా ఎవరు ఎప్పుడు వేద్యమొనర్చుకొనునో యంతటనుండి యా జ్ఞానముచేతనే యతడు స్వసృష్టియెడల పరమాత్మవలె సమభావముతో వర్తించును. ఇది యదియె నిశ్చయము.

౧3 వ మంత్రము శ్రుతిః ॥ 13

అఙ్గుష్ఠమాత్రః పురుషో
జ్యోతిరి వాధూమకః ।

ఈశానో భూతభవ్యస్య
సఏవాద్యసఉశ్వః; ఏతద్వైతత్ ॥

అఙ్గుష్ఠమాత్రః=అఙ్గుష్ఠమాత్ర పరిమాణముగల; పురుషః= పురుషుడు; అధూమకః = పొగ లేని; జ్యోతిః=జ్యోతి; వెలుగు ఇవ = వలెనె; ( అస్తి = ఉన్నాడు ) భూతభవ్యస్య = భూత భవిష్యత్తులకు; ఈశానః = ప్రభువు; సః=అతడు; ఏవ = మాత్రమే; అద్య=నేడు; అస్తి = ఉన్నాడు; సః = అతడు; ఉ = నిక్కముగా; శ్వః= రేపు; (ఉండువాడు) ఏతద్వైతత్ = ఇదియదియే నిశ్చయము.

విశేషార్థము:— ( 1 ) అఙ్గుష్ఠ మాత్రః పురుషః = 12 వ మంత్రముయొక్క విశేషార్థములో చూడవలెను.

( 2 ) జ్యోతిః = ఆత్మ వెలుగు. వెలుగు రూపముననే అఖండమైన వెలుగురూపముననే యోగులకు ధ్యానసమాధులలో సాక్షాత్కరించును. కేనోపనిషత్తు 4 వ ఖండము 4 వ మంత్రము "విద్యుతో వ్యద్యుతదా 3" అని చెప్పబడినది. మెరుపుతీగయొక్క మెరుపువలె ఆత్మ గోచరించును. మహా నారాయణము 13 వ అనువాకము "నారాయణ పరో జ్యోతిః" అనగా శ్రేష్ఠమైన జ్యోతియనియు "జ్వాలమాలాకులంభాతి" ప్రకాశ పరంపరలతో వెలుగుచున్నదనియు "విశ్వార్చిః విశ్వతోముఖః" మహాగ్నివలె నున్నదనియు "విద్యుల్లేఖేవ భాస్వరా" మెరుపుతీగవలె ప్రకాశించుచున్నదనియు చెప్ప బడెను. శ్రీ రామకృష్ణ పరమహంసలవారికిని యట్లే దర్శన

మయ్యెను. క్రైస్తవ మతతత్వవేత్తకు Unappraacpable light సమీపించ వీలుగాని తేజస్సుగా కనపడెను. పురుష సూక్తములో ఆత్మ ఆదిత్యవర్ణుడని తెలుపబడెను. ఇచ్చట ఈ జ్యోతికి నొకవిశేషము కలదు. అధూమకః = పొగలేని వాడు. పొగ చీకటిని నీడను కళంకమును అజ్ఞానమును సూచించును. ఇవేవియులేని ప్రకాశమానమగు వెలుగు అని అర్థము.

( 3 ) ఈశానో భూతభవ్యస్య = 5 వ మంత్రములోని విశే షార్థము చూడవలెను.

( 4 ) అద్యశ్వః= నేడు రేపు. అరవిందయోగి ఈ వాక్యము నిట్లన్వయించుచున్నాడు He is to day and He is tomorrow అతడు నేడు ఉన్నాడు. అతడు రేపు కలడు ఆత్మైవ = ఈ ఆత్మ మాత్రమే నేడున్నది రేపుండును. కాన ఈ శరీరములో తక్కిన దంతయు నేడున్నది రేపుండేదికాదని అనగా పరివర్తనము నొందుచుండునని స్పష్టము బౌద్ధవాదన ప్రకారము కర్మఫలితము లేక వాసనా సముదాయము మాత్రము ఎల్లపుడు మారుచుండును. అదియే కలదు ఆత్మ లేదు, అను వాదమును ఈ వాక్యము ఖండించుచున్నది. కర్మ ఫలితములు కర్మ వాసనలు ఎల్లపుడు మారుచుండుట నిశ్చ యమే. దానికాధారముగా మారనది ఒకటి యుండవలెను. అస్తిది కలదని ఇందువలన స్పష్టము. 1, 1, 20 లో కలదందురు కొందఱు. లేదందురు కొందరు అని నచికేతస్సు తెలిపినదానికి ఈ వాక్యములో జవాబు కలదు. కలడనుమాటయే నిశ్చయము

రేపు అనుటచేత వేరొక్కరోజు మాత్రమే అనికాదు. భవిష్యత్తంతకును అని అర్థము నేడు రేపు అనుటచేత నిన్న లేదని అర్థముకాదు. భూతభవ్యస్య అను పదములో భూత కాలము భూతసృష్టి కూడ సూచింప బడినది. ఈశానః అనుట చేత నిన్న నేడు రేపు మూటికికూడ ఆయన ప్రభువని యర్థము.

తాత్పర్యము:— హృదయాకాశమందున్న అంగుష్ఠమాత్రుడని ఔపచారికముగా తెలుపబడు పూర్ణమైన పురుషుడను ప్రఖ్యాతితోనుండు ఈ యాత్మ యేమాత్రము బాగ లేనట్టి సర్వకాలము సర్వావస్థలలో నఖండముగా దేదీప్యమానముగా వెలుగుచుండును. భూతకాలమునకు భవిష్యత్కాలమునకు భూతసృష్టికి భవిష్యత్సృష్టికి అది ప్రభువు. అదియే నేడున్నది. రేపుండునది. నిశ్చయము. ఎన్నడు ఏమాత్రము పరివర్తనము నొందదు. అధ్రువమగు శరీరాదుల మధ్య సుధ్రువమై యున్నదానిని తెలిసికొనవలెను. ఇది యదియే నిశ్చయము. 12, 13 మంత్రములలో హృదయమందున్న ఆత్మకు బయట ప్రపంచమునకు సృష్టికిగల సంబన్ధము తెలుపబడినది. 12 వ మంత్రములో నొకచోట దానికి స్థానము 13 వ మంత్రములో దాని స్వరూపమును తెలుపబడెను.

౧౪ వ మన్త్రము శ్రుతిః ॥ 14

యథోదకం దుర్గేవృష్టం
పర్వతేషు విధావతి ।
ఏవంధర్మాన్ పృథక్పశ్యం
స్తానేవాను విధావతి ॥

యథా = ఏప్రకారము; దుర్గే = పర్వత శిఖరముమీద; వృష్టం = కురిసెడి; ఉదకం = నీరు; (వాన) వాననీరు పర్వ తేషు = కొండలభాగములందు; విధావతి = వివిధములుగాపరు గిడును, ఏవం = అట్లే; ధర్మాన్ = ధర్మములను, పృథక్ = భిన్నముగా, పశ్యన్ = చూచు, (సః = వాడు) తాన్ = వానిని; ఏవ = మాత్రమే; అనువిధావతి = అనుసరించి పరు గెత్తును,

విశేషార్థము:— (1) దుర్గే = ఎక్కుటకు కష్టమయినది. అత్యున్నతమైనశిఖరము అయ్యది ఏకాగ్రముగా తేలియుండును ఆ అగ్రముమీదను ఆ శిఖరముమీదను వాన కురియును ఆ వా నంతయును నొకే మేఘమునుండి ఒకే ప్రదేశమున వృష్టం కురియుచుండును.

(2) పర్వతేషు = పర్వతములయందు ఈ శిఖరము తేలు లోపల యెన్నియో యెత్తుపల్లములుగల ప్రదేశములుండును. ఎన్నియో లోయలు గండశిలలు నుండును. ఆ పర్వతమునకన్ని వైపుల నీరుజారిపడు వాలులుండును. శిఖరముపై పడు నీరు పల్ల మునకు వచ్చుటకై వాలు వెంబడి వీలు వెంబడి క్రిందకు దూకుచు వచ్చుచుండును. పర్వతముచుట్టు నధోభాగమందు సమప్రదే శమున నుండు జనులు ఈ సెలయేళ్లకు పలువిధముల పేర్లుపెట్టి యానీటికి నామరూపములనిచ్చి రంగును రూపమును, రుచిని వర్ణింపజొత్తురు. అసలు ఒకటే నీరనియు ఒకే ప్రదేశమందుపడిన దనియు మరచిపోయెదరు. మరచిపోయి తమలోదాము వివాద ములకు దిగెదరు.

(౩) ధర్మాన్ = ధర్మములు అనగా గుణములు లేదా నైతిక సాంఘిక మతవిషయక ధర్మములు వివిధ తారకమార్గములు వివిధ మతములు నామరూపభేదములన్నియు అని చెప్పవచ్చును.

(4) విధావతి = ధావ=అనగా పరుగెత్తుట విధావ అనగా విశేషముగా పరుగెత్తుట అనేక ఏరులుగా పరుగెత్తుట అనికూడ చెప్పుచున్నారు. ఇచ్చట ఉపమానమున కాయర్థమునరిపోవును. అనువిధావతి అను పదమునకు విశేషనే.

(5) పృథక్ పశ్యన్=10-11 మంత్రములలో నానేవపశ్యతి అనునదియు ఇదియు నొక్కటే విడివిడిగా జూచుట అంతర్లీనమయిన యేకత్వమును చూడకుండుట మూలకారణమగు నేకత్వమును తెలియకుండుట, జగత్తులో నవతరించిన ఏకస్థానము తెలియకుండుట.

తాత్పర్యము:— అత్యంత ఉన్నతమైన పర్వత శిఖరముపైనుండు దుర్గమమయిన అగ్రభాగమున పడెడి వాననీరంతయు నచ్చటనుండి యాపర్వతముచుట్టునుండు నీటివాలు ననుసరించి యనేక సెలయేళ్ళయి ఉత్సాహాతిశయముతో ఉవ్విళ్ళూరుచు నుర్విపై దొర్లిపడుచుండును. అట్లే వివిధ గుణములు నామరూపములు వస్తుజీవజాలము ప్రాణికోటియెల్ల దైవ మానవ యోనులలో నుద్భవించెడి జనము వారికుండు శారీరక మానసిక నైతిక ఆధ్యాత్మిక సాంఘిక ఆర్థిక రాజకీయవ్యవస్థాపనలన్నియును ధర్మములును, మతములును, వివిధములుగా కన్పట్టుచుండును. అభిన్నత్వమునే చూచువాడు అభిన్నత్వము ననుసరించియేపోవు

చుండునుగాని వెనుకకు మరలి అసలు తత్త్వమును గ్రహించడు. సెలయేళ్లలోని నీరు ఒకే మేఘమునుండి ఒక చోటనేపడి ఒక కొండచుట్టు జారి వేరు వేరు ప్రేగ్గను ఎట్లు పొందెనో అట్లే యీ ధర్మములన్నియు ఒకే యాత్మనుండి ఒకే హృదయసీమలో ప్రవేశించి యాయా దేశకాల పరిస్థితుల ననుసరించి భాషల మూలమున భిన్న భిన్న నామరూపములను ధరించినదని తెలిసి కొనవలెను. మూలాధారములో ఏకత్వమును అవతరించిన చోట ఏకత్వమును ఉద్దేశములోని ఏకత్వమును (అన్నిటి ఉద్దేశము వస్తోనకమువలెనే ప్రాణరక్షణ ప్రాణపోషణ ప్రాణపరిణామము) మరచి ప్రజలందఱును పలుబాముల పడుచున్నారు. జననమరణ రూపసంసారమున చిక్కుకొని తరింపజాలకున్నారు. ఆవృత్త చక్షుస్కులయినవారు మాత్రమే 1 మంత్రములో చెప్పినట్లు తరింపగలరు.

౧౫ వ మంత్రము శ్రుతిః ॥ 15

యథోదకం శుద్ధేశుద్ధ
మాసిక్తం తాదృగేవ భవతి ।
ఏవం మునేర్విజానత
ఆత్మా భవతి గౌతమ ॥

గౌతమ = ఓ నచికేతస్సా ! యథా=ఏ విధముగా; శుద్ధం= పవిత్రమయిన, ఉదకం = నీరు; శుద్ధే = శుద్ధమయిన దాని యందు, (ఉదకమందు) ఆసిక్తమ్= తడుపుటచేత, పోయుటచే;

తా దృ క్ = దానివలె, ఏవ = మాత్రమే; భ వ తి = అగుచున్నది; ఏవం = ఇట్లుగానే; విజానతః = జ్ఞానియయిన, మునేః = మునియొక్క, ఆత్మా=ఆత్మ, భవతి= అగుచున్నది.

విశేషార్థము:— (1) శుద్ధం ఉదకం= పవిత్రమయిననీరు, స్వభావముచే పవిత్రమయినది పిమ్మటకూడ ఆ ప వి త్ర త ను పోగొట్టుకొననది. స్వభావముచే పవిత్రమైనది పిమ్మట అపవిత్ర మయిగాని అపవిత్రమనుకొనిగాని సంస్కరింపబడి అసలు పవిత్ర తను పొందెనది, లేక గ్రహించినది. దీనిని శుద్ధమయిన ఉదక ములో చేర్చినపుడు రెంటి పవిత్రతలలో భేదముండదు. అంతియే గాక రెండును ఒకటే వస్తువులు కలసిన పిమ్మట భిన్నముచేయ వలవికాని వస్తువులు కలసి ఒకే పేరుతో బరగునవి.

(2) ఏవం=అదేవిధముగా అనుటచేత జీవాత్మ శుద్ధమనియు పరమాత్మకూడ శుద్ధమనియు స్ఫురించుచున్నది. జీవాత్మ పరమాత్మలో సెలయేళ్ళలోని నీరు సముద్రములో పరుగెత్తు కొనిపోయి పడునట్లే చేరునని స్ఫురించుచున్నది. ముండకము 3-2-8 వ మంత్రము యిదే భావమును ఇదే ఉపమానమును తెలుపుచున్నది "యథానద్యస్స్యన్దమానాస్సముద్రే" ప్రవ హించి పోయెడు నదులు సముద్రములో చేరునట్లు జీవాత్మ పరమాత్మలో లీనమగును. శుద్ధమయిన జీవాత్మకు అపవిత్రత లేక అజ్ఞానము ఎట్లు కలిగెనో యెట్లు తొలగెనో తెలిసికొనవలసి యున్నది. ఈ వల్లి మొదటి మంత్రములో చెప్పిన యింద్రియ ములు బాహ్యముఖములగుటయే యీ యపవిత్రతకు కారణ

మనియు, బాహ్య ప్రపంచ సంబన్ధ విసర్జనమే అపవిత్రత తొలగుటకు హేతువనియు చెప్పవచ్చును. ఈశావాస్యము 8 వ మంత్రము "శుద్ధమపాపవిద్ధమ్" అని ఆత్మను వర్ణించుచున్నది. ఆ వర్ణనము ఆత్మకు సర్వదా చెల్లునదియే.

(3) తాదృక్=అనగా దానివంటిది దీనినిబట్టి సాదృశ్యము, లేక సారూప్యమే చెప్పబడినదని యెంచవచ్చును. కాని జలము జలములో చేరినట్లు అని 1 వ పాదములో చెప్పినందున అట్టి ఊహకవకాశము లేదు. విజానతః మునేః= ముని అనగా మననశీలుడు మనన ధ్యానముల ద్వారా ఆత్మను చూచువారు సామాన్యార్థము. మౌనము వహించువాడు మునియని అట్లు సామాన్యుడు కాడని తెలుపుటకు విజానతః అను పదము వాడబడెను. దానికర్థము జ్ఞానియని జ్ఞానమనగా ఏకత్వదర్శనము యిచ్చట బ్రహ్మాత్మైక్యము తెలిసిన వాడని చెప్పవలెను.

(4) ఆత్మ= ఇక్కడ ఒక్కటే ఆత్మయని సూచించబడినది. మునియొక్క ఆత్మ పరమాత్మలో పడుట అనే సూచన కూడ లేదు, జ్ఞానియైన మునియొక్క ఆత్మ ఆత్మయగుచున్నది. అనగా తన స్వస్థితిని పొందుచున్నది. మధ్యకలిగిన అవిద్య లేక అజ్ఞానస్థితి ఆ గ్రహణము తొలగనదని అదివరకు రెండు ఆత్మలన్న భ్రమ తొలగుచున్నది

తాత్పర్యము:— శుద్ధమయిన పవిత్రమైన ఉదకము అట్టి శుద్ధమయిన పవిత్రమైన ఉదకములో చేరినపుడు రెండవదానివలెనే మొకటి యుదకముండును. రెంటిమధ్య ఏమాత్రము భేదముండదు. రెండును ఒక్కటే యగును. ఓ నచికేతస్సా!

జ్ఞానియగు మునీశ్వరునియొక్క ఆత్మ యాత్మయేయయి స్వస్వరూపమున విరాజిల్లును. జీవాత్మ, పరమాత్మలు రెండుకలవన్న భ్రమ తొలగును. ఏకత్వమే అనుభవమగును,

చతుర్థవల్లీ సమాప్తా-

— ద్వితీయాధ్యాయ ప్రథమవల్లీ సమాప్తా —



## ★ కఠోపనిషత్ ★

### ద్వితీయాధ్యాయము

### ద్వితీయవల్లీ - ౫ పఞ్చమవల్లీ -

౧ వ మన్త్రము - శ్రుతిః ॥ 1

పురమేకాదశద్వార
మజస్యావక్రచేతసః ।
అనుష్ఠాయ న శోచతి
విముక్తశ్చ విముచ్యతే; ఏతద్వైతత్ ॥

అజస్య = జన్మరహితుడగు; అవక్రచేతసః = వంకరలేని మనస్సుకలవానియొక్క; పురం=పట్టణము; ఏకాదశద్వారం= పదునొకండు ద్వారములుకలది; (అయియున్నది) అనుష్ఠాయ = జ్ఞానానుభవముకలుగగా; (మనుజుడు) నశోచతి = దుఃఖించడు; చ=మరియు, విముక్తః=జీవన్ముక్తుడగును, విముచ్యతే = జననమరణ రూప సంసార బన్ధమునుండి విడివడును. ఏతద్వైతత్=ఇది యదియే నిశ్చయము.

విశేషార్థము:— (1) అజస్య=పుట్టుకలేనివాడు మానవ శరీరములోనున్న జీవాత్మయనెడి ఆత్మకూడ పుట్టుకలేనివాడే, ఎవరికి పుట్టుక లేదో వానికి చావులేదు. కాన ఈ లక్షణములలో పరమాత్మకును జీవాత్మకు భేదమేమియులేదు. ఈశావాస్యము శాన్తి పాఠములో చెప్పిన "పూర్ణాత్పూర్ణ ముదచ్యతే" పూర్ణ

మగు పరమాత్మనుండి పూర్ణమగు జీవాత్మ వెల్వడెను. అనగా జీవాత్మరూపమున కనబడెను. అజస్య అని చెప్పుటచేత అచ్చట ఉపచ్యుత వ్యక్తమయ్యెననియే తెలుపవలెను. అని చెప్పబడిన దానికి పుట్టుక అని అర్థము కాదు.

(2) * అవక్రచేతసః= వక్రమనగా వంకర చేతస, అనగా మనస్సు లేక బుద్ధి లేక వివేకము. వక్రచేతసః అనగా వంకరగా పోయిన మనోబుద్ధ్యాదులు గలవాడు. అవక్రచేతసః అనగా అట్లు వంకరగా పోనవిగలవాడు ఈ వంకరగాపోవుటకు కారణము ప్రకృతి, లేక మాయ, "దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా" భగవద్గీత 7 వ అధ్యాయం 14 శ్లోకము త్రిగుణమయమయిన నామాయ దాటుటకు కష్టమైనది, అట్టి మాయచే మనోబుద్ధ్యాదులు సామాన్యముగా మోహములో పడుచుండును. అవక్ర చేతస్కుడనగా సహజముగా శుద్ధమైన బుద్ధ్యాదులు ఏ మాయచే వంకర పొందెనో ఆ వంకరనుండి తొలగినవాడు. ఎప్పుడు ఈ వంకరనుండి తొలగెనో అప్పుడు తాను అజుడని అమృతుడని (పుట్టుక - చావు లేనివాడని) తన స్వస్వరూపము తనకు తెలియవచ్చును. అంతకుముందు తాను పుట్టి చచ్చువాడను భ్రమయంతయు తొలగిపోవును.

(3) ఏకాదశద్వారంపురం=పురమనగా పట్టణము, మానవ

* ఈ మనోబుద్ధులలో అపస్మారము సన్నిపాత మరణము మొదలగునవి సంభవించినపుడుకూడ వక్రత కలుగుచుండును. అట్టి వంకరలు లేకుండ స్వతస్సిద్ధమైన నిర్మలమైన తేజస్సుకలవాడు అవక్రచేతసుడని చెప్ప వచ్చును.

శరీరమునకే పురమను పేరుకలదు. దానికి పదునొకండు ద్వారములు; నవరంధ్రములని మనము వాడుకొను తొమ్మిదియు తొమ్మిది ద్వారములు భూపతనమునకు పూర్వము అమలులో నుండెడి బ్రహ్మరంధ్రము నాభి రెండును కలసి 11 ద్వారములు ఈ శరీరములో శిరమందుండు హృదయమునకు బ్రహ్మపురి యను ప్రఖ్యాతి కలదు. "దివ్యే బ్రహ్మపురే" ముణ్డకం 2-2-7 దివ్యమైన బ్రహ్మపురి మానవ హృదయమే ఈ పురము బ్రహ్మ యొక్క పురము, నాదికాదు. ఇయ్యది యాత్మ మందిరము, నాదికాదు. అను భావముతో ఈ శరీరమును యీ పురమును కామాది అరిషడ్వర్గమునకు వశము కానియ్యక, దాని సహజ పరిపాలకుడగు ఆత్మవశమందే ఉంచవలెను.

(4) అనుష్ఠాయ = అనగా ధ్యానించుటయని అర్థముచెప్పుచున్నారు. అది సమంజసముగా తోచదు. అనుష్ఠానమనగా ఆచరణ, ఏ సిద్ధాంతము నమ్మెనో దానిని ఆచరణలో పెట్టుటను అనుష్ఠానమందురు, మొదటి పాదములో చెప్పిన అంశములు మూడు. (1) మాయకు లోబడని మనోబుద్ధ్యాదులు కలవాడు. (2) తన్మూలమున తాను అజుడని తెలిసికొన్నవాడు. (3) తాను నివసించి యున్న శరీరము తనదిగాక, తానుగాక, ఆ అజునిదే. ఈ మూడు అంశములు తన జీవితములో తనకు అనుభవమగుచుండగా తన చరిత్రలో ప్రత్యక్షమగుచుండగా తానుగాక యితర జీవకోటికంతకును కూడ అనుభవమగుచుండును. ఇట్టి ఆచరణ అతనికి స్వభావమయి పోవలెను.

(5) విముక్తః = మాయాబన్ధములన్నియు విడివడినవాడు. జీవించి యుండగనే, యీ శరీరమునందుండగనే ఆ బన్ధనము లన్నియు వీడిపోయినవాడు. 5వ ప్రశ్న 5వ బ్రాహ్మణము "యథాపాదోదర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హవైసపాప్మనా వినిర్ముక్తః" ఏవిధముగా నాగుపాము తన కుబుసమును విడుచునో అదేవిధముగా పుణ్యాపాపాది కర్మ సంబంధములనుండి విడువబడినవాడు, ఈ కుబుసముయొక్క ఉపమానము అర్థవంతమైనది. వీడనంతవరకు నద్యది యాపాముయొక్క దేహముతో నభిన్నముగా నె కనబడును, విడిపోయినప్పుడు కించిత్తైనను ఆపద యుండదు. అట్లే యీ పుణ్యాపాప కర్మలుగూడ మానవులకు సహజముగా అభిన్నముగా నపరిత్యాజ్యముగా కనపడును. విడివడినపుడు ఆపద లోపము ఉండదు. కుబుసము పోయిన పాము బ్రతికియే యుండును. అట్లే పుణ్యాపాప కర్మబన్ధనములు వీడిన పురుషుడును, బ్రతికియే యుండును. ఈ కర్మగాని పుణ్యాపాపకర్మగాని వాని బన్ధనములుగాని అనివార్యములు కావని స్పష్టము. అచ్చట పాము మరల కుబుసము పెట్టవచ్చును ఇచ్చట పురుషుడు మరల కర్మపరుడు కర్మబద్ధుడు కాగూడదా యని ప్రశ్నించవచ్చును. కాని యట్లు మ ర ల సంభవించదు. మొదటి పాదములోని మూడుపాయములును అనుష్ఠించినవాడు గాన తదనుష్ఠానమువలన యీ కర్మబీజము నశించును. వేయించిన గింజ ఎన్నటికి యెట్లు మొలవదో పాతరలో పోసిన గింజకు అంకురశక్తి ఎట్లు పోవునో నానపోసి మొలపించిన గింజకుండు అఙ్కురము ఎండిపోగా మరల ఆగింజ యెట్లు మొలవదో అట్లు

ఇతనికి కర్మపరత్వముగాని కర్మబద్ధత్వముగాని కలుగదు. అంకు రించిన గింజ ఆధారము లేనపుడు ఆ యంకురము కొలదికాలమే యుండునుగాని చిగురాకు వేయదు. అట్లే ఒకపర్యాయము పుణ్యా పాప కర్మబంధనమను కుబుసము వీడిన మనుజునకు మరల ఆ కుబుసము కలుగనేరదు. ఇతడే నిర్భయుడైన జీవన్ముక్తుడు,

(6) విముచ్యతే = శరీరపతనమైన పిమ్మట మరల శరీరము కలుగదు. స్థూలసూక్ష్మ కారణ శరీరములు లేవియు కలుగవు. అజుడుగానే ఆత్మ ఆత్మగానే ఆవరణావరోధ రహితముగా స్వత స్సిద్ధ తేజముతో ఆనందమున అలరారుచుండును. బుద్ధభగవా నుడు తెలిపినట్లు మరల ఇల్లు కట్టుటకు అవసరమైన పరికరము లన్నియు నాశనమై పోయినవి. పెట్టిన గోడల మీాద కట్టని ఇట్లె బ్రహ్మనిర్వాణ పదములో సర్వము తానై శోభిల్లుచుండును.

తాత్పర్యము:— మాయచే లేక ప్రకృతిచే కలిగింపబడిన అవరోధము తొలగింపబడుటచే విశుద్ధ వివేకుడయిన శుద్ధసత్వ స్థితిలోనుండి తానజుడనియు నమరుడనియు తావసించు 11 వాకిళ్లుగల పురము పరమపవిత్రమగు ఆత్మమందిరమనియు తెలిసి కొని తద్విధమున నివశేషముగా అనుష్ఠాన తత్పరుడై యున్న వాడు దఃఖమును పొందడు కర్మనుండి కర్మబంధనములనుండి విడివడి జీవన్ముక్తుడగును. మరియు పాము కుబుసమువలె, పండిన పండువలె యీా దేహము వ్రాలిపోయిన పిమ్మట మరల ఏవిధ మయిన దేహసంబంధము లేకుండ నిరుపాధికుడయి బ్రహ్మ నిర్వా ణమున ప్రవర్తిల్లును ఇది యదియె నిశ్చయము, ఏది జీవాత్మ యని పేర్కొన బడుచున్నదో అద్యది పరమాత్మయే.

౨ వ మంత్రము శ్రుతిః ॥

హగ్ంసః శుచిషద్వసురన్తరిక్షస
ద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్ ।
నృషద్వరసదృతసద్వ్యోమస
దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ ॥

శుచిషత్ = శుచియందున్నట్టి; హంసః = హంస; అన్తరిక్షసత్ = అన్తరిక్షమందుండు; వసుః = వాయువు, వేదిషత్ = యజ్ఞవేదికయందుండు; హోతా = హోత; దురోణసత్ = ఇంటియందుండు; అతిథిః = అతిథి; నృషత్ = నరునియందుండువాడు, వరసద్ = నరులయందు లేక వరములందుండువాడు, ఋతసత్ = ఋతమందుండువాడు, వ్యోమసత్ = ఆకాశమందుండువాడు; అబ్జాః = నీటిజీవులు, గోజాః = భూజీవులు; ఋతజాః = తేజోజీవులు, అద్రిజాః = కొండజీవులు, ఋతం = ఋతము, బృహత్ = గొప్పది.

విశేషార్థము:— (1) *శుచిషత్ = ఈ మంత్రము ఋగ్వేద సంహితలో కలదు. ఇది మహానారాయణోపనిషత్తులో 40 వ అనువాకములో 1 వ మంత్రమయి యున్నది. మహానారాయణము 12 వ అనువాకము 6 వ మంత్రముగానున్నది. సంహి

* ఆదిత్యో ఆత్మస్వరూపః అని ఆదిత్యుడే చరాచరములకెల్ల ఆత్మస్వరూపుడని శ్రుతివాక్యము కలదు.

తలో నిర్వర్తించినను ఉపనిషత్తులలో విపులార్థమున అన్వయించవలెను. శుచి అనగా పవిత్రమయినది, అందుచే సూర్యుడని అర్థము చెప్పుచున్నారు. ఆకాశమని అర్థము చెప్పుచున్నారు ఇందులో నెట్లయినను చెప్పవచ్చును, ఈ శుచియైన స్థానమందు వున్నవాడు,

(2) హంసః = అనగా గమనము కలవాడని అర్థము కాన సూర్యుడని అర్థము చెప్పుచున్నారు. హంసః అనగా శ్రేష్ఠమైన సన్యాసియని అర్థము కలదు. పరమాత్ముడని అర్థము కలదు. ఆకాశమందు వసించుచున్న సూర్యుడని చెప్పవచ్చును. అతి పవిత్రతయే స్థానముగాగల పరమాత్ముడని చెప్పవచ్చును. శుద్ధసత్త్వమునొందిన సన్యాస శ్రేష్ఠుడని చెప్పవచ్చును.

(3) వసుః = అనగా వాయువని అర్థము చెప్పుచున్నారు. వ్యాపించునది అని అర్థము కలదు. సూత్రాత్ముడని అర్థము కలదు. అంతరిక్షమందుండు వాయువు లేక అంతరిక్షమును ఆవరించువాడని చెప్పవచ్చును. వసుః అనగా సూర్యుడు సూర్య కిరణము అష్టవసువులలో నొకడు, అని అర్థము కలదు. సూర్యపరముగా అంతరిక్షమంతయు వ్యాపించిన కిరణములుకల వాడనిచెప్పవచ్చును. ఆత్మపరముగా అంతరిక్షమును ఆవరించిన శ్రేయోరూపి, శివంకరుడు మంగళప్రదుడు అని చెప్పవచ్చును.

(4) * వేదిః = యజ్ఞములు చేయునపుడు అగ్నిని నిలుపు

---

* అగ్నిర్వైహోతా అను శ్రుతివాక్యమును శ్రీ శంకరులవారు ఉదహరించుచున్నారు ఇయం వేదిః పరోన్తః పృథివ్యాః ఋగ్వేద సంహిత 2-3-20 వేది యనగా భూమి.

అరుగు లేక ప్రదేశము. వేదిషత్ అనగా వేదియందున్న వాడు హోత అనగా యజ్ఞకర్త. యజ్ఞవేదికపై కూర్చుని యజ్ఞము చేయు కర్తయని ఆత్మపరముగా నర్థము చేయవచ్చును. అనగా యజ్ఞసంసిద్ధుడైయున్న లేక యజ్ఞాచరణమందున్న మానవుడు ఆత్మస్వభావమును వ్యక్తపరచుచున్నాడని చెప్పవచ్చును. వేది యనగా అగ్నికుండము అగ్నికుణ్డమందు ఉన్నవాడు అగ్నిహోత్రుడు. హోత యను పదమునకు అగ్నిహోత్రుడని కూడ అర్థము చెప్పుచున్నారు. అగ్నియొక్క విశేషణమని ఆర్షీణ ఘంటు తెలుపుచున్నది. యజ్ఞకుండములో ప్రవేశించిన పవిత్రాగ్ని అని సూర్యపరముగా అర్థము చెప్పవచ్చును. వేది యనగా నొక స్థానము లేక ప్రదేశము అని అర్థముకలదు. అనగా భూమి వేది షత్ అన్నందున భూమిపై అగ్నిహోత్ర రూపమున ప్రజ్వరిల్లిన వాడు అని సూర్యపరముగా జెప్పవచ్చును.

(5) దురోణసత్ = దురోణమనగా కుండ, కలశము, లేక ఇల్లు అని అర్థము కలదు. అతిథి యనగా అతిథిగా వచ్చిన జీవి. కుండలోనుండు అతిథి అనునప్పుడు సోమరసమని అర్థము చేసిరి. ఇంటియందుండు అతిథిఅనునప్పుడు "అభ్యాగతస్స్వయంవిష్ణుః" అతిథి అభ్యాగతులు ఆత్మస్వరూపులే పూజనీయులె అని అన్వయించ వచ్చును. ఆత్మపరముగా మానవాది జీవకోటిరూపమున గృహస్థు సమభావము ను ఆదరణను పరీక్షించుటకు వచ్చు వాడు అని చెప్పవచ్చును. సూర్యపరముగా సోమ తేజ ందు గడి తద్రసమున వర్తిల్లువాడని అర్థము చెప్పవచ్చును. దురోణ మనగా ఇల్లు గనుక ప్రతి యింటియందు ప్రకాశించి పవిత్రము

చేయు సూర్యకాన్తి లేక అగ్నికాన్తి లేక దీపముకాన్తి అని చెప్పవచ్చును. ప్రతి ఓషధి వనస్పతికిని, ఒక్కొక్క కుదురుండును. అదియె దానికిల్లు ఆ యింటియందు ప్రవేశించి ఓషధి వనస్పతులను పోషించువాడని అర్థము చెప్పవచ్చును

(6) నృషత్ = మనుజునియందు ఆత్మరూపముందుండువాడు ఆత్మపరముగానిట్లు చెప్పవచ్చును. మానవునియందు తేజోరూపమున నున్నవాడని సూర్యపరముగా చెప్పవచ్చును. తైత్తిరీయము 2 వ అధ్యాయము 8 వ అనువాకములో మానవుని యందు సూర్యునియందుండు ఆత్మలు ఒకటేయని తెలుపబడెను. లేదా నరులు మొదలగు జీవరాశియందెల్ల అన్నరస రూపమున నుండువాడని చెప్పవచ్చును. పూర్వశాస్త్రము ప్రకారమును ఇప్పటి పాశ్చాత్యశాస్త్ర ప్రకారమును కూడ భూమిలోనుండు సర్వశక్తులు సూర్యునినుండి వచ్చుచున్నవి, సూర్యునివలననే యాహారపదార్థమంతయు నుత్పత్తి యగుచున్నది.

(7) వరసత్ = వరులనగా శ్రేష్ఠులు మానవులకంటే నుత్తములగువారు దేవతలనియు నట్టి దేవతలందుకూడ ఆత్మ కలదనియు ఒక అర్థము. వరమనగా ఉత్తమమయిన ప్రదేశము అందుచేత పుణ్యక్షేత్రములందుండువాడు, అని యొక అర్థము చెప్పుచున్నారు. వరమనగా నియ్యబడిన వస్తువు. దైవమువలన ప్రాణికోటిపొందెడి అన్ని మేళ్ళు వరములయియున్నవి. ఆ యన్నిటి మూలమున గోచరమగువాడు తన్మూలమున తాను తనను ప్రాణికోటికి నిచ్చుచున్నాడు. వరమనగా దానధర్మము

లని యర్థము కలదు. అనగా మనముచేయు దానధర్మములలో నిమిడియున్న ధర్మస్వరూపమని చెప్పవచ్చును.

(8) ఋతసత = సత్యములగు వైదిక కర్మయందు లేక యజ్ఞయాగాది క్రతువులయందున్న వాడనియొక అర్థము. ఋత మనగా పరమ సత్యము. పరాత్పరుని స్వస్వరూపము ఆసత్యమే కాన సత్యస్వరూపియయినవాడని చెప్పవచ్చును. ఋతః అనగా సూర్యుడనియు, దైవ శాసనమనియు అర్థములుకలవు. కాన సూర్యునిలోనుండువాడు; లేక ఈ ప్రపఞ్చమును నడుపు దివ్య శాసనములో నున్న వాడు.

(9) వ్యోమసత్ = ఆకాశమందున్న వాడు, హృదయాకాశ మందని కూడ చెప్పవచ్చును. వ్యోమమనగా మోక్షమని చెప్పు చున్నారు. అట్టి యర్థము కనబడదు. వ్యోమసత్ అనగా దేవ తలు గన్ధర్వులు అని అర్థము కలదు. గన్ధర్వాది యోనులలో కలవాడని చెప్పవచ్చును.

(10) అబ్జాః = జలచరములలో నుండు వాడు.

(11) గోజాః = భూమియందుపుట్టిన ప్రాణికోటిలోనుండు వాడు. గోవులనుండి వచ్చెడి పాలలో నుండువాడని అర్థము చెప్పుచున్నారు. భూమియందు పుట్టి ఓషధులు మొద లగు వానిలోనుండువాడు.

(12) ఋతజాః=సత్యమునుండి వెల్వడు తపస్సు మొదలగు శక్తులలోనుండు వాడు.

(13) అద్రిజాః=కొండలనుండి పుట్టు నదులు వృక్షములు గైరికాది ధాతువులలోనుండువాడు.

( 14 ) బృహత్ = అనగా మిక్కిలి వ్యాపించునది. ఋతం బృహత్ అనునపుడు ఆ పరమ సత్యము సర్వవ్యాపి మహోన్నతము అయినది అని చెప్పవచ్చును. మహమ్మద్ ప్రవక్త అల్లాహో అక్బర్ దేవుడు గొప్పవాడని చెప్పినపుడు యిదియె భావము, అంశంలో నిమిడి యున్నది. ఈ మంత్రములో పఞ్చభూతములు ఆత్మయేయనియు, ఆ పఞ్చభూతములలో జనించి చరించు జీవరాశియందుండువాడు ఆత్మయని కూడ తెలుపబడినది.

( 15 ) తిథి = అనగా అమావాస్యాది తిథివిశేషమనపేక్ష్య భోజన యాచనార్థ తత్ర తత్ర గచ్ఛతి పురుషః వై దేశికః అతిథిః తిథివిశేషము లేకయే పరగృహమునకుబోయి యన్నమును కోరెడి యన్యదేశీయుడు అతిథి.

తాత్పర్యము:— ఈ మన్త్రము సూర్యోపాసనలో నుపయోగించబడుచున్నది. మధ్యాహ్న సన్ధ్యావందనమందు దీనికి సూర్యపరమైన వినియోగము కలదు. ఇచ్చట సందర్భమును బట్టి సూర్యోపాసన ప్రశంసలేదు. ఆత్మవిచారణయే యిచ్చట ప్రధానమైనది. కాన ఆత్మపరముగానే దీనికర్థము చేయవలెను. అత్యన్త పవిత్రమైన స్థానమందుండి సర్వత్ర గమనించగలది. ఆకాశమందు సూర్యరూపమున వెలుగునది. అంతరిక్షమంతటను వ్యాపకమైనది. అంతరిక్షమున వాయురూపమున నున్నది. యజ్ఞవేదికయందు కూర్చుని అగ్న్యారాధనకు పూనుకొన్న యజ్ఞకర్తయందు ప్రస్ఫుటమగునది. భూమియందగ్ని రూపమున ఉన్నది. గృహస్థులయింటికి వచ్చెడి అతిథి

అభ్యాగతుల రూపమున పొడగట్టునది. నరులయందు ఉత్తమ యోనులందు ప్రాణికోటి కివ్వబడు సర్వశ్రేయస్సులయందు ప్రాణికోటి హృదయాకాశమందుండునది. పూర్ణ సత్య స్వరూపమున నిమిడియుండునది, నీటిలో భూమిలో కొండలలో పుట్టి చరించెడి వస్తుజీవజాలములో నుండునది. విశ్వసృష్టిని నడిపించు సత్యశాసనములో వెల్లడి యగునది. ఇది యదియన నేల దృశ్యాదృశ్య ప్రపంచమందంతటను నిండియున్నది. మహత్తరమైన సత్యస్వరూపమున సర్వము ఆవరించియున్నది.

3 వ మన్త్రము శ్రుతిః ॥ 3

ఊర్ధ్వం ప్రాణమున్నయతి
అపానం ప్రత్యగస్యతి ।
మధ్యేవామ నమాసీనం
విశ్వే దేవా ఉపాసతే ॥

(సః = అతడు) ప్రాణం = ప్రాణమును, ఊర్ధ్వం=ఊర్ధ్వముఖముగా లేక పైకిఉన్న, యతి=పంపుచున్నాడు, అపానం= అపానమును, ప్రత్యక్ = క్రిందికి లేక అధోముఖముగా, అస్యతి = త్రోయుచున్నాడు, మధ్యే= హృదయమధ్యమందు, ఆసీనం = కూర్చునియున్న, వామనం=పూజనీయుడైన, తం= వానిని, విశ్వేదేవాః = సమస్త దేవతలు లేక సకలేన్ద్రియములు, ఉపాసతే=ఉపాసింతురు పూజింతురు సేవింతురు,

విశేషార్థము:— (1) వామనం = పొట్టివాడు. పూజనీయుడు అని రెండర్థములు కలవు. హృదయమందుండువాడు కాన అఙ్గుష్ఠమాత్రుడు, పూజనీయుడు ఆత్మ గాన సర్వులకు పూజనీయుడు. సృష్టిస్థితిలయకర్త కనుక అందఱికిని పూజనీయుడు. ప్రశ్నోపనిషత్ ౩ వ ప్రశ్న ౩ వ బ్రాహ్మణము "ఆత్మన ఏష ప్రాణో జాయతే" ఆత్మనుండి యీ ప్రాణము పుట్టుచున్నది. పంచప్రాణములు ఈ ప్రాణముయొక్క స్వరూపములే.

(2) ప్రాణం అపానం = ప్రాణమనగా రెండర్థములు కలవు. లోపలనుండి బయటకువిడుచు ఊపిరి ప్రాణవాయువందురు. బయటనుండి లోపలకుపీల్చు ఊపిరిని అపానవాయువందురు. ఇదియొకఅర్థము. ౩ వ ప్రశ్న 5 వ బ్రాహ్మణములో పాయూపస్థలయందు అపాన ముండుననియు కన్ను, చెవి, ముక్కు, నోరులయందు ప్రాణముండుననియు చెప్పబడినది. ఆయా భాగములను నడిపించు నరములశక్తి Nervous energy అని ఒక అర్థము హృదయాకాశమందుండు ఆత్మయే ఈ ప్రాణాపానములను నడిపించుచున్నదని ఈమన్త్రమువలన స్పష్టము. వీనికి స్వయముగా శక్తిలేదనియు వీనికి అన్యమైనది వీనిని నడిపించుచున్నదనియు స్పష్టము. కేనోపనిషత్ మొదటి ఖండములో చెప్పిన భావమేయిది.

(౩) విశ్వేదేవాః = మానవదేహములోనున్న ఆత్మను సర్వదేవతలు పూజించుచున్నారు, అని చెప్పవచ్చును. విశ్వేదేవాః = సమస్తేన్ద్రియములు అని చెప్పవచ్చును. 2 ప్రశ్న

4 వ బ్రాహ్మణములో " ఏవంవాక్ మనః చక్షుశ్శ్రోత్రం - - - ప్రాణంస్తువన్తి " ఈ ఇంద్రియములు ప్రాణమును పొగడెను. ఈ యిన్ద్రియములన్నియు ప్రాణమును లేక ఆత్మను సేవించుచుండును. " వయందాతారః " మేము మీకందిచ్చువారము అని 2 వ ప్రశ్న 11 వ బ్రాహ్మణములో ఇన్ద్రియములు ప్రాణమునకు మనవిచేసెను. అట్లే యాత్మకుకూడ నింద్రియములన్నియు తమమూలమున కలుగదగు అనుభవములను అందిచ్చును. ఇట్టి యనుభవములను బొందుచున్నపుడే ఆత్మకు భోక్త లేక జీవుడు అను పేరు కలదు. 1 అ. 3 వ 4 వ మంత్రములో " ఆత్మేన్ద్రియ మనోయుక్తః భోక్తా " అని చెప్పబడినది. ఆత్మ ఇన్ద్రియమనస్సులతో కలసినపుడు భోక్త లేక జీవుడని చెప్పబడును. ఇన్ద్రియములు ఉపాసించుట యనగా తమతో కలిసియున్న ఆత్మను సేవించి తమ పరిచయములను అనుభవములను అందించుట.

తాత్పర్యము:— ఈ యాత్మ హృదయాకాశమందు నిలిచి యున్నది. ప్రాణమను శక్తిని ఊర్ధ్వముఖమున పైకి నడిపించును. అధోముఖమున అపానమును క్రిందకు త్రోయును, ప్రాణాపానములను శక్తులను ఆయా స్థానములందుంచి వాని నుండి పనులు గైకొనుచుండును. సమస్త దేవతలు ఈ యాత్మను భజింతురు. సకలేన్ద్రియములు తమకు కలిగిన అనుభవములను తమతో సంబన్ధము కలిగియున్న భోక్త యనుపేర బరగు ఆత్మకు అర్పింతురు. ఇట్లాత్మ దేవతలచేతను, ఇన్ద్రి

యములచేతను, పూజింప బడుచున్నది. వామనమను పేర వెలయుచున్నది.

౪ వ మంత్రము శ్రుతిః ॥ 4

అస్య విస్రంసమానస్య
శరీరస్థస్య దేహినః ।
దేహాద్విముచ్యమానస్య
కిమత్ర పరిశిష్యతే॥ ఏతద్వై తత్ ॥

అస్య = ఈ; శరీరస్థస్య=శరీరమందున్నట్టి వానియొక్కయు; విస్రంసమానస్య = అందులోనుండి విడబడి వదలిపోగల పోవు చున్న వానియొక్కయు; దేహినః = దేహియొక్క; దేహాత్ = దేహమునుండి; విముచ్యమానస్య = దేహము పడిపోయిన పిమ్మట; అత్ర = ఈ దేహములో; కిం = ఏది; పరిశిష్యతే = మిగులుచున్నది; ఏతద్వై తత్ = ఇది యదియే నిశ్చయము.

విశేషార్థము: (1) అస్య=అనగా ఇతనియొక్క వీనియొక్క అనగా 3 వ మాత్రములో చెప్పిన హృదయమధ్యయందాసీనుడై యున్న వామనం=పూజనీయుడై యున్న వానియొక్క

(2) దేహినః = దేహముకలవాడు ఈ వల్లి 1 వ మంత్రములో చెప్పినట్లు ఏకాదశద్వారపురమునకు అధీశుడై యున్న ఆత్మయొక్క అతడు శరీరస్థస్య = శరీరమందున్నవాడని చెప్ప బడెను. అనగా శరీరమందున్న కాలమందు జరిగెడి కార్యమును గూర్చి యోచింప బడుచున్నది.

( 3 ) విస్రంసమానస్య = విడివడునది శరీరములోనున్నను, దానిచే బన్ధింపబడక దానినుండి వేఱుపరచ తగినది. వేరుగా నున్నానని ఊహించి సంకల్పించి శరీరమును ఆత్మను విడివిడిగా భిన్న విషయములుగాభావించి వర్తించగలవాడు. తన్నుదాజూచు కొనగలవాడు; శరీరమును గమనించి పరిశీలించగలవాడు. ఇట్టి యవకాశముండబట్టియే యీ శరీరమును ఒకచోట భద్రపరచి పరకాయ ప్రవేశము చేయ వీలగునని యోగులు యెంచుచుండిరి. ఇట్లెంచుటయెగాక పరకాయప్రవేశము చేయుచుండిరి. అణిమాది సిద్ధులలో నిదియొకశక్తి. భారతము అనుశాసనపర్వము 40–41 వ ఖండములలో మహర్షి దేవశర్మయు ఆయన శిష్యుడు విపులునియు కథకలదు. విపులుడు యోగశక్తిచే తనకాయమును వీడి దేవశర్మ భార్యయగు రుచియొక్క దేహములో ప్రవేశించి దేవేన్ద్రుని యాకర్షణలనుండి యామె పాతివ్రత్యమును కాపాడెను.

( 4 ) విముచ్యమానస్య = దేహము వదలిపోగానే విముచ్యతే అను శీర్షిక క్రింద 1 వ మంత్రముయొక్క విశేషార్థము చూడవలెను.

( 5 ) కింపరిశిష్యతే = ఏమిమిగులును, ఏమియు మిగులదు. అని అర్థము. ఈ దేహములో ఆత్మ లేవగానే దానినుండి పుట్టిన ప్రాణముకూడ లేచును. ప్రాణము లేవగానే దానిమీద ఆధారపడియున్న ఇంద్రియశక్తులు లేచిపోవును, ఇట్లీ మూడు లేవగానే శరీరము శవమగును. ఇది సామాన్యస్థితి, యోగధారణ వలన నిలిపినపుడు ఆ శరీరము శవవత్ గానున్నను నశించదు. ఇతర

సమయములందు నశించును. బృహదారణ్యకములో యిట్లే శరీరమును విడుచు విధానము చెప్పబడెను.

ఏతద్వై తత్ = ఈ శరీరమును విడువగలది, విడిచిపోయినది. ప్రధానమయినది. అదియే ఆత్మ అదియే బ్రహ్మ.

తాత్పర్యము:— ఈ శరీరములోనున్నట్టిదియు శరీరమునకు అధిపతి అయినట్టిదియు పూజనీయమయినదియు నగు ఆత్మ శరీరము కంటె వేరైనది. వేరుపరచ తగినది. వేరని భావించి వ్యవహరించునది. అది దేహమును విడిచిపోగానే దేహముగాని ఆ యింద్రియములుగాని నిశ్చేష్టులు నిస్తేజస్కములు అగును. అచ్చట యేమియు మిగులదు. ఇది యదియే నిశ్చయము.

౫ వ మంత్రము శ్రుతిః ॥ 5

న ప్రాణేన నాపానేన
మర్త్యో జీవతి కశ్చన ।
ఇతరేణతు జీవన్తి
యస్మిన్నేతా వుపాశ్రితౌ ॥

కశ్చన = ఏ ఒకడును; మర్త్యః=నశ్వరమానవుడు; ప్రాణేన= ప్రాణముచేత; అపానేన = అపానముచేత; నజీవతి = బ్రతుకుట లేదు; తు = కాని; యస్మిన్ = దేనిమీద; ఏతౌ = ఈ రెండు; ఉపాశ్రితౌ = ఆధారపడి యున్నవో; ఇతరేణ = అట్టి యితరవస్తువు వలన, జీవన్తి = బ్రతుకుచున్నారు.

విశేషార్థము:— (1) మర్త్యః = నశించు స్వభావముకల శరీరము కలవాడు. అట్టి శరీరమే తానను కొను భ్రమకలవాడు.

(2) ప్రాణేన-అపానేన = 3 వ మంత్రములో చెప్పబడి నవి. ఈ రెండే అచ్చట విశేషార్థము చూడవలెను. ఊపిరి పీల్చుటవలన విడుచుటవలన మాత్రమే, మనుజుడు జీవించుట లేదు. ప్రశ్నోపనిషత్తులో నివ్వబడిన నిర్వచన ప్రకారము, ప్రాణాపాన శక్తులవలన కూడ జీవించుట లేదు. ఈ ప్రాణాపానములు రెండేగాక వ్యానోదానసమానమువలనకూడ జీవించుట లేదు

(3) ఇతరేణ = మరియొక వస్తువు, ఆ వస్తువు యొక్క స్వరూపము ఈ మంత్రములోనే సూచింపబడినది. దేనిమీద నీ ప్రాణాపానములు రెండు ఆధారపడి యున్నవో అది ప్రశ్నోపనిషత్తు 2 ప్రశ్న 3 వ బ్రాహ్మణములో ప్రాణము తాను ఐదుగా విభజించుకొని శరీరమును భరించుచున్నదని చెప్పబడినది. 3 వ ప్రశ్న 3 వ బ్రాహ్మణములో ఆత్మనుండి ప్రాణము ఉత్పత్తి అయినట్లు చెప్పబడినది. 4 ప్రశ్న 7 వ బ్రాహ్మణములో ఇన్ద్రియములు ప్రాణములు "ఏతత్సర్వం పరే ఆత్మని సంప్రతిష్ఠతే" తమకంటే ఉత్తమమయిన ఆత్మ యందు నిలచి యున్నవని చెప్పబడెను. కాన ప్రాణాది పంచప్రాణములు పదు నాలుగు ఇంద్రియములును ఆత్మమీదనే ఆధారపడి యున్నవి. ఈ ఆత్మ యీ శరీరమందుండబట్టియే, ఈ శరీరము కళాకాన్తులతో వర్తించుచున్నది. ఇతరేణ అనునప్పుడు ఆత్మయనియే చెప్పవలెను. ముఖ్యప్రాణమనికూడ చెప్పరాదు. సమాధిస్థితిలో

నుండెడివారికి గుండె కలదు; ఊపిరి ఆడదు. రామకృష్ణపరమ హంసకును, ఇట్టి అనుభవమే కలిగెను. (ఏసు నాథుడు Man liveth not by bread but every word of God మానవుడు ఆహారమువలన గాక దైవ వచనము వలన జీవించుచున్నాడు. అని చెప్పెను) ఇచ్చట word అనుపదము నకు వచనమను సామాన్యార్థము చేయబడినది. అట్లుగాక జాన్ సువార్త ప్రకారము word అనునది దేవుని ప్రథమ పుత్రుడు అనగా మొట్టమొదట వ్యక్తమయిన జీవాత్మయని అర్థము చెప్పవచ్చును. ఇట్లు చెప్పినయెడల ఏసునాథుని ప్రవ చనమునకును, ఈ ఉపనిషన్మంత్రమునకును భావము, భాష సరిపోవును.

తాత్పర్యము:— నశ్వరశరీరముగల మానవుడు ఎవడును ప్రాణాపానాది పంచప్రాణముల వలనగాని, ఉచ్ఛ్వాస నిశ్వాస ములవలనగాని జీవించుటలేదు. కాని ఈ ప్రాణాదులును ఇంద్రి యములును దేనిమీద ఆధారపడియున్నవో, అట్టి యాత్మ మూలమున మానవులు జీవించు చున్నారు.

ఆరవ మన్త్రము శ్రుతిః ॥ 6

హన్త త ఇదం ప్రవక్ష్యామి
గుహ్యం బ్రహ్మసనాతనం।
యథాచ మరణం ప్రాప్య
ఆత్మా భవతిగౌతమ ॥

గౌతమ = ఓ నచికేతస్సా! హన్త=ఆశ్చర్యము, ఇదం= ఈ, గుహ్యం = రహస్యమును, ప్రవక్ష్యామి = తెలిపెదను, మరణం=మరణమును, ప్రాప్య=పొంది, చ=మరియు, యథా= ఎట్లు, ఆత్మ = ఆత్మ, సనాతనం = శాశ్వతమైన, సనాతన మైన; బ్రహ్మ = బ్రహ్మ, భవతి = అగుచున్నది, ఇతి = ఇట్లని చెప్పెను.

విశేషార్థము:— (1) హన్త=ఆశ్చర్యము అని అర్థము ఇది 5 వ వల్లి యింతవరకు వచ్చిన పిమ్మట మృత్యువు ఇట్లేల చెప్పవలసివచ్చెనో తోచుటలేదు. హన్త అనగా ఇప్పుడు అని శ్రీ శంకరులవారు అర్థముచేసిరి. ఇప్పుడు గుహ్యమైన సమాచారము చెప్పెదను అని యముడు వాగ్దానము చేయు చున్నాడు. ఇదివరకు చెప్పినది మనుజుడు జీవించియున్నపుడు జరిగెడి శరీర ఆత్మసంబన్ధమనియు ఇకముందు జెప్పెడిది శరీర పతనముపిమ్మట సమాచారమనియు ఎంచవలసి యుండును. హన్త అను పదమునకు ఇప్పుడు అను అర్థము నిఘంటులో కన పడదు. సంభాషణారంభమున వ్యర్థపదముగా నుపయోగించ వచ్చును. లేదా సంతోషమును, ఆశ్చర్యమును, సంభ్రమ మును, తెలుపు పదము లేదా దయ, జాలి, దుఃఖము, తెలుపు పదము లేదా ఆశీర్వాదమును దెలుపు పదముగా వాడెదరు. ఇచ్చట దీని ప్రయోజనము కన్పట్టుటలేదు. ఇదివరకు చెప్పిన అంశములనే మరల విపులపరచ పూనుకొనెనని యెంచ వచ్చును. ఆత్మయె బ్రహ్మయని స్థిరపరచకపోవుటచేత తన సంతోషమును యముడు వెల్లడిచేసి యుండవచ్చును.

(2) గుహ్యంబ్రహ్మ = రహస్యమయిన బ్రహ్మనుగూర్చి అని శ్రీ శంకరులవారు అన్వయించిరి. అన్యు యితరులును అనుసరించిరి. ఈ మంత్రములో 2 విషయములు తెలుపబడె నని విశదపరచిరి. 1 సనాతన బ్రహ్మనుగూర్చియు, 2 మరణా నంతరమున ఆత్మపొందు దశనుగూర్చియు ఈ మన్త్రములో రెండు అంశములుగాక ఒకే అంశము చెప్పబడెనని తలంచబడు చున్నది. పై మంత్రములో ఈ శరీరము ఎవరిమీద ఆధార పడి నడుపుచున్నదో తెలుపబడెను. ఈ మంత్రములో నట్టి శరీరము పోగనపుడు, అనగా నశించినపుడు, దాని కాధారమై యున్న ఆత్మ యేమగునో అనగా నెట్లు సనాతనబ్రహ్మ మగునో అదియే రహస్యములలోనికెల్ల ఉత్తమ రహస్య మనియు, దానినిగూర్చియే యముడు చెప్పబూనుకొనెన నియు, తలంచబడుచున్నది. చ అను అక్షరము సముచ్చ యము రెంటిని కలుపుట కుపయోగించును. అప్పుడు రెండు అంశములేవని ప్రశ్నింపవచ్చును. 1 మరణం ప్రాప్య 2 బ్రహ్మ భవతి అని చెప్పవచ్చును. లేదా " యథా " తో కలపి నిరర్థక మైనపదముగా నెంచవచ్చును.

తాత్పర్యము:— ఓహో ! ఆశ్చర్యము దేనిమీద ఆధార పడి మనుజుల శరీరములు బ్రతికియున్నవో యట్టి ఆత్మ పదా ర్థము ఈ శరీరము మరణించినపిమ్మట ఏ విధమున సనాతన బ్రహ్మము అగుచున్నదో ఓ నచికేతస్సా ఆ అద్భుతమైన పరమరహస్యమైన యీ విషయమును నీకు నేను తెలుపు చున్నాను. అత్యన్త శ్రద్ధాళువై దీనిని గమనింపుమా!

౭ వ మంత్రము శ్రుతిః ॥ 7

యోనిమన్యే ప్రపద్యన్తే
శరీరత్వాయ దేహినః ।
స్థాణుమన్యేఽనుసంయన్తి
యథాకర్మ యథాశ్రుతమ్ ॥

యథాకర్మ = కర్మననుసరించియు, యథాశ్రుతం=శ్రుతుల ననుసరించియు, అన్యే = కొందఱు, దేహినః = దేహములో నుండిన ఆత్మలు, శరీరత్వాయ = శరీరమును పొందుటకు, యోనిం=మాతృగర్భమును, ప్రపద్యన్తే=ప్రవేశింతురు, పొందుదురు; అన్యే=ఇతర, ఆత్మలు, స్థాణుం = స్థావరమును, అను సంయన్తి = పొందుచున్నారు.

విశేషార్థము:— (1) దేహినః=దేహమందున్న ఆత్మలు అనగా నిదివరకు జన్మ పొందుచున్నవారు ఆ శరీరములు నశించిన పిమ్మట మరల శరీరముపొందు కారణము తెలుపబడుచున్నది.

(2) శరీరత్వాయ = శరీరము పొందుటకు స్థూలసూక్ష్మ శరీరము యేదైనను కావచ్చును. మానవ, దేవ, పశు, పక్షి యోనులలో నేదైనను కావచ్చును. స్థావర జంగములలో నేదైనను కావచ్చును. ఎచ్చటనైన యేదైన దేహము పొందుటకు అని భావము ఏయొక జాతి నిర్దేశము కాలేదు.

(3) యోనిం=మాతృగర్భమున పై దెలిపిన యే జాతిలో నైనను సరే శరీరము పొందుటకు పూర్వముండు సన్నిహిత స్థితి ఐతరేయములో 4 విధముల జన్మకారణము తెలుపబడెను. 3 వ అ. 1 ఖండము 4 వ మంత్రము 5 వ విధానము స్వంత సృజన బృహదారణ్యకము 1 అ. 4 వ ఖండము 3 వ బ్రాహ్మణము 5 వ బ్రాహ్మణము యోని అనగా నుత్పత్తి కారణము. కొంత కాలము ధరించి పక్వమయిన రూపమున గర్భగోళమునుండి వెడలించునది.

(4] * స్థాణుం = స్థాణువనగా స్థావరములగు ఓషధి వనస్పతులని (శ్రీ) శంకరులవారు అర్థముచేసిరి. మానవజన్మ ఎత్తిన ఆత్మ పరిణామదశలో లోగడ వదలి వచ్చిన స్థావర రూపమును పొందుననిఁ యర్థము. ముణ్డకం 1 అ. 2 ఖండం 10 వ మంత్రములో "ఇమంలోకం హీనతరం వావిశన్తి" ఈమనుజలోకముగాని అంతకంటె తక్కువ లోకముగాని పొందుదురని చెప్పబడెను. 3 వ ప్రశ్న 7 వ బ్రాహ్మణములో పుణ్యలోకములు పాపలోకములు మనుష్య లోకములు కలుగునని చెప్పబడెను. అందుచే జడపదార్థము నుండి క్రమేణ మానవ దేవయోనులవరకు పరిణామము పొందుచు మధ్య మధ్య కర్మ ప్రాబల్యముచే హీన యోనులలో పుట్టవచ్చునని యీ మంత్రము స్పష్టము చేయుచున్నది. ఇట్టి

* స్థాణుం అను పదమునకు మోక్షమని కొందఱర్థము చెప్పుచున్నారు. అచంచలమైన స్థితిగనుక స్థాణుం అనగా స్వర్గమని వారి ఊహ. ఇది ఔపచారికము మోక్షమను అర్థము. ఈ పదమునకు రూఢి కాదు. స్థాణుః అనగా శివుడని అర్థము కలదు. శ్వేతాశ్వతరము.

అవకాశము కలదని శ్రీ అరవిందయోగి అంగీకరించియున్నారు. కాని అరుదుగా నిట్లు సంభవించును.

(5) * యథాకర్మ యథాశ్రుతం = అనగా కర్మనుబట్టి జ్ఞానమునుబట్టి అని అర్థము చెప్పబడినది. ఇంకొక విధముగా చెప్పవచ్చును. ప్రమాణ గ్రన్థములలో చెప్పిన విధమున చేసిన కర్మలననుసరించి జన్మలు కలుగునని చెప్పవచ్చును. 3 వ ప్రశ్న 10 వ బ్రాహ్మణములో చిత్తము యెట్లుండునో యా విధముగా సంకల్పించిన లోకము కలుగునని చెప్పబడెను. భగవద్గీత 8 అధ్యాయము 6-7 శ్లోకములనుబట్టి జీవితమంతలో కలిగయున్న భావములనుబట్టియే అన్త్యకాలమున బుద్ధి నిలుచుననియు దానిని బట్టియే జన్మ కలుగుననియు చెప్పబడెను. "యథాప్రజ్ఞం హి సంభవాః" లోగడ జన్మలో కలిగిన ప్రజ్ఞావిశేషమునుబట్టి జన్మ కలుగునని శ్రుతి వాక్యమును శ్రీ శంకరుల వారుదహరించిరి. బృహదారణ్యకము 4 అ. 4 ఖండము 4 వ బ్రాహ్మణములో కర్మయు జ్ఞానమును మరుజన్మలోనికి తీసుకొని పోవునని చెప్పబడెను.

(6) అనుసంయన్తి = అనుసరించి పోవును. కర్మను, జ్ఞానమును అనుసరించియని చెప్పవచ్చును.

---

* ఈ మంత్రములో పునర్జన్మకారణము కర్మయని చెప్పబడెను. ఆ కర్మనుండి విడిబడ్డవారు జన్మనుండి వైదొలగగలరు. అందుకనియే సన్యాసము ఉత్తమమని చెప్పబడెను. 'పరీక్ష్యకర్మ చితాన్ లోకాన్' ముండకం ౧-౨-౧౨ జన్మలు లోకములు కర్మవలననే కలుగుచున్నవి. దానిని వీడుట విత్తనమును నాశనము చేయుటయే.

తాత్పర్యము:— శరీరధారణ మొనర్చిన యీ యాత్మ తా జేసిన కర్మనుబట్టియు తా సంపాదించిన జ్ఞానమునుబట్టియు ప్రమాణ గ్రంథములలో చెప్పబడిన విధమున నూతన దేహము లను పొందుటకు మాతృగర్భమున ప్రవేశించును, ఇట్లు కొందఱికి సంభవించును, మరికొందఱి విషయములో స్థావరములగు ఓషధి వనస్పతుల దేహములు కూడ ఆయా కర్మజ్ఞాన ఫలిత ముగా సంభవించవచ్చును, ఈ శ్రుతి పునర్జన్మ కలుగునని స్పష్ట ముగా తెలుపుచున్నది. ఆ పునర్జన్మకు కారణము కర్మజ్ఞానము అని సూచించుచున్నది. ఆ జన్మ ఉత్తరోత్తర క్రమేణ ఉత్తమ మైనదేగాక అధమమైనదికూడ కావచ్చునని సూచించుచున్నది. ఇచ్చట జ్ఞానమనగా బ్రహ్మజ్ఞానము మాత్రముకాదు, బ్రహ్మ జ్ఞానమయినచో ఈ జన్మలలో నేదియును కలుగదు.

౮ వ మంత్రము శ్రుతిః ౻ ౪

యఏష సుప్తేషు జాగర్తి
కామం కామం పురుషో నిర్మిమాణః ।
తదేవ శుక్రం తద్బ్రహ్మ
తదేవామృత ముచ్యతే
తస్మిన్ లోకాశ్శ్రితాస్సర్వే
తదునాత్యేతి కశ్చన । ఏతద్వైతత్

యః=ఎవడు; ఏషః=ఈ; పురుషః=పురుషుడు; సుప్తేషు నిద్రపోవువారియందు; కామం కామం వివిధ కామ్యములను;

నిర్మిమాణః=నిర్మించుచు; జాగర్తి = మేల్కొని యున్నాడు; తత్=అది; ఏవ=మాత్రమే, శుక్రం=పవిత్రుడు, లేక తేజో రూపుడు; తత్=అది, బ్రహ్మ=బ్రహ్మ; తత్=అది, ఏవ= మాత్రమే, అమృతం=అమృతము, [ అని ] ఉచ్యతే=చెప్ప బడుచున్నది, తస్మిన్= దానియందు, సర్వే=సకల, లోకాః= లోకములు, శ్రితాః=ఆశ్రయించి యున్నవి. కశ్చన=ఎవడును, తత్=దానిని, ఉ=నిశ్చయముగా, నాత్యేతి=అతిక్రమింపజాలడు, ఏతద్వై తత్=ఇది యదియే నిశ్చయము.

విశేషార్థము:— (1) సుప్తేషు=నిద్రపోవుచుండగా గాఢ నిద్రకావచ్చును, స్వప్నస్థితి కావచ్చును. అజ్ఞానస్థితి కూడ కావచ్చును. కాని స్వప్నావస్థయే ముఖ్యముగా సూచింపబడె నని యెంచవలెను. ఏలయన కామం కామం నిర్మిమాణః కోరి కలను కలిగించుచు అని చెప్పబడినది. సుషుప్తిలో "యత్ర కామం నకామయతే స్వప్నం నపశ్యతి" మాండూక్యము 5 వ మంత్రము అచ్చట స్వప్నము కనడు కోరిక, కోరడు. అని చెప్ప బడినది. అందుచేత నచ్చట స్వప్నావస్థయు, లేక అజ్ఞానావ స్థయు అని చెప్పవచ్చును. అట్టి స్థితిలో నితనికి తైజసుడనిపేరు. ప్రశ్నోపనిషత్ 4 వ ప్రశ్న 5 వ బ్రాహ్మణములో స్వప్నస్థితి వర్ణింపబడినది.

(2) జాగర్తి=మేల్కొని యున్నాడు. తైజసుడు మేల్కొని యున్నవాడు ప్రశ్నోపనిషత్తు 4 వ ప్రశ్న 3 వ బ్రాహ్మణములో "ప్రాణాగ్నయ ఏవ ఏతస్మిన్ పురే జాగ్రతి" ఈ శరీరమను పురమందు ప్రాణాగ్నులే మేల్కొని యున్నవి, అని చెప్పుచు

న్నది. ఆ ప్రాణాగ్ని లేవన యీ మంత్రము స్పష్టము చేయుచున్నది. జీవాత్మయే యీ ప్రాణాగ్నులలోని వాడు అనికాని ఆ ప్రాణాగ్నులకు కర్తయనిగాని ఈ మంత్రము తెలుపుచున్నది బ్రహ్మసూత్రములుకూడ ఈ మంత్రములో దెలుపబడిన వ్యక్తి జీవాత్మయేయని నిశ్చయించెను.

(౩) నిర్మిమాణః=నిర్మించువాడై, సృష్టించువాడై అని అర్థము. జీవాత్మగా నిర్బన్ధించబడక పూర్వము తనకుండెడి సృష్టిశక్తి యిప్పుడు కూడ కొంతవరకు ఉపయోగమగుచున్నదని అర్థము. ఆ శక్తిని పూర్తిగా పునరుద్ధరించుట కవకాశము కలదని సూచన చేయబడినది. మొదటి పాదమునకు శ్రీ అరవిన్దయోగి ఇట్లనువదించెను. This is he that is awoke in those who sleep నిద్రించు బహుజనులలో మేల్కొని యున్నవాడు ఇతడే. అనగా ఆ ఒక్క ఆత్మ బహుజనులందరిలో మేల్కొనియున్నాడు, ఆత్మయొక్క ఏకత్వము కూడ ఋజువగుచున్నది.

(4) బ్రహ్మ=పరమాత్మయని అర్థము. మహానారాయణములో 1 అనువాకము 7 వ మంత్రము "తదేవశుక్ర మమృతం తద్బ్రహ్మ తదాపస్స ప్రజాపతిః" అని చెప్పబడినది. అదియే తేజస్సు అమృతము, హిరణ్యగర్భుడు అదియే పంచ భూతములు.

(5) తదునాత్యేతి కశ్చన= 2 వ అధ్యాయము 1 వ వల్లి 9 వ మంత్రము యొక్క విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము:— నిద్రించు సమస్త జీవులలోను అవిద్యావరణమువలన మోహితమయిన సమస్త జనులలోను యెవడు మేల్కొనియుండి ఆయా కామ్యములను కోర్కెలను కామ్యపదార్థములను సృష్టించుచున్నాడో అదియే శుద్ధమైన తేజస్సు అదియే బ్రహ్మ అదియే అమృతమని చెప్పబడుచున్నది. దానియందే భూర్భువస్సువరాది లోకములన్నియు నిలిచియున్నవి. ఎవరును దానిని అతిక్రమించజాలరు అనగా దాని నుల్లంఘింప జాలరు. ఇది యదియే నిశ్చయము.

౯ వ మంత్రము శ్రుతిః ॥ 9

అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ।
ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥

యథా=ఏవిధముగా; ఏకః=ఒక్కడయిన, అగ్నిః = అగ్ని, భువనం=లోకమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడై, రూపం రూపం= వస్తువుయొక్క ఆకారమునుబట్టి, ప్రతిరూపః = సమానమైన రూపముగలవాడు; బభూవ = అగుచున్నాడో, తథా=అట్లే, ఏకః=ఒక్కడయిన, సర్వభూతాన్తరాత్మా=సర్వభూతములలోనుండు ఆత్మ, రూపం రూపం= ప్రతిదాని యాకారమును బట్టి, ప్రతిరూపః= సమానమైన రూపముగలది, భవతి= అగుచున్నది, చ=మరియు, బహిః=అతీతము (అయియున్నది)

విశేషార్థము:— (1) అగ్నిః = అగ్నిదేవుడు ఒక్కడే దహింపగల శక్తిగలవాడు.

(2) రూపం రూపం ప్రతిరూపః = లోకములో నేయే వస్తువులను లేక జీవములను దహించునో, ఆ రూపమునకు తగిన రూపముతో పేరుతో యుండును. చింతచెట్టును కాల్చునపుడు చింతనిప్పందుము మనుజ శవమును కాల్చునపుడు ఆ ఆకారము ననే శవాగ్ని యందుము. ఆ కాల్చెడి వస్తువుయొక్క ఆకారమునుగాక వాసనకూడ కలుగుచుండును. శ్రౌతాగ్ని యనియు స్మార్తాగ్నియనియు ఆ ప్రయోజనములనుబట్టి భిన్నమైన పేర్లు పొందుచుండును. అరణులలో నున్న పుడు కాష్ఠాగ్నియను పేరుపొందును. అసలు అగ్ని ఒక్కటే దహించు శక్తియు నొకటే.

(3) సర్వభూతాన్తరాత్మా = భూతమనగా జడము ప్రాణముకూడ, సమస్త వస్తుజీవజాలములోపల ఉన్నది గనుక అన్తరాత్మయని పేరు. ఆత్మ సృష్టిలోని సమస్తమునందు నిమిడియున్నది. ముణ్డకము 2 అ. 1 ఖండం 4 మంత్రము "ఏషసర్వభూతాన్తరాత్మా" ఈ పరమాత్మయే సర్వభూతములందున్నవాడు, అని చెప్పుచున్నది.

(4) రూపం రూపం ప్రతిరూపః = ప్రపంచములో 84 లక్షలు జీవరాశి కలదని ప్రతీతి. యేజీవముకలదో; దానిలో ఈ అన్తరాత్మ ప్రవేశించుచున్నది. దానికి జీవాత్మయనిపేరు. ఆ ఒక్కొక్క రకమునకేగాక ఆ రకములో నున్న వ్యక్తులకెల్ల ఒక్కొక్క జీవాత్మగా కనపడుచుండును. జడపదార్థము

నకు జడముగాను జీవపదార్థమునకు జీవముగాను పిలువబడుచుండును.

(5) * బహిః = బహిరనగా బయట అన్తరముగాను, బయటను అని యొకవిధముగా అర్థము చేయుచున్నారు. ఈ ఆత్మ ప్రతివస్తు జీవములోపలను వెలుపలను కలదని అర్థము చెప్పవచ్చును. ఆ విషయము నిశ్చయమే. ఈశావాస్యము మొదటి మంత్రము మొదటిపాదము ఆ సత్యమును విశదపరచుచున్నది. కాని యిచ్చట యట్లు చెప్పుట పొసగదు. "రూపంరూపం ప్రతిరూపో బభూవ" అనిచెప్పుటచేత లోపలనున్నాడని చెప్పుటయే ముఖ్యము. "బహిః" అనునపుడు వెలుపల అనిగాక అతిక్రమించి అతీతము అయి అని చెప్పుటయే మేలు. ఆయాజీవిలో

---

* పురుషసూక్తము "అత్యతిష్ఠద్దశాంగుళం" సృష్టినంతయు నతిక్రమించి ఆత్మయున్నదని చెప్పబడెను. దృశ్యపదార్థములలోని దృష్టాన్తము తీసుకొన్నను అట్లే కనపడును. విద్యుత్ లేక మెరుపు విశ్వమంతయు వ్యాపించియున్నది. ఎచ్చట యేయే రూపములో గ్రహించబడి వినియోగించబడునో యాయా రూపమున ఆయా కార్యకర్తగా తెలుపబడుచుండును. ఒకచోట దీపముగా ఒకచోట విసనకగ్రిగా ఒకచోట గంపము త్రోయునదిగా ఒకచోట రైలు నడుపునదిగా ఒకచోట వంటచేయునదిగా ఒకచోట నేయునదిగా కనబడుచున్నది. దీపములలో కూడ ఆ గాజు తొప్పెనుబట్టి ప్రకాశభేదము కలుగుచున్నది. ఒక దీపములోనుండియు అదే సమయమున యితర దీపములు వెలిగించుచుండును. లోకములోనున్న విద్యుత్తు రేడియో వార్తలను సంచారము చేయుచు ఆయా యంత్రములను మించియున్నది.

నాయా వస్తువులో ప్రవేశించి ఈ ఆత్మ ఆయా నామరూప ములతో బరగుచున్నమాట నిశ్చయమే. ఆయా నామరూప ములతో బరగుటతోడనే దానివ్యాప్తి శక్తి ఆఖరయి పోవుట లేదు.

(6) భువనం = అన్ని భూతములు, జడములు, జీవములు ఇందులో నివసించును. గనుక ఇది భువనము భు అగుదానిని అనం కాపాడునది. అన్ని వస్తు జీవములను తన గర్భమందుంచి కాపాడునది.

తాత్పర్యము:— స్వగత భేదము ఏ మాత్రము లేక అఖండమైయున్న అగ్ని ఈ భువనములోని వస్తుజీవజాలములో ప్రవేశించి ఆయావస్తు జీవజాలమునకు సరియయిన నామరూప ములను పొందుచుండును. దహించు వస్తు జీవజాలమునుబట్టి కూడ సరియయిన నామరూపములను వహించుచుండును. ఇట్లే ఆత్మ సర్వభూతములయందు సర్వవస్తు జీవజాలమందు ప్రవేశించి వానివానికి అనువగు నామరూపములను ధరించు చుండును. ఆయా సర్వ భూతములను అతిక్రమించిగూడ నుండును.

౧౦ వ మన్త్రము శ్రుతిః ॥ 10

వాయుర్యథైకో భువనం ప్రవిష్టో
రూపంరూపం ప్రతిరూపోబభూవ ।
ఏకస్తథాసర్వ భూతాన్తరాత్మా
రూపంరూపం ప్రతిరూపోబహిశ్చ ॥

ఏకః = ఒక్కటైన, వాయుః = వాయువు తక్కినపదము లకు ప్రతిపదార్థము 9 వ మంత్రములో చూడవలెను.

విశేషార్థము:— (1) వాయుః = వ్యాపించు గుణము కలది. ఇతరపదములకు విశేషార్థము 9 వ మంత్రములోని విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము:— స్వగతభేదము ఏమాత్రములేక అఖండమైయున్న వాయువు ఈ భువనములోని వస్తుజీవజాలములో ప్రవేశించి ఆయా వస్తుజీవజాలమునకు సరియైన నామరూపములను పొందుచుండును. ప్రాణాదిరూపమునభరించు వస్తుజీవజాలమునుబట్టికూడ సరియైన నామరూపములను వహించుచుండును. ఇట్లే ఆత్మ సర్వభూతములయందు సర్వవస్తుజీవజాలమందు ప్రవేశించి వానివానికి అనువగు నామరూపములను ధరించుచుండును. ఆయా సర్వభూతములను అతిక్రమించియుండును.

౧౧ వ మంత్రము శ్రుతిః ॥ 11

సూర్యోయథా సర్వలోకస్యచక్షు
ర్నలిప్యతేచాక్షుషైర్బాహ్యదోషైః ।
ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా
నలిప్యతే లోకదుఃఖేనబాహ్యః ॥

సర్వలోకస్య = అన్నిలోకములకు, చక్షుః=కన్నుఅయిన, సూర్యః = సూర్యుడు, యథా = ఏప్రకారము, చాక్షుషైః=

కంటిసంబన్ధమయిన, బాహ్యాదోషైః = వెలుపలదోషముల చేత, నలిప్యతే = అంటబడదు, మైలబడదు, తథా = అట్లే, ఏకః = ఒక్కడైన, సర్వభూతాన్తరాత్మా = సర్వభూతము లలోనున్న ఆత్మ, లోకదుఃఖేన = లోకములలోనుండు దుఃఖ ములచేత; బాహ్యః = ఆ దుఃఖములకు భిన్నమైనది, అతీత మైనది, గనుక, నలిప్యతే = అంటదు మైలపడదు.

విశేషార్థము:— (1) సర్వలోకస్యచక్షుః = సమస్త లోకములకు కన్ను లోకమనగా లోకములోని జీవజాలమం తయు అనికూడ అర్థము. ఈ జీవజాలమంతయు లోకములో నిమిడియున్నది. లోకమునకు కన్ను అనగా లోకము ఇతర ములను చూచుటకు ఈ సూర్యుడు తగిన వెలుతురును ఇచ్చు చున్నాడు. సూర్యకాన్తి వస్తువు లేక జీవముమీాదపడి దాని ప్రిభావము దానినిచూచు జీవియొక్క కంటిలో పడును. ఆ పడిన బింబములో తలక్రిందులుగా నుండును. దానివిషయము మెదడులో దృష్టిసంబన్ధముగల కేంద్రమునకు తెలుపబడును. అచ్చట తలక్రిందుగానున్న బింబమును సరిగా నిలిపి బయట దేనినుండి ఈ బింబమేర్పడినదో దానిరూపమును మనస్సు గ్రిహించుచున్నది. బుద్ధి నిర్ధారణ చేయుచున్నది. సూర్య కాన్తి ఆయా వస్తువు లేక జీవముమీాదపడుటచే వస్తువు లేక జీవముయొక్క పై భాగముననున్న దోషములు ఆ కిరణము నకు లేక కాంతికి అంటవు. దానిని ఉన్న దున్నట్లుగా ప్రతిఫ లింపచేయుట యే ఆ కాన్తి లేక కిరణముయొక్క కర్తవ్యము ఇట్టి ఈ వస్తువును లేక జీవమును చూచెడి కన్నుకూడ అట్టి

దోషములవలన మాలిన్యమును పొందదు. అందులో ఫలాని దోషములున్నవని కనిపెట్టునేగాని గుడ్డిగాని పాపగాని నరములుగాని మెదడులోని భాగముగాని ఆ దోషముల బాధ పొందవు. అట్టి వస్తువును లేక జీవమును చూచుటకు సాయపడు సూర్యకిరణము లేక కాన్తిగాని ఇట్టి దాని ప్రతిబింబమును పొందెడి కన్ను, కంటి అధిష్ఠాన దేవత ఆ కన్నుగల వ్యక్తి లేక ఆ జీవాత్మ లేక ఆ వస్తువు జీవమందలి దోషములచేత వ్యధ నొందదు. లోక విదితము,

(2) బాహ్యదోషైః = దృశ్యమగు వస్తువు లేక జీవము యొక్క పై భాగమున లేక వెలుపలనుండుదోషములు లోతట్టు నుండు దోషములు సూర్యకాంతి లేక కిరణములవలన తాకబడవు. అందుచే బాహ్యదోషముల ప్రశంసయే చేయబడినది.

(3) లోకదుఃఖేన = లోకమందలి దుఃఖము, దీనత్వము, బాధ, ఆవేదన, మొదలగునవన్నియు ఇవన్నియు శరీరములోని ఇంద్రియములద్వారా పరిచయమగునవి. శరీరమే లేనపుడు వీని సంబన్ధమే యుండదు. ఇవన్నియు కర్మఫలితములు, ద్వన్ద్వములకు సంబన్ధించినవి. ఆత్మ అక్రియుడుగాన ఈ ద్వన్ద్వములకును యీ కర్మ ఫలితములకును భిన్నమై అతీతముగా నుండును. ఈ ద్వంద్వములను యీ కర్మఫలితములను ఈ ఆత్మ అనుభవించదని ఈ మంత్రము స్పష్టము చేయుచున్నది. అన్ని జీవములలో నుండు ఆత్మ ఒకే కాలమందు ఆయా భిన్న జీవులకు కలిగెడి భిన్నానుభవములను పొందుచుండెడి యెడల ఆ యనుభవములన్నియు దుర్భరములగును. ఏక కాలమందు పరస్పర భిన్నము

లగు అనుభవములు కలుగవచ్చును. అందువలననే యీ జీవాత్మలు ఒక్కటేగాక వేరని వాదించబడుచున్నది. ఈ సర్వభూతాన్తరాత్మ ఆ జీవాత్మగాక దానితో పాటుండెడి పరమాత్మ యని అర్థము చెప్పబడుచున్నది. ఈ ఉపనిషత్తు 1 అధ్యాయం 3 వ వల్లి 4 వ మంత్రము భోక్తను తత్స్వభావమును నిరూపించినది. ఇంద్రియమనో యుక్తమయిన ఆత్మ భోక్త యగుచున్నాడు గాన ఇంద్రియ మనస్సులతో యుక్తమయినపుడే అవె తాననుకొనినపుడే తాను శరీరము వేరుపరచ వీలుగానివి అనుకొనినపుడే ఈ లోకదుఃఖములు ఆ యాత్మకు అంటును. ఈ యనుకొనుటయే అవిద్య. తాననుకొన్నంత మాత్రముచే ఆత్మకు స్వస్వరూపమున యివి అంటజాలవు. త్రాడునుజూచి పామనుకొని యొకడు భయపడవచ్చును, పాముకుగల గమనశక్తిగాని విషముగాని త్రాడుకు సంభవించవు. అట్లే ముత్యపు చిప్పను జూచి వెండియని భ్రమించినను వెండికుండు విలువ దానికి లభించదు, ఎండమావులను జూచి నీరనుకొన్నను దాహముతీర్చు శక్తి వానికి లభించదు. అట్లే ఈ యాత్మ యీ సుఖదుఃఖములు పడుచున్నది యని యెవరైన యెంచినను యీ యారోపించిన సుఖదుఃఖములు దానికి వికారము కల్పించవు. ఇదియే శ్రీ శంకరులవారి వివర్తవాదము, అధ్యాసవాదము. ఇంతవరకు నిది సమంజసమే కాని ఈ సుఖదుఃఖములు ఆత్మకు కలుగునని ఆరోపించినవాడెవడు? దీనిని పొందుచున్నవాడెవడు? దానికీమంత్రములో ప్రత్యుత్తరము కనపడదు. తాను సర్వమైనవాడను సత్యమును గ్రహిం

చక భిన్నత్వమును ఆరోపించుకొనిన అహంకారుడు (Ego) వ్యక్తియే ఈ సుఖదుఃఖములను పొందుచుండును. ఎప్పుడీ భిన్నత్వమును అసత్యమని గ్రహించి యారోపించ మానుకొనునో అపుడేశరీరమున్నను దానిచే కలుగదగిన ప్రత్యేకత నశించును.

తాత్పర్యము:— సూర్యుడు ఒక్కడే సమస్త లోకముల లోని సమస్త వస్తుజీవజాలమునకును పరస్పరము చూచుటకు సాయపడుచున్నాడు. అతని కిరణములు లేక కాన్తి ఏ వస్తువు మీాదనైనను పడినపుడే దానిరూపము కంటిలో ప్రతిబింబిత మగుచున్నది. ప్రతిబింబితమైన రూపమే చూడబడుచున్నది. ఏ వస్తువు లేక జీవముమీాద ఈ కిరణము లేక యీ కాన్తి పడు చున్నదో దాని లోపలగాక బయటనుండు దోషము లేవియు ఆ కిరణమును లేదా కాన్తినిగాని లేదా దానిప్రతిబింబము ఎచ్చట పడుచున్నదో యా కంటిని దాని యంత్రమును దాని యధిష్ఠాన దేవతను మైలపరచుట లేదు. అంటనే అంటవు. అట్లే సర్వ భూతములలోనున్న అంతరాత్మ ఆయాభూతములు ఆరోపించు కొని అనుభవించెడి సుఖదుఃఖములచేత మైలపడదు. ఇట్లారో పించుకొనుటకు అవిద్యయె కారణము. అవిద్య తొలగగానే ఆరోపించుకొన్నవాడు నశించును. ఆరోపణచే బాధనొంద జాలని అంతరాత్మ స్వతస్సిద్ధమైన తేజముతో యథాప్రకా రము వరిలుచుండును.

౧౨ వ మన్త్రము శ్రుతిః ౻ 12

ఏకోవశీసర్వ భూతాన్తరాత్మా
ఏకంరూపం బహుధా యఃకరోతి ।

తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥

యః = ఎవరు, ఏకః = ఒక్కడే, వశీ = సర్వస్వతన్త్రుడు, సర్వభూతాన్తరాత్మా = సర్వభూతములలోపలనున్న ఆత్మ, ఏకం = ఒకటైన, రూపం = రూపమును, బహుధా = అనేకములుగా, అనేకవిధములుగా, కరోతి = చేయుచున్నాడో, తం = వానిని, ఆత్మస్థం = తమ ఆత్మగానున్నట్టి, యే ధీరాః = ఏ ధీరులు, అనుపశ్యన్తి = వేద్యమునచ్చుకొనుచున్నారో, తేషాం = వారికి, శాశ్వతం = శాశ్వతమైన, సుఖం = ఆనందము, ఇతరేషాం = ఇతరులకు, న = లేదు,

విశేషార్థము:— ఈ మన్త్రము శ్వేతాశ్వతరము 6 వ అధ్యాయము 12 వ మంత్రముగా నున్నది. కాని రెండు భేదములు కలవు. ఇచ్చట సర్వభూతాన్తరాత్మా యున్నది. అచ్చట నిష్క్రియాణాం బహూనాం అని కలదు. ఇచ్చట రూపం అని కలదు. అచ్చట బీజం అని కలదు.

(1) ఏకం = ఒక్కడే దీనికి అసమానుడని అర్థము చెప్పుచున్నారు. అతనికి సమానులుగాని మించినవారుగాని ఎవరూ లేరు.

(2) వశీ = వశమందుంచుకొన్నవాడు జగత్తునంతను తన వశమందుంచుకొన్నవాడు. తనను వశపరచుకొనగలది ఏదియు లేనందున అతడే సర్వస్వతంత్రుడు నియన్త.

( 3 ) ఏకంరూపం బహుధా=ఏకంరూపం అనగా తన ఒక్క రూపమును బహుధా అనేకములుగా చేయుచున్నాడని ఒక అర్థము. "అజాయమానో బహుధావిజాయతే" పుట్టుక లేని వాడు అనేకములుగా పుట్టుచున్నాడు. అని పురుషసూక్తము తెలుపుచున్నది. తన రూపమే అనుటచేత అందులోనుంచి చేయబడినవస్తువు అతని రూపముతోనే యుండవచ్చునని యూహించవలెను. "ప్రతిభవన్తిసరూపాః" అని ముణ్డకం 2 అ. 1 ఖండం 2 వ మన్త్రము తెలుపుచున్నది. తానే యీ సర్వభూతములకు నిమిత్త ఉపాదాన కారణమని స్పష్టమగు చున్నది ఒకేరూపమును అనేక విధములుగా జేయుచున్నాడు. అనగా రూపములో మార్పులేదు. దానిని చేయుటకు తల పెట్టిన విధానములలో మార్పున్నది. ఏ వస్తువులను ఏయే దామాషాగా సమకూర్చి చేసినను చిట్టచివరకు ఒకరూపము గానె పరిణమించును. ఇట్టిభావమే శ్రీ అరవిన్దయోగి తెలుపు చున్నాడు. He fashions one form of things in many ways వస్తువుల ఒకేరూపమును అనేక విధములుగా చేయుచున్నాడు.

( 4 ) ఆత్మస్థం = ఆత్మయందు అని చెప్పుచున్నారు. శ్రీ శంకరులవారు బుద్ధియందు అని అర్థము చేయుచున్నారు. బుద్ధిలో ప్రతిబింబిత మగునని వారి భావము లేదా బుద్ధియను నపుడు supermind అని అర్థము చెప్పవచ్చును. ఆత్మ

యమును అనిచెప్పుటయే మేలు. ఏది యింతవరకు జీవాత్మ యని అనుకొనుచున్నారో దానియందే పైని తెలిపిన ఏకోవశీ అగు ఆత్మ కనబడుటయే ప్రధానమైన భావము రెంటియొక్క అభేదత్వము స్పష్టపడును. 6 వ మంత్రములో "ఆత్మా భవతి బ్రహ్మ" మానవశరీరములోనుండు ఆత్మ పరబ్రహ్మమగు విధానము చెప్పుటకు మృత్యుదేవత పూనుకొనెను. ఆ విధానమును ఇందులో తెలియపరచెను.

(5) ధీరాః = ఆత్మదర్శనముచేసిన జ్ఞానులు పరమానన్దము వారిసొత్తు.

(6) ఇతరేషాం=ఇతరులు, అజ్ఞానులు ఆత్మను చూడని వారు వివిధముగా కనపడువానిలో ఏకత్వము చూడలేనివారు 2 అధ్యాయం 1 వ వల్లి 10-11 మంత్రములలో చెప్పిన నానాత్వమునే చూచువారు.

తాత్పర్యము:— నిరుపమానుడును, ఏకైకుడును, సర్వమును తనవశమునందే యుంచుకొని తానెవరికి వశముకాని సర్వస్వతంత్రుడును సర్వవస్తు జీవజాలమందు లోపలనున్న వాడును ఏకమైన తనరూపమునే అనేక రూపములుగా చేసిన వాడును, ఒక్కొక్క రూపమునే అనేక మార్గముల నిర్మించ గలవాడును అగువానిని తమ ఆత్మలో నున్నవానినిగానే కాన తమ ఆత్మగానే యే జ్ఞానులు దివ్యదృష్టిచే జూచి యనుభవింతురో వారికే శాశ్వతమైన సుఖము పరమానన్దము లభ్యమగుచున్నది. ఇతరులకు అవిద్యాబాధితులకు అజ్ఞానులకు

నానాత్వమే చూచువారికి నానాత్వములోనున్న ఏకత్వమును చూడలేనివారికి ఇట్టి శాశ్వతసుఖము లభింపనేరదు.

౧౩ వ మన్త్రము (శ్వే॰ ౬॥ 13

నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానాం
ఏకోబహూనాం యోవిదధాతికామాన్ ।
తమాత్మస్థంయేఽ నుపశ్యన్తి ధీరా
స్తేషాం శాన్తిశ్శాశ్వతీనేత రేషామ్ ॥

అనిత్యానాం = అనిత్యములమధ్య; నిత్యః = శాశ్వతమైనది; చేతనానాం=బుద్ధిగలజీవులలో; చేతనః = బుద్ధి; బహూనాం= అనేకమందిలో; ఏకః = ఒక్కడే; యః = ఎవడు; కామాన్= కోరికలను; విదధాతి = తీర్చుచున్నాడు; తం = వానిని; యేధీరాః = ఏ జ్ఞానులు; ఆత్మస్థం = ఆత్మయందున్నవానినిగా అనుపశ్యన్తి = అనుభవైకవేద్యమొనర్చుకొందురో; తేషాం= వారికి; శాశ్వతీ=స్థిరమైన; శాన్తిః = శాన్తి (కలుగుచున్నది) ఇతరేషాం=అన్యులకు; న = లేదు; ( కలుగదు )

విశేషార్థము:— ఈ మన్త్రము శ్వేతాశ్వతరము 6 అ. 13 వ మంత్రముతో పోల్చవచ్చును. అక్కడ ఇచ్చట మొదటి రెండుపాదములు కించిద్భేదముతో సమానముగా నుండును. ఇచ్చట " నిత్యోఽనిత్యానాం " అని కలదు. అచ్చట నిత్యోనిత్యానాం అని యున్నది, అదియే భేదము.

(1) అనిత్యానాం = అనిత్యమగు వస్తువులు ఎన్నియో కన్పట్టుచుండును. లోకమంతయు అనిత్యమేయని తోచుచుండును. అట్లున్నను అన్నిటిమధ్య నిత్యమైన వస్తువొకటి కలదని ఈ మన్త్రము తెలుపుచున్నది. అద్యదియే ఆత్మ 1 అ. 2 వ వల్లి 22 వ మంత్రములో "అనవస్థేష్వవస్థితమ్" అను వాక్యమును దీనితో పోల్చవచ్చును.

(2) * చేతనానాం = చేతనమనగా పరమాత్మలోని చిత్ శక్తిలోని భాగము అట్టిది కలవారు చేతనులు ఈ చేతనులలో నుండు చైతన్యము పరమాత్మ అనుగ్రహించినదే. దానివలననే యితర విషయములను గ్రహించుశక్తి కలుగుచున్నది. చైతన్యమనగా జీవకళయనియు అర్థము కలదు. అట్లును చెప్పవచ్చును. జీవునిలోని జీవకళ ఆయననుండియే వచ్చుచున్నది.

(3) బహూనాం = అనేకమంది అనేక జీవులు అనేకరకములు అనేక పదార్థములు ఉన్నను అన్నిటిమధ్య తానొక్కడే యయి యన్నింటికి అంతరాత్మయయి యున్నవాడు.

(4) కామాన్ = కామములను, లేక కోరికలను జీవబాహుళ్యమునకుగల అక్కరలను అన్నిటిని కనిపెట్టి తీర్చువాడు అన్ని కామములను తీర్చక కొన్నిటిని నిరాకరించుచున్నవాడుకూడ. మానవులలో నధర్మములైన కోర్కెలు తీర్చబడుటలేదు. కవిసార్వభౌముడగు రవీంద్రుడు తెలిపినట్లు మనకు

---

*జీవులన్నిటి హృదయములోగల కోరికలను తీర్చుచున్నాడు గాన ఆయన సర్వజ్ఞుడనియు సర్వోదారుడనియు చెప్పవలెను.

వరములనిచ్చుట ఇవ్వక నిరాకరించుచు రెండు విధముల మనకు పరమాత్మ సాయము చేయుచున్నాడు.

(5) ఆత్మస్థం = చివర రెండు పాదములును వెనుకటి మంత్రములోని రెండు పాదములతో పోల్చవచ్చును. ఒక్క భేదము కలదు. అచ్చట సుఖము చెప్పబడెను. దానికి బదులు ఇచ్చట శాన్తి చెప్పబడెను. రెండును అవినాభావ సంబన్ధము కలవే. శాన్తము లేక సౌఖ్యము లేదని శ్రీ త్యాగరాజులు వారు పాటను పాడియుండిరి. శాన్తమనగా ఉపరతియని అర్థము కలదు. శారీరక మానసిక ఆధ్యాత్మిక కర్మలనుండి విరమించుట యని అర్థము.

తాత్పర్యము:— అనిత్యమయినవస్తువులమధ్య నిత్యమై యున్నది. చైతన్యముగల వస్తువులలో, జీవులలోనుండెడి జీవకళ, చిత్ శక్తి అయియున్నది. అనేక సంఖ్యాకులలో ఏకమై నదిగా నున్నది. అపరిమితమైన జీవకోటికిగల అక్కరలను తీర్చుచున్నది. ధర్మబద్ధమైన కోర్కెలను తీర్చుచు అక్రమమయిన వానిని నిరాకరించుచున్నది. కోర్కెలు తీర్చు విధానమును శాసనమును అనుగ్రహించి యున్నది. దానిని తమ ఆత్మలో నున్నట్లు తమ యాత్మగానె యున్నట్లు యే జ్ఞానులు ప్రబోధ మొనర్చుకొని యనుభవించుచున్నారో వారికి శాశ్వతమయిన శాన్తి కలుగుచున్నది. ఇతరులకు యిట్లు చూడలేని వారికి నానాత్వమే. చూచెడి వారికి ఈ శాంతి కలుగనేరదు.

౧४ వ మంత్రము శ్రుతిః ॥ 14

తదేతదితి మన్యన్తే
ऽనిర్దేశ్యం పరమం సుఖం।
కథంను తద్విజానీయాం
కిముభాతి విభాతివా ॥

అనిర్దేశ్యం = వర్ణింపవీలుకాని; పరమం=శ్రేష్ఠమైన; సుఖం= సుఖమును; తత్ = అది; ఏతత్ =ఇది; ఇతి=అని; (జ్ఞానులు) మన్యన్తే=గ్రహించుచున్నారు; తత్ =దానిని; కథం=ఎట్లను= నిశ్చయముగా; విజానీయాం = తెలిసికొనవచ్చును; కిం = ఏది; ఉ = నిశ్చయముగా; భాతి = ప్రకాశించుచున్నది, వా = లేదా, విభాతి = విశేషముగా ప్రకాశించుచున్నది.

విశేషార్థము:— (1) అనిర్దేశ్యం = నిరూపించుటకు వీలు కానిది. మానవభాషలో చెప్పతరముకానిది. అనుభవము మూలముగానే గ్రాహ్యమగునది. అయ్యది "పరమంసుఖం" 12 వ మంత్రములో చెప్పిన శాశ్వతమైన సుఖమున్ను 13 వ మంత్రములో చెప్పిన శాశ్వతమైన శాన్తిన్ని రెండున్ను ఒక్కటే. రెండున్ను వర్ణించనవిగానివే ఏలయన:— "యతో వాచోనివర్తన్తే అప్రాప్యమనసాసహ "మనస్సున్ను వాక్కున్ను దానిని పొందలేక తిరిగివచ్చెను. అని తైత్తిరీయము 2 వ అధ్యాయము 4 వ అనువాకము తెలుపుచున్నది. ఆ సుఖము భాషకు అందదు. మనస్సుకు అందదు. శరీరములోని యే యిన్ద్రియమునకుఅందదు. ఆత్మ స్వయముగా పొందవలసినదే

తీపిరుచి తిన్నవానికే గోచరమగును. వర్ణనచే గోచరము కాదు. ఐతరేయములో ప్రథమాధ్యాయము ౩ వ ఖండము 3-4-5-6-7-8-9 మంత్రములలో అన్నము గ్రహించుటకు ఇన్ద్రియముల కెట్లుశక్యమో తెలుపబడెను. అపానశక్తియే దానిని గ్రహించగలదని 10 వ మంత్రము స్పష్టముచేసెను. స్థూలమైన అన్నవిషయమే ఇట్లుండ సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాత్మవిషయమును, దాని లక్షణమగు ఆనన్ద విషయమును ఈ ఇంద్రియములకు గోచరము కావని చెప్పుటలో ఆశ్చర్యము లేదు. కేనోపనిషత్తు మొదటిఖండ మాతయు నందుకే యుపయోగింపబడెను.

( 2 ) తదేతదితి = అది యిదియేయని గ్రహించుచున్నారు అనిర్దేశ్యమయిన సుఖము ఇదేయని గ్రహించుట యెట్లు పొసగును, అని ప్రశ్న వేయవచ్చును. జిజ్ఞాసువులు ఆ యనిర్వాచనీయమునకై యత్నించుచు మధ్యమధ్య దానిలో అంశమును కొంతకొంత రుచిచూచుచు పైమెట్టుకు పోవుచుందురు. పోగాపోగా దైవానుగ్రహమున వారు చిట్టచివరకు గమ్యస్థానము చేరినపుడు అదియిదియెయను హాయి వారికి స్ఫురించును. ఆ తృప్తికలిగినసిమ్మట వారు ఆప్తకాములగుదురు. ఇంకను పొందదగినది యేమియు లేదని ఆ ఆత్మ పరమానందమును అనుభవించుచుండును.

( 3 ) కథంవిజానీయాం=ఈ పాదము నచికేతస్సు వాక్యముగా నెంచవలెను. అట్లెంచినయెడల సమంజసముగానుండును. అది యమునివాక్యముగా నెంచినయెడల యము

నికే తెలియదని సందేహ మేర్పడును. అట్టి సందేహము యమునికి లేనేలేదు. ఆ విషయమును ఆయన 1 వ అధ్యాయము 2 వ వల్లి 10 వ మంత్రములోను, 21 మంత్రములోను స్పష్టము చేసెను. ప్రాప్తవానస్మి దానిని పొందినవాడ నైతిని. అని పదవ మంత్రములో ధ్రువపరచెను. "మదన్యోజ్ఞాతుమర్హతి" నాకంటె నితరులు దానిని తెలిసికొన అర్హత కలవారెవరని 21 మంత్రములో ప్రశ్నించెను. కాన ఈ సందేహము యమధర్మరాజునకు కలిగియుండదు. శ్రీ శంకరులవారు ఈపాదమును యమునికే వర్తింప చేయుచున్నారు. అట్లుచేయకుండుట మేలు. యముడే యీ యాత్మ సుఖమునే నెట్లు ఎరుగగలను? ఇదియెట్లు నాబుద్ధికి తోచగలదు? అది ప్రకాశ స్వరూపముగదా! నాబుద్ధికి గోచరమై స్పష్టమగునా కాదా? అని ప్రశ్నించినట్లు అర్థము చేసిరి. అగునా కాదాయను ప్రశ్న ఈ మంత్రములో కనబడదు. ఈ పాదము యముని వాక్యమే యయ్యెయెడల దానిమహత్తు వర్ణించుటకై యాశ్చర్యార్థకముగా యముడు చెప్పియుండవచ్చును. దాని సామాన్య ప్రకాశము లేక విశేషప్రకాశము ఎట్టిదని నేను వర్ణించగలను? అనుభవించతగ్గదేకాని వర్ణించ వీలుకాదు. అని చెప్పినట్లు అర్థము చేయవచ్చును, ఈ పాదము నచికేతస్సు వాక్యమే అయినయెడల దాని జవాబు 15 వ మంత్రములో యముడు తెలుపుచున్నాడు.

తాత్పర్యము:— అనిర్వచనీయమైన యత్యుత్తమమయిన యీ సుఖము ఇదియేయని యనుభవజ్ఞులయిన ధీరులు

గ్రహించగలుగుచున్నారు. ఆ యానందముయొక్క లేక యా పరమాత్మయొక్క సామాన్య లేక విశేష లక్షణములు ఎట్టివి? ఏవి? యని యెట్లు చెప్పనగును. దాని స్వతస్సిద్ధమైన తేజస్సు ఎట్లు సామాన్యముగా ప్రకాశించునో లేక విశేషముగా ప్రకాశించునో అనగా మానవుల కంటునట్లు ప్రకాశించునో అంటనట్లు ప్రకాశించునో ఎట్లు చెప్పవచ్చును? అవ్యాది యత్యద్భుతమైన వర్ణనాతీతమైన విషయముకాదా! అనుభవజ్ఞులే యనుభవింతురే కాని వర్ణించ పూనుకొనరు. ఏలయన:- తదితరులకు ఆ వర్ణన బోధపడదు. ఇట్లు యమునివాక్యముగా ఈ మన్త్రమున కంతకును తాత్పర్యము చేయవచ్చును లేదా 2 వ పాదము నచికేతస్సు వాక్యమేయని యెంచినయెడల ఓ మృత్యుదేవతా! దాని సామాన్య తేజస్సు విశేషతేజస్సు ఎట్లుండును? దాని సామాన్యలక్షణము విశేష లక్షణము, ఎట్లుండును? మీరు బోధించితిరి. నేను వింటిని. దానిని గ్రహించే లేక అనుభవించే అర్హత నాకు కలిగెనో లేదో నిర్ణయించి చెప్పుమా! యని యముని నచికేతస్సు ప్రశ్నించుచున్నాడు.

౧౫ వ మన్త్రము శ్రుతిః ॥ 15

నతత్రసూర్యోభాతి నచన్ద్రతారకం
నేమావిద్యుతో భాన్తికుతోఽయమగ్నిః ।

తమేవ భాన్తమనుభాతిసర్వం
తస్యభాసా సర్వమిదంవిభాతి ౻

ఈ మన్త్రము శ్వేతాశ్వతరము 6 వ అధ్యాయములో 14 వ మంత్రముగా నున్నది. ముణ్డకం 2 వ అధ్యాయము 2 వ ఖండము 10 వ మంత్రముగా నున్నది. అక్కడనుండి దీని ప్రతి పదార్థము విశేషార్థము తాత్పర్యము గ్రహించి యిచ్చట ఉల్లేఖించవలెను.

ద్వితీయాధ్యాయె ద్వితీయవల్లీసమాప్తా

పఞ్చమీవల్లీ। సమాప్తా



## ★ కఠోపనిషత్ ★

### ద్వితీయాధ్యాయః షష్ఠీవల్లీ

౧ వ మన్త్రము శ్రుతిః ॥ 1

ఊర్ధ్వమూలోఽవాక్శాఖ
ఏషోఽశ్వత్థః సనాతనః ।
తదేవశుక్రం తద్బ్రహ్మ
తదేవామృత ముచ్యతే ।
తస్మిఁల్లోకాశ్శ్రితాస్సర్వే
తదునాత్యేతి కశ్చన । ఏతద్వైతత్

ఊర్ధ్వమూలః = పైన వేళ్ళుకలది, అవాక్శాఖః = క్రిందికి కొమ్మలుకలది, ఏషః = ఈ, సనాతనః = పురాతనకాలము నుండి యున్నది, అశ్వత్థః = రావిచెట్టు, తత్ = అది, ఏవ= మాత్రమే, లేక నిక్కముగా, శుక్రం = పవిత్రమైనది, తేజోవన్తమైనది, తత్ = అది, బ్రహ్మ=బ్రహ్మ, తత్ =అది, ఏవ=మాత్రమే, అమృతం=అమృతము లేక నాశనరహితము, (అని) ఉచ్యతే=చెప్పబడుచున్నది, తస్మిన్ = దానియందు, సర్వేలోకాః = అన్నిలోకములు, శ్రితాః = నిలిచియున్నవి, తత్ =దానిని, ఉ=నిక్కముగా, కశ్చన=ఎవడున్ను, నాత్యేతి= అతిక్రమింపజాలడు, ఏతద్వైతత్= ఇదియదియే నిశ్చయము

విశేషార్థము:— *(1) అశ్వత్థః=రావిచెట్టు వ్యుత్పత్త్యర్థము, శ్వః = రేపు, త్థః=ఉండునది, అ = కాదు, రేపటి వరకు ఉండునదికాదు. నేడుండి రేపుండదు అనగా త్వరలో నశించునది. ఈ అశ్వత్థము సంసారవృక్షము లేక ప్రపంచము అని అర్థము చెప్పుచున్నారు. అనగా ఈ ప్రపంచము లేక సంసారము త్వరితగతిని మారుచుండును అనిభావము భగవద్గీత 15 వ అధ్యాయము 1 వ శ్లోకములో మొదటి పాదము (పూర్వార్థములో) ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థంప్రాహురవ్యయం ॥ అని చెప్పుచున్నది. అచ్చట సంసారమని అర్థము చేసిరి. దానిని అవ్యయం నాశనరహితము అయినదని చెప్పిరి. ఇచ్చట సనాతనః అన్నపదము వాడిరి. అనాదియని అర్థము ఇది సృష్టి అయ్యేయెడల ఇదికూడ అజము పుట్టుక లేనిదే యగును. శ్వేతాశ్వతరము 4 అ. 5 వ మంత్రము ప్రకృతి కూడ పుట్టుకలేనిదే అని చెప్పుచున్నది. అప్పుడు పరమాత్మ జీవాత్మ ప్రకృతి మూడు పుట్టుక లేనివే యని చెప్పవలసి వచ్చును. కాని నశ్వరమని అశ్వత్థమని పిలుచుట పొసగదు. అప్పుడు పైన పరివర్తనముండుననియు లోపల సారము అసలు ఆధారము రెండు మారవని చెప్పవలసి యుండును. సముద్రములోని అలలు మారినను నీరు మారనట్లు అని పోలిక చెప్పవచ్చును. అసలు అవ్యయము కాకపోయినను

* ఇదియదిరోే నిశ్చయము, అనే పదములు ఈ మన్త్రము చివర కలవు. ఈ జీవాత్మ ఆ అశ్వత్థమే. అని చెప్పవలసి వచ్చును. లేదా దానికి మూలముగు పరమాత్మయని చెప్పవచ్చును.

సృష్టి యెన్నాళ్లనుంచి యున్నదో చెప్పుటకు వీలులేదని యనవచ్చును. కాని ఖగోళశాస్త్రజ్ఞుడు సృష్టియొక్క ఆది 195 కోట్ల సం॥రములని తేల్చిరి. ఇట్టి సందర్భములనుబట్టి అశ్వత్థ అను పదమునకు వ్యుత్పత్త్యర్థము ఇయ్యక పవిత్రమైన వృక్షము అనిచెప్పిన బాగుండును. శ్రీ అరవిందులవారు ఇది Eternal tree అని అనువదించిరి. శాశ్వతముగా నుండేదే యని వారి భావము. శ్రీ శంకరులవారు ఇది నశ్వరమని యభిప్రాయపడిరి. అప్పుడొక చిక్కు కలదు. "తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతం" అని రెండవపాదములో చెప్పిన వర్ణన ఈ అశ్వత్థమునకే చెందవలసియుండగా శ్రీ శంకరులవారు తత్ అనగా ఆమూలము అని అన్వయించిరి. అనగా సృష్టికి మూలము బ్రహ్మయనియు ఆ బ్రహ్మయే 2 వ పాదములో విస్తరించి తెలుపబడెననియు వారభిప్రాయపడిరి. శ్రీ అరవిన్దయోగి అట్లు గాక ఇదియే అనగా ఈ శాశ్వత వృక్షమే బ్రహ్మము అమృతము అని చెప్పిరి. ముండకములో 3 అ. 1 ఖం 1 వ మంత్రములో "పిప్పలంస్వాద్వత్తి" రావిపండు తినుచున్నాడని చెప్పబడెను. ముండకములోని భావమును భగవద్గీతలోని భావమును ఒక విధముగా నున్నవి. ఈ కథలోని భావము మరియొకవిధముగా నున్నది. ఇచ్చట శ్రీ అరవిందయోగి భావమునే గ్రహించే యెడల ఈ సృష్టి అవినాశియని అంగీకరించవలసియుండును. అప్పుడు గౌడపాదాచార్యులవారి అజాతవాదము సమర్థింప వీలగును. ఈ సృష్టియంతయు బ్రహ్మయే

పుట్టినట్లు మారుచుండునట్లు అగపడునేగాని పుట్టుటలేదు. మారుటలేదు.

(2) ఊర్ధ్వమూలః అవాక్ శాఖః=పైన వేళ్లు క్రింద కొమ్మలు ఈ పదములు సాపేక్షకములు భూమిమీదనున్న మానవుడు తలఎత్తి చూచినపుడు పైన ఖగోళములు కన బడును. ఉన్నతమైనది గౌరవనీయముగా మానవునకు తోచు చుండును. ఒక కాలమందు ఖగోళములుగల ద్యౌః = దివి అదియె దేవుడని తలంపబడెను. ద్యౌః = పితయని పిలుచు చుండిరి. jupiter అని లాటిన్‌లోను తెలుపబడెను. ఈ ఖగోళములుకూడ సృష్టింపబడినవే గనుక సృష్టికర్త వానికి పైన ఉండునని ఊహించిరి, సృష్టికి మూలమైన బ్రహ్మ పైన ఉన్నాడుగనుక అతడే వేళ్లని ఉదహరించిరి. సృష్టింపబడిన లోకములన్నియు దానికి కొమ్మలుగా పోల్చబడెను.

(3) తత్=శంకరులవారు చెప్పినట్లు వృక్షముయొక్క మూలమని యనవచ్చును. లేదా అరవిన్దయోగి చెప్పినట్లు ఆ వృక్షమేయని చెప్పవచ్చును.

(4) తస్మిన్ = దానియందు ఆ బ్రహ్మయందు లేక ఆ వృక్షమందు.

(5) తదునాత్యేతికశ్చన=2 వ అధ్యాయం 2 వల్లి 8 వ మంత్రముయొక్క విశేషార్థము చూడవలెను. ఆ మంత్రము లోని 2-3-4 పాదములు ఇచ్చట 2-3-4 ఒక్కటే. అచ్చట మొదటి పాదములో సందరు నిద్రించుచుండగా మేల్కొని

యుండు పదార్థము తెలుపబడెను. అదిన్ని ఇక్కడ మొదటి పాదములో తెలుపబడినదిన్ని ఒక్కటేయని ఊహించవచ్చును.

తాత్పర్యము:— ఇది సనాతనమైన శాశ్వతమైన అశ్వత్థము దీనివేళ్లు పైనఉన్నవి. కొమ్మలు క్రిందనున్నవి. అదే పవిత్రమైనది. అదే తేజోవన్తమైనది. అదే బ్రహ్మ అదే అమృతమని చెప్పబడుచున్నది. దానియందె సర్వలోకములు ఆశ్రయించియున్నవి. దానిని నిక్కముగా అతిక్రమించగలవాడెవ్వడును లేడు. ఇదియదియే నిశ్చయము.

౨ వ మన్త్రము శ్రుతిః ॥ 2

యదిదంకించ జగత్సర్వం
ప్రాణఏజతి నిస్సృతమ్ ।
మహద్భయం వజ్రముద్యతం
య ఏతద్విదురమృతాస్తేభవన్తి ॥

యత్ = ఏ, ఇదం = ఈ, కించ = స్వల్పమైనను, ప్రాణః = ప్రాణము, సర్వం = సమస్తమైన, జగత్ = జగత్తు, నిస్సృతం = వ్యక్తమగుచు, బయటకు వచ్చుచు, ఏజతి = స్పందము ( చలనము ) కలిగియున్నది, ( vibrates ) సః = అది, మహత్ = గొప్పదైన, భయం = భయము, ఉద్యతమ్ = ఎత్తబడిన, వజ్రం = వజ్రాయుధము, యె = ఎవరు, ఏతత్ = దీనిని, విదుః = బోధపరచుకొనిరో, తే = వారు, అమృతాః = అమృతులు, భవన్తి = అగుచున్నారు.

విశేషార్థము:— (1) ప్రాణః = ప్రాణము మామూలు పంచప్రాణములు కావు. ముఖ్యప్రాణమును కాదు. ప్రశ్నోపనిషత్ 6 వ ప్రశ్న 4 వ బ్రాహ్మణములో చెప్పిన హిరణ్యగర్భుడును కాదు. బ్రహ్మ పరమాత్మయనియే చెప్పవలెను. బ్రహ్మసూత్రములు 1 వ అధ్యాయం 3 ఖం 39 వ సూత్రము ఈ ప్రాణము బ్రహ్మయనియే నిర్ధారణ చేయుచున్నది. మొదటిమంత్రములో చెప్పిన బ్రహ్మ ఈ ప్రాణము ఒకటే. ఈ లోకములోనుండు ఏ స్వరూపమయినదియుకూడ బ్రహ్మయే. ఈశావాస్యము మొదటిమంత్రము మొదటిపాదము అట్లే ఇదే భావము తెలుపుచున్నది.

(2) జగత్ = ఈ విశ్వమంతయు బ్రహ్మనుండి నిస్సృతం = వ్యక్తమైనది, ఈశావాస్యము శాన్తివచనములో ఉదచ్యతే అని చెప్పబడినది. ఇదియె భావము.

(3) మహద్భయం = గొప్ప భయము ఈ లోకమంతయు ఒక చణ్డశాసనము ననుసరించి నడచుచున్నది. ఎత్తిన వజ్రాయుధమును చూచిన ఎంతభయమో ఈ శాసనముకూడ అంత భయంకరమేయని అర్థము. అదిగాక ఇంకొక గూఢార్థము కలదు. ఈ ప్రపంచమును ఈ పరమాత్మయు అభిన్నము అద్వైతము అను భావము తెలిసి అనుష్ఠించుట సమాధిలో ఈ ఏకత్వమును దర్శించుట, ఇది చాల భయమును పుట్టించునని యోగులు తెలుపుచున్నారు. రామకృష్ణ పరమహంసుని అనుభవమిదియె. రామకృష్ణపరమహంసయొక్క వివేకానందుని యొక్క జీవితములు రచించిన రోమైన్ రోలెండు.

పాశ్చాత్య వేదాన్తులలోకూడ క్రైస్తవ వేదాన్తులలో కూడ ఈ అద్వైతదర్శనము భయంకరమని భావించియే తెలిపి యున్నారు. ఇచ్చట భయమనగా ప్రచండమైన ఆజ్ఞ, శాస నము అని చెప్పవచ్చును.

(4) యఃఏతత్=ఎవరు తెలిసికొందురో అనగా ఈ సృష్టి విధానము పరమాత్మ స్వరూపమును ఎవరు తెలిసికొందురో వారు అమృతులగుదురు.

తాత్పర్యము:— ఈ జగత్తంతయు నా బ్రహ్మనుండి వెల్వడి యాయనలో స్పందించుచున్నది. ఇందులోనే స్వల్ప మైనదికూడ ఆ బ్రహ్మయె ఎత్తిన వజ్రాయుధము భయము గొలుపుచుండును. అట్లు ఈ జగత్తు సృష్టివిధానము తన స్వకీయ శాసనము ప్రచణ్డమైనది. ఈ ఏకత్వభావన ఈ ఏకత్వాను ష్ఠానము ఈ ఏకత్వానుభవము భిన్నత్వములో చరించువారికి భయంకరముగా నుండును. ఎవరీభయమును వీడి దాని యథార్థ స్వరూపమును అనుభవైకవేద్యమొనర్చుకొందురో వా రమృతులగుచున్నారు.

3 వ మన్త్రము శ్రుతిః ౻ ౩

భయాదస్యాగ్ని స్తపతి
భయాత్త పతిసూర్యః ।
భయాదిన్ద్రశ్చ వాయుశ్చ
మృత్యుర్ధావతి పఞ్చమః ॥

అస్య = అతనివలన, భయాత్ = భయముచేత, అగ్నిః = అగ్ని, తపతి = దహించుచున్నాడు, అస్య = అతనివలని, భయాత్ = భయముచేత, సూర్యః = సూర్యుడు, తపతి = వెలుగుచున్నాడు. చ = మరియు, అస్య = అతనివలన, భయాత్ = భయముచేత, ఇన్ద్రః = ఇన్ద్రుడు, చ = మరియు, వాయుః = వాయువు, పంచమః = అయిదవవాడు, (అగు) మృత్యుః = మృత్యుదేవత, ధావతి = పరుగెత్తుచున్నది.

విశేషార్థము:— (1) భయాత్ 2 వ మంత్రములోని మహద్భయం యొక్క విశేషార్థము చూడవలెను.

(2) తపతి = సూర్యుని అగ్నినిగూర్చి ఒకేపదము వాడబడినది. రెంటికి వెలుగుచున్నాడన్న అర్థమే సరిపోవును. ఈ అగ్ని సూర్యునియొక్క ప్రతినిధియే. 6 వ ప్రశ్న 7 వ బ్రాహ్మణము ఋగ్వేదములో సూర్యునియొక్క వత్స అగ్ని యని చెప్పబడెను. ఇద్దఱు వేడి వెలుగు ఇచ్చువారు

(3) ధావతి = పరుగెత్తుచున్నాడు. తన కర్తవ్యపాలనమున ఆతురపడుచున్నాడు. ఈ క్రియ ఏకవచనము మృత్యువుకే చెల్లును. ఇన్ద్ర వాయువులకు వర్తించు క్రియలేదు. కాని వాయువుకు ధావతిచెల్లవచ్చును. అధ్యాహారము చేయవచ్చును వాయువు ఎప్పుడును గమన శీలుడే. ఇన్ద్రుడు తన పనులను చూచుకొనును. కర్తవ్యం పాలయతి అని అధ్యాహారము చేయవచ్చును. తైత్తిరీయము 2 అ. 8 అనువాకము. "భీషాఽస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః। భీషాఽస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పంచమ" ఇతి అచ్చట భీషా అనగా ఆజ్ఞ, శాస

సము అర్థము చేయబడెను. వీరందఱు పరమాత్మ పరిశ్రి నిధులు కాన భిన్నమైన వారు, నిర్దేశ్యమైన కార్యక్రమమును నడిపించుటకు నియోగింపబడినవారు కాన జగచ్ఛాసన ప్రకారము నిరంతరము తమ కర్తవ్యములను పాలించుచుండవలెను.

(4) మృత్యుః = యముడు తానుకూడ భయపడి కార్యక్రమము సాగించుచున్నట్లు తెలిపెను. ఇది భయముచే తననికూడ సూచించెను. కాని తాను పరమాత్మను చూచితినని 1 అధ్యాయము 2 వ వల్లి 10-21 మంత్రములలో తెలిపియున్నాడు. యెవరు పరమాత్మను పొందిరో వారు నిర్భయులు మిట్టి మొదట సభయుడై శాసనానువర్తిగా కర్తవ్యములను పాలించెను. ఇప్పుడు పరమాత్మను తెలిసికొని నిర్భయుడై పరాయి వానిచే నియోగింపబడినదిగాక, తనదే, అయిన పనులను స్వేచ్ఛగా లీలగా సంతోషముతో జరుపుచున్నాడు. దేవతలందఱుగూడ ఇట్టి యుత్తమస్థాయిచెంద వచ్చునని యీ ఉపనిషత్తు నిస్సంకోచముగా తెలుపుచున్నది.

తాత్పర్యము:— పరమాత్మ శాసనానుసారము భయభక్తులతో సూర్యుడు అగ్ని వేడి వెలుగుల నిచ్చుచున్నారు. ఇంద్రవాయువులు తమ కార్యములను పాలించుచున్నారు. అయిదవ వాడగు మృత్యుదేవత తన పనిపాటులకై పరుగెత్తుచున్నాడు.

౪ వ మంత్రము శ్రుతిః ౫౪

ఇహచేదశకద్బోద్ధుం
ప్రాక్ శరీరస్య విస్రసః

తతస్సర్గేషులోకేషు

శరీరత్వాయ కల్పతే ॥

ఇహ = ఇచ్చట, శరీరస్య = శరీరముయొక్క, విస్రసః = పతనమునకు, ప్రాక్ = పూర్వమే, (బ్రహ్మను) బోద్ధుం = వేద్య మొనర్చుకొనుటకు, అశకచ్చేత్ = శక్తి కలిగిన యెడల, విముచ్యతే = విముక్తి నొందును, నచేత్ = కానిచో, తతః = పిమ్మట, సర్గేషు లోకేషు = సృష్టింపబడిన లోకములలో, శరీత్వాయ = శరీరమును పొందుటకు, కల్పతే = అర్హుడగు చున్నాడు.

విశేషార్థము:— (1) ఇహ = ఈ లోకమందు, ఈ శరీర మందు ఇచ్చట యిప్పుడే అనగా జీవించి యుండగానే.

(2) ప్రాక్ఛరీరస్య = శరీరము పడుటకు పూర్వము యీ శరీరములోనుండగానే బ్రహ్మజ్ఞానముపొందవలెను. ఏమాత్రము వాయిదా వేయుటకు వీలులేదు. కేనోపనిషత్ 2 వఖండము 5 వ మంత్రము ఇదే అర్థమును (అంశమును) తెలుపుచున్నది. ఇచ్చట యిప్పుడు తెలిసికొన్న వానికి సత్యజీవితము కలదు. తెలిసికొనని వానికి మహత్తరమైన నష్టముకలదు. భగవద్గీత-5 వ అధ్యాయము 23 వ శ్లోకము. ఈ శరీరము పడకముందే అరిషడ్వర్గమును జయించిన యెడల వాడే యోగి వాడే సుఖి అని చెప్పబడెను. కాన సత్వర జ్ఞానప్రాప్తి అత్యంత వాంఛ నీయము అత్యావశ్యకము.

(3) బోద్ధుం = మనసా, బుద్ధ్యా, గ్రన్థస్థముగా దెలిసి కొనుట కాదు, అనుభవైకవేద్య మొనర్చుకొనుటయే.

(4) అశకత్ = సాధ్యమయ్యే యెడల కేనోపనిషత్ 2 వ ఖండము 5 వ మంత్రములో "అవేదీత్" అని కలదు. ఇది అట్టిదే యీ మంత్రము ఉన్నదున్నట్లు అర్థము చేసే యెడల చాల అసందర్భము కలుగుచున్నది. ఉన్నది వున్నట్లుగా అర్థము ఇట్లగును. "శరీర పతనమునకు పూర్వము తెలిసి కొనుటకు సమర్థుడైన యెడల పిమ్మట సృష్టింపబడిన లోకములలో ఇతర శరీరములు పొందుటకు అర్హుడగుచున్నాడు" అనగా జన్మ పరంపరలు పొందుటకు అవకాశము కలుగుచున్నది. బ్రహ్మ జ్ఞానము కలవాడు జన్మరాహిత్యము పొందకపోవుటయేగాం జన్మపరంపరలు పొందునని ఈ మంత్రము తెలుపుచున్నది. ఇట్టి అసందర్భమును గమనించి శ్రీ శంకరులవారు "సంసారబన్ధనా ద్విముచ్యతె నచేదశకద్బోద్ధుం" అను పదములను అధ్యాహా రము చేసిరి. శక్లృశక్తౌ ధాతువు శతృప్రత్యయము శకత్ =సమ ర్థుడు న + శకత్ = అశకత్ = అసమర్థుడు, ఈ పదములకర్థ మేమన సంసార బన్ధనమునుండి విడివడును. వేద్యమొనర్చుకొన జాలని యెడల మొదటిపంక్తికి పిమ్మట రెండవపంక్తికి పూర్వము ఇట్టి పదములను వారు చేర్చిరి. ఈ పదములు ఒక పాదమునకు సుమారుగా సరిపోవును. మంత్రములోని అర్థము నంతను మార్చును. ఇట్టి ముఖ్య పదములు ఎట్లు మంత్రములో చేర లేదో చేరిన యెడల ఎట్లు లుప్తమయ్యెనో తోచుటలేదు. ఈ యసందర్భము తొలగించుటకు ఇంకొక వీలుకలదు. అశకత్

అను పదమును నిషేధార్థముగా గుర్తించిన యెడల అనగా అసమర్థుడు అని అర్థము చెప్పిన యెడల యీ మంత్రముయొక్క ఒకటి రెండు పాదములు సవ్యముగా అన్వయించవచ్చును. ఈ యర్థమును పాపయ్య శెట్టిగారు తమ ప్రచురణములో యిచ్చి యున్నారు. ఇది వ్యాకరణ సాధ్యము అయినయెడల శ్రీ శంకరుల వారు దీనిని ఉదహరించి యుందురు వారట్లు ఉదహరించ లేదు. పండితులింకను పరిశోధించవలసి యున్నది.

తాత్పర్యము:— ఈ శరీరము పడిపోక పూర్వము ఇందుండగనే బ్రహ్మజ్ఞానము పొందుటకు సాధ్యమైన యెడల అట్టివాడు సంసారబంధమునుండి విముక్తుడగును. అట్లు సాధ్యము కానిచో సృష్టింపబడిన లోకములలో అనేక యోనులలో జన్మను ఎత్తుటకు అర్హుడగును అనగా జన్మము లెత్తవలసి యుండును.

౫ వ మంత్రము శ్రుతిః ॥ 5

యథాదర్శే తథాత్మని
యథా స్వప్నే తథా పితృలోకే ।
యథాప్సుపరీవ దదృశే
తథా గన్ధర్వలోకే ఛాయాతపయోరివ బ్రహ్మలోకే ॥

ఆదర్శే=అద్దమందు. యథా=ఎట్లో, తథా=అట్లే, ఆత్మని=ఆత్మయందు, స్వప్నే=స్వప్నమందు, యథా=ఎట్లో, తథా=అట్లే, పితృలోకే = పితృలోకమందు, అప్సు = నీటియందు, యథా=ఎట్లో, తథా=అట్లే, గన్ధర్వలోకే=గన్ధర్వలోకమందు.

ఇవ=వలె, పరివశ్య శే=చూడబడును, బ్రహ్మలోకే=బ్రహ్మలోకమందు, ఛాయాతపౌ=నీడ ఎండలు, ఇవ = వలె, (కనపడును)

విశేషార్థము: = వెనుకటి మంత్రములో బ్రహ్మజ్ఞానము కలుగనియెడల సృష్టింపబడిన లోకములలో శరీరధారణము చేయవలసివచ్చునని చెప్పబడెను. ఈ మన్త్రములో నిదర్శనమునకై మూడులోకములు తెలుపబడెను. (1) పితృలోకము (2) గంధర్వలోకము (3) బ్రహ్మలోకము. ఈ మూడులోకములలో శరీరము లుండును. అంతకంతకు సూక్ష్మశరీరములగుచుండును. శరీరము లేని స్థితి సంభవించదు. ఆయాలోకములలో బ్రహ్మజ్ఞానమునకై ప్రయత్నించవచ్చును. అచ్చట సంభవించే బ్రహ్మదర్శనము లోపయుక్తమని ఈ మన్త్రము తెలుపుచున్నది.

(1) స్వప్నే = స్వప్నకాలమందు కనపడు విషయమంతయు అస్పష్టముగా నుండును. స్వల్పకాలమే యుండును. మరియు ఒక్కొక్కప్పుడు సందర్భశుద్ధిలేని (శుచిలేని) విషయసమ్మేళనము జరుగుచుండును.

(2) పితృలోకే = పితృలోకమందు కర్మఫలప్రాప్తి కలుగుచుండును. దానిని వదలుట కష్టసాధ్యముగా నుండును. అందుచే బ్రహ్మదర్శనము కలుగుటగాని కలిగితే నిలుచుటగాని దుర్ఘటము.

(3) * గంధర్వలోకే = గంధర్వలోకమందు లీలావినోదా

---

* పితృలోకే-చన్ద్రలోకమనవచ్చును. గన్ధర్వలోకే సూర్యలోకమనవచ్చును. బ్రహ్మను కర్త చేయవచ్చును.

దులు హెచ్చుగా నుండును. మనస్సు అందులో రమించి యితరమునకై సామాన్యముగా యత్నించక కుతూహల ముండదు. గంధర్వలోకములో జన్మ మానవ మిశ్ర శరీరము లుండును. అందుచే బుద్ధి తేజస్సు తరిగియుండును.

(4) అప్సు = నీటియందు, నీటియందు కనబడు బింబము ఎప్పుడు చలించుచుండును. నీరు గాలిచే కదలుచుండును. ఏమాత్రము అల్లయున్నను బింబము భిన్నములగుచుండును.

(5) బ్రహ్మలోకే = ఇది సగుణబ్రహ్మలోకము. ఇచ్చట క్రమముక్తి పొందినవారు చేరుదురు. ఇటనుండి పునర్జన్మ లేదు. కాని ఏదో శరీరముండును. బ్రహ్మైక్యత కలుగదు. కలుగుటకు ప్రళయాంతమువరకు నిలిచియుండవలెను.

(6) ఛాయాతపౌ = ఎండలో నీడలో ఉన్నంత స్వల్ప భేదముండును. ఛాయామాత్రమైన లోపముకలదు, అనిఅర్థము.

(7) * ఆదర్శే = అద్దము అద్దము స్థిరముగా నుండును. స్పష్టముగా ప్రతిబింబించును. వెంట్రుకలో వెయ్యోవంతు లేక లక్షవంతుకూడ అద్దములో కనపడుచునే యుండును. శ్వేతాశ్వతరము 5 అధ్యాయం 9 వ మంత్రములో వెంట్రుకను 100 భాగములుచేసి ఒక్కొక్కభాగమును మరల 100 భాగములు చేసినయెడల ఎంతసూక్ష్మమో ఆత్మ అంతసూక్ష్మ

* బృహదారణ్యకములోను. కౌషీతకిలోను ఇంద్రునకును ప్రతర్దనునకును ప్రజాపతి బ్రహ్మజ్ఞాన ముపదేశించినపుడు నీటిలోను అద్దములోను చూచుకొమ్మని చెప్పెను. ఈ విషయమిచ్చట చూచి ఉదహరించవలెను. బ్రహ్మ కర్తృ పదదృశ్యక్రియ లోకేఛాయా తపయోరివ అని సమన్వయించరాదా?

మని తెలుపబడెను. అట్టి యత్యన్త స్వల్పాంశముకూడ అద్ద ములో ప్రతిబింబించును.

(8) ఆత్మని=ఆత్మయందు దీనికి బుద్ధియని శ్రీ శంకరుల వారు అర్థము చేసిరి. జీవాత్మ యనుకొనుచున్న ఆత్మస్థితి యని చెప్పుటయే మేలు. అనగా తన ఆత్మయందే పరమాత్మ దర్శనము సంపూర్ణముగా లోపరాహిత్యముగా శాశ్వతముగా కలుగును. అందుచే మానవజన్మలోనే బ్రహ్మజ్ఞానసంపాద నము అత్యన్త వాంఛనీయమని ఈ మన్త్రము ఋజువు చేయుచున్నది.

(9) లోకే = సామాన్యార్థము లోకములు విశేషార్థ ములో జీవశరీరములు ఇంకొక అర్థము చెప్పవచ్చును. Planes of consciousness అనగా జ్ఞాత్వావస్థితి, ప్రాజ్ఞత్వ స్థాయి లేక అవస్థయని చెప్పవచ్చును.

తాత్పర్యము:— పితృలోకమందు స్వప్నావస్థయందు వలెను గంధర్వలోకమందు నీటియందువలెను బ్రహ్మలోక మందు ఎండచేపడెడి నీడయందువలెను బ్రహ్మదర్శనము కలుగుచున్నది. కాని మానవజన్మయందు అద్దములో ప్రతి బింబించినట్లు స్పష్టముగా సంపూర్ణముగా లోపరహితముగా స్థిరముగా జీవుని ఆత్మయందు పరమాత్మదర్శనము కలుగును. జీవాత్మ పరమాత్మల ఐక్యత సంఘటిల్లును.

౬ వ మంత్రము (శ్రుతిః ౹౹ 6

ఇన్ద్రియాణాం పృథగ్భావ
ముదయాస్తమయౌ చయత్ ।
పృథగుత్పద్యమానానాం
మత్వాధీరో నశోచతి ౹౹

పృథక్ = వేరుగా భిన్నముగా, ఉత్పద్యమానానాం = పుట్టు చున్నట్టి, ఇన్ద్రియాణాం = ఇన్ద్రియములయొక్క, పృథగ్భావం = భిన్నస్వభావమును, చ = మరియు, ఉదయాస్తమయౌ = పుట్టుక చావును, యత్ = ఆత్మస్థితి ఏదో; ధీరః = ధీరుడు, (తత్ = దానిని) మత్వా = తెలిసికొని. నశోచతి = దుఃఖించడు

విశేషార్థము:— (1) పృథగ్భావం = విడిఉత్పత్తి వేరగు స్వభావము ఇన్ద్రియములన్నియు తమలోతాము వేరగు ప్రదేశములో నుండి వేరు వేరగు పనులను చేయు చుండును దీనికి అధిష్ఠానదేవతలు వేరువేరు. అందుచేతనే పృథగుత్పద్యమానానాం అని చెప్పబడినది. అనగా ఆయా యింద్రియముల ఉత్పత్తికిగల కారణములు వేరువేరని అర్థము.

(2) ఉదయాస్తమయౌ = ఈ యింద్రియముల పుట్టుక చావు అసలుపుట్టుక చావేగాక మధ్యమధ్యకూడ ఈ ఇన్ద్రియ ములు పనిచేయుకాలముకొంత చేయనికాలముకొంత కలదు. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలో ఈ ఇంద్రియములు భిన్నభిన్న అవస్థలు పొందుచుండును. ఆత్మకు నిట్టియవస్థలు లేవు. ఉత్పత్తిలోకూడ ఇన్ద్రియములవంటిది కాదు. ఆత్మ పంచ

భూతములలో దేనినుండిగాని అన్నిటినుండిగాని పుట్టుటలేదు. ఈ పంచభూతముల పుట్టుకకు తానే కారణమగుచున్నది.

(౩) యత్ = ఏది అనగా ఆత్మయొక్క ఉత్పత్తిస్వభావము ఏదో అది అనగా ఇన్ద్రియములకును ఆత్మకును గల భేదము కార్యమందు కారణములయందు ఉండు భిన్నత్వమును గనుసించవలెను.

(4) మత్వా= తెలిసికొని సంపూర్ణముగా తెలిసికొనుటచే ఆత్మ ఇన్ద్రియములమీద ఆధారపడ నక్కరలేదనియు వీనివంటి అవస్థావిశేషములు దానికి లేవనియు అయ్యది సర్వదా చిన్మాత్రరూపమున నిరన్తరానన్దరూపమున తేజరిల్లునని తెలిసికొనవలెను.

(5) నశోచతి= శోకించదు ఛాన్దోగ్యము 7 అ. 1 ఖం 3 వ మంత్రము "తరతిశోకమాత్మవిత్" ఆత్మజ్ఞాని శోకమును తరించునని చెప్పుచున్నది. ముణ్డకం 3 అ. 2 ఖం 9 వ మంత్రము "తరతిశోకం తరతిపాప్మానం" బ్రహ్మజ్ఞాని బ్రహ్మయేయయి శోకమును పాపమును తరించును దాటును, అని చెప్పియున్నది. ఈ ఉపనిషత్తులోగూడ నశోచతి - అను భావము చాలచోట్ల కలదు. 2 అధ్యాయం 1 వ వల్లి 4 వ మంత్రము, 1 వ అధ్యాయము 2 వ వల్లి 12 వ మంత్రము 22 వ మంత్రము చూడనగును.

తాత్పర్యము:— ఇంద్రియములు ఆత్మకంటే భిన్నములు తమలో తాము పరస్పర భిన్నములు వాని వాని కారణము వాని వాని కార్యము వాని వాని అధిష్ఠాన దేవత వాని వాని శరీర

స్థానములు భిన్నములు జాగ్రత్స్వప్న సుషుప్తులలో వానికి అనేకములగు పరివర్తనములు కలుగుచుండును. ఇన్ని విషయములలోను ఆత్మ వీనికంటే భిన్నము అయ్యది సచ్చిదానంద రూపి మార్పులేనిది ఈ విషయము వేద్యమొనర్చుకొనినవాడు జ్ఞాని, దుఃఖముదాటిపోవును.

౭ వ మంత్రము శ్రుతిః ॥ 7

ఇన్ద్రియేభ్యః పరంమనో
మనస స్సత్వ ముత్తమం।
సత్వాదధి మహానాత్మా
మహతోఽవ్యక్త ముత్తమం ॥

ఇన్ద్రియేభ్యః = ఇన్ద్రియములకంటే; మనః=మనసు; పరం= అతీతము, మనసః=మనస్సుకంటే: సత్వం=బుద్ధి; ఉత్తమం= శ్రేష్ఠము, సత్వాత్ = బుద్ధికంటే; మహానాత్మా = జీవాత్మ; అధి = మించియున్నది; మహతః=జీవాత్మకన్న; అవ్యక్తం= హిరణ్యాగర్భుడు; ఉత్తమం = శ్రేష్ఠుడు.

విశేషార్థము:— (1) ఇన్ద్రియేభ్యః = 1 అధ్యాయము 3 వ వల్లి 10 వ మంత్రిముయొక్క విశేషార్థము చూడవలెను. అందులో నా మంత్రములో "అర్థాః" అనునది ఒకటి ఇంద్రియములకు మనస్సుకు మధ్యకలదు, తక్కినవన్నియు సరిపోవు చున్నవి.

తాత్పర్యము:= ఇన్ద్రియముల కతీతమై శ్రేష్ఠమై మనస్సు ఉన్నది. దానికంటె అతీతమై శ్రేష్ఠమై బుద్ధియున్నది. దానికంటె అతీతమై శ్రేష్ఠమై జీవాత్మయున్నది. దానికంటె నతీతమై శ్రేష్ఠమై హిరణ్యగర్భుడు ఉన్నాడు.

౮ వ మంత్రము శ్రుతిః ॥ 8

అవ్యక్తాత్తుపరః పురుషో
వ్యాపకో౽లిఙ్గ ఏవచ।
యఙ్జ్ఞాత్వా ముచ్యతే జన్తు
రమృతత్వంచ గచ్ఛతి ॥

విశేషార్థము:— (1) అవ్యక్తం 1 అధ్యాయం 3 వ వల్లి 11 వ మంత్రముయొక్క విశేషార్థము చూడవలెను.

(2) పురుషః = పురుషుడు పైచెప్పిన మంత్రముయొక్క విశేషార్థము చూడవలెను,

(3) అలిఙ్గః=లింగమనగా గుర్తు. అలిఙ్గమనగా ఆగుర్తులు లేనిది. అనగా దానిని గుర్తుపట్టుటకు ప్రత్యేకలక్షణములు లేవు. అలిఙ్గాత్ = అనుపదము 3 ముణ్డకం 2 ఖండము 4 వ మంత్రములో ఇదే అర్థములో వాడబడెను. మాణ్డూక్యము 7 వ మన్త్రము "అదృష్టంఅవ్యవహార్యం" అనియు ముణ్డకం 1 అ. 1 ఖం 6 వ మంత్రము "అద్రేశ్యంఅగ్రాహ్య" మనియు మొదలుగా చెప్పియున్నవి. ఇదేభావము పరమాత్మ నిరాకార నిర్గుణ స్వరూపియని నిశ్చయము.

(4) జన్తుః = పుట్టిన ప్రతిజీవి మానవుడుమాత్రమేగాదు జీవులందరికి బ్రహ్మజ్ఞానముపొందు అవకాశము కలదని ఈ మన్త్రము స్పష్టపరచుచున్నది, శ్రీ శంకరులవారు జన్తువనగా మానవుడేయని చెప్పుచున్నారు. గజేన్ద్రమోక్షముకథ చూచిన యెడల మానవేతరజంతువులుకూడ మోక్షము పొందెనని తెలియనగును.

(5) గచ్ఛతి = పోవుట, అని కాక పొందుట అని అర్థము చెప్పవలెను. బ్రహ్మజ్ఞానముపొందినవాడు జీవాత్మస్థాయిలో నుండి పరమాత్మస్థాయిలోకి పోవును. స్థలాంతరప్రయాణము లేదు. ఉన్నచోటనే ఆత్మయని తెలిసికొని అనుభవించును. ముణ్డకం ౩ అ. 2 ఖండం ౯ వ మంత్రము "బ్రహ్మైవ భవతి" బ్రహ్మయే యగుచున్నాడు. అనగా నున్నచోటనే అవ్వడే అగుచున్నాడని యర్థము.

తాత్పర్యము:— మరియు హిరణ్యగర్భునికంటె పరమాత్మ అతీతుడు శ్రేష్ఠము. అతడు సర్వవ్యాపి. గుణరహితుడు నిశ్చయము వానిని తెలిసికొనిన జీవి జనన మరణ రూప సంసారమునుండి విడివడుచున్నాడు. మరియు అమృతత్వ మును పొందుచున్నాడు.

౯ వ మన్త్రము శ్రుతిః ॥ 9

నసందృశే తిష్ఠతి రూపమస్య

నచక్షుషాపశ్యతి కశ్చనైనమ్

హృదా మనీషా మనసాభిక్లృప్తో
య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥ 9 ॥

అస్య = దానియొక్క, రూపం = రూపము, సందృశే = దృక్పథమందు, నతిష్ఠతి = నిలుచుటలేదు, కశ్చన = ఎవడును, ఏనం = దీనిని, చక్షుషా = కంటితో, నపశ్యతి = చూచుటలేదు, హృదా = హృదయముతోడను, మనీషా = మనీషతోడను, మనసా = మనస్సుతోడను, అభిక్లృప్తః = తెలియబడుచున్నది, యే = ఎవరు, ఏతత్ = దీనిని, విదుః = వేద్యమొనర్చుకొందురో, తే = వారు, అమృతాః = అమృతులు, భవన్తి = అగుచున్నారు.

విశేషార్థము:— (1) సందృశే = దృష్టిపథమునందు. తరువాతవాక్యములో ఎవరు కంటితో చూడలేరు? అని చెప్పబడినది. ఆ వాక్యమును ఈ వాక్యమును ఒకే విషయమును తెలుపుచున్నవి. మొదటిదానిలో ఆత్మ దృగ్గోచరమగుటలేదు. అనియు రెండవదానిలో ఎవరు చూచుటలేదనియు కలదు. దృష్టిపథమనునపుడు సకలేన్ద్రియ వ్యాపారముద్వారా తెలియరాదని అర్థము. ఈ భావనే కేనోపనిషత్తు 1 వ ఖండములో విస్తరింపబడెను. ముండకం అ 3 ఖండం 1 మంత్రము 8 లో కంటికిగాని వాక్కునకు గాని ఇతర అవయవములకుగాని ఆత్మ అందదని తెలిపెను. ఈ భావము అన్ని యుపనిషత్తులకు అంగీకారమైనదే సమానమైనదే సందృశ్ అను క్రియకు పోలి యుండుట అని అర్థము కలదు. ఇచ్చట సందృశే యనగా

పోలినవస్తువులలో అని అర్థము చెప్పవచ్చును. అట్లు చెప్పిన యెడల ఆత్మస్వరూపము దానితో పోల్చగల ఏ వస్తువులలోను లేదు అని అర్థమగును.

ఈ మన్త్రము మహానారాయణము 1 వ అనువాకము 10 వ మన్త్రముగా నున్నది. అచ్చట నాలుగవ పంక్తిలో (పాదములో) "ఏనం" అని కలదు. దానికి బదులు ఇచ్చట "ఏతత్" అని కలదు. అందుచే నర్థభేదమేమియు లేదు. శ్వేతాశ్వతరము 4 వ అధ్యాయము 20 వ మంత్రము ఇదియు నొకటే అచ్చటకును యిచ్చటకును, కొంచెము భేదముకలదు. 3 వ పంక్తిలో (పాదములో) "హృదాహృదిస్థం మనసా" అని యున్నది. ఇచ్చట హృదిస్థం లేదు. మనీషా అభిక్లృప్తో అని రెండు మాటలు హెచ్చుగానున్నవి ఇందులో 3-4 పఙ్త్తులు (పాదములు) శ్వేతాశ్వతరము 4 వ అధ్యాయం 17 వ మంత్రములో కలవు, 3 వ అధ్యాయం 13 వ మంత్రములో కలవు.

(2) హృదామనీషా మనసా = ఈ మూడు పదములకు వ్యాఖ్యానము చేయుటలో అభిప్రాయ భేదములు కలుగుచున్నవి. ఈ మూటికి శ్రీ రవీంద్ర కవిసార్వభౌముడు (Revealed through love Intnetion and thought) అని అర్థము చెప్పిరి. శ్రీ శంకరులవారు ఇట్లు చెప్పిరి. హృదా = హృదయ స్థితమైన బుద్ధిద్వారా, మనీషా, మనసః సంకల్పాది రూప మనస్సును నియమించు వికల్ప శూన్యమైన బుద్ధిచేనని అర్థము చెప్పిరి. అనగా మనస్సును నియమించునట్టి హృదయమందున్న బుద్ధి

ద్వారా మననరూపమైన సమ్యక్ దర్శనమువలన అని తాత్పర్యము, ఇంకొకరు యిట్లు చెప్పిరి. "హృదా" అనగా నేతినేతి పదముల ద్వారా మనీషా అనగా వివేచన శక్తిద్వారా మనసా అనగా ఈ రెంటివలన కలిగిన ప్రత్యక్షానుభూతిద్వారా, ఈ పదములు మహానారాయణములో 79 వ అనువాకము 16 వ మంత్రములో ఉదహరించబడినవి. "తపసా శ్రద్ధా శ్రద్ధయా మేధా మేధయా మనీషా మనీషయా మనో మనసా శాన్తిః శాన్త్యా చిత్తం చిత్తేన స్మృతిం, స్మృత్యా స్మారం, స్మారేణ విజ్ఞానం, విజ్ఞానేనాత్మానం వేదయతి"

శ్రద్ధ మొదలు విజ్ఞానమువరకు మధ్య 7 పదములు చెప్పబడినవి. ఇవన్నియు అప్పటి మానసిక శాస్త్రజ్ఞులు మనోవ్యాపారమును యెంత సున్నితముగా పరిశీలించి విభజించిరో తెలియపరచుచున్నది. వీనికి సరిపోవు ఆంగ్లేయ పదములు "రనెడి" అను గ్రన్థకర్త కొన్నిటిని యిచ్చియున్నాడు, మేధ అనగా (Understanding) మనీషా అనగా (Imagination) శాన్తం అనగా (Tranqility) స్మృతిః అనగా (Memary) తక్కిన పదములకు సమానమైన ఆంగ్ల పదములు కనపడలేదు. ఈ పదములకు మహానారాయణ వ్యాఖ్యాత మార్కండేయ శర్మగారు ఇట్లర్థము చెప్పుచున్నారు. "మేధ" అనగా గురువులు తెలిపిన గ్రంథార్థధారణము మనీషా అనగా బుద్ధి, మనః అనగా మననము శాన్తి అనగా క్రోధాది వృత్తిరహితము. చిత్తమనగా ప్రమాణజనిత జ్ఞానము స్మృతి అనగా తత్వ విషయక స్మృతి

స్మారమనగా నిరంతరస్మరణము విజ్ఞానమనగా విశిష్టమయిన జ్ఞానము. ఏసునాథుడు (Know thy god with all thy heart with all thy mind and with all thy soul) పూర్ణహృదయముతో పూర్ణఅంతరాత్మతో పూర్ణమనస్సుతో దేవుని తెలిసికొనవలెను, అని చెప్పెను. ఈ పదముల వాడుక ఒకే యర్థముతో సర్వత్ర చేయబడుటలేదని తోచును. 2 వ పాదములో చెప్పిన దానినిబట్టి కర్మేంద్రియ జ్ఞానేంద్రియములకు ఆత్మ అందదని స్పష్టము. ముణ్డకములో చెప్పిన దానినిబట్టి అన్తరింద్రియములకును అందదని స్పష్టము. కేనోపనిషత్ మనస్సుకు అందదని 1 ఖండము 3 వ మంత్రములోను 5 వ మంత్రములోను స్పష్టపరచెను. తైత్తిరీయము అ. 2 అనువాకము 4 మనస్సుకు అందదని తెలిపెను. ఇట్లు చెప్పుటచేత 14 ఇంద్రియములకు అందదని స్పష్టమైనది. ఇక దీని తెలిసికొనుట యెట్లని చర్చించగా శ్రీ అరవిన్దయోగి చెప్పినట్లు ఈ అన్తరింద్రియములకు అతీతమైన యింద్రియములు కొన్ని ఆత్మకు ప్రత్యేకముగా కలవనియు తద్ద్వారా తెలియవలెననియు స్పష్టము. వీనికే దివ్యశక్తులని పేరు. దానికే అరవిందయోగి (Knowledge by Identily) అని వాడెను. అనగా రెండు ఒకటే అగుటచే కలిగెడి జ్ఞానము జీవాత్మ పరమాత్మలు రెండు సంపూర్ణముగా ఏకీభవించినపుడు జీవాత్మకు పరమాత్మ జ్ఞానము కలుగును. అట్లు ఏకీభవించుట సమాధిస్థితిలోనే కలుగుచున్నది. సమాధిస్థితి పూర్వము అప్పుడప్పుడు తటాలున కలిగెడి దివ్యప్రబోధమునకు (Inspiration Intnition) అని వాడుచుందురు. ఈ రెండు పదములకు

అర్థమేమన మనమెరిగిన ఏ తర్కమునుమీదను ఏ ఉపమానాదుల మీదను ఆధారపడక అకస్మాత్తుగా కలిగెడి దివ్యప్రబోధము ఏ వ్యక్తికి యిట్టి దివ్యప్రబోధము కలుగుచున్నదో అతడే ఆ విధానమును వర్ణించలేడు, కాన యిచ్చట తెలిపిన మూడుపదములకు ఇట్లు అర్థము చెప్పవచ్చును. అనిర్వచనీయమగు అన్తస్స్ఫురణ తన్మయత్వము= ఆత్మావేశము సమాధి అని చెప్పవచ్చును. ఈ యర్థమే సరియయినదని పిమ్మట వచ్చెడి మంత్రముల వలన బుజువగుచున్నది. ఇంకొకవిధమున అన్వయించవచ్చును. పాశ్చాత్యమానసిక శాస్త్రజ్ఞులు మనస్సునకు ౩ శక్తులు కలవని తెలుపుచున్నారు. ఇచ్ఛాశక్తి, ఉత్సాహశక్తి, ఆలోచనశక్తి ( Will emotion thought ) అంతరింద్రియవ్యాపారములన్నియు ఈ మూటిలో నిమిడిపోవుచున్నవి. కాన ఈ మూటిద్వారా ఆత్మను విశదమొనర్చుకొనినయెడల సంపూర్ణ జ్ఞానము కలిగినట్లె ఎంచవచ్చును.

[ ౩ ] అభిక్లప్తః= తెలియబడి అని అర్థము పరిమితమొనర్చబడి అని యొక అర్థము చెప్పుచున్నారు. దానికంటే తెలియబడి అని చెప్పుటయే మేలు. అపరిమితమైన వస్తువును పరిమితమొనర్చుట అని భావ్యముకాదు. హృదా మనీషా మనసాలకు అందునట్లు పరిమిత మొనర్పబడి అని యెంచుటగూడ భావ్యముకాదు. ఆ మూటిచేత తెలియ శక్యమైతే పూర్ణపురుషునే తెలియవలెను,

[4] ఏతద్విదుః= ఈ అధ్యాయము 2 వ మంత్రములో ఇవియే పదములు వాడబడినవి. అచ్చట వీని విశేషార్థము చూడవలెను.

తాత్పర్యము:— ఈ పురుషుని రూపము ఇంద్రియ మణ్డలము లోనికి చేరుటలేదు. దానితో పోల్చతగన దేదియు కనపడుట లేదు. ఎవరును దానిని ఏ యిన్ద్రియముతోను గ్రహించియుండ లేదు. ఇచ్ఛా ఉత్సాహ, ఆలోచన శక్తులన్నిటిని సమగ్రముగా దానిమీద వ్యాపింపజేసి అనిర్వచనీయమైన అన్తస్స్ఫురణవల నను తన్మయత్వము తదావేశమువలనను సమాధిస్థితివలనను దానిని ప్రబోధ మొనర్చుకొనవచ్చును. ఎవరు దానిని అనుభవైకవేద్య మొనర్చుకొనిరో వారు అమృతులగుచున్నారు.

౧౦ వ మంత్రము శ్రుతిః ॥ 10

యదా పఞ్చావతిష్ఠన్తే
జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టతి
తామాహుః పరమాంగతిమ్ ॥

యదా = ఎప్పుడు; పఞ్చ=అయిదు కర్మేంద్రియములును; జ్ఞానాని = అయిదు జ్ఞానేంద్రియములును; మనసాసహ = మనస్సుతో కూడ; అవతిష్ఠన్తే=వ్యాపారరహితమై నిలిచియుండునో; చ=మరియు; బుద్ధిః = బుద్ధియును; నవిచేష్టతే = చేష్టలుడిగి యుండునో; తాం = అట్టి స్థితిని; పరమాం=శ్రేష్ఠమైన, గతిం= మార్గము లేక స్థితియని; ఆహుః = వారు జ్ఞానులు చెప్పెదరు.

విశేషార్థము:— (1) పఞ్చ = అయిదు యా అయిదు జ్ఞానేంద్రియములె అని శ్రీ శంకరులవారు అన్వయించిరి, సమాధి

స్థితిలో కర్మేంద్రియ జ్ఞానేంద్రియములన్నియు చేష్టలుడుగును. కాన పఞ్చ అనునప్పుడు కర్మేంద్రియమనుపదము అధ్యాహారము చేసి అయిదు కర్మేంద్రియములని చెప్పబడెను. అట్లే జ్ఞానాని అనునపుడు అయిదు అను పదమును అధ్యాహారముచేసి జ్ఞానేంద్రియములు అయిదు చెప్పబడెను. సర్వేంద్రియ వ్యాపారము నశించినపుడే సమాధి సంభవించును. పాతంజలి యోగ సూత్రములలో యోగః = చిత్తవృత్తినిరోధః అనిచెప్పి యున్నారు. అన్తరింద్రియ వ్యాపారనిర్మూలనము తద్ద్వారా జరిగెడి బాహ్యేంద్రియ వ్యాపార నిర్మూలనము కలసి యోగ మగుచున్నది. అప్పుడు ఈ యింద్రియములన్నియు పదునాలు గును ఆత్మలో నుపశమించును. ఆత్మ పరమాత్మలో చేరును. దీనిపేరే కలయిక ఇదే యోగము 1 అధ్యాయం 3 వ వల్లి 13 వ మంత్రములో యోగసమాధిస్థితి తెలుపబడెను. ఆ విధానమునే ఇచ్చట మరింత విపులముగా దెలుపుచున్నాడు.

తాత్పర్యము:— ఎప్పుడు పఞ్చ కర్మేంద్రియములు పఞ్చ జ్ఞానేంద్రియములు మనసుకూడ బుద్ధియును నిశ్చేష్టితములయి నిలిచియుండునో దానినే జ్ఞానులు ఉత్తమగతియని తెలుపుదురు.

౧౧ వ మంత్రము శ్రుతిః ॥ 11

తాం యోగ మితిమన్యన్తే
స్థిరామిన్ద్రియ ధారణాం ।
అప్రమత్త స్తదాభవతి
యోగోహి ప్రభవాప్యయౌ ॥

తాం = ఆ; స్థిరాం = సుస్థిరమైన; ఇంద్రియధారణాం = ఇంద్రియములను ధరించుట లేక నిగ్రహించుటను, యోగం = యోగము; ఇతి=అని; మన్యన్తే=తలంతురు; తదా=అప్పుడు, (జీవాత్మ) అప్రమత్తః=అప్రమత్తుడు; భవతి=అగుచున్నాడు; హి = నిశ్చయము; యోగః = యోగము, ప్రభవాప్యయౌ= ఉత్పత్తి లయములు కలది.

విశేషార్థము:— (1) యోగం=యుజ్; కలుపుట యోగ మనగా కలయిక. ఇంద్రియములన్నియు ఆత్మలో కలియుట 4 వ ప్రశ్న 7 వ బ్రాహ్మణములో "తత్సర్వంపరే ఆత్మని సంప్రతిష్ఠన్తే" ఆ ప్రశ్నలోనె 9 వ బ్రాహ్మణములో "సపరే అక్షరే ఆత్మని సంప్రతిష్ఠన్తే" అని చెప్పబడినది. ఇంద్రియములన్నియు జీవాత్మలోను జీవాత్మ పరమాత్మలోను ప్రతిష్ఠితమై యుండుట యోగము మూలాధారము కలిగియుండుటయేగాక అందులో లీనమైపోవుట యోగము, యోగమను పదమునకు శ్రీ శంకరుల వారు వియోగమని అర్థముచేసిరి అది సమంజసమే బాహ్య ప్రపంచముతో వియోగమే ఆత్మతో సంయోగము, దుఃఖ సంయోగ వియోగమే యోగమని కలదు.

(2) ఇంద్రియ ధారణాం=ఇంద్రియములను ఏకతానములో నిలుపుట. ఎచ్చటికి కదలకుండ ఒకచోటనే నిలిపి వాని వాని కర్మశక్తిని నిగ్రహించుట శ్వేతాశ్వతరము 2 అ. యీ యోగ విషయము విపులముగా తెలుపుచున్నది. అయ్యది చూడవలెను.

(3) అప్రమత్తః = మత్తత అనగా మోహము భ్రమ మాద్యము మత్తు ప్రమత్తత అనగా అందులో విశేషస్థితి, అప్రి

మత్తః = అనగా దాని అభావము ప్రమాదాత్ అను పదము ముండకము 3 అ. 2 ఖం. 4 వ మంత్రములో కలదు. ఇచ్చట అప్రమత్తత అనగా ఆమాన్యము లేకపోవుట యేకాదు. నిద్రా సుషుప్తులలో జ్ఞాతృస్థితి యుండదు సమాధిస్థితిలో బోధకు లోటుండదు. ఆత్మ శుద్ధ చిద్రూపియయి ఆనందమును అనుభవించుచుండును. అయ్యది తామసిక స్థితిగాదు అజ్ఞానస్థితి కాదు ఈ విషయమును పాశ్చాత్యులుకూడ గ్రహించిరి. (Words worth) అను మహాకవి ఇట్లు చెప్పెను.

ఆలోచనాశక్తి రహితమయ్యెను, ఆనందానుభవములో అవి మగ్నమయ్యెను కాన ఇచ్చట అప్రమత్తత అనగా సచ్చిదానన్ద భోగము అనుభవించెడి స్థితి.

(4) ప్రభవాప్యయౌ = ప్రభవమనగా పుట్టుట అప్యయమనగా నశించుట మాణ్డూక్యములో "ప్రభవాప్యయౌహి భూతానాం" అని 6 వ మంత్రములో తెలుపబడినది. ఇచ్చట యోగముయొక్క రాకపోకలు అనిచెప్పుట సరికాదు. యోగము యీ సమాధిస్థితి రెండు విధములయియున్నది. 1, సవికల్పము, 2. నిర్వికల్పము ఈ రెంటిని యోగిపుంగవుడు స్వేచ్ఛానుసారము ప్రయోగించుకొనును. శ్రీ రామకృష్ణపరమహంస ఇట్టి అనుభవములను పొందెను.

తాత్పర్యము:— సుస్థిరముగా నింద్రియములను నిగ్రహించి ఆత్మలో ధరించుట లేక నిలుపుట యోగమని తలపబడుచున్నది. అప్పుడు చిత్ భాసిల్లుచుండును. ఈ యోగము సమాధిస్థితి సవికల్ప నిర్వికల్ప సమాధులుగా అనుభవమగుచుండును. సవి

కల్పములో ఆకారమును సృష్టించి శబ్దమునకు అర్థమునకు అభేదమును భాసించుచుండును. ఆ ధ్యేయము ధ్యాతా రెండును నశించుట నిర్వికల్పమని చెప్పుచున్నారు. ఈ రెంటిలోను ఆయా సమయములందు సచ్చిదానందము అనుభవమగుచుండును.

౧౨ వ మంత్రము శ్రుతిః ॥ 12

నైవ వాచాన మనసా
ప్రాప్తుం శక్యో న చక్షుషా ।
అస్తీతి బ్రువతో ఽన్యత్ర
కథం తదుపలభ్యతే ॥

(సః = ఆ ఆత్మ) వాచా = వాక్కుచేత; ప్రాప్తుం = పొందుటకు; నశక్యః = సాధ్యముకాదు; మనసా = మనస్సుచేత! ప్రాప్తుం = పొందుటకు; నశక్యః = సాధ్యముకాదు; చక్షుషా = కంటిచేత; ప్రాప్తుం = పొందుటకు; నశక్యః = సాధ్యముకాదు, ఏవ = నిక్కము; అస్తీతి = కలదని, బ్రువతః = చెప్పువారివలన అన్యత్ర = ఇతర విధముల, తత్ = అది, కథం = ఎట్లు, ఉపలభ్యతే = పొందబడును?

విశేషార్థము:— (1) వాచా, మనసా, చక్షుషా = 9 వ మంత్రములో "నచక్షుషాపశ్యతి" అని చెప్పబడిన భావమేఇది. 6–7 మంత్రములలో ఇంద్రియములకంటె యిది అతి సూక్ష్మ మని తెలుపబడెను. ముణ్డకం 3 అ. 1 ఖండము 8 వ మంత్రము కూడ ఇదియే యింద్రియములకు తెలియదని తెల్పుచున్నది.

అట్లే యితర ఉపనిషత్తులుకూడ తెలుపుచున్నవి. 11 వ మంత్రములో యోగమును చెప్పెను. ఈ మంత్రములో ఇంద్రియములకందదని చెప్పుచున్నాడు. "వాచా" అని మొదట వ్రాసినను ఇచ్చట మూడు ఇంద్రియములనే తెలిపినను అన్ని యింద్రియములకు ఇదే వర్తించును 2 వ అధ్యాయము 1 వ వల్లిలో 1 వ మంత్రములో ఇంద్రియములకు ఆత్మను గ్రహించుటకు అశక్తత స్వభావసిద్ధముగానున్నదని తెలుపబడెను. కాన ఇంద్రియములు ఆత్మను పొందలేవని చెప్పుటలో ఆశ్చర్యమేమియు లేదు.

(2) అస్తి ఇతిబ్రువతః = ఉన్నదని చెప్పువారు. బ్రహ్మజ్ఞానులని అర్థము ఆ బ్రహ్మజ్ఞానులుకూడ ఆత్మనుగూర్చి యిది యున్నదని మాత్రమే చెప్పెదరు. అంతకంటె దాని లక్షణము లేవియు వారు చెప్పరు. ఏలయన:- చెప్పుటకుగాని, తెలిసికొనుటకుగాని యీ యింద్రియములకు శక్తిలేదు. నచికేతస్సు 1 అ 1 వ వల్లి 20 వ మంత్రములో వేసిన ప్రశ్నకు యిందులో జవాబు కలదు. ఉన్నదని తెలుపువారు కలరు.

(3) అన్యత్ర=ఇతరవిధమున ఇతరులనుండి అని రెండు విధములుగా అర్థము చెప్పవచ్చును. ఇతరులనుండి అని చెప్పేయెడల ఉన్నదను చెప్పువారుగాక ఇతరులనుండి అనగా లేదనువారి నుండి ఎట్లు తెలియనగును? లేదనువారు లేదనే వస్తువును వర్ణించుట అసాధ్యము. కాన ఉన్నదనువారే దానిని తెలుపవలెను. అది నిస్సందేహము. ఇచ్చట ముఖ్యమైన భావము దీనిని ఎవరు తెలుపుదురనికాదు. దీనినెట్లు తెలిసికొనవలెన

నునదిముఖ్యము. తెలిసికొన్న యముడే చెప్పుచున్నాడు. అతడు చెప్పుటవలన నచికేతస్సు దానిని పొందుటలేదు. దానిని గురించి చెప్పతగిన అంశమంతయు చెప్పి పొందుటకు యోగ మార్గమును జూపుచున్నాడు. మొదటి పఙ్త్తిలో నింద్రియ ముల అశక్తత తెలుపుటకూడ యోగాధిక్యతను తెలుపుట కొఱకేగాన అన్యత్రి అనునపుడు యోగమార్గమునగాక మరి యొకండు విధమున అని అర్థము చెప్పవలెను. అనగా జ్ఞానుల వలన కూడ వారి యింద్రియములద్వారా శిష్యుల ఇంద్రియ ములకు గోచరింపచేయబడదనియు ఆ గురువులు అనుగ్రహించి శిష్యులలో యోగస్థితిని ఉద్ధరించినపుడే యీ యాత్మ ఉపలబ్ధి యగునని ఈ మన్త్రము స్పష్టము చేయుచున్నది. శ్రీ రామ కృష్ణపరమహంసలవారికి గురువగు తోటాపురి సాకార నిరా కార బ్రహ్మమును సమాధిలో వేద్యమొనర్చెను. అట్లే రామ కృష్ణ పరమహంసలవారు వివేకానందులు మొదలగు శిష్యు లకు సమాధిస్థితి నేర్పిరి. అందుచేత నది యొక్కటే మార్గమని యిప్పటికిని ఋజువగుచున్నది.

తాత్పర్యము:— వాక్కుద్వారా, మనస్సుద్వారా, కంటి ద్వారా లేదా ఏ యితరేన్ద్రియములద్వారా లేదా అన్నిటి ద్వారా యీ యాత్మను పొందుటకు శక్యముకాదు. నిశ్చ యము. అనగా నీ యాత్మ కలదని తెలిసికొనిన బ్రహ్మజ్ఞానుల నుండి వారి యనుగ్రహముచే పురికొల్పబడిన సమాధిస్థితిలోనే యీ యాత్మోపలబ్ధి పొందబడును. ఇంకొకవిధమున పొంద బడదు. ఇంకొకరివలన పొందబడదు నిశ్చయము.

2-6-13



౧౩ వ మన్త్రము (శ్రుతిః ॥ 13

అస్తీత్యేవోపలబ్ధవ్య
స్తత్త్వభావేన చోభయోః ।
అస్తీత్యేవోపలబ్ధస్య
తత్త్వభావః ప్రసీదతి ॥

ఉభయోః=రెంటిలోను, తత్త్వభావేన = స్వస్వరూపము యథార్థలక్షణములతో. అస్తి=ఉన్నది, ఇతి=అనెడి, (వస్తువు) ఏవ = మాత్రమే, ఉపలబ్ధవ్యః = పొందతగియున్నది లేక పొందవలెను అస్తి = కలదు, ఇతి=అని, ఉపలబ్ధస్య = ఉపలబ్ధిపొందినవారికి, తత్త్వభావః=స్వస్వరూపము, ప్రసీదతి = ప్రత్యక్షమగును.

విశేషార్థము:— (1) * ఉభయోః=రెంటిలో ఈ రెండు సాకార నిరాకార బ్రహ్మలని శ్రీ శంకరులవారి అభిప్రాయము. అస్తినాస్తి = ఆత్మ ఉన్నది, లేదు అను రెంటివిషయము అని శ్రీ రామకృష్ణమఠముచే ప్రకటితమైన గ్రంథములో తెలుపబడిన భావము. ఉభయోః అనగా వికల్ప నిర్వికల్ప సమాధులలో అని అర్థము చెప్పవలెను. 11 వ మన్త్రములో నీరెండే ప్రసంగింపబడెను. ఆ రెంటియొక్క ప్రయోజనమే 12 వ మంత్రములోను, ఈ మంత్రములోను విస్తరింపబడుచున్నది.

* శ్రీ రామకృష్ణ పరమహంసలవారు సాకారనిరాకార బ్రహ్మల ఉపలబ్ధిని వికల్ప నిర్వికల్ప సమాధులలో పొందుచుండిరి. తమ శిష్యులకు కలిగించుచుండిరి.

(2) తత్వభావేన = ఇది రెండవ పజ్తిలోని పదము నాలుగవపజ్త్తిలో తత్వభావః అనికలదు. విభక్తిప్రత్యయమును అట్లుంచినయెడల రెండుపఙ్త్తులలోను తెలియతగినది. తత్వ భావమే తత్వభావమనగా యదార్థస్థితి. లేదనేదానికి యథార్థ స్థితి ఉండనేరదు. దానికి ఉపలబ్ధి అసలే ఉండనేరదు. కాన ఇచ్చట ఆత్మ ఉన్నదా లేదా యనుప్రశ్న ఉదయించనేరదు. రామకృష్ణమఠమువారు ఉభయోః అను పదమునకు చెప్పిన అర్థము సమంజసముకాదు. తత్వభావ మనునపుడు అసలు స్థితి ఆత్మను సాకార నిరాకారముగా రెండు విధముల భావించు చున్నారు. సాకారస్థితికూడ పొందతగినదే అని చెప్పు చున్నారు. కాని అవి ప్రధానమైన స్థితి కానందున నిరాకార స్థితినే పొందవలెననుట స్పష్టము. ఈ వల్లిలోని 5 వ మంత్రము సగుణబ్రహ్మలోకమున పొందెడి ఆత్మదర్శనము సంపూర్ణము కాదని స్పష్టపరచియున్నది. బ్రహ్మసూత్రములలో చిట్టచివర అధ్యాయమున ఈ సాకార నిరాకార బ్రహ్మల ఉపలబ్ధిలోగల భేదమును తెలిపి సాకార బ్రహ్మోపలబ్ధిలో ఇంకను కొంత పొందతగినదియున్నదని తెలుపుచు సృష్టిశక్తులు దానికి వర్తించవని 4 అ. 4 ఖం 17 వ సూత్రములో దెలుపబడినది. ఈ నాలుగవఖండమంతయు సాకార నిరాకార బ్రహ్మోపలబ్ధిలో నుండు భేదమును గూర్చియే చర్చించినది, కాన తత్వభావ మనునపుడు సాకారముకాక నిరాకారమేయని చెప్పవలసి యున్నది. ఉభయోః అనుపదమునకు శ్రీ శంకరులవారు ఇచ్చిన అర్థమును తత్వభావమును పదమున కివ్వవలెను.

( ౩ ) అస్తీత్యేవ = ఉన్నదనియే, ఆత్మ ఉన్నదనియే అనుభవైకవేద్యము చేసుకొనవలెను. ఇది సాకారమని తెలిసికొన్నవానికి సాకారముగానే ప్రత్యక్షమగును. దీనిని నిరాకారమని తెలిసికొన్నవానికి నిరాకారముగానే ప్రత్యక్షమగును. తైత్తిరీయము 2 వ అధ్యాయము 6 వ అనువాకము "అసన్నేవసభవతి అసత్ బ్రహ్మేతి వేదచేత్ అస్తి బ్రహ్మేతి చేద్వేదస న్తమేనం తతోవిదురితి" ఎట్లు తెలుసుకున్నవాడు అట్టి బ్రహ్మనే పొందుచున్నాడు. ముణ్డకం ౩ అ. 2 ఖండం 9 మంత్రము "యోపరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి" ఆ పరబ్రహ్మను తెలుసుకొన్నవాడు పరబ్రహ్మయె యగుచున్నాడు. కాన సగుణబ్రహ్మను తెలిసికొన్నవాడు సృష్టి శక్తులు లేకుండ ఆ సగుణబ్రహ్మను పొందుచున్నాడు. అది యింకను తత్వభావముకాదు. పూర్ణోపలబ్ధి కావలెనన్నపుడు నిరాకార బ్రహ్మనే పొందవలెను. అప్పుడే ఏవిధమయిన శరీరము ఉండదు. ఆత్మ సంపూర్ణమైన అపారమయిన అనిర్వచనీయమయిన స్వస్థితిని పొందును.

( 4 ) ఉపలబ్ధవ్యః = పొందవలెను. మొదటి పఙ్క్తికి యిట్లర్థము చెప్పవచ్చును. ఉన్నదనే వస్తువునే వికల్ప నిర్వికల్ప సమాధులను రెంటిమూలమున యథార్థస్వరూపమున అనుభవైకవేద్య మొనర్చుకొనవలెను.

( 5 ) ప్రసీదతి = ముండకం ౩ అ. 2 ఖండం ౩ వ మంత్రము "ఏష ఆత్మా వివృణుతె తనూంస్వాం" అని చెప్పినది. అట్టి వానికి ఆయాత్మ తన స్వస్వరూపమును ప్రత్యక్షపరచును. ఇదే

మంత్రము 1 అధ్యాయం 2 వ వల్లి 23 వ మంత్రముగా కలదు. ఏవిధముగా ప్రత్యక్షము కావలెనో ఆ రూపమున ఆ కాలమున ఆత్మ వానికి ప్రత్యక్షమగును. సమాధిస్థితులలో ఉపలబ్ధిపొందిన వానికి ఆత్మ స్వస్వరూపము తెలియపరచుచున్నది.

తాత్పర్యము:— వికల్ప నిర్వికల్ప సమాధుల మూలమున ఉన్నదని చెప్పబడువస్తువే ఆత్మనే స్వస్వరూపమున ఉపలబ్ధి పొందవలెను. అట్లు ఉపలబ్ధి పొందినవానికి, ఆత్మ తన స్వస్వరూపమును ప్రత్యక్షమొనర్చును. రెండు సమాధులలోను నిరాకార నిర్గుణరూపముననే బ్రహ్మను ఉపలబ్ధి పొందవలెను. రెండు సమాధులలోను సాకార నిరాకార రూపమున బ్రహ్మోపలబ్ధి పొందవచ్చును. కాని నిరాకార రూపమున పొందుట తత్త్వభావమున పొందుట యగును.

౧౪ వ మంత్రము శ్రుతిః ॥ 14

యదా సర్వే ప్రముచ్యన్తే
కామా యే ఽస్య హృది స్థితాః ।
అథ మర్త్యో ఽమృతో భవ
త్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥

సమశ్నుతే = పొందును.

తాత్పర్యము:— ఈ నిర్వికల్ప వికల్ప సమాధులలోనే, ఉన్నదను నీవస్తువును, తత్త్వరీత్యా పొందవచ్చును. అట్లు సమాధులలో మగ్నమైనవారికే దానిస్వస్వరూపమునుఅయ్యది

అనుగ్రహించును. అపుడు మానవుని హృదయసీమలో చలన ముండదు. కోరికలుండవు, ఆనందము నిండినిబిడీకృత మగును. అపుడే అమృతత్వము; బ్రహ్మత్వము, లభ్యమగును.

౧౫ వ మంత్రము శ్రుతిః ॥ 15

యదాసర్వే ప్రభిద్యన్తె
హృదయస్యేహ గ్రన్థయః ।
అథమర్త్యో ఽమృతో
భవత్యేతావదను శాసనం ॥

ఏతావత్ = ఇంతవరకే.

తాత్పర్యము:— అంతకు పూర్వముండెడి, హృదయగ్రన్థులన్నియు బ్రద్దలగును, అపుడే అమృతుడగును, వేదాన్త బోధనాసార మిదియే.

౧౬ వ మంత్రము శ్రుతిః ॥ 16

శతంచైకాచ హృదయస్య
నాడ్యస్తాసాం మూర్ధాన మభినిస్సృతైకా ।
తయోర్ధ్వ మాయ న్నమృతత్వ
మేతి విష్వజ్ జన్యా ఉత్క్రమణె భవన్తి ॥

తాసాం = వానిలో, నిస్సృతా = వ్యాపించిన, ఆయన్ = వెళ్ళిన, విష్వక్ = వేరైన.

తాత్పర్యము:— హృదయమునందు నూటొక్క నాడులు కలవు. ఒక్కనాడి బ్రహ్మరంధ్రమువరకు కొనిపోవును. జ్ఞాని ఆ మార్గముగుండా శరీరపతనమును చేయును. ఇతర నాడులలో సంచరించువారు మరల జన్మనెత్తెదరు.

౧౭ మంత్రము శ్రుతిః ॥ 17

అఙ్గుష్ఠమాత్రః పురుషో ఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః ।
తం స్వాచ్ఛరీరాత్ప్రవృహే
న్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ,
తం విద్యాచ్ఛుక్రమమృతం
తం విద్యాచ్ఛుక్రమమృతమితి ॥

ముఞ్జాత్ = గడ్డినుండి, ఇషీకాం = కాడను, ప్రవృహేత్ = విడదీసి.

తాత్పర్యము:— గడ్డి బొంగులోనుండి పోచను విడదీసినట్లు శరీరమందలి హృదయమందు అధిష్ఠించియున్న అంతరాత్మను ఇట్లే వేరుచేసి అనుభవించవలెను. దానినే పవిత్రమైన అమృత నిలయమని తెలియవలెను.

౧౮ వ మంత్రము శ్రుతిః ॥ 18

మృత్యుప్రోక్తాం నచికేతో ఽథలబ్ధ్వా
విద్యామేతాం యోగవిధించ కృత్స్నమ్,

బ్రహ్మప్రాప్తో విరజో ఽభూద్వి
మృత్యురన్యో ఽప్యేవం యో విదధ్యాత్మమేవ ॥

తాత్పర్యము:— ఈ విద్యను యోగవిధిని తెలిసికొని నచికేతస్సు నిష్పాపుడై, బ్రహ్మను పొందెను, ఇట్లు ఈ రెండును తెలిసికొనిన ఇతరులుకూడ వానివలెనే బ్రహ్మప్రాప్తినొందుదురు. ఈ వల్లిలోకూడ జీవాత్మ పరమాత్మల ఏకత్వము స్థిరపరచబడినది. ఆత్మోపలబ్ధికి ఏకైకమగు మార్గము యోగమని ఈవల్లి నిరూపించినది. ఆ యోగసమాధిమూలముననే, ఆ పరమాత్మను పొందనగును. అన్యథా వీలులేదని తెలుపబడెను. మరణానన్తరమున ఆత్మయనునది ఉన్నదా ? లేదా ? అని నచికేతస్సు 1 అ. 1 వ వల్లిలో వేసినప్రశ్నకు, సంపూర్ణమయిన ఉత్తరము ఈ వల్లి యిచ్చుచున్నది. ఆ ఆత్మ ఉన్నది. లేదనుట పొరపాటు. ఆయున్నది ఒక్కటే అనేకమనుట పొరపాటు. ఆ ఉన్నదానిని యోగసమాధిలో నిప్పుడే చూడవచ్చును. అది అలభ్యమనుట పొరపాటు. దేహపతనానన్తరమువరకు వేచియుండవలెననుట పొరపాటు; దానిని జ్ఞానులయినవారు, దేవతలుగాని, మానవులుగాని, ఇతరులకు బోధించవచ్చును. రహస్యము ఇతరులకు బోధించరాదను భావము పొరపాటు. అట్లు బోధనొందినవారు, అనుష్ఠించిన దాని యానందమును, ఆ బ్రహ్మత్వమును అనుభవించగలరు. యముడు నచికేతస్సుపై అనుగ్రహించెను, నచికేతస్సు ఇత

రులపై యనుగ్రహించుటకు అనుమతించెను. యముడు నచికేతస్సుకు నొసంగిన ఏషణాత్రయత్యాగమును నచికేతాగ్నిని ఆత్మయొక్క అద్వైత తత్త్వజ్ఞానమును తదనుభవసాధనమగు యోగవిధిని, ఆత్మజ్ఞానము ఏరూపమున స్వార్థమును నిలువబెట్టను. నిలువనీయక తరిమివేయును. సర్వులకు లభింపచేయుట, నచికేతస్సుకు కర్తవ్యముగా నియమించెను. బాలుడైన ఆ నచికేతస్సు తనకావేశించిన శ్రద్ధమూలమున, తా ధన్యుడయ్యెను. ఇతరులను ధన్యులజేసెను. ధన్యుడు ఇతరులను తరింపజేయకుండ నుండజాలడు. ఈ ఉపనిషత్తులోని మన్త్రములు కొన్ని ఇతర ఉపనిషత్తులలో జేర్చబడియున్నవి. ఇందులో జేర్చబడిన కొన్ని భావములు ఇతర ఉపనిషత్తులతో బోలియున్నవి. ఉపనిషత్సారమని ప్రసిద్ధిచెందిన భగవద్గీత ఇందులోని మంత్రములను కొన్నిటిని గ్రహించినది. కొన్నిటిని గ్రహించి భావములో గొంత మార్పు జేసినది. ఈ వివరములు ఆయామన్త్రములపై చేయబడిన వ్యాఖ్యానములో నుదహారించబడినవి.

ఓం తత్సత్.

ఇతి శివమ్

శాన్తిః— సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై । తేజస్వినా
వధీతమస్తు మావిద్విషావహై ॥
ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః ॥

